

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీభగవద్గీత

# గీతాసంగీతము

( తోహారాద్వయ తాత్పర్య సహితము. )


కృతికర్త:

[illegible]





సంశోధకులు:

[illegible]

శిరోమణి & విద్వాన్





ప్రకాశకులు:

[illegible]







దీని వెల] 1955 [రూ. 4—0—0

ఈ గ్రంథముయొక్క ప్రథమ ద్వితీయ తృతీయ ముద్రణములలో ప్రతి శ్లోకమునకు నొక్కొక్క తోహార చొప్పున మాత్రమే అనువదించి ముద్రించియుండిరి. ఈ చతుర్థ ముద్రణమున ప్రతిశ్లోకమునకు రెండు తోహారలు వంతున విరచించి ముద్రింపబడియున్నది. శ్లోకమునకు రెండు తోహారలు వ్రాయుటకు కారణమేమన, లోగడ ఒక్క తోహారలో కొన్ని శ్లోకముల భావము దెచ్చుటకు శ్రమసాధ్యముగా నుండినందున — అట్టిచోట యీ రెండవ తోహారలో శ్లోకభావము పూర్తిగా తేబడినది. మఱియు ఆ యా శ్లోకభావమును భావించుటవలన వారికి భావావేశము కలిగి భగవత్ప్రార్థనాపరముగాను కొన్ని తోహారలున్నవి. కనుక యీముద్రణమున రెండుతోహారలతో గ్రంథము సాంతము సాగినదను విశేషమును పాఠకులు గుర్తింప ప్రార్థన.

మఱియు సంస్కృతభాషా పరిచయము లేనివారుగూడా యీ తోహారలను కంఠస్థముజేసి పాడుకొనుట కనుకూలముగా నుండునను తలంపుచేత వీరు తమ గ్రంథమునకు "గీతాసంగీత" మని పేరిడిరి. భగవద్గీతకు గీతాసంగీతమని పేరిడుట విపరీతముగదా యని కొందఱు ప్రశ్నింపవచ్చును. శ్రీకృష్ణభగవానుడే గీతను గానమొనర్చెనని పెద్దలు బల్కుదురు. గాన యోగ్యమగు భగవద్వాణిని సర్వులు పాడుకొని యానందించుటకు సులభముగా నుండునట్లు తోహారరూపమున వ్రాసి "గీతాసంగీత" మని పేరిడుట యుక్తమేయగును. ప్రతితోహారకు గడపట "శ్రీకృష్ణ" "గోవింద" మొదలగు పల్లవి గలదు. ఇదియేమని కొందరు ప్రశ్నింపవచ్చును. తోహారను బాడునప్పుడు దానికి చివరనొక పల్లవిని సంధించుట సంగీత సాంప్రదాయము. కనుక ఆ విధముగా నుంచబడినది.

# శ్రీ సేగు కృష్ణదాసువారు

మా తీర్థపాదులగు శ్రీ సేగు కృష్ణదాసుగారు మఱియు వీరి ధర్మపత్ని శ్రీమతి ఆదిలక్ష్మమ్మగార్లు చాల కాలమునుండి ప్రాపంచిక భోగములను తుచ్ఛముగా దలంచి దేశసేవయే ప్రధానమనియు, సంసార దుఃఖపీడిత మనుజులకు జ్ఞానోపదేశము దప్ప మఱొకటి చేయదగిన మహోపకారము లేదని తలంచి పుత్రులు లేక చింతించెడి శారదాదేవికి "అమ్మా" యని పిలుచువారందరూ నీ పుత్రులేయని శ్రీరామకృష్ణ పరమహంస జెప్పినప్రకారమున, లౌకిక దృష్టితో సంతతి లేకపోయినను ఇదికూడ మన మేలు కొఱకేయని దలంచి తను మనోధనముల ధార్మిక సేవకై విని యోగించుచు, పల్లెపల్లె, వాడవాడ, గ్రామగ్రామము, దేశదేశములు తిరిగి ఆహ్వానములుండని, ఒకవేళ లేకపోని, బలాత్కారముగనైన భయముతో నయముతో భక్తితో బాలబాలిక స్త్రీ పురుష వృద్ధులకు సర్వవర్ణస్థులకు "రామనామ మహిమను" దైవప్రార్థనల ఆవశ్యకతను భగవద్గీతా పారాయణ పఠన విచారణ వలన కలిగెడి శాంతిని బోధించి ప్రార్థనాసంఘములను స్థాపించి, మహదుత్సాహముగా శ్రీరామకోటి సప్తాహములను ఆయాగ్రామస్థు లంతకుమునుపు కనివిని యెరుగనట్లుగా గావించి తులసీరామదాసు సమర్థరామదాసు రామదాసులవలె శ్రీరామ నామములనందరిచే "నోరునవ్వంగ హరికీర్తి నుడువఁడేని" యను ప్రహ్లాదోక్త ప్రకారము నోటినిండగా సిగ్గు జంకు కొంకులన్నియు వీడిపారిపోవునటుల చెప్పించిరి. పవిత్ర రామనామామృత రసమును రాత్రింబవళ్లు ఇష్టముండినను — లేకుండినను శబ్దవిస్తరణ యంత్రముల ద్వారా ప్రాపంచిక వ్యవహారములందు మునిగిన గృహస్థులకుకూడా కర్ణానందముగా త్రాపించి మరల ధర్మదేవతను చతు



ప్పాదములచే నడిపించుచున్నారా యనునట్లు చేసినారు, చేయు చున్నారు, చేయనున్నారుకూడా. మఱియు ఏతత్సద్గ్రంథమును అస్మజ్జనకులకు ప్రేరేపణచేసి వ్రాయించి లోకోపకారముచేసిన మహాభాగ్యమును వడికట్టుకున్నారు.

ఇట్టి తపస్సంపన్నుల కృషి ప్రోత్సాహాఫలితముగా వెలు వడిన యీ గ్రంథరత్నమును ఆంధ్రలోకము — పండిత పామర భేదములేక నాదరించి యీ ధన్యజీవుల సంకల్పమును సార్థక మొనరించుగాక యని ప్రార్థించుచున్నాడను.

ఇట్లు భక్తజనవిధేయుఁడు,

**సేగు వేణుగోపాలగుప్త బ్రహ్మచారి.**



## సేగు వేణుగోపాలగుప్తగారు.

వీరు యీ కృతికర్త శ్రీ సంజీవ నారాయణదాసుగారి ద్వితీయ పుత్రులు. సంసారమునందరుచివలన నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతముబూనినవారు. వీరు బాల్యమందు కొన్ని సంవత్సరములు శ్రీ మహర్షి మలయాళస్వాములవారి శ్రీవ్యాసాశ్రమ సంస్కృత పాఠశాలయందును, తిరుపతి శ్రీవెంకటేశ్వర కళాశాలయందును అధ్యయనముచేసి శిరోమణి పట్టభద్రులైరి. మాతృ భాష కర్ణాటముగనుండియు, ఆంధ్రమునను హిందీ భాషయందును చక్కని పాండిత్యము గలవారు. ఆసేతు హిమాచలము యాత్ర జేసి లోకానుభవముతోబాటు పుణ్యార్జనముచేసినవారు. ఆధ్యా త్మిక ప్రచారమునే జీవితలక్ష్యముగా పెట్టుకొన్న కర్మయోగి. మాతాపితృ సేవాపరాయణుడు. ప్రస్తుతము బెంగుళూరు దండు

యందుండు శ్రీగీతాప్రచారమండలియందు ఆధ్యాత్మికసేవఁజేయుచున్నారు. శ్రీ కృష్ణదాసుగారికి కుడిభుజముగనుండి గీతా ప్రచారమున, రామకోటిసప్తాహమున సహాయపడుచున్నారు.

ఇట్లు,

**కుప్పుస్వామి,**

న్యాయశిరోమణి.

---

ఓం

# గ్రంథకర్త వంశ ప్రాశస్త్యము.

## సేగు సంజీవ నారాయణదాసు

జన్మస్థలము: అగరము, ముళబాగలు తాలూకా.

**టపాలుమార్గము:**

యలదూరుపోస్టు, శ్రీనివాసపురం మార్గము,
కోలారుజిల్లా, మైసూరు సీమ.

**దాసుని విజ్ఞాపనము.**

మా తండ్రి నామధేయము — రామహనుమంతయ్య

మా తాత — సంజీవయ్య

**ముత్తాత — హనుమంతయ్య**

ఋషివరతంతు సగోత్రము. యజుశ్శాఖా. ఆపస్తంబ సూత్రము. సంకేతనామము: మాసంత — మాసంతకుల. ఇంటి పేరు: సేగువారు, ఇంటిదేవుడు ఆంజనేయుడు.

సంధ్యావందనములో చెప్పవలసినది:— చతుస్సాగరపర్యంతం శుభం భవతు ఆంగీరసవారతంతవేతి ద్వ్యార్షేయప్రవరాన్విత-వరతంతుసగోత్రః ఆపస్తంబసూత్రః యజుశ్శాఖాధ్యాయీ అని.

అర్జున రథ కేతనములో వుండిన దేవుడే రామభక్తుడౌ ఆంజనేయుడు. తన రథ కేతనమునను న్న స్వామిని పార్థుడు ప్రతిష్ఠచేసిన స్థళము పేరు

ద్వాపర యుగము — దండకారణ్యము
వసిష్ఠాశ్రమము — కదళీషండవనము
భాస్కరక్షేత్రము — మూడలబాగిలు

శతకవాటపురి అను పుణ్యక్షేత్రమే ఇపుడు ముళబాగలు అని స్థళపురాణమున కలదు.

శ్రీకృష్ణార్జున సంవాదరూపమయిన పరమోత్తమమగు భగవద్గీత శ్లోకములకు తోహారాలు వ్రాయుటకు ప్రారంభములో మా ఇలువేల్పయిన ఆంజనేయుని స్తుతించి ఆంజనేయ వరప్రసాదకులయిన మా తండ్రి, తాత, ముత్తాతల చరిత్రము సూక్ష్మముగ వ్రాయుటకు ప్రారంభించి గణపతిని స్తుతించుచున్నాను.

---

ఓం

## గ ణ ప తి స్తు తి .

పల్లవి॥ శ్రీకృష్ణ జయ శ్రీకృష్ణ జయ
శ్రీకృష్ణ జయ శ్రీకృష్ణ
శ్రీకృష్ణ జయ శ్రీకృష్ణ జయ
శ్రీకృష్ణ జయ శ్రీకృష్ణ

శ్లో॥ శ్రీ గౌరీశంకరుల కుమారుని శ్రీ గణనాథుని సేవించి
శ్రీ గీతాసంగీతము వ్రాసెద శ్రీభగవద్గీతను తలచి ॥శ్రీ॥

శ్లో॥ సుముఖాయ నమో సుందరాకార సుజనస్తోత్ర శివపుత్ర
సమస్తలోకాధీశ్వర దేవర నమోనమో మంగళగాత్ర ॥శ్రీ॥

తో॥ శారదాదేవి శరణాగతుడను కరుణించుము వాక్కున నిలచి
శ్రీరమాపతిని సర్వకాలమును స్మరింపచేయుము దయయుంచి
తో॥ లక్ష్మీదేవి కటాక్షించుము లక్షణ కైంకర్యముచేయ
పక్షివాహనుని పట్టపురాణి పరమాత్ముని ప్రేమనుబడయ
తో॥ జ్ఞానభక్తి వైరాగ్యములియ్యవె పరమేశ్వరి ప్రార్థించెదను
జ్ఞానాంబా పార్వతీ మృడాణీ కరుణించుము నేదాసుడను
తో॥ ముందుగ మాతాపితృల స్మరించెద వందనంబు గావించెదను
అందముగా నాజన్మసార్థకము పొందెద దుఃఖము నొందకను
తో॥ గురువే బ్రహ్మము గురువే విష్ణువు గురువే మహేశ్వరుండగును
గురువే సాక్షాత్ పరబ్రహ్మమగు గావున గురువుల స్తుతించెదన్
తో॥ ప్రహ్లాదుని నారదుని పరాశరు పుండరీకు రుక్మాంగదుని
ఆహ్లాదంబున అంబరీషుమది స్మరించెదను నేనతిభక్తిన్ ॥శ్రీ॥
తో॥ శుకాచార్యులను శౌనకాదులను భీష్మాచార్యుని భక్తిగను
పాకారిసుతుని పావనాత్ములగు భాగవతులనే భజించెదన్
తో॥ సీతారాముల సర్వకాలమును సేవచేసి తను వప్పించు
వాతాత్మజునే మదిలోతలచెద జ్ఞానముబడయగ మదితలచి
తో॥ ఎంతోభక్తిగ ఎన్నోవిధముల ఎన్నోకథలుపమానముల
ఎంతోప్రీతిగ రామచంద్రునికి జ్ఞానము తెలిపిన వసిష్ఠుల॥శ్రీ॥
తో॥ జ్ఞాననిధుల అజ్ఞాననాశకుల జ్ఞానము నుపదేశించనిల
జ్ఞానమూర్తిగను జన్మంబెత్తిన గురువుల తలచెద వసిష్ఠుల

## ఆదికవీశ్వర స్తుతి.

తో॥ జ్ఞాన వాసిష్ఠరామాయణమును శ్రీమద్రామాయణంబును
జ్ఞానము గలుగగ రచియించిన వాల్మీకులభక్తి భజించెదను

## శ్రీ వేదవ్యాసస్తుతి.

తో॥ భారతభాగవ తాదిగ్రంథముల పరమప్రీతిగ రచియించి
భారతభక్తుల పోషించిన ఆబాదరాయణుల స్తుతియించి

## ఆంధ్రకవీశ్వరస్తుతి.

తో॥ ఆంధ్ర కవీశ్వరులను స్తుతియించి పోతనామాత్యు భజియించి
ఆంధ్రభాషకును నమస్కరించి భాషలనన్నిట వినుతించి॥శ్రీ

## దేశోద్ధారకులు.

లోకమాన్యులను గాంధిమహాత్ముని పరమహంసులను వివేకులన్
లోకసేవ్యులగు పండితనెహ్రూరును శోకరహితులను స్తుతించెదన్॥

## పండరి భక్తులస్తుతి.

తో॥ పాండురంగ భక్తులను భజించెద పరమప్రీతిగ పాడెదను
పాండురంగ విఠ్ఠలుని భజనలో భక్తితోడనేనాడెదను ॥శ్రీ॥
తో॥ ఆడగపాడగ ఆశగుచున్నది పాండురంగభజనతో గూడి
ఆడుటకును డెబ్బదివరుషంబులు ఈ దేహమునకు వదిగినది
తో॥ ఇంపుగ నీయందే మనసుంచియు ఇహసుఖముల కాశించకను
ఇందిరారమణ నీనామంబును పాడి ఆడు భక్తులగనెదన్
తో॥ ఆత్మతత్వమును అందినవారల అందరికిని నేనందముగ
ఆత్మయందే నేనానందింపగ వందనంబు లందించెదను ॥శ్రీ॥
ఇట్లు ఇష్టదేవతా వందనంబుసల్పి.

## శ్రీ ఆంజనేయస్వామినేనమః

తో॥ శ్రీ సీతాపతి పదయుగళంబును హృదయ పీఠమున నిలుపుకొని
శ్రీ సీతారాఘవుల భజించును మారుతిభక్తితో గూడుకొని
తో॥ తను వాగ్మనంబు దాశరథిదనుచు తను దాసుండని మదినెంచు
తనువు మరచు శ్రీరామునిస్మరించు తనలో తానానందించు

తో॥ ప్రభంజనసుతుడు ద్వాపర యుగమున భగవద్గీతార్థము దెలియ
పార్థునిరథ కేతనమున నిలచెను పరమార్థంబును తాబడయ
తో॥ ఉపనిషత్సారమును అర్జుననకు ఉపేంద్రు డపుడు బోధించు
ఉపదేశంబును మారుతి వినుచును ఉత్సాహంబును తాబెంచె

భారత యుద్ధానంతరము:-

తో॥ పార్థుడు రథ కేతనమున వెలసిన పవమానసుతుని పార్థుండు
శతకవాటపురి సుక్షేత్రంబున ప్రతిష్ఠించె పుణ్యాత్ముండు
తో॥ శతకవాటపురి సుక్షేత్రంబున శతదేవాలయములు గలుగుగ
శతతీర్థంబులు గలుగును అందులో నృసింహతీర్థము శ్రేష్ఠముగ
తో॥ దేవాలయములలో నుత్తమమగు ఆంజనేయ దేవాలయము
సేవింతురు యాత్రికులు భక్తితో ఆంజనేయ పాదాంబుజము
,, దినమణిఉదయాత్పూర్వమెభక్తినిద్విజవరులందరున్నృసింహుని
తీర్థమునకు జని జలకమాడుకొని నిత్యకర్మములు తీర్చుకొని
,, భక్తిగ పరమాత్ముని భజించుకొని భాగవతులతో కూడుకొని
బాలకృష్ణఆశ్రమము మొదలుకొని భగవన్నిలయంబులనుగని
,, ఆంజనేయ దేవాలయంబునకు అంజలిశిరమున నుంచుకొని
ఆంజనేయుపదకంజము దలచుచు అరుదెంతురు అక్కరబూని
,, గోవిందాయని గోవిందాయని గోవిందరాజుల దర్శించి
గోవిందంభజ గోవిందంభజ గోవిందంభజ యనితలచి ॥శ్రీ॥
,, వరములనొసగెడి వరదరాజులకు వందనములు భక్తిగసల్పి
వరదునిమదిలో వదలక తలచుచు వరములగొని పూజలుసల్పి
,, సుగ్రీవుని సేవించియు నరహరి చరణములను తమతలవుంచి
సుగ్రీవముతో వాయుతనూజుని వర్ణనంబులనుగావించి ॥శ్రీ॥

తో॥ వైఖానస ఆగమమురీతిగను వాయుతనూజుని ప్రీతిగను
వైఖానసు లర్చింపగ షోడశ పూజల నేకాగ్రతగనియుఞ ॥శ్రీ॥
,, సీతాలక్ష్మణ సహితుండగు శ్రీరామచంద్రమూర్తినిగనియు
సీతావల్లభ గతినీవే అని చేతులు తట్టుచు భజించియు ॥శ్రీ॥
,, సుందరాకారు వేణుగోపాల శ్రీకృష్ణుని మదిభావించి
మందరగిరిధరు మాణిక్యరాయు పాదద్వంద్వము సేవించి॥శ్రీ॥
,, సంకటహరు శ్రీవెంకటేశ్వరుని సన్నిధిచక్కగ సేవించి
కింకరులము సంకటములుబాపుము శ్రీనివాసయని మదినెంచి
,, ముఖమంటపమునదశావతారముల్ ముందుగానెదర్శించియును
శ్రీకల్యాణపు మంటపంబుగని శృంగారము లన్నియుగనియుఞ
,, అంతటనిండిన ఆత్మారాముని ఆనందంబున భజియించి
చింతవిడచి శ్రీమదాంజనేయుని తీర్థప్రసాదము సేవించి ॥శ్రీ॥
,, మ్రొక్కుబడులు చెల్లించువారలును యుక్తముగనుతమబిడ్డలకు
మక్కువతలనీలా లొప్పగించి చెవులుకుట్టింతురు శిశువులకు
,, సమారాధనలు సల్పెడివారలు సాధుల పోషించెడివారు
రమానాథు మదితలచుచు తమతమ స్థానంబులు చేరెడివారు

## మావంశీకుల చరిత్రము.

తో॥ శతకవాటపురి సుక్షేత్రంబున మాసంతతులోద్భవుడగుమా
ముత్తాతగువైశ్యకులోత్తంసుడు హనుమంతాఖ్యుడు శ్రీరామ
,, రామరామయని సర్వకాలమును రామునినామము మనంబున
నేమంబున ధ్యానంబును సేయుచు ముఖబాగలు సుక్షేత్రమున
,, ఆంజనేయు పాదములు తలంచుచు సర్కారుద్యోగంబుననూ
అంజనాసుతుని అనుగ్రహంబున ముద్దురాలు ముద్దమ్మయను

తో॥ కన్యామణిని వివాహంబాడియు కాపురంబునకు అగరమను
గ్రామంబున వసియించియు కృషిగో రక్షణ వ్యాపారంబులను
,, శ్రీ హరి ప్రీతిగచేయుచు పెద్దల సేవించుచు నిర్మలుడగుచున్
శ్రీహరికృపకును పాత్రుడగుచుతా సత్పుత్రుల నల్వురబడసెన్
,, మొదటిపుత్రుడే సంజీవయ్యాన ముద్దయ్యా బాలయ్యానగ
బుచ్చయ్యానగను పుత్రులు నలువుర బడసెను చాలాపెంపెసగ
,, వృద్ధాప్యంబున సద్గతిచెందెను హనుమంతయ్యాను ముత్తాత
ముద్దమ్మయు హరిపాదము చెందెనుముదిమిలోన ముత్తవ్వయుతా
,, సంజీవయ్యాయు సద్ధర్మంబున సహోదరుల పోషించుచును
సద్గుణోపేతలక్ష్మమ్మయను సతికిని సంతానము లేమిన్॥ శ్రీ
,, రామునితలచుచురామభక్తుడగుహనుమంతునిమదితలచుచును
ప్రేమచె తమ్ములబిడ్డల చూచుచు తనపుత్రులవలె భావించెన్
,, ముద్దయ్యా యనెడిముద్దులతమ్మునికి పుత్రుండొక్కడు పుట్టగను
బుద్ధియుతుండగు పుత్రుండనుచును నారాయణ నామంబిడియెన్
,, బుచ్చయ్యాలనెడి పుణ్యాత్మునకును పెద్దభార్యాగర్భాంబుధిలో
పుత్రులిద్దరును పుట్టగ ప్రేమతో మోదమందె తనమనస్సులో
పెద్దబిడ్డకును హనుమంతయ్యానిద్వితీయునకురామహనుమయని
పేరులు పెట్టియు ప్రేమతో చూచియు పోషించెనుతనబిడ్డలని
,, బుచ్చయ్యాకు రెండవభార్యయందుబుత్రులు కొందరుగలుగగని
బహుప్రేమ రామహనుమంతయ్యాను దత్తుస్వీకారమునందెన్
,, రాముని దాసుడురామహనుమయనిరామదాసరారమ్మయని
రామహనుమ శ్రీరామాయనుమని రామునితలంచెతనయుగని
,, రామహనుమనాతనయరావయ్యారామనామమునుబలుకయ్యా
రాముడె నీ గతి వృద్ధుడనయ్యా రారరామ హనుమంతయ్యా

తో॥ వంశోద్ధారకుడవు నాతనయ వాసుదేవుమది తలచయ్యా
వంశము పావనమగునుగదయ్యా శంశిత చరితుండవు జియ్యా
,, కన్నతండ్రి కన్నను కడుప్రేమతో కనిపెంచిరి తల్లియు తండ్రి
చిన్నికొమారుని సతికొప్పగించి జనియెను స్వర్గమునకు తండ్రి
,, లక్ష్మమ్మయు తనతనయునిచూచుచు లక్షణవంతుండని తలచి
లక్ష్మిపతి మదితలచుచు బిడ్డను రక్షించెను ప్రీతినియుంచి॥శ్రీ॥
,, హనుమంతునివలె బలవంతుండగుమనమునరామునిమరువండు
వినయవిధేయతగల సుపుత్రుండు అని తల్లియుతలచుచునుండు
,, పెద్దలగని సేవించెడివాడు పేదల యెడ దయ గలవాడు
మోదమలర హరితలచెడివాడు నాదు కొమారుండనుచుండు
తో॥ ప్రహ్లాదునివలెభక్తియుత్తముడుధ్రువునివలెను దృఢభక్తుండు
ఆహ్లాదము కలిగించుచునుండు రామహనుమయనుతనయుండు
,, కొన్నివర్షములు గడువగ గుణసంపన్న కొమారునిచయువిడచి
వెన్నుని తలచుచు స్వర్గముచేరెను క్రన్నన దేహంబును విడచి
వ॥ మాతండ్రినికన్న జనకతండ్రి బుచ్చయ్యాగారు.
,, ముందుభార్యతో కన్నపుత్రులకు ముదమున ఆస్తిని పంచిచ్చి
తొందరలేకను రెండవభార్యా పుత్రులతో తానివసించి॥శ్రీ॥
,, బుచ్చయ్యయు తనబిడ్డల నందరి ప్రేమించియు ఆస్తినిపొంచి
పుత్రీపుత్రులతో సుఖముండియు పుణ్యలోకమున నివసించె
వ॥ ఈ నలుగురు అన్నతమ్ములుపయికి బాలయ్య అను పుణ్యాత్ముడు
సంతానము లేనివాడని వినుము.

## మా తం డ్రి వృ త్తాం త ము.

తో॥ శ్రీలకుల గోత్రమున జన్మించిన
శ్రీయుత లక్ష్మిదేవియన

శీలవతినితా వివాహామాడియు
సేగు రామహానుమంతయ్యాయుతాన్ ||శ్రీ||

తో|| గృహాస్థధర్మము ధర్మయుక్తముగ
గృహిణీ యుక్తుండై నడపి
గృహాయజమానుండగు తన అన్నగు
హానుమంతయ్యాజ్ఞనుసలిపి ||శ్రీ||

తో|| శతకవాటపురి సుక్షేత్రంబున
సేవక సమూహామును గాచు
శ్రీమదాంజనేయుని సేవించిరి
భ్రాతృవులిద్దరు ప్రియులగుచు ||శ్రీ||

తో|| హానుమంతుని ప్రీతిగ యాత్రీకుల
అనుకూలము చేయగదలచి
హానుమంతుని గుడిప్రాకారమునకు
పడమట చత్రము కట్టించి ||శ్రీ||

తో|| హానుమంతయ్యను రామహానుమయును
అన్నతమ్ము లిద్దరు ప్రీతి
హానుమంతునికిని ధర్మచత్రమును
అర్పణచేసిరి బహాుభక్తి ||శ్రీ||

## రామహానుమంతయ్యగారి చరిత్రము.

తో|| అగర గ్రామంబున వసియించుచు
అన్నయొసంగిన గృహామందు
అతిథుల అభ్యాగతులను విప్రుల
ఆదరించె తన గృహామందు ||శ్రీ||

తో॥ ఇట్లు రామహనుమంతయ్య యథా
విధిసత్కర్మలు చేయుచును
విఠ్ఠల శ్రీ హరి నారాయణయని
విధి జనకుని మది తలచుచును ॥శ్రీ॥

తో॥ గోసంరక్షణ కృషివాణిజ్యము
కుల ధర్మంబని ప్రీతిగను
గోసంరక్షణ గోపూజయు తన
పత్నితోడ తా సల్పుచును ॥శ్రీ॥

వ॥ ఈ దంపతు లెపుడు.

తో॥ గోబ్రాహ్మణ పూజాధురంధరులు
గోవిందుని మరువనివారు
గోపూజయు దేవతార్చనంబును
గోరిక కోరక సలిపెదరు ॥శ్రీ॥

తో॥ సమస్త వ్రతముల సల్పెడివారలు
సకల దేవతారాధకులు
సద్వ్రతంబుల సేవచేయుదురు
సత్కథా శ్రవణ సల్పెదరు ॥శ్రీ॥

వ॥ ఇట్లు లక్ష్మిదేవమ్మయు శ్రీరామహనుమంతయ్యయు ధర్మయుక్తమైన గృహస్థాశ్రమంబు నడపుచు నలువుర పుత్రులను నొక ఆడబిడ్డను బడసిరి.

1. సంజీవ నారాయణదాసు
2. అశ్వత్థమ్మ
3. రామచంద్రయ్య
4. కృష్ణదాసు
5. గోవిందయ్య

తో॥ బిడ్డల పోషించుచు తలితండ్రులు
బుద్ధితో రాముని స్మరించుచుఁ
బిడ్డలకును తగుబుద్ధులు పల్కుచు
బోధించిరి హరినామమును ॥శ్రీ॥

తో॥ ధర్మము అర్థము కామము మోక్షము
తగువిధముల బోధించుచును
ధర్మమె అన్నిటికిని మూలంబని
తగబల్కిరి తమ తనయులకుఁ ॥శ్రీ॥

తల్లితండ్రులు తమ కుమారులు నల్వురికి చౌలోప నయనాది కర్మల శాస్త్రోక్తముగచేయించి సకాలంబున వివాహ మును జేసిరి. తల్లితండ్రుల యాజ్ఞానువర్తులై ఇప్పటికి అందరు సూర్యోదయాత్పూర్వము భగవన్నామస్మరణతో లేచి స్నాన సంధ్యాద్యనుష్ఠానములు సల్పి భగవత్ప్రార్థనాదులు దేవతార్చ నలుచేసి భగవద్గీతా పారాయణము భోజనసమయంబున గీతా పురుషోత్తమ ప్రాప్తియోగము పఠించెదరు. సాయంకాలమున సంధ్యావందనము రాత్రి రామభజన మంగళహారతులు సల్పి భుజింతురు.

ఇట్లు కన్న తలిదండ్రుల ఇష్టప్రకారము పవిత్రులుగ సత్ప్రవర్తనతో నుండుటే తలితండ్రులు కని పెంచినందులకు సార్థకము.

నా చెల్లెలు సౌ॥ అశ్వత్థమ్మ నిరంతరము రామభజనతో కాలము గడుపుచు తన యజమానుడయిన శ్రీ కారుపాకల సూర్యనారాయణయ్యను రామాయణాది సద్గ్రంథంబుల బఠించ ప్రోత్సహించి తాను తత్కథాశ్రవణము చేయుచున్నది. ఇవే తలితండ్రులకు వారలిచ్చెడి కానుక.

తో॥ తలితండ్రుల వాక్యంబుల రీతిగ
తనయు లందరును ధర్మముతో
తలితండ్రులె గౌరీ శంకరులుగ
తగసేవించిరి నియమముగ ॥శ్రీ॥

## మా తల్లితండ్రులు.

నా చిన్నవయసున బ్రహ్మశ్రీ వెంకటేశశాస్త్రిలవారు నాకు కన్నడభాష చదివించుటకు ఓన్నమః పూజగావించిరి.

మాగ్రామస్థులగు దేశపాండే వెంకోబరాయలు నాకు ఆంధ్ర సంస్కృతాభ్యాసము గావించి వాచకము, భారతరామాయణ భాగవతము చెప్పించిరి. వారు నిరపేక్షులు, బలాత్కరించి పాఠము చెప్పెడి మహనీయులు.

తో॥ దేశపాండె వెంకోబ రాయలను॰దేశికోత్తముని దయవలను
వాసిగ సంస్కృతమాంధ్ర గ్రంథముల॰వాక్కుచేతబల్కగనాయెగా
తో॥పెద్దకొమారుండగు నాయందలి॰ప్రేమచె బాల్యపువయసుననె
పెద్దలచే విద్యయు నేర్పించెను॰ప్రీతిగ మానాయన తానే ॥శ్రీ॥

తో॥ భారత రామాయణ భాగవతము
పారాయణమును చేయగను
బాగుగవిని సంతోషము పొందెను
మాతండ్రియు మోదంబునను ॥శ్రీ॥

మాగ్రామమున ఆర్యవైశ్య పేట మధ్య భాగంబున వుండెడి అశ్వత్థవృక్షము, నాగులరచ్చ సమీపంబున మాఆర్య వైశ్యులందరిచే నిర్మింపబడిన శ్రీరామభజన మందిరమున భక్తులందరు చేరికొని శ్రీరామభజనసేయు సమయంబున బ్రహ్మజ్ఞానులును తపోధనులును దత్తాత్రేయోపాసకులయిన

బ్రహ్మశ్రీ రఘునాథరాయలనువారలు నిత్యమును వచ్చి భజనలో పాల్గొనుచుండిరి. మేమందరు వారికగ్రస్థానమివ్వ వారు శాంతముగ తంబూరు చేబూని చేయు భజనను వినుచుందుము. వీరు నిత్యము భజనమందిరమునకువచ్చి "దత్తాత్రేయ గురు అవధూత శ్రీ జనార్దన ఏకనాథ। భజమనరామ్ భజమనరామ్ గంగాతులసీ సాలిగ్రామ్" ఇట్లు భజన చేయువారు. ఒకనాడు నన్ను చూచి నాయందు దయగలిగి నన్ను కృతార్థుని చేయదలచి "నీ కెంతవయస్సు"ని అడిగిరి. స్వభానుసంవత్సర ఆశ్వీజ శు ౧౧ శుక్రవారము ధనిష్టా నక్షత్రమున మధ్యాహ్నసమయమున నాజన్మమని నేను ఉత్తరమివ్వగ, షోడశ వర్షములు కావచ్చెనని వికారి సం॥ భాద్రపద శు ౧౧ 15-9-1899 శుక్రవారము ౯ ఘంటలకు పరమోత్తమమగు హంసమంత్రము నుపదేశించిరి.

తో॥ చిన్నవయసుననె చేరబిలచినను
కన్నతండ్రివలె కరుణించి
ఉన్నతత్వమును ఉపదేశించిరి
శ్రీ రఘునాథులు దయయుంచి ॥శ్రీ॥

తో॥ హనుమంతుని ఎటు శ్రీ రఘునాథుడు
అనుగ్రహించిన విధమెంచి
అనుగ్రహించెను బ్రహ్మశ్రీ రఘు
నాథరావునను దయయుంచి ॥శ్రీ॥

వీరు దత్తాత్రేయోపాసకు లగుటచే ప్రతివత్సరము మార్గశిర శు ౧౫ దత్తాత్రేయ జయంతిగావున ఈ శుభదినమందు దత్తాత్రేయ భజనతో దత్తాత్రేయప్రీతిగ సద్బ్రాహ్మణోత్తములకు సంతర్పణచేయించి సంతసించుచుండిరి.

ఇట్లు మూడు వత్సరములు దాటగ వీరు ఎల్లపుడు కాశీ విశ్వనాథాలయమందు యోగనిష్ఠతో వుండువారు.

మామూలు మేరకు నొక దినంబున వీరి వాక్యామృతము శ్రవణముచేయు సమయంబున తమ దేహమునకు చావుసమీపించి నదని పలికిరి. నేను విని దీనవదనుడనై వ్యథచెంది

తొ॥ సమీపించినే నమస్కరించుచు
సద్గురునాథుని సేవించి
సద్గురువర్యుడ నాగతి ఏమని
సవినయంబుగను నుతియించి ॥శ్రీ॥

ప్రార్థించ గా

భగవద్గీతను నాచేతి కందిచ్చి "ఈగీతనిన్ను ఉద్ధరించును. ఎపుడు పఠించుము. గీతార్థము రీతి గృహస్థాశ్రమ ధర్మము నడుపుము. నీతలిదండ్రులు సంతోషించురీతి గీతార్థము బోధించుము" అనిపలికిరి. నేను గురువుల యెడపాటు సహించక మరలను ఇక నాకిట్లు బోధించు పుణ్యాత్ము లెవరనియు,

తొ॥ నాగతి యేమని నేప్రార్థించగ
నాయన భయపడవద్దనుచు
నాకంటెను పరమోత్తమ గురువులు
నావలె బోధించెద రనుచు ॥శ్రీ॥

తొ॥ దత్తాత్రేయుని తలంపుచేయుచు
తనుమన ధనములు గురువుకును
దత్తము చేసియు దేహము విడచిరి
తాదాత్మ్యంబును పొందుచును ॥శ్రీ॥

సద్గురుమూర్తులు తే 20-12-1903 ది శుభకృతు సం॥ మార్గశిర బ॥ ౯ స్థిరవారము ఉదయం 9 ఘంటలకు నిర్యాణముచెందిరి.

విద్యాగురువులు వెంకోబరాయలువారు తే 18-12-1916 నల సం॥ మార్గశిర బ ౮ — ౯ సోమవారము మధ్యాహ్నము మూడుఘంటలకు స్వర్గారోహణముచేసిరి.

రెండు నిధులు పోగొట్టుకొని వారి ఆజ్ఞవలె గృహస్థాశ్రమమందు మాతాపితృల సేవించుచు జవుళివ్యాపారములో కుటుంబపోషణ చేసుకొనుచు యదృచ్ఛాలాభ సంతోషముతో భార్యాసహితము కాలము గడుపుచుండ శ్రీ రామానుగ్రహము వలన సత్సంతానము కలిగెను.

1. ఆడబిడ్డ వరలక్ష్మీదేవి
2. రఘునాథగుప్త
3. వేణుగోపాలగుప్త
4. లక్ష్మీనారాయణగుప్త
5. విఠోబగుప్త

ఇట్లు కుటుంబభారము గోపురపు ప్రతిమ వహించు నట్లు భరించి శ్రీ రామభజన మందిరమున శ్రీ రామోత్సవము, రామకోటి, శ్రీ కృష్ణోత్సవములును జరుపుచు హరికథలు నుడువుచు కాలము గడుపుచుండును.

తో॥ సద్గ్రంథంబులు చదువుచు శ్రీహరి
కథలను నుడువుచు బాడుచును
సత్కాలక్షేపములచె కాలము
గడుపుచు గురువుల వెతకుచును ॥శ్రీ॥

తో॥ ఆసేతు అయోధ్యాపురి వరకును
కన్న తల్లితండ్రుల తోడన్
అనేక యాత్రలు ఆచరించియును
ఆత్మజ్ఞానము బడయగను ॥శ్రీ॥

తో॥ అనేక వ్రతములు ఆచరించగను
ఆఈశ్వరు మది భజించగన్
ఆజన్మార్జిత పాపరాసులును
అణగియు గురుదర్శన మాయెన్ ॥శ్రీ॥

---

## గురుదర్శనము.

సద్గురువులకు పూర్వనామధేయము బ్రహ్మశ్రీ శామ శాస్త్రిలువారు. వీరి తల్లిగారు — కనకమ్మగారు, తండ్రిగారు — నంజుండశాస్త్రిలువారు. వీరిది భృగువంశము. శ్రీవత్స గోత్రము, వీరి స్థళము — ముడియనూరు అగ్రహారము, వీరు ఈ గ్రామమునకు పశ్చిమమున ఆరోగ్యాశ్రమమును స్థాపించిరి.

ఈ శామశాస్త్రిలువారే రోగిష్ఠులకు ప్రకృతి చికిత్సల వల్ల ఆరోగ్యము కలిగించినవారు. భవరోగులకు జ్ఞానోపదేశము చేసి భవసాగరము దాటించువారు. వీరి బావమరదులు బ్రహ్మశ్రీ సుబ్బయ్యగారికి ప్రకృతి చికిత్సలు నేర్పించి వేదాంతశాస్త్రము బోధించుచుండిరి.

మాగ్రామమునకు నాల్గుమైళ్ళ సమీపమున ఇట్టి మహనీయులున్నను భగవంతుని అనుగ్రహము కలుగునంతవరకు వీరల దర్శనము లేకుండెను.ఒకపుడు నాభార్య వ్యాధిపీడితురాలాయెను. ఆరోగ్యాశ్రమములో వుండవలసివచ్చెను. కష్టము సంభవించుట మంచిదానికే అని ఆరోగ్యాశ్రమమునకు ప్రయాణమైతిని.

తో॥ మాగ్రామమునకు సమీపమందున
ముడియనూరు అను పేరుగల
బ్రాహ్మణవర్యుల అగ్రహారమున
ఆరోగ్యాశ్రమ స్థాపకుల ॥శ్రీ॥

తో॥ ఆచార్యోక్తములను నేగంటిని
ఆనందంబును బొందితిని
ఆచార్యుల పాదముల బట్టితిని
అజ్ఞానము తొలగించితిని ॥శ్రీ॥

తో॥ ఎంత దయాళులో చెంతచేరినే
సాష్టాంగ నమస్కారముచేసి
చింతలు దీర్చగ ప్రార్థనచేయగ
సంతోషముతో దయచేసి ॥శ్రీ॥

అనుగ్రహించిరి.

వీరు నిత్యము స్నానసంధ్యానుష్ఠానములు తీర్చుకొని భగవద్గీత మూడు అధ్యాయములు పఠించి అధ్యాత్మరామాయణమును, శ్రీమద్రామాయణమును పారాయణముచేతురు. ప్రతినెల పునర్వసునాడు పట్టాభిషేకము తప్పక ఆచరించి ఆనాడే శ్రీ రామజననమువరకు శ్రీమద్రామాయణము పఠించి మంగళము చేయుచుందురు. ఇట్లు భక్తిపూర్వకముగ సుమారు 200 శ్రీ రామపట్టాభిషేకములు చేసినారు. నాకు నిత్యము భారత రామాయణ భాగవతకథలు వినిపించి, అగరము శ్రీనివాసాశ్రమమున భాగవత సప్తాహము ప్రతివత్సరము జరుగునట్లు చేసిరి.

నాకును వరంగల్ శ్రీ సాధు బుచ్చిలింగంగారికిని ఏకాంత ప్రదేశమున,

తో॥ బ్రహ్మసూత్రముల భగవద్గీతా
భాష్యంబులు పలుకుచు మాకు
మాండూక్యోపనిషద్భాష్యమ్మును
శ్రవణము చేయించిరి కడకు ॥శ్రీ॥

వీరు ఎప్పుడున్ను ఏ ఊరికివెళ్ళినను ఎక్కడవుండినను శ్రీమద్రామాయణ గ్రంథమును పూజాద్రవ్యములతో వెంటనే వుంచుకొందురు. నిరాడంబరులు. సదా రామాయణార్థమునందే దృష్టి గలవారు.

శ్లో॥ శమదమ తపస్సు శౌచమార్జవము
శాంత స్వభావములుగలిగి
శంకరుల వలెను క్షేమదాయకులు
శంకరులే వీరని మెలగి ॥శ్రీ॥

తో॥ శ్రీమచ్ఛంకర భగవత్పాదుల
సద్గ్రంథంబులు వినిపించి
శ్రవణానందము గలుగగచేసిరి
సంశయమ్ములను తొలగించి ॥శ్రీ॥

మాకు మావారలకు ఆరోగ్య భాగ్యము, శ్రీ రామ చంద్రుని కరుణాకటాక్షభాగ్యము కలిగించిరి.

ఇట్టి శాంతచిత్తుల నివాసస్థానమగు ఆరోగ్యాశ్రమమందు ముళబాగలులో వుండిన కీర్తిశేషులు సుంకు గురప్పశ్రేష్ఠిగారి పేరున వారివారల అనగ వీరిభార్యలు రంగమ్మ, సీతమ్మ; కొమారులు అశ్వత్థయ్య ఒక దేవస్థానమును కట్టించి ఆదిదేవుడగు దక్షిణామూర్తిని అందు ప్రతిష్ఠించిరి. దేవుని దీపారాధనకు ముళబాగలు సమీపమున ఖుష్కీ జమీనున్ను, స్వామి నివేదనకు అగరముచెర్వు కట్టకింద క్తు వారనే మాతండ్రిగారిచే నిర్మింపబడిన నొక రాతికట్టడ భావియందు అర్ధభాగమున్ను,జమీనున్ను క్రయమునకు తీసియిచ్చిరి. దక్షిణామూర్తి వార్షికోత్సవమునకు ఇదే చెర్వుకింద పెద్దభావి ఆధారముగ తరీజమీన్లు రెండుస్థళములలో తీసియిచ్చిరి.

ఈ దేవస్థానములో ముడియనూరు అగ్రహారమునగల బ్రాహ్మణోత్తములు అందరుచేరి శ్రీ శామశాస్త్రిలువారిని పూజచేయు కాలంబున వేదఘోషతో మంత్రపుష్పము చెప్పుచుండ శ్రవణముచేసిన బ్రహ్మానందముగ నుండును. రాత్రి దీపారాధనకాలమున బ్ర॥ శ్రీ॥ నైషధం సుబ్బయ్యగారు త్యాగరాజ కృతులు, పురందరనామములు భక్తులతో చేరుకొని గానము చేయుచుండ బ్రహ్మానందమగును.

ఇట్లుండ మాస్వాములగు బ్రహ్మ శ్రీ శామశాస్త్రిలు వారు నందన సం॥ ఫాల్గుణ శు. ౧౫న శృంగేరి జగద్గురు శంకరుల సన్నిధానమున తురీయాశ్రమ స్వీకారము బడసి శ్రీ శ్రీ శ్రీ రామబ్రహ్మానంద సరస్వతీస్వాములని సార్థకనామధేయమును బడసిరి.

తో॥ రామబ్రహ్మను రాత్రి పగళ్ళను
రక్తితో భజించి శ్రీ శ్రీ శ్రీ
రామ బ్రహ్మానంద సరస్వతీ
స్వాములయిరి రాముని దయ శ్రీ ॥శ్రీ॥

తో॥ చల్లని పలుకులు పలుకుచుండెదరు
సందేహము పోగొట్టెదరు
ఉల్లమలర వుండేది రాముడని
ఉత్సాహము పడుచుండెదరు ॥శ్రీ॥

తో॥ రామబ్రహ్మ చరిత్రము చదువుచ
రామరామ అని తలంచుచ
రామ బ్రహ్మానంద సరస్వతీ
స్వామిని మనమున తలంచెదర్ ॥శ్రీ॥

## మా తల్లితండ్రుల స్వర్గారోహణ విచారము.

మా తల్లిగారు తనకొమార్లు, కోడండ్లు, మనుములు, మనుమరాండ్రు సేవించుచుండ భగవన్నామముతో కాలము గడుపుచు, గోసేవచేయుచు, తులసీదేవిని సేవించుచు, ఏకాదశి మొదలగు వ్రతములు చక్కగ పాలించుచుండ, వృద్ధాప్యదశ ప్రాప్తించగ, భాగవతములో ఉద్ధవబోధ వినతలంచినందున, మా గురువులగు ఆరోగ్యాశ్రమ స్థాపకులు బ్రహ్మ శ్రీ శామశాస్త్రిల వారిని ప్రార్థించగ వారు దయచేసివచ్చి శ్రీనివాసాశ్రమములో భాద్రపద శుద్ధ ౫ మొదలు భాగవతసప్తాహము ప్రారంభించిరి. అపక్వాహారదీక్షతో ఉద్ధవబోధను భక్తులందరికిని వినిపించిరి. మా తల్లిగారు శ్రీ కృష్ణవాక్యములువిని పరమానంద భరితురా లయిరి. ఇప్పటికిని భాగవత సప్తాహము మాతల్లిగారి ప్రీతిగ నడుచుచున్నది. ఆ సంవత్సర పుష్య బ॥ ౭ స్థిరవారము ఉత్త రాయణ పుణ్యకాలమున కొడుకులు, కోడండ్రు మొదలుగాగల అందరు రామనామస్మరణ చేయుచుండ మా తండ్రిగారి యెదుట దేహమును వదలి శ్రీకృష్ణానుగ్రహ పాత్రురాలై అఖండులైరి. తండ్రిగారు దృఢాంగులై గోవిందనామము పఠించుచు, యుక్తా హార విహారులగుచు, చిన్నబిడ్డవలె సంచరించుచు, శ్రీనివాసాశ్రమ మున శ్రీనివాసమూర్తి శ్రీదేవిభూదేవితోకూడ ప్రతిష్ఠింపబడ నేత్రానందముగ సేవించుచు ప్రతివర్షము జరుపబడు భాగవత సప్తాహములో బ్ర॥ శ్రీ॥ శామశాస్త్రిలవారివల్ల భాగవతము శ్రవణముసేయుచు, యోగవాసిష్ఠము నాచే జదివించి శ్రవణము చేయుచు, భారత కథా శ్రవణముచేయుచు, భీష్ముని చరిత్రము చక్కగ వినుచు, భీష్ముని బ్రహ్మచర్యమునకు ఆనందపడుచు, ఉత్తరాయణము గమనించుచు 96 సంవత్సరములు పూర్తిగ

బ్రతికి, రోగాది ఉపద్రవముల పాలుగాక, దుఃఖసంసారమున చిక్కక, ఏ వ్యథ మనస్సున ధరించక, గోవిందనామ స్మరణ చేయుచు, పుత్రులాదిగ అందరు చేరుకొని ఆనందముగ హార్మోనియం వాద్యముతో గోవిందుని భజన చేయుచుండ,

ఓం భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే।
సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఞ్ కరణే॥

తో॥ గోవిందాయను గోవిందాయను
గోవిందాయను మూఢమతి
అవసానపుకాలంబున కావదు
వ్యాకరణం విను మందమతి॥

శ్లో॥ మూఢ జహీహి ధనాగమతృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాం।
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తం ॥భ॥

శ్లో॥ భగవద్గీతా కించిదధీతా
గంగాజలలవకణికా పీతా।
సకృదపి యేన మురారిసమర్చా
క్రియతే తస్య యమోఽపి న చర్చాం ॥భ॥

శ్లో॥ గేయం గీతా నామ సహస్రం
ధ్యేయం శ్రీపతిరూపమజస్రం।
నేయం సజ్జనసంగాదనిశం
దేయం దీనజనాయ చ విత్తం ॥భ॥

అని అందరు భజనచేయుచుండ పార్థివ సం॥ అధిక చైత్ర శు ౯ గురువారమున పగలు కుడిచెవి పైకివుండగ గోవింద

నామస్మరణతో దేహము చాలించి శ్రీ కృష్ణానుగ్రహపాత్రులై అఖండులైరి.

ఇట్లు మాతాపితృలు ఆత్మానందము పొందగ నాతమ్ములు రామచంద్రయ్య, కృష్ణదాసులు, గోవిందయ్య నాయందు భ్రాతృవత్సలత చూపుచు నన్ను గురువుగ భావించి నాఆజ్ఞను ఇప్పటికి మీరక కలియుగ నాటక మాడక భగవద్గీతా పారాయణాది సత్క్రియల జరుపుచుండుట నాకానందము.

తే॥ గీతా సంగీతంబను భగవత్
గీతార్థము వ్రాయగ తాను
ఉత్సాహంబును గలుగగ చేసెను
కృష్ణదాసుడను సోదరుడుఁ ॥శ్రీ॥

నాకొమార్లు రఘునాథగుప్త, వేణుగోపాలగుప్త, లక్ష్మీనారాయణగుప్త, విఠోబగుప్త వీరలు భ్రాతృవత్సలతగలిగి సద్ధర్మవర్తులై ఉద్ధరించు గీతాసంగీతమును సదా చదువుచు గానముచేయుచు గీతార్థముతో ప్రపంచ సంసారము నడిపించుచు సర్వకాలము శ్రీ రామభజనతో నుండుటే నాయందు గురుభావన గలిగియుండుటని నా అభిప్రాయము.

ఇట్లు తమ ఇష్టదైవమైన శ్రీమదాంజనేయుని, పూజ్యులయిన తండ్రి తాత ముత్తాతల గురువుల సంస్తుతించి గీతాచార్యుల వాక్కులనుండి వచ్చిన గీతామాతను స్తుతించుచున్నాను.

# గీతాప్రార్థన.

తో॥ భక్తాభీష్ట ఫలప్రదుడగు శ్రీ
భగవంతుని పలుకగు గీతా
భక్తులలో నేకనిష్ఠ భక్తుడ
భ్రమచెందితి తల్లీ గీతా ॥శ్రీ॥

తో॥ గీతాసంగీతము యను పేరుతో
పలుక నెంచితిని వోగీతా
నీతాత్పర్యము చక్కగ తెల్పుము
నీదే భారము వోమాతా ॥శ్రీ॥

తో॥ సర్వోపనిషత్సమేత గీతా
సర్వలోకపావని గీతా
సర్వోపద్రవనాశని మాతా
సర్వశుభప్రదె మన్మాతా ॥శ్రీ॥

తో॥ జనార్దనుండను పర్వతమందున
జన్మించిన పావన గీతా
జన్మజరామరణాదుల బాపెడి
జగజ్జనని ఓ మామాతా ॥శ్రీ॥

తో॥ పూర్వజన్మ సమయంబున
మనసా పుణ్యమేమి చేయించితివే
పూర్వపుణ్యఫల మబ్బెను ఇపుడు
భగవద్గీతను భజించవె ॥శ్రీ॥

తో॥ గీతాగీతని కీర్తన సల్పుచు
గీతార్థము శాంతిగ వినుచు
గీతాసంగీతంబును పాడుచు
గీతేగతియని మదినెంచు ॥శ్రీ॥

తో॥ గీతాగంగోదకమున మునుగుచు
గీతామృత పానము చేసి
గీతా సంగీతంబును నుడువుచు
గీతేగతి యనుచే వాళి ॥శ్రీ॥

## గీ తా చా ర్య స్తు తి.

తో॥ శ్రీకృష్ణ నీవాక్యామృతమును
నీదాసుని బుద్ధిని నిలచి
ఓ కృపాకరా తోహరారూప
చరణము లనెదవ దయయుంచి ॥శ్రీ॥

తో॥ పలికెడివాడవు నీవెకృష్ణ
పలికించెడి శక్తియు నీదె
ఫలమును బొందెడివాడవు నీవె
ఫలమునీదె సర్వమునీదె ॥శ్రీ॥

తో॥ నీవచనమునను పలికిన పలుకులు
భవహారమగు నట శ్రీకృష్ణ!
పావనులగు నీభక్తుల వాక్కుల
పలికెదవని కోరెదకృష్ణ ॥శ్రీ॥





# ప్రార్థనలు.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥ ౧

శ్లో॥ అభీప్సితార్థసిద్ధ్యర్థం పూజితో యస్సురైరపి ।
సర్వవిఘ్నచ్ఛిదే తస్మై గణాధిపతయే నమః ॥ ౨

శ్లో॥ శరదిందువికాసమందహాసాం
స్ఫురదిందీవరలోచనాభిరామాం ।
అరవిందసమానసుందరాస్యా
మరవిందాసన సుందరీముపాసే ॥ ౩

శ్లో॥ కరద్వయేన కమలే ధారయంతీం స్వలీలయా ।
హారనూపురసంయుక్తాం లక్ష్మీదేవీం నమామ్యహం॥ ౪

శ్లో॥ ఓంకారపంజరశుకీం ఉపనిషదుద్యాన కేళికలకంఠీం ।
ఆగమవిపినమయూరీం ఆర్యామంతర్విభావయే గౌరీం॥ ౫

శ్లో॥ తనురిదమభివృద్ధిం సమవాప్యాస్తే సర్వదేవతా శక్త్యా ।
దేవ్యా యయా వికలయా మాత్రే తస్యై నమోఽస్తు భగవత్యై॥

శ్లో॥ యస్మాత్పార్థివదేహః ప్రాదురభూ
ద్యేన భగవతా గురుణా ।
సంతు నమాంసి సహస్రం
తస్మై సర్వజ్ఞమూర్తయే పిత్రే ॥ ౬

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥ ౮

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥ ౯

శ్లో॥ సనందనం శ్రీసనకం సనాతనం
సనత్కుమారం చ సనత్సుజాతం ।
శ్రీవామదేవం చ శుకం మహాంతం
నమామి భక్త్యా నిజబోధసిద్ధ్యై ॥ ౧౦

శ్లో॥ వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం ॥ ౧౧

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః ।
అఫాలలోచనశ్శంభుః భగవాన్ బాదరాయణః ॥ ౧౨

శ్లో॥ సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ।
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే ॥ ౧౩

శ్లో॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః॥ ౧౪

శ్లో॥ మునిం స్నిగ్ధాంబుధాభాసం వేదవ్యాసమకల్మషమ్ ।
వేదావాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహం ॥

శ్లో॥ యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్।
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతసమకల్మషమ్॥ ౧౬

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం ।
సూత్రభాష్యకృతం వందే భగవన్తౌ పునఃపునః ॥ ౧౭

శ్లో॥ భక్త్యా శ్రీశంకరాచార్యం తచ్ఛాత్రం సద్గురుం ముహుః।
నమామి శిరసా నిత్యం సమ్యక్ జ్ఞానోపపత్తయే ॥ ౧౮

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్ ।
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి ॥ ౧౯

శా॥ శ్రీకైవల్యపదంబు చెందుటకునై చింతించెదన్ లోక ర
క్షైకారంభకు భక్తపాలనకళా సంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు గేళిలోకవిలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనాడింభకున్ ॥

ఉ॥ ఆతత సేవజేసెద సమస్తచరాచర భూతసృష్టివి
జ్ఞాతకు భారతీ హృదయ సౌఖ్య విధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికరనేతకు గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిల తాపసలోక శుభప్రదాతకున్ ॥

ఉ॥ వాలిన భక్తిమ్రొక్కెద నవారిత తాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖ పద్మమయూఖ మాలికిన్
బాల శశాంకమౌళికి గపాలికి మన్మథగర్వ పర్వతో
న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్ ॥

---

ఓం

# శ్రీ గురుపరంపరా స్తోత్రప్రారంభః.

శ్లో॥ మహాదేవో మహావిష్ణు స్తృతీయశ్చతురాననః ।
వసిష్ఠశ్శక్తియోగీన్ద్రః పరాశరమహామునిః ॥ ౧

,, వ్యాసశ్శుకో గౌడపాదో గోవిన్దో భగవాన్మునిః ।
గురుశ్శ్రీశంకరాచార్యష్షణ్మతస్థాపనః ప్రభుః ॥ ౨



శ్రీ నేగు కృష్ణదాసుగారు, శ్రీ నేగు సంజీవ నారాయణదాసుగారు, శ్రీ నేగు వేణుగోపాలగుప్తగారు.

శ్లో॥ సురేశ్వరాచార్యయోగీ నిత్యబోధఘనాభిధః ।
తతో జ్ఞానఘనాచార్యో జ్ఞానోత్తమమహామునిః ॥ ౩

,, జ్ఞానగిర్యాచార్యవర్యస్తథా సింహగిరీశ్వరః ।
తతశ్చేశ్వరతీర్థాఖ్యో నృసింహాభిదతీర్థకః ॥ ౪

,, విద్యాశంకరతీర్థాఖ్యో లంబికాయోగతత్పరః ।
భారతీ కృష్ణతీర్థాఖ్యో విద్యారణ్య మహామునిః ॥ ౫

,, విద్యానగరనిర్మాతా వేదభాష్యాదికృద్గురుః ।
శ్రీచంద్రశేఖరాభిఖ్య భారతీ చ తతః పరం ॥ ౬

,, నృసింహభారతీవర్యో నృసింహోపాసకస్తథా ।
భక్తశంకరనామాఖ్యః పురుషోత్తమభారతీ ॥ ౭

,, శ్రీచంద్రశేఖరాభిఖ్యభారతీ తదనన్తరం ।
నృసింహభారతీ చైవ పురుషోత్తమభారతీ ॥ ౮

,, భారతీరామచన్ద్రాఖ్యో నృసింహాభిఖ్యభారతీ ।
నృసింహభారతీ భూయో నృసింహోఽభినవస్తథా ॥ ౯

,, సచ్చిదానన్దయోగీన్ద్రః స్తంభే హేరంభదర్శనః ।
శ్రీనృసింహాఖ్యయోగీన్ద్రస్సచ్చిదానన్దభారతీ ॥ ౧౦

,, తతశ్చాభినవాభిఖ్యస్సచ్చిదానన్దభారతీ ।
తతోఽభినవపూర్వశ్శ్రీనృసింహాభిదభారతీ ॥ ౧౧

,, సచ్చిదానన్దయోగీశస్తపశ్చర్యాపరాయణః ।
పునశ్చాభినవాభిఖ్యస్సచ్చిదానన్దభారతీ॥ ౧౨

,, శ్రీశృంగేరిపురాధీశ శ్రీవిద్యామన్త్రబోధకః ।
శ్రీమదాచార్యసదృశశ్శ్రీనృసింహయతీశ్వరః ॥ ౧౩

,, భారతీనామవిఖ్యాతస్తపశ్శీలో జగద్గురుః ।

రాజాధిరాజసంపూజ్యో జగత్ఖ్యాతో వ్యరాజత ॥ ౧౪

శ్లో॥ తచ్ఛిష్యస్సచ్చిదానన్దశివాభినవపూర్వకః ।
నృసింహభారతీస్వామీ జయత్యేవ జగద్గురుః ॥ ౧౫

,, తేషామనుగ్రహాజ్జాతశ్చంద్రశేఖరభారతీ ।
సుప్రసిద్ధో మహాన్ ఖ్యాతః లోకోద్ధారకతత్పరః ॥ ౧౬

,, సుప్రసిద్ధే గురోః పీఠే విద్యానాం నిధిరేవ చ ।
విద్యాభినవతీర్థేతి జయత్యద్య మహాన్ గురుః । ౧౭

,, శ్రీమన్తో జ్ఞానదాతారః శిష్యాణాం పాపహారిణః ।
తేజోవంతో ప్రకాశన్తే జగతాం భాగ్యదేవతాః ॥ ౧౮

,, తత్సంప్రదాయమాశ్రిత్య రామబ్రహ్మయతీశ్వరః ।
ఆరోగ్యాశ్రమనిర్మాతా తస్మిన్నేవ విరాజతే ॥ ౧౯

,, అవిద్యావరణం సర్వం శిష్యాణాముపహారితుం ।
ప్రచకాస్తేఽధునా పుణ్యే పవిత్రాశ్రమభూతలే ॥ ౨౦

,, తత్సేవనేన బహవో బ్రహ్మజ్ఞానపరాయణాః ।
విముక్తాస్సంసృతేర్బంధాత్ సజ్జనా భాగ్యశాలినః ॥ ౨౧

,, శ్రుత్యంతం పఠతి శ్రీమాన్ ప్రత్యహం భాష్యపాఠకః ।
గీతాపారాయణం చైవ కరోతి జ్ఞానవానసౌ ॥ ౨౨

,, ప్రాతఃస్నాత్వా సమారాధ్య శంకరం లోకశంకరం ।
ధ్యానయోగపరో నిత్యమామధ్యాహ్నమతఃపరం ॥ ౨౩

,, శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యకృతాన్మునిః ।
పఠన్ గ్రన్థాన్ స్వయం స్వస్య శిష్యాణాం బోధయత్యసౌ ॥

,, ఏవం కాలం నయత్యేవ దక్షిణామూర్తిసన్నిధౌ ।
రామబ్రహ్మమహాయోగీ బ్రహ్మపూర్ణం విచిన్తయన్ ॥ ౨౫



# అథ దత్తాత్రేయ స్తోత్ర ప్రారంభః.

శ్లో॥ జటాధరం పాండురంగం శూలహస్తం కృపానిధిమ్ ।
సర్వరోగహరం దేవం దత్తాత్రేయమహం భజే॥ ౧

అస్య శ్రీ దత్తాత్రేయ స్తోత్రమంత్రస్య, భగవాన్ నారద ఋషిః, అనుష్టుప్ఛన్దః, శ్రీ దత్తః పరమాత్మా దేవతా, శ్రీ దత్తాత్రేయ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః. ౨

నారదఉవాచ:-

శ్లో॥ జగదుత్పత్తికర్త్రే చ స్థితిసంహారహేతవే ।
భవపాశవిముక్తాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౩

,, జరాజన్మవినాశాయ దేహశుద్ధికరాయ చ ।
దిగంబరదయామూర్తే దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౪

,, కర్పూరకాంతిదేహాయ బ్రహ్మమూర్తిధరాయ చ ।
వేదశాస్త్రపరిజ్ఞాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౫

,, హ్రస్వదీర్ఘకృశస్థూల నామగోత్రవివర్జిత ।
పంచభూతైకదీప్తాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౬

,, యజ్ఞభోక్త్రే చ యజ్ఞాయ యజ్ఞరూపధరాయ చ ।
యజ్ఞప్రియాయ సిద్ధాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥

,, ఆదౌ బ్రహ్మ హరిర్మధ్యేఽప్యంతే దేవస్సదాశివః ।
మూర్తిత్రయస్వరూపాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౮

,, భోగాలయాయ భోగాయ యోగ్యయోగ్యాయ ధారిణే।
జితేంద్రియజితజ్ఞాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౯

,, దిగంబరాయ దివ్యాయ దివ్యరూపధరాయ చ ।
సదోదితపరబ్రహ్మ దత్తాత్రేయ నమోఽస్తు తే ॥ ౧౦

శ్లో॥ జంబూద్వీపే మహాక్షేత్రే మాతాపురనివాసినే।
జయమావసతాం దేవ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౧౧

„ భిక్షాటనం గృహే గ్రామే పాత్రం హేమమయం కరే।
నానాస్వాద్యమయీ భిక్షా దత్తాత్రేయ నమోఽస్తు తే॥

„ బ్రహ్మజ్ఞానమయీ ముద్రా వస్త్రేమాకాశభూతలే।
ప్రజ్ఞానఘనబోధాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౧౩

„ అవధూతసదానంద పరబ్రహ్మస్వరూపిణే।
విదేహదేహరూపాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౧౪

„ సత్యరూపసదాచార సత్యధర్మపరాయణ।
సత్యాశ్రయపరోక్షాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౧౫

„ శూలహస్తగదాపాణే వనమాలాసుకంధర।
యజ్ఞసూత్రధర బ్రహ్మన్ దత్తాత్రేయ నమోఽస్తు తే॥

„ క్షరాక్షరస్వరూపాయ పరాత్పరపరాయ చ।
దత్తముక్తిపరం స్తోత్రం దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౧౭

„ దత్తవిద్యాయ లక్ష్మీశ దత్తస్యాత్మస్వరూపిణే।
గుణనిర్గుణరూపాయ దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౧౮

„ శత్రునాశకరం స్తోత్రం జ్ఞానవిజ్ఞానదాయకమ్।
సర్వపాపప్రశమనం దత్తాత్రేయ నమోఽస్తు తే॥ ౧౯

„ ఇదం స్తోత్రం మహద్దివ్యం దత్తప్రత్యక్షకారకమ్।
దత్తాత్రేయప్రసాదాచ్చ నారదేన ప్రకీర్తితమ్॥ ౨౦

ఇతి శ్రీ నారదపురాణే నారదవిరచితం దత్తాత్రేయ స్తోత్రం సంపూర్ణమ్.

## శ్రీమతే రామానుజాయ నమః

శ్లో॥ యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥

శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥
,, లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥
,, అస్మద్గురుసమారంభాం నాథయామునమధ్యమామ్ ।
లక్ష్మీవల్లభపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥

★

## మధ్వమత సిద్ధాంతపద్ధతి.

### రాగపూర్వీ - ఆదితాళ.

బిడబేడ బిడబేడ బిట్టుకెడ బేడకెడబేడ ॥పల్లవి॥

హరిసర్వోత్తమ నహుదెం బజ్ఞానవ అరితు బాళ్వదకె పరతరవాదమత ౧

ఘోరయమన భయదూర ఓడిసి మురారియ చరణవ సేరో సన్మార్గవ ౨

భారతీశ ముఖ్యప్రాణాంతర్గత నీరజాక్షపురందర విఠలనే ప్రియ ౩

## ఆంజనేయస్తుతి,

శ్లో॥ ఆంజనేయమతిపాటలాననం
కాంచనాద్రికమనీయవిగ్రహం ।
పారిజాతతరుమూలవాసినం
భావయామి పవమాననందనం ॥ ౧

,, యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం ।
బాష్పవారిపరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకం ॥ ౨

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం।
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి॥ 3

# శ్రీభగవద్గీతా ప్రభావము.

శ్లో॥ కరకమలనిదర్శితాత్మముద్రః
పరికలితోన్నత బర్హిబర్హచూడః।
ఇతరకరగృహీతవేత్రతోత్రో
మమ హృది సన్నిధిమాతనోతు కృష్ణః॥ 1

శ్లో॥ ఆతామ్రపాణికమల ప్రణయప్రతోద
మాలోల హారమణికుండల హేమసూత్రమ్।
ఆవిశ్శ్రమాంబుకణమంబుద నీలమవ్యా
దాద్యం ధనంజయరథాభరణం మహో నః॥ 2

శ్లో॥ అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషా వేక్షమాణః।
సవ్యేతోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథమధివసన్ పాతు నః సూతవేషః॥ 3

,, వందే కృష్ణార్జునౌ వీరౌ నరనారాయణావుభౌ।
ధృతరాష్ట్రసుతోన్మత్తగజారోహణవల్లభౌ॥ 4

,, సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః।
సర్వతీర్థమయీ గంగా సర్వధర్మమయో మనుః॥ 5

శ్లో॥ ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం
ఏకో దేవో దేవకీపుత్ర ఏవ।

ఏకో మంత్రో దేవకీపుత్రనామా
కర్మాప్యేకం దేవకీపుత్రసేవా ॥ 6

శ్లో॥ గీతాః సుగీతాః కర్తవ్యాః కిమన్యైః శాస్త్రసంగ్రహైః।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతాః॥ 7

,, అకృత్యమపి కుర్వాణో భుంజానో వా యతస్తతః ।
ఘోరం వై వస్వతస్థానం గీతాధ్యాయీ న పశ్యతి ॥ 8

,, శ్లోకమేకం తదర్ధం వా పాదం పాదార్ధమేవ వా,
నిత్యం పఠతి యో భక్త్యా స మోక్షమధిగచ్ఛతి. 9

,, గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్య చ,
నైవ సంతి హి పాపాని పూర్వజన్మకృతాన్యపి. 10

,, శ్రీకృష్ణశైలసంజాతవేదాంతార్ణవసంగతా,
గీతాజ్ఞానమయీ గంగా పునాతి భువనత్రయం. 11

,, మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే,
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనం. 12

,, గీతా గీతేతి బ్రూయాద్యో జనానాం చ శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి. 13

,, గీతాశాస్త్రమిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్
విష్ణోః పదమవాప్నోతి భయశోకాదివర్జితః. 14

,, భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిఃసృతమ్,
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే. 15

,, వాచకః ప్రణవో యస్య క్రీడావస్త్వఖిలం జగత్,
శ్రుతిరాజ్ఞావపుర్జ్ఞానం తం వందే దేవకీసుతం. 16

,, సారథ్యమర్జునస్యాజౌ కుర్వన్ గీతామృతం దదౌ,
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః. 17

శ్లో॥ కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే. 18

,, కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం,
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిం. 19

,, అసంస్పృశ్యైవ ప్రకృతిం వికృతిం చ గుణైస్సహ,
యస్సదా భాతి మేఽన్తస్థః తం సేవే కృష్ణమీశ్వరం. 20

---

# భగవద్గీతామాహాత్మ్యము.

ఋషిరువాచ:-

శ్లో॥ గీతాయాశ్చైవ మాహాత్మ్యం యథావత్సూత మే వద,
పురాణమునినా ప్రోక్తం వ్యాసేన శ్రుతినోదితమ్. 1

సూత ఉవాచ:-

పృష్టం వై భవతా యత్తన్మహద్గోప్యం పురాతనమ్,
న కేన శక్యతే వక్తుం గీతామాహాత్మ్య ముత్తమమ్. 2

కృష్ణో జానాతి వై సమ్యక్ క్వచిత్కౌంతేయ ఏవ చ,
వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథమైథిలః.3

అన్యే శ్రవణతః శ్రుత్వా లోకే సంకీర్తయన్తి చ,
తస్మాత్కించిద్వదామ్యద్య వ్యాసస్యాస్యాన్మయా శ్రుతమ్.4

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నన్దనః,
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్. 5

సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ,
సర్వలోకోపకారార్థం తస్మై కృష్ణాయ తే నమః. 6

సంసార సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో జనః,
గీతానావం సమారుహ్య పారం యాతు సుఖేన సః 7

గీతాజ్ఞానం శ్రుతం నైవ సదైవాభ్యాసయోగతః,
మోక్షమిచ్ఛతి మూఢాత్మా యాతి బాలకహాస్యతామ్. 8

యే శృణ్వన్తి పఠన్త్యేవ గీతాశాస్త్రం మహర్నిశమ్,
న తే వై మానుషా జ్ఞేయా దేవా ఏవ న సంశయః. 9

గీతాజ్ఞానేన సంబోధ్య కృష్ణః ప్రాహ తమర్జునమ్,
అష్టాదశపదస్థానం గీతాధ్యాయే ప్రతిష్ఠితమ్. 10

మోక్షస్థానం పరం పార్థ సగుణం వాఽథ నిర్గుణమ్,
సోపానాష్టాదశైరేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి. 11

మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే,
సకృద్గీతాంభసి స్నానం సంసారమలనాశనం. 12

గీతాశాస్త్రస్య జానాతి పఠనం నైవ పాఠనమ్,
పరస్మాన్న శ్రుతం జ్ఞానం నైవ శ్రద్ధా న భావనా. 13

స ఏవ మానుషే లోకే పురుషో విడ్వరాహకః,
యస్మాద్గీతాం న జానాతి నాధమస్తత్పరో జనః. 14

ధిక్తస్య మానుషం దేహం ధిగ్ జ్ఞానం ధిక్కులీనతాం,
గీతార్థం న విజానాతి నాధమస్తత్పరో జనః. 15

ధిక్సురూపం శుభం శీలం విభవం సద్గృహాశ్రమమ్,
గీతాశాస్త్రం న జానాతి నాధమస్తత్పరో జనః. 16

ధిక్ప్రాగల్భ్యం ప్రతిష్ఠాం చ పూజాం మానం మహాత్మతామ్
గీతాశాస్త్రే రతిర్నాస్తి తత్సర్వం నిష్ఫలం జగుః. 17

ధిక్తస్య జ్ఞానమాచారం వ్రతం చేష్టాం తపో యశః,
గీతార్థపఠనం నాస్తి నాధమస్తత్పరో జనః. 18

గీతాగీతం నయజ్ఞానం తద్విద్ధ్యాసురసంజ్ఞకమ్,
తన్మోఘం ధర్మరహితం వేదవేదాన్తగర్హితమ్. 19

యస్మాద్ధర్మమయీ గీతా సర్వజ్ఞానప్రయోజికా,
సర్వశాస్త్రమయీ గీతా తస్మాద్గీతా విశిష్యతే. 20
యోఽధీతే సతతం గీతాం దివారాత్రౌ యథాఽర్థతః,
స్వపన్గచ్ఛన్వదం స్తిష్ఠఞ్ఛాశ్వతం మోక్షమాప్నుయాత్. 21
సాలగ్రామశిలాగ్రే తు దేవాగారే శివాలయే,
తీర్థే నద్యాం పఠేద్యస్తు వైకుంఠం యాతి నిశ్చితమ్. 22
దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి,
యథా న వేదైర్దానైశ్చ యజ్ఞతీర్థవ్రతాదిభిః. 23
గీతాఽధీతా చ యేనాపి భక్తిభావేన చేతసా,
తేన వేదాశ్చ శాస్త్రాణి పురాణాని చ సర్వశః. 24
యోగిస్థానే సిద్ధపీఠే శిష్టాగ్రే సత్సభాసు చ,
యజ్ఞే చ విష్ణుభక్తాగ్రే పఠన్యాతి పరాఙ్గతిమ్. 25
గీతాపాఠం చ శ్రవణం యః కరోతి దినేదినే,
క్రతౌ వాజిమేధాద్యాః కృతాంతేన సదక్షిణాః. 26
యశ్శృణోతి చ గీతార్థం కీర్తయేచ్చ స్వయం పుమాన్,
శ్రావయేచ్చ పరార్థం వై స ప్రయాతి పరంపదం. 27
గీతాయాః పుస్తకం నిత్యం యోఽర్చయత్యేవ సాదరం,
విధినా భక్తిభావేన తస్య పుణ్యఫలం శృణు. 28
సకలాచోర్వరాతేన దత్తా యజ్ఞే భవేత్కిల,
వ్రతాని సర్వతీర్థాని దానాని సుబహూన్యపి. 29
భూతప్రేత పిశాచాద్యాస్తత్ర నో ప్రవిశంతి వై,
అభిచారోద్భవం దుఃఖం పరేణాపి కృతం చ యత్. 30
నోపసర్పంతి తత్రైవ యత్ర గీతార్చనం గృహే,
తాపత్రయోద్భవా పీడా నైవ వ్యాధిభయం తథా. 31

న శాపం నైవ పాపం చ దుర్గతిం న చ కించన,
దేహేఽరయః షడేతే వై న బాధన్తే కదాచన. 32

భగవత్ పరమేశానే భక్తిరవ్యభిచారిణీ,
జాయతే సతతం తత్ర యత్ర గీతాభివందనమ్. 33

స్నాతో వా యది వాఽస్నాతః శుచిర్వా యది వాఽశుచిః,
విభూతిం విశ్వరూపం చ సంస్మరం సర్వదా శుచిః. 34

అనాచారోద్భవం పాపమవాచ్యాది కృతం చ యత్,
అభక్ష్యభక్ష్యజం దోషమస్పర్శస్పర్శజం తథా. 35

జ్ఞాతాజ్ఞాతకృతం నిత్యం ఇంద్రియైర్జనితం చ యత్,
తత్సర్వం నాశమాయాతి గీతాపాఠేన తత్క్షణాత్. 36

సర్వత్ర ప్రతిభోక్తా చ ప్రతిగ్రాహీ చ సర్వశః,
గీతాపాఠం ప్రకుర్వాణో న లిప్యేత కదాచన. 37

రత్నపూర్ణాం మహీం సర్వాం ప్రగృహ్యాతివిధానతః.
గీతాపాఠేన చైకేన శుద్ధస్ఫటికవత్సదా. 38

యస్యాంతఃకరణం నిత్యం గీతాయాం రమతే సదా ।
సర్వాగ్నికః సదా జాపీ క్రియావాన్ స చ పండితః ॥ 39

దర్శనీయః స ధనవాన్ స యోగీ జ్ఞానవానితి ।
స ఏవ యాజ్ఞికో ధ్యానీ సర్వవేదార్థదర్శకః ॥ 40

గీతా మే హృదయం పార్థ గీతా మే సారముత్తమమ్ ।
గీతా మే జ్ఞానమత్యుగ్రం గీతా మే జ్ఞానమవ్యయం ॥ 41

గీతా గంగా చ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।
బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తగేహినీ ॥ 42

అర్ధమాత్రా చిదానంద భవఘ్నీ భయనాశినీ ।
వేదత్రయీ పరానంతా తత్త్వార్థజ్ఞానమంజరీ ॥ 43

ఇత్యేతాని జపన్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం లభేచ్ఛీఘ్రం తథాంతే పరమం పదం ॥ 44
పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతి వై ।
సంతుష్టాః పితరస్తస్య నిరయాద్యాంతి సద్గతిం ॥ 45
గీతాపాఠేన సంతుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః ।
పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాదతత్పరాః ॥ 46
శతపుస్తకదానం చ గీతాయాః ప్రకరోతి యః ।
పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాదతత్పరాః ॥ 47
గీతాదానప్రభావేన సప్తకల్పావధీః సమాః ।
విష్ణులోకమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥ 48
సమ్యక్ శ్రుత్వా చ గీతార్థం పుస్తకం యః ప్రదాపయేత్ ।
తస్మై ప్రీతోఽస్మి భగవాన్ దదామి మనసేప్సితం ॥ 49
జనైః సంసారదుఃఖార్తైః గీతాజ్ఞానం చ యైః శ్రుతం ।
సంప్రాప్తమమృతం తైశ్చ గతాస్తే సదనం హరేః ॥ 50

---

ఓం

# శాంకరధర్మశాస్త్రే గీతామాహాత్మ్యమ్.

శ్లో॥ అవశ్యం మ్రియతే జంతుః స్వకర్మవశగోఽవశః,
జాయతే చ పునర్భూయః మ్రియతే జాయతే పునః. 1

,, ఏవం గతాగతం కుర్వన్ న విముచ్యేత కర్హిచిత్,
అజ్ఞానాజ్జాయతే బంధః ముక్తిర్జ్ఞానేన సాధ్యతే. 2

,, జ్ఞానం గురూపదేశేన సర్వాశుద్ధ్యా ముముక్షవః,
ఈశప్రసాదేన తథా సమత్వే పుణ్యపాపయోః 3

శ్లో॥ నారాయణో గురుర్దేవః దేవో నారాయణోః గురుః,
శిష్యోఽర్జునో నరస్సాక్షాత్ గీతస్సంవాదమేతయోః. 4

,, గీతామృతం చ సాక్షాత్తు కృష్ణేన పరమాత్మనా,
ఉపదిష్టా యుద్ధకాలే మోహితాయ కిరీటినే. 5

,, కిం వా శాస్త్రైః బహుముఖైః తర్క-కర్క-శదుర్ఘటైః,
మితమాయుః మితేనైవ శాస్త్రేణ సఫలీకురు. 6

,, అనేకకార్యసిద్ధ్యర్థం ఏకకార్యార్థసిద్ధయే,
గీతాసప్తశతీమంత్రం ఏకమేవ సమాశ్రయేత్. 7

,, స్థానే హృషీకేశ ఇతి సాష్టాక్షరసుదర్శనమ్,
జపహోమార్చనైః బ్రహ్మ రక్షోవిక్షోబణం పరం. 8

,, అనన్యాశ్చింతయంతో మాం ఇతి మంత్రేణ నిత్యశః,
సాలగ్రామేఽర్చనం కుర్యాత్ సర్వసంపత్సమృద్ధయే. 9

,, అహం వైశ్వానర ఇతి మంత్రముచ్చార్య నిత్యశః,
భుంజీత కబళాన్యాని సర్వాజీర్ణనివృత్తయే. 10

,, వివాహే యుద్ధయాత్రాయాం ప్రశ్నేష్వన్యేషు వా పునః,
మంత్రత్రయం విలిఖ్యాదౌ పుష్పాక్షతసమన్వితం. 11

,, పద్మపత్రే పృథక్ బధ్వా దేవపీఠే నివేశయేత్,
పూజావసానే తత్రైకం ఆదాయ పరిశోధయేత్. 12

,, యత్ర యోగీశ్వర ఇతి మంత్రస్సర్వోత్తమో మతః,
స్థానే హృషీకేశ ఇతి మధ్యమస్సముదాహృతః. 13

,, ఏవముక్త్వాఽర్జునో మంత్రశ్చధమస్సముదీరితః,
అధమే వర్జయేత్ సర్వానారంభాన్ కుశలో నరః. 14

,, యత్ర యోగేశ్వరః కృష్ణ ఇతి మంత్రముదీరయేత్,
వామే కరోతు శ్రవణముర్యమాణస్య బాంధవః. 15

శ్లో॥ యది ప్రజ్ఞాం బలం స్థైర్యం తస్య ముక్తిః కరే స్థితః,
అథవా వాసనాయోగాత్ జ్ఞానస్సు భువి జాయతే. 16

,, నిమంత్రితేషు విప్రేషు భుంజానేషు స్వమందిరే,
గీతాపంచదశాధ్యాయం జపేత్యుచ్చైః గృహేశ్వరః. 17

,, శ్రాద్ధకాలే యతీనాం చ భిక్షాకాలే విశేషతః,
ఏకాదశ్యాం పుణ్యదినేష్వన్యేషు చ విశేషతః. 18

,, అయం ఇతి సమాఖ్యాతః మునిభిః తత్త్వదర్శిభిః,
ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థస్య ప్రదక్షిణే. 19

,, ఏవం అన్యే చ బహవో దృశ్యంతే విధయోఽపరే,
గీతామాశ్రిత్య తత్సర్వం విజ్ఞేయం గురుసన్నిధౌ. 20

,, పఠేత్ ప్రతిదినం గీతాం బ్రహ్మచారీ విశేషతః,
గృహస్థో వా వనస్థో వా సంన్యాసం వా సమాశ్రితః. 21

,, సర్వేషాం పావనమిదం గీతాధ్యయనముచ్యతే,
వర్ణాశ్రమాణాం సర్వేషాం నిర్విశేషో విధిస్స్మృతః. 22

,, న హి తస్యాపి కైవల్యే నిషేధః ప్రతిదృశ్యతే,
ప్రాప్య మానుష్యకం జన్మ బహుజన్మాంతరే నరః. 23

,, సంసారబంధమోక్షాయ యతేత సుసమాహితః,
తీర్థాశ్రమవనారణ్యో గిరిపర్వతసాగరాః. 24

,, పురీ సరస్వతీ చైవ భారత్యే త్యభిధీయతే,
ఏతేషామపి సర్వేషాం యతీనాం యతచేతసః. 25

,, ముక్త్యర్థమనిశం సేవ్యం గీతామృతమితి స్థితః,
భిక్షుకీ విధవా వంధ్యా విధురో విధనోఽపి వా. 26

శ్లో॥ అపుత్రో గతపుత్రో వా రోగార్తో గతజీవితః,
పఠేత్ గీతాం ప్రతిదినం గీతామాహాత్మ్యసంయుతాం. 27

,, బాలగ్రహనివృత్త్యర్థం భూతప్రేతానుపత్తయే,
వైరాగ్యాయ చ మోక్షాయ గీతైకా పరమాయనం. 28

,, అశక్తర్యది నిశ్శేషః పఠనే ప్రతివాసరం,
శ్రీరుద్రో గిరిమిత్రేతి క్రమమేవాశ్రయేన్నరః. 29

,, అధ్యాయమేకమథవా సప్తశ్లోకీ దినేదినే,
ఏకశ్లోకీం చ వా గీతాం పఠేద్భక్త్యా విముక్తయే. 30

,, పూజయేత్ పుస్తకం భక్త్యా వాసుదేవస్య భాషితం,
సర్వోపనిషదం సారం సర్వాఘౌఘనివారణం. 31

,, విశ్వరూపం భగవతో ధ్యాయేత్పరమమంగళం,
యాత్రాకాలే జపే హోమే స్వాపకాలే విశేషతః. 32

,, ఏవం గీతాం సమాశ్రిత్య భుక్తిముక్తిఫలప్రదామ్,
బహవః ప్రాణినః ప్రాప్తాః క్షణేన విజయోత్సవం. 33

,, గంగా గీతా చ గాయత్రీ గోపికా చందనం తథా,
భస్మత్రిపుండ్రరుద్రాక్షం తులసీమాలికా తథా. 34

,, సాలగ్రామాభిపూజా చ శివలింగార్చనం తథా,
స్థిరలింగార్చనం నామకీర్తనం హరివాసరః. 35

,, అభయాయ మనుష్యాణాం ఏతాని సమయే కలౌ,
అతో విజ్ఞాయ తత్సర్వం విశేషేణ సమాశ్రయేత్. 36

ఇతి శాంకరధర్మశాస్త్రి లఘుధర్మప్రకాశికాయాం
త్రయోదశాధ్యాయే ప్రథమపాదః.

శ్రీగీతామాహాత్మ్యం సంపూర్ణమ్.

ఓం తత్సత్.



## శ్రీమద్భగవద్గీత – అంగన్యాస కరన్యాసములు

ఓం అస్య శ్రీ మద్భగవద్గీతా మాలా మంత్రస్య భగవాన్ వేదవ్యాస ఋషిః అనుష్టుప్ ఛందః క్వచిన్నానా ఛందాంసి శ్రీ కృష్ణః పరమాత్మా దేవతా. అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞా వాదాంశ్చ భాషస ఇతి బీజమ్. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః. అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకమ్. నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇత్యంగుష్ఠాభ్యాంనమః. నచైనం క్లేదయంత్యాపో నశోషయతిమారుత ఇతి తర్జనీభ్యాంనమః, అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచేతి మధ్యమాభ్యాంనమః. నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతన ఇత్యనామికాభ్యాంనమః. పశ్యమే పార్థరూపాణి శతశోఽథ సహస్రశ ఇతి కనిష్ఠికాభ్యాంనమః. నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చేతి కరతల కరపృష్ఠాభ్యాంనమః. ఇతి కరన్యాసః.

### అథ హృదయాదిన్యాసః.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇతి హృదయాయనమః. నచైనం క్లేదయంత్యాపో నశోషయతి మారుత ఇతి శిరసే స్వాహా. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచేతి శిఖాయైవషట్. నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతన ఇతి కవచాయహుమ్. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశ ఇతి నేత్రత్రయాయ వౌషట్. నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చేతి అస్త్రాయఫట్. శ్రీ కృష్ణప్రీత్యర్థే పాఠే వినియోగః.

# శ్రీ గీతాధ్యానము.

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్।
అద్వైతామృతవర్షిణీం భగవతీం అష్టాదశాధ్యాయినీం
అంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్. 1

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిందాయత పత్రనేత్ర।
యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః. 3

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్. 4

వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనమ్,
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్. 5

భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా,
అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః. 6

పారాశర్యవచస్సరోజమమలం గీతార్థ గంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథా సంబోధనాబోధితమ్,
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయాత్ భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే. 7

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్,
యత్కృపా తమహం వందే పరమానంద మాధవమ్. 8

యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః
వేదైస్సాంగపదక్రమోపనిషదైః గాయంతి యం సామగాః,
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యంతి యం యోగినః
యస్యాంతం న విదుః సురాసురగణాః దేవాయ తస్మై నమః.9



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## ప్రథమాధ్యాయము — అర్జునవిషాదయోగము.

### పీఠిక.

పల్లవి॥ శ్రీకృష్ణజయ శ్రీకృష్ణజయ
శ్రీకృష్ణజయ శ్రీకృష్ణ।
శ్రీకృష్ణజయ శ్రీకృష్ణజయ
శ్రీకృష్ణజయ శ్రీకృష్ణ॥

చ॥ శ్రీరుక్మిణీశుడగు శ్రీకృష్ణుడు
శ్వేతవాహనుని బ్రోవగను
సారథ్యంబును చేయబూనుకొనె
సాధులోకపాలకు డగుటన్ ॥శ్రీ॥

చ॥ మహావీరుడైనను యాపార్థుడు
మహాదయాపర బుద్ధియునై
మోహముచెందెను యుద్ధసమయమున
మహాత్ములగు గురుతాతలకై ॥శ్రీ॥

చ॥ ధనంజయుని దుఃఖంబును పోవగ
ధన్యునిచేయగ హరిదలచె
ధనంజయుని నెపమున సర్వజనులు
ధన్యులుగా ఉపదేశించె ॥శ్రీ॥



# గ్రంథారంభము.

ధృతరాష్ట్ర ఉవాచః—

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥ 1

తా॥ ఓయి సంజయుడా! పుణ్యభూమియగు కురుక్షేత్రమునందు యుద్ధముచేయుటకై చేరిన నా కొమారులు, పాండుపుత్రులు యేమిచేసిరి?

త్రో॥ శ్రీయుత సంజయ కురుక్షేత్రమను
ధర్మభూమిలో మావారు
ఆ యుద్ధమునకు పాండవేయులును
చేసినపని తెల్పావేరు ॥శ్రీ॥

*త్రో॥ భారతంబునను భీష్మపర్వమున
పంచవింశతియు మొదలుగను
నలుబదిరెండవ సంఖ్యవరకుగల
అధ్యాయములే గీతగును ॥శ్రీ॥ ౧

సంజయ ఉవాచ = సంజయుని ఉత్తరము:—

శ్లో॥ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్॥ 2

తా॥ అపుడు నీ పుత్రుడగు దుర్యోధనుడు వ్యూహములుగా నిలపిన పాండవసేనను గని రాజు ద్రోణాచార్యుల సమీపించి ఇట్లనెను.

త్రో॥ పాండవవ్యూహము గనుగొని సుతుడును
ద్రోణాచార్యుల చేరియును
భండనమునకై కాగలపనులకు
త్వరపడియును తానిట్లనెను ॥శ్రీ॥

కేశవాదిచతుర్వింశతి నామములు.

*త్రో॥ కేశవ నీకే శరణంటినినను
కాపాడగ మరియువరయ్య
కేశి నిషూదన వాసవాదినుత
దాసుని పోషించగదయ్య ॥శ్రీ॥ ౨

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణాం ఆచార్య మహతీం చమూం।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3

తా॥ ఆచార్యా! మీ శిష్యుడైన బుద్ధిమంతుడగు ద్రుపదపుత్రుడు వ్యూహాకారముగ నేర్పరచిన అధికమగు పాండుపుత్రుల సేన చూడుము.

తో॥ ధీమంతుండును తవశిష్యుండగు
ద్రుపదపుత్రునిచె తయారగు
పాండురాజ పుత్రుల సేనయు విను
గొప్పది వ్యూహమును గనందగు ॥శ్రీ॥

*తో॥ నారాయణ నీనామము పలుకుచు
నా నాలుక ధన్యత చెందె
ఘోర పాతకము దూరము జనియెను
నాజన్మము సార్థక మొందె ॥శ్రీ॥ 3

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4

తా॥ ఈ పాండవ సేనలో గొప్ప ధనుస్సులు గలవారలు భీమార్జునుల బోలువారున్నారు. సాత్యకి విరాటరాజు మహారథుడగు ద్రుపదుడు.

తో॥ పాండవ సేనలో బహు పరాక్రములు
భీమార్జులతో సమబలులుగ
భండనమునకై వచ్చినారు విను
సాత్యకి విరాట ద్రుపదులును ॥శ్రీ॥

*తో॥ మాధవ యనుచును అడుగడుగుకు నిను
మదిలో తలచిన శ్రీకృష్ణ
మోదము చెందియు ఆదరించెదవు
వోదయానిధే హరికృష్ణ ॥శ్రీ॥ ౪

శ్లో॥ ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః ॥ 5

తా॥ ధృష్టకేతువును చేకితానుడు బలశాలియగు కాశీరాజు పురజిత్తు కుంతిభోజుడు పురుషవర్యుడగు శైబ్యుడు.

తా॥ ధృష్టకేతువును చేకితానుడును
ధైర్యశాలి కాశీ రాజున్
శ్రేష్ఠవంతుడగు శైబ్యుడు పురజిత్
బలవంతుడు కుంతిభోజుడున్ ॥శ్రీ॥

*తా॥ గోవిందాయని కోరి భజించిన
కోర్కెలిచ్చెదవు శ్రీకృష్ణ
సేవించెద నే నమస్కరించెద
భావించెద హరి శ్రీకృష్ణ ॥శ్రీ॥ ౫

శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6

తా॥ పరాక్రమశాలి యుధామన్యుడును బలిష్ఠుడగు ఉత్తమౌజుడును అభిమన్యుడును ద్రౌపది పుత్రులు వీరందరు మహారథులే.

తా॥ పరాక్రమముగల యుధామన్యుడును
ఉత్తమౌజుడను బలిష్ఠుడున్
బలవంతుండగు అభిమన్యుండును
ద్రౌపదేయులగు ధీరులును ॥శ్రీ॥

*తా॥ విష్ణువె తిథియును విష్ణువె వారము
విష్ణువె నక్షత్రంబనియు
విష్ణువె యోగము విష్ణువె కరణము
విష్ణువె విశ్వంబనవలయు ॥శ్రీ॥ ౬

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ 7

తా॥ ద్విజోత్తమ! మనసేన విశిష్టములో సైన్యనాయకులగు బలిష్ఠులయినవారిని నీకు జ్ఞాపకముకొరకు తెలిపెదను.

తో॥ బ్రాహ్మణోత్తమ మనసైన్యములో
బలిష్ఠులగు వారల గనుము
బహుపరాక్రముల సైన్యానాయకుల
పాటించగ బల్కెద వినుము ॥శ్రీ॥

*తో॥ మధుసూదన నిను మదిలో తలచెద
మధురవాస మాధవకృష్ణ
మధురంబగు నీపాద భజన నా
కొడగించుము నీదయకృష్ణ ॥శ్రీ॥ ౭

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః ॥ 8

తా॥ నీవు భీష్ముడు కర్ణుడు యుద్ధమున జయమొందు కృపుడు అశ్వత్థామా సోమదత్తుని పుత్రుడు భూరిశ్రవుడు వికర్ణుడు జయద్రథుడు.

తో॥ నీవు భీష్ముడును కర్ణుడు కృపుడును
అశ్వత్థామయు వికర్ణుడు
నీవుచూడు ఈ జయద్రథుండును
సోమదత్తుని సుపుత్రుండు ॥శ్రీ॥

*తో॥ త్రివిక్రమ ధ్యానము త్రిజగంబుల
ధన్యంబని తలచెద కృష్ణ
పవిత్రునిగ గావించియు బలివా
కిలి గాచితివో హరి కృష్ణ ॥శ్రీ॥ ౮

శ్లో॥ అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ 9

తా॥ ఇంకను బహుశూరులు నానావిధములగు శస్త్రాస్త్రములయందు ప్రవీణులై నాకొరకై ప్రాణములుగూడ విడుచుటకు సిద్ధముగానున్నారు.

తో॥ ఇంకను అనేక బలపరాక్రములు
నానా శస్త్రప్రహారణులు
శంకలేక చేరియు నాకొరకై
విడచెద రిప్పుడు ప్రాణములు ॥శ్రీ॥

*తో॥ నామన నామన నాలకింపవే
నామనమున నిలవం దగదే
నేమవంతునిగ చేయం గదవే
నమస్కరించెద గావగదే ॥శ్రీ॥ ౯

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10

తా॥ భీష్మునిచే రక్షింపబడు మనసైన్యము అపరిమితముగ నున్నది. భీమునిచే రక్షింపబడు పాండవసేన అల్పముగ నున్నది.

తో॥ మనభీష్మునిచే పోషింపగ బడు
మనసేనయు గను అపరిమితం
విను భీమునిచే పోషింపగ బడు
పరసేనయు చూడగ నల్పం ॥శ్రీ॥

*తో॥ శ్రీధర నీ పెదవుల గీతంబును
మోదంబున పొందిన వేణు
మొదలిపుట్టువున నెట్టితపంబును
చేసెనొ అదిచూడగ జాణు ॥శ్రీ॥ ౧౦

శ్లో॥ అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।
భీష్మమేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి ॥ 11

తా॥ మీరందరు వారివారికి నిర్ణయింపబడిన వ్యూహప్రదేశముల నుండి భీష్ముని అంతట రక్షించండి అని రాజుపలికెను.

తొ॥ మీరందరు వారివారిస్థలముల
మేరతప్పకను నివసించి
ధీరునిగంగాపుత్రుని గావుడు
జాగ్రత బుద్ధియును వహించి ॥శ్రీ॥

*తొ॥ హృషీకేశ హో దయాంతరంగ
హృదయ పీఠమున నిలువంగ
దోషములంతయు దూరము చనంగ
వసియించుము చక్రాంగ రంగ ॥శ్రీ॥ ౧౧

శ్లో॥ తస్య సఞ్జనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥12

తా॥ అంత ప్రతాపశాలియు కురువృద్ధుండగు పితామహుడు రాజుకు హర్షము చేయుటకై గట్టిగ సింహనాదము చేసి శంఖము పూరించెను.

తొ॥ గంగాపుత్రుడు దుర్యోధను మా
టలువిని హర్షము గలిగింపన్
సింహనాదమును చేసియు శంఖము
నూదెను కురువృద్ధుడు వేడ్కన్ ॥శ్రీ॥

*తొ॥ పద్మనాభ నిను భజియించెద నిదొ
పాడుచు ఆడుచు నుతించెదన్
సదమలచిత్తము లోన చేర్చెదను
వ్యథలన్నియు విదళింపంగన్ ॥శ్రీ॥ ౧౨

శ్లో॥ తతశ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।
సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములో౽భవత్ ॥ 13

తా॥ పిమ్మట వెంటనే శంఖములు, దుందుభులు, పణవములు, తప్పెటలు, కొమ్ములు వాయింపబడెను. ఆవాద్యముల ధ్వని అంతటవ్యాపించెను.

తో॥ అనంతరము శంఖములు భేరులును
అనకంబులును గోముఖముల్
పణవము లాదిగ పౌరుషంబునను
వాయించిరి రణవాద్యములు ॥శ్రీ॥

*తో॥ దామోదరనిను దలచిన నరుండు
ధన్యతనొందును నా తండ్రి
నామము తలచని పామరజనముల
సంగముచేర్పకు మా తండ్రి ॥శ్రీ॥ ౧౩

శ్లో॥ తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ ।
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః ॥ 14

తా॥ అంత తెల్లని గుఱ్ఱములు గట్టిన గొప్పరథమందున్న శ్రీకృష్ణుడును అర్జునుడును దివ్యములగు తమశంఖములను లెస్సగ పూరించిరి.

తో॥ పిమ్మట తెల్లని గుఱ్ఱములతోడ
కూడిన గొప్పగు రథమునను
నున్నమాధవుడు పార్థుడు దివ్యపు
శంఖములూదిరి ముదమునను ॥శ్రీ॥

*తో॥ సంకర్షణా నీ సంకీర్తనమును
సల్పిన నిమిషమె నిమిషంబా
సంస్తుతిచేసిన ఘడియే ఘడియా
స్తుతిచేసిన దినమే దినమా ॥శ్రీ॥ ౧౪

శ్లో॥ పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥ 15

తా॥ కృష్ణమూర్తి పాంచజన్యమును అర్జునుడు దేవదత్తమును పూరించిరి. భయంకర వ్యాపారముగల భీముడు పౌండ్రం అను మహాశంఖం పూరించెను.

తో॥ శ్రీ కృష్ణుడు పాంచజన్య మనునది
దేవదత్తమును అర్జునుడు
వృకోదరుండును మహాశంఖమును
పూరించిరి శంఖము లపుడు ॥శ్రీ॥

*తో॥ వాసుదేవ నీ భాసుర నామము
వర్ణించెడి పగలే పగలౌ
ఈశ నిన్ను ధ్యానించెడి రాత్రియె
తీర్థయాత్ర శ్రీ హరియాత్రౌ ॥శ్రీ॥ ౧౫

శ్లో॥ అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ 16

తా॥ కుంతీపుత్రుడు ధర్మరాజు అనంతవిజయమును నకులుడు సుఘోషమును సహదేవుడు మణిపుష్పకమును (శంఖములు) పూరించిరి.

తో॥ అనంతవిజయుంబను శంఖంబును
కుంతీపుత్రుడు ధర్మజుడు
మాద్రీపుత్రులు సుఘోష మణిపు
ష్పకశంఖము లూదిరియపుడు ॥శ్రీ॥

*తో॥ ప్రద్యుమ్నాయని పలికిన పలుకౌ
పలుకని పలుకే వ్యర్థంబౌ
పద్మనాభ నిను భజియించెడియా
భక్తుల జన్మము జన్మంబౌ ॥శ్రీ॥ ౧౬

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీ చ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥ 17

తా॥ గొప్పధనుర్ధారి కాశీరాజును మహారథుడు శిఖండియు - ధృష్టద్యుమ్నుడును విరాటరాజును అపజయమొందని సాత్యకియు తమశంఖములు పూరించిరి.

త॥ ధనుర్ధరుండగు కాశీరాజును
మహారథుండగు శిఖండియు
ధృష్టద్యుమ్నుడు విరాటరాజును
అపజయమొందని సాత్యకియు ॥శ్రీ॥

*త॥ అనిరుద్ధా నీ అంఘ్రిధ్యానము
అనుసంధించిన ధన్యంబౌ
అన్యము తలచిన దుఃఖకరంబౌ
అతికష్టము సంప్రాప్తంబౌ ॥శ్రీ॥ ౧౭

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖా౯ దధ్ముః పృథక్పృథక్ ॥

తా॥ పృథివీపతే! ద్రుపదరాజును ద్రౌపదీతనయులును మహాబాహుడు అభిమన్యుడు వీరలందరు వేర్వేర తమతమ శంఖములు సర్వత్ర పూరించిరి.

త॥ ద్రుపదుడు ద్రౌపది పుత్రులందరును
మహాబాహు డభిమన్యుండు
సమస్త రాజులు వేరువేరుగను
శంఖంబుల నూదిరి అపుడు ॥శ్రీ॥

*త॥ పురుషోత్తమ వో పురాణపురుష నా
పుణ్యాముల రాశి శ్రీకృష్ణ
పుణ్యశరీర వో పూతన సంహార
పూజించెద నిను హరికృష్ణ ॥శ్రీ॥ ౧౮

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములోవ్యనునాదయన్ ॥ 19

తా॥ సంకులమైన ఆ మహాధ్వని ఆకాశమును పృథివిని ప్రతిధ్వనింప చేయుచు దుర్యోధనాదుల గుండెల పగల్చెను.

తో॥ తుములమైన యామహా ధ్వనియు భూ
నభోంతరాళము నిండుచును
దిక్కులను ప్రతిధ్వనులతో ధార్త
రాష్ట్రుల గుండెలు పగల్చెను ॥శ్రీ॥

*తో॥ అధోక్షజుని అనుగ్రహంబును
అందినవారే మాన్యులుగా
సుదాబ్ధి శయనహో సుందరవిగ్రహా
ఇందురార నేధన్యుడుగా ॥శ్రీ॥ ౧౯

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాణ్డవః ॥ 20

తా॥ శంఖముల పూరించి యుభయులు శస్త్రములు ప్రయోగించు ఆరంభసమయమున హనుమధ్వజుడు నీ కౌమారులను చూచి ధనువెక్కుబెట్టె.

తో॥ శస్త్రములు ప్రయోగించు సమయమున
హనుమధ్వజుండు ధనుస్సును
చేలబూని నీతనయులను గనియు
సమరమునకు సమయంబనియున్ ॥శ్రీ॥

*తో॥ నృసింహా నీదగు నామకీర్తనయు
నరుండు నెవడేనియు దలప
నరజన్మము సార్థకమాగాకను
నరక నివాసము లేదప్ప ॥శ్రీ॥ ౨౦

శ్లో॥ హృషీకేశం తదావాక్య మిదమాహ మహీపతే।
అర్జున ఉవాచ:—
సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥ 21

తా॥ ఓ రాజా! విను హృషీకేశునిగని ఇట్లని పలికెను. పార్థునిపలుకు:— అచ్యుత! రెండు సేనల మధ్యమున రథము నిలుపుము.

త్రో॥ రాజ యిప్పుడు రాజీవాక్షుని గని
ఇట్లని పలికెను అర్జునుడు
అచ్యుత గను ఈ సేనమధ్యమున
రథమును స్థాపింపుము ఇపుడు ॥శ్రీ॥

*త్రో॥ అచ్యుత అనంతరూపక కృష్ణ
అఖిలాధారా హరికృష్ణ
ఆదిదేవ ఆగమ నుత కృష్ణ
ఆద్యంత రహిత హరికృష్ణ ॥శ్రీ॥ ౨౧

శ్లో॥ యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥ 22

తా॥ యుద్ధాపేక్షచే యెవరెవరు వచ్చినారో ఈ రణప్రారంభ సమయమున ఎవరితో యుద్ధము చేయవలయునో ఇక్కడ నిరీక్షించి చూచెదను.

త్రో॥ యుద్ధము చేయుటకై యెవరెవరును
వచ్చినారో చూడగవలయున్
యుద్ధము ఎవరితో చేయగవలయునో
ఈరణభూమిలో గనియెదను ॥శ్రీ॥

*త్రో॥ జనార్దన నీ చరణయుగళమును
సేవించెద శ్రీ హరికృష్ణ
మనంబు నిను కోరెను ఓమాధవ
దృఢంబుగను నిల్పుముకృష్ణ ॥శ్రీ॥ ౨౨

శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః॥ 23

తా॥ దుర్మతియగు దుర్యోధనునికి హితముచేయ నిశ్చయించి యుద్ధము చేయవచ్చినవారెవరో చూడగోరుచున్నాను.

తో॥ దుర్మార్గుండగు దుర్యోధనునికి
సన్మానంబులు సల్పగనూ
పేర్మిచె జనుదెంచినవారలనూ
చూచెద నిపుడా శౌరాదులను ॥శ్రీ॥

*తో॥ ఉపేంద్ర నీదగు కృపాతిశయమున
ఉపద్రవము బాపుముకృష్ణ
చపలచిత్తుడను అతికోపిష్ఠుడ
పాపము బాపుము హరికృష్ణ ॥శ్రీ॥ ౨౩

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥ 24

తా॥ భారత! ఈరీతిగ గుడాకేశుని వాక్యములు విని హృషీకేశుడు ఉత్తమరథమును రెండుసేనల మధ్యమున నిలిపి.

తో॥ ఓధృతరాష్ట్ర శ్రీభగవంతుడు
పార్థుని వచనము రీతిగను
ఉత్తమ రథమును రెండు సైన్యముల
మధ్యే నిలపియు నిల్లనెను ॥శ్రీ॥

*తో॥ హరియను రెండక్షరముల భక్తులు
స్మరియించిన గాచునుమనసా
హరిదాసుల దుఃఖముహరియించును
హరిశ్రీ హరిహరియనుమనసా ॥శ్రీ॥ ౨౪

శ్లో॥ భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25

తా॥ శ్రీకృష్ణస్వామి పలికెను:- పార్థ! భీష్మ ద్రోణ ప్రముఖులతో చేరియున్న రాజులను కౌరవులను అందరి చూడుమనెను.

తో॥ భీష్మద్రోణులు అనేక రాజులు
చేరియున్న కౌరవసేనన్
వీక్షింపుము నో పురుషసింహామా
అని శ్రీకృష్ణుడు పల్కగను ॥శ్రీ॥

*తో॥ కృష్ణయనుచు ఆ కృష్ణావేడిన
కష్టము బాపితివే కృష్ణ
కృష్ణయనెదనా కభీష్టమియ్యు
కృష్ణాదుల తోలుముకృష్ణ ॥శ్రీ॥ ౨౫

శ్లో॥ తత్రాపశ్యత్స్థితాన్పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా॥

తా॥ పార్థుడు అక్కడ చేరియున్న తండ్రులను తాతలను గురువులను మేనమామలను సోదరులను కొడుకులను మనములను స్నేహితులను చూచెను.

తో॥ తర్వాతను పార్థుడు దాచూచెను
తండ్రుల తాతల గురువులను
మరి మాతులలను సోదరులను మరి
మనముల మిత్రుల కొడుకులను ॥శ్రీ॥

దశావతారములు:—

*తో॥ వైవస్వత మనువును పోషించిన
మీనాకార శరీర నమో
వేదోద్ధారా వేదాంతసారా
ఆదరించు కృపతోడ నమో ॥శ్రీ॥ ౨౬

శ్లో॥ శ్వశురాన్సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।
తాన్సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్ బన్ధూనవస్థితాన్॥

తా॥ మామలను సుహృద ప్రత్యుపకారము కోరక సహాయపడువారల ఇట్లు రెండు సేనలలోనుగల సమస్తబంధువుల కౌంతేయుడుచూచి.

తో॥ మరియు మామలను సుహృదుల గనియెను
ఉభయ సేనలలో నుండగల
వారలు బంధువులనుచును కుంతీ
తనయుడు గనె ప్రేమతో మిగుల ॥శ్రీ॥

*తో॥ మందరోద్ధరణ మనోరమణా
కూర్మాకార శరీర నమో
బృందారక జన వందితచరణా
సుందరవిగ్రహా కృష్ణ నమో ॥శ్రీ॥ ౨౭

శ్లో॥ కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।
అర్జున ఉవాచ:—
దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్॥ 28

తా॥ కృపాపరవశుడై విషాదమొంది ఇట్లనియె! అర్జునుడనుచున్నాడు. కృష్ణ! యుద్ధమునకు చేరినవారందరును చూడగ స్వజనులె.

తో॥ కృపాళుడై కడుదుఃఖము బట్టగ
జాలక స్వామితో నిట్లనెను
గోపాలా యుద్ధమునకు వచ్చిన
వారలు స్వజనులు చూడగను ॥శ్రీ॥

*తో॥ వరాహరూపక వసుమతి పాలక
వందనమిదిగో శ్రీ కృష్ణ
మారజనక నిను మదిలో మరువక
కరుణించుము యిక హరి కృష్ణ ॥శ్రీ॥ ౨౮

శ్లో॥ సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ 29

తా॥ కృష్ణ! నా అవయవములు నిస్సత్తువగుచున్నది. నోరెండుచున్నది. దేహము వణకుచున్నది. రోమములు గగుర్పాటు కలుగుచున్నది.

తో॥ శ్రీకృష్ణా నా గాత్రమంతయును
శిథిలం బగుచున్నది గనుమా
నోరెండెను మరిదేహము వణకెను
గగుర్పాటు కలిగెను వినుమా ॥శ్రీ॥

*తో॥ ప్రహ్లాదుని పోషించుటకై నర
సింహాకృతి నంతట చేరి
ఆహ్లాదంబున అవతరించి హరి
ప్రహ్లాదుని బ్రోచితివి హరి ॥శ్రీ॥ ౨౯

శ్లో॥ గాణ్డీవం స్రంసతే హస్తాత్త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30

తా॥ గాండీవము చేతినుండి జారుచున్నది. చర్మముకూడమండుచున్నది. నిలుచుటకు శక్తిలేకున్నది. మనస్సు భ్రమిం చుచున్నది.

తో॥ గాండీవము చేతినుండి జారెను
యొడలి చర్మమును తపియించెన్
ఉండచాల నీ రథమున కృష్ణ
చూడుము చిత్తము చలియించెన్ ॥శ్రీ॥

*తో॥ వటురూపుడవై వగచూపుచు బలి
వాటము చేరియు మూడడుగుల్
వసుధను బొందియు వర్ధిల్లుచు నీ
వంతయు నిండితివే మిగుల ॥శ్రీ॥ ౩౦

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ !
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే॥ 31

తా॥ కేశవ! విపరీతములగు అపశకునములు తోచుచున్నవి. యుద్ధములో స్వజనుల చంపిన హితము గలుగునని తోచదు.

త॥ కేశవ అపశకునములను కంటిని
శ్రేయస్సగు టొకటియు లేదు
ఆశచె ఆహావమున స్వజనులను
చంపిన శ్రేయస్సును రాదు ॥శ్రీ॥

*త॥ పరశురామ నిను ప్రార్థన సేసెద
పార్థివ పతులను పరశువుచే
బలిపెట్టిన విధి నాశత్రువులగు
కామక్రోధాదుల గూల్చు ॥శ్రీ॥ ౩౧

శ్లో॥ న కాఙ్క్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవిన్ద! కిం భోగైర్జీవితేన వా ॥ 32

తా॥ కృష్ణ! నేను జయముకోరను. రాజ్యసుఖమువలదు. గోవింద! రాజ్య భోగములతో ఏమిలాభము! బ్రతికియుండిన ఫలమేమి?

త॥ జయము వలదు రాజ్యసుఖంబులును
తలపను రాజ్యముచే నేమి
కాయసుఖంబున యేమి ఫలంబగు
కృష్ణ బ్రతికిన ఫలమేమి ॥శ్రీ॥

*త॥ రఘువంశోత్తమ రామనృపాలా
రామచంద్ర సీతా నాథా
రావణమర్దన నా హృదయంబున
రంజనతో నుండగ రాదా ॥శ్రీ॥ ౩౨

శ్లో॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ॥ ౩౩

తా॥ ఎవరికొరకు రాజ్యమును, భోగంబులును, సుఖములును మనము కోరితిమో వారలే ప్రాణధనంబుల ఆశవిడచి ఈ యుద్ధములో నిలిచినారు.

తొ॥ ఎవరికొరకు రాజ్యము భోగంబులు
ఎవరి సుఖముకై కోరితిమో
ఆ వారలెవచ్చినారు ప్రాణము
లర్థంబులు విడచియు గనుము ॥శ్రీ॥

*తొ॥ బలరాముడవై ప్రలంబాసురుని
బరిమార్చిన రేవతి నాథా
చలనమానసము శీఘ్రమె నిలపియు
శరణాగతు బ్రోవగరాదా ॥శ్రీ॥ 33

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాః స్స్యాలాస్సంబన్ధిన స్తథా॥ 34

తా॥ ఆచార్యులు, తండ్రులు, పుత్రులు అట్లే తాతలు, మేనమామలు, మామలు, మనమలు, బావలు, సంబంధులు.

తొ॥ పితామహులు ఆచార్యులు తండ్రులు
బిడ్డలు మామలు బావలును
పౌత్రులు తల్లితోబుట్టువు లాదిగ
మరదులు సంబంధులు మరియుక్ ॥శ్రీ॥

*తొ॥ బౌద్ధావతారా పరమదయాకర
భక్తపాల పావన రూపా
బుద్ధిజ్ఞాన విచార ప్రకటన
భూతదయా పశ్చాత్తాపా ॥శ్రీ॥ 34

శ్లో॥ ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన! ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥ 35

తా॥ మధుసూదన! వీరలు మమ్ము హింసించినను మూడులోకముల రాజ్యము రానున్నను వీరల హింసింపనొల్లను. ఈ భూమికై హింసింతునా?

తో॥ మధుసూదన వీరలు హింసించిన
ప్రతిహింసించుట నొల్లవిను
మూడు లోకములకును రాజైనను
నొల్లను ఈ రాజ్యమునకును ॥శ్రీ॥

*తో॥ కల్కి-రూపమును బొందియు కఠినుల
కాలుని సన్నిధికిని చేర్చి
కరుణించియు నీ భక్త వర్యులను
కాచెదవట ప్రీతిని నునిచి ॥శ్రీ॥ 3౫

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన! ।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః॥ 36

తా॥ జనార్దన! దుర్యోధనాదులను జంపిన మనకేమి ప్రీతిగల్గును? వీరు ఆతతాయినులయినను జంపిన పాపమే వచ్చును.

తో॥ ధార్తరాష్ట్రులను జంపిన ప్రీతియు
ఏమిగల్గు ఓ జనార్దన
ఆతతాయినుల హత్యచేసినను
పాపమువచ్చును శ్రీకృష్ణ ॥శ్రీ॥

*తో॥ ధార్తరాష్ట్రులను బంధు సహితముగ
జంపుటయును ఉచితము గాదు
కరుణలేక స్వజనులను జంపిన
కడుదుఃఖము గల్గునువిడదు ॥శ్రీ॥ 3౬

శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః ।
క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః ॥

శ్లో॥ తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్స్వబాన్ధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ!॥ 37

తా॥ మా బంధువులే అయియున్న ధార్తరాష్ట్రులను వధించుట మాకు తగదు. మాధవ! స్వజనులచంపి మేము ఏమి సుఖపడుదుము?

త్రో॥ మావారగు ఈ ధార్తరాష్ట్రులను
మాధవ చంపుటకును కాదు
మా వారిని ఏ రీతిగ చంపియు
సుఖపడవచ్చును కారాదు ॥శ్రీ॥

*త్రో॥ సర్వమునందును నీవేయుండగ ♦ సందేహము నొందగ నేలా
సర్వస్వరూప సర్వాధారా ♦ సర్వేశ్వర శ్రీగోపాలా ॥శ్రీ॥

*త్రో॥ సర్వంబునకును అధారుడవని ♦ చక్కగ నెరిగిన భయమేలా
సర్వసృష్టి స్థితిలయకర్తవు హరి ♦ స్తుతియించెదనిను గోపాలా ॥శ్రీ॥ ౩౭

శ్లో॥ యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ 38

తా॥ లోభమునుండి మతిచెడినవారలు కులక్షయమునుండి గలుగు దోషమును మిత్రద్రోహముచే గలుగు పాపమును తెలియజాలరు.

త్రో॥ లోభగుణముచే మతిచెడువారలు
కులనాశనమునకు భయబడరు
దుర్బుద్ధిచె స్నేహితులగువారికి
ద్రోహముచేయగ దలచెదరు ॥శ్రీ॥

*త్రో॥ దుర్యోధనుండు రాజ్యలోభమున
దురుద్దేశ్యమును బొందియును
మిత్రద్రోహము కులనాశనమును
గానక మోసమునొందెవిను ॥శ్రీ॥ ౩౮

శ్లో॥ కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥ 39

తా॥ జనార్దన! కులక్షయమయిన దోషమును కనులార చూచుచున్న మనకు ఇట్టి పాపమును విడవబడుటకు ఎందుకు తెలియకూడదు?

త॥ కులక్షయంబగు పాపకార్యమును
కనులారగ చూచియు మనము
తొలుతను మానుట ఎరుగక పోతిమి
జనార్దనా యందుకు వినుము ॥శ్రీ॥

*త॥ సుందరాంగ వసుదేవ దేవకీ
నందన ఇందీవర నయనా
నందయశోదా నందవర్ధనా
బృందారకవందిత చరణా ॥శ్రీ॥ ౩౯

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత ॥ 40

తా॥ కులక్షయమయితే సనాతనంబగు కులధర్మములు నష్టమగుచున్నది. ధర్మనాశనమయితే కులమంతయు చెడి అధర్మము నిలువబడుచున్నది.

త॥ వంశనాశనము నొందగ నప్పుడు
శాశ్వతమగు వంశాచారము
నశియించును ధర్మంబుహతంబా
నిలుచును చూడగ అధర్మము ॥శ్రీ॥

*త॥ దేవదేవ నిను దినదినమును మది
ధ్యానంబును చేయగవలయు
దేవకీ దేవి తనయ యశోదా
దేవి భాగ్యరాశీ అనియు ॥శ్రీ॥ ౪౦

శ్లో॥ అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥ 41

తా॥ కృష్ణ ! అధర్మాభివృద్ధి అయిన కులస్త్రీలు భ్రష్టులగుదురు. వార్ష్ణేయ! స్త్రీలు చెడుటవల్లను వర్ణసంకర మగుచున్నది.

త॥ శ్రీ కృష్ణ ధర్మనాశనంబున
స్త్రీలు చెడుదురే వార్ష్ణేయ
స్త్రీలు భ్రష్టులైనను వర్ణంబులు
సంకరంబులగు నిజమయ్యా ॥శ్రీ॥

*త॥ వాసుకీ శయన వసుదేవాత్మజ
వందన మిదిగో శ్రీ కృష్ణ
వాసుదేవ శ్రీ నందకుమార
వరము లిమ్మశ్రీ హరికృష్ణ ॥శ్రీ॥ ౪౧

శ్లో॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః ॥ 42

తా॥ వర్ణసంకరముచే కులనాశకులకు నరకము సిద్ధముగద. మరియు వారల పితరులు పిండోదకములేక అధోగతిని పొందెదరు.

త॥ వర్ణసంకరము కులనాశనమును
చేసిన నరకము నొందెదరు
వారి పితరులును పిండోదకములు
లేక అధోగతి చేరెదరు ॥శ్రీ॥

*త॥ వృద్ధాప్యము అభివృద్ధి చెందెనిక
ఉద్ధరించు వారలులేరె
ఉద్ధవ పోషక ఉద్ధరించుమిక
వద్దచేరి శ్రీ కృష్ణహరె ॥శ్రీ॥ ౪౨

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

తా॥ కులఘాతకులుచేయు ఇట్టి వర్ణసంకరము కలిగించుదోషముచే శాశ్వతములయిన వర్ణాచారము కులాచారములు పోబడుచున్నది.

తో॥ కులఘాతకులచె కలిగెడి కష్టము
కులాచారములు గతించును
కులధర్మంబును జాతిధర్మమును
కాపాడుట యుక్తం బవును ॥శ్రీ॥

*తో॥ కులమువధించెడి ఈ పాపపుపని
జాలును యాదవ కులతిలక
అల సనాతనపు ధర్మనాశనము
చేయగనెంచితి మిందాక ॥శ్రీ॥ ౪౩

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ॥ 44

తా॥ జనార్దన! కులధర్మంబును నశియింపజేసిన మనుష్యులకు నియతముగా నరకవాసము కలుగునని వినుచున్నాము.

తో॥ జనార్దన వినుము ధర్మనాశనము
చేసిన మనుష్యవర్గముకున్
మానక నరకము కలుగు ననుచునే
వినియుందును పెద్దలవలనన్ ॥శ్రీ॥

*తో॥ జాతిధర్మమును కులధర్మంబును
నశియింపగ చేసినవెనుకన్
మతాభిమానము లేనందుననూ
నరకమెప్పటికి సిద్ధముగన్ ॥శ్రీ॥ ౪౪

శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః ॥ ౪౫

తా॥ అయ్యో! రాజ్యసుఖ లోభమునకై స్వజనుల చంపుట కుద్యుక్తులై మనము మహాపాపము చేయుటకు సిద్ధమైతిమిగద.

తో॥ రాజ్యసుఖములకై బంధు వర్గమును
నాశనంబు చేయుగ నేను
మించి పాపకార్యము చేయుంగను
అహో తలచితిమే ఇపుడు ॥శ్రీ॥

*తో॥ సర్వమునందును నుండెడి కృష్ణ
సర్వము నీలోనిదె కృష్ణ
సర్వమునకు నాధారుడ కృష్ణ
సర్వస్వరూప హరికృష్ణ ॥శ్రీ॥ ౧౫

శ్లో॥ యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ।

తా॥ నిరాయుధుని బదులుచేయని నన్ను శస్త్రపాణులై ధార్తరాష్ట్రులు రణమున సంహరించిరేని అది నాకు క్షేమకరమగును.

తో॥ నాదు ప్రాణ పోషణకై బాణము
లాదిగాగనే ధరియించక
మీదవారలును నన్ను వధించిన
ప్రియమగు ననినే తలంచెదర ॥శ్రీ॥

*తో॥ శ్రీకృష్ణయ్య అపకారంబును
చేయనినాపై బాణములు
ధార్తరాష్ట్రులీ రణమున వేతురు
వేసిననిచ్చెద ప్రాణములు ॥శ్రీ॥ ౧౬

శ్లో॥ ఏవముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 47

తా॥ ఇట్లుపలికి శోకభరితమైన మనస్సుగల పార్థుడు శరచాపంబులు వదలి రణభూమిలో రథములో చల్లగ కూర్చుండెను.

తో॥ స్వామితో ఈరీతిగ బల్కుచును
శోకమోహములో జిక్కియును
ఏమిశోచకను రథములో వరిగెను
శరచాపంబులు విడచియును ॥శ్రీ॥

*తో॥ రణభూమిలో పాండవ మధ్యముండు
రామానుజుతో ఇటుబలికి
బాణచాపములు పారవేసియును
రామా ఇంకెట్లని బలికె ॥శ్రీ॥ ౪౭

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జున
విషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.
ఓమ్.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతాసంగీతము

## ద్వితీయాధ్యాయము – సాంఖ్యయోగము.



పల్లవి॥ శ్రీరామజయ శ్రీరామజయ
శ్రీరామజయ శ్రీరామ
శ్రీరామజయ శ్రీరామజయ
శ్రీరామజయ శ్రీరామ॥

తో॥ పూర్ణవిరాగము పొందగ భావకు
పూతనహారుడగు కృష్ణుండు
పూర్ణకటాక్షమునుంచియు సాంఖ్యము
బోధించెను కరుణాభుండు ॥శ్రీ॥

తో॥ సాంఖ్యయోగమును చదివిన చాలును
సంపూర్ణంబగు జ్ఞానమగున్
సాంఖ్యయోగ తత్వంబును భక్తిగ
సద్గురు ముఖమున తెలియదగున్ ॥శ్రీ॥

*తో॥ గీతాశాస్త్రంబును చదువుటయు
గీతార్థంబును తెలియుటయు
గీతాగీతాయని స్మరించుటయు
గీతే నాగతి యనవలయు ॥శ్రీ॥

సంజయ ఉవాచః—

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్తమిదం వాక్యమువాచ మధుసూదనః ॥ 1

తా॥ ఈ రీతిగ కరుణాళుడై కన్నులనుండి నీరుగార్చుచు వ్యాకులమయిన చూపుతో దుఃఖించుచున్న అర్జునుని గురించి మధుసూదనుండు ఈరీతి పలికెను.

తో॥ అతిదయాళుడై కన్నులనుండియు
నీరుగార్చుచును దుఃఖించు
అర్జునునిగాంచి మధుసూదనుండు
ఈ రీతిగ ననె వినుమనుచు ॥శ్రీ॥

*తో॥ యెంతదయో భక్తులపై కృష్ణ
కుంతీసుత పాలకకృష్ణ
చింతించెద పాలించుము కృష్ణ
శాంతాకార శ్రీకృష్ణ ॥శ్రీ॥ ౧

శ్రీ భగవానువాచ.—

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్టమస్వర్గ్య మకీర్తికరమర్జున॥ 2

తా॥ అర్జున! ఆర్యుల నడతలోలేని నరకహేతువయిన అపకీర్తి కరమయిన ఈ మోహము అకాలమున నీకెట్లు ప్రాప్తించెను?

తో॥ అర్జున ఈ యుద్ధపు సమయంబున
అస్వర్గ్య మకీర్తికరంబు
అనార్యసేవితమగు ఈ మోహము
ఆవరించె నిను అల్పంబు ॥శ్రీ॥

తా॥ కుంతీసుత ఈ విషమాకాలమున
మూఢ మోహమగు అపకీర్తి
కరమును నరకప్రాప్తికిమూలము
ఈ భ్రమయందుకు సత్కీర్తి ॥శ్రీ॥

*తా॥ నందయశోదా నందనకృష్ణ
నవనీతచోరా శ్రీకృష్ణ
మందరగిరిధర మాధవకృష్ణ
వందనమిదిగో హరికృష్ణ ॥శ్రీ॥ ౨

శ్లో॥ క్లైబ్యం మా స్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ౩

తా॥ పార్థ! ఇట్టి పిరికితనము పొందకుము. నీయట్టివానికి యుచితము గాదు. శత్రువుల తపింపచేయువాడా! ఈతుచ్ఛమయిన హృదయ దౌర్బల్యము విడచిలెమ్ము.

తా॥ శత్రుహారణ పిరికితనము వదలుము
హృదయదౌర్బల్యము నొందకుము
పార్థ గౌరవమ్మును విడువకుము
యుద్ధమునకు వేగమెలెమ్ము ॥శ్రీ॥

*తా॥ పరంధాముగన రామునిమదిలో
పరిపరివిధముల స్మరియించు
నరకవాసమును కావలెనంటె
విషయవాసనల మదినెంచు ॥శ్రీ॥ 3

అర్జున ఉవాచ:—

శ్లో॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన! 4

తా॥ అరిమర్దన! రణభూమిలో పూజార్హులైన భీష్మ ద్రోణాచార్యుల యెదుటనిలచి బాణప్రయోగముచేసి మధుసూదన! ఎట్లు యుద్ధము చేయగలను?

తో॥ అరిమర్దన పూజార్హులు భీష్మ
ద్రోణులయెదుటను నిలబడియుః
ఈరణభూమిలో బాణములు వేసి
యుద్ధము ఎటుచేయగవలయుః ॥శ్రీ॥

తో॥ పితామహుండగు భీష్మునిమీదను
ఆచార్యుండగు ద్రోణునిపై
బాణంబులునెటు ప్రయోగించెదను
పూజార్హులైనా వారలపై ॥శ్రీ॥

*తో॥ కృష్ణాయను రెండక్షరంబులును
ద్రౌపతిమానము గాచెగదా
తృష్ణా దుఃఖము తొలగగవలసిన
కృష్ణాయని తలపగరాదా ॥శ్రీ॥ ४

శ్లో॥ గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥ 5

తా॥ మహాత్ములగు గురువులను బాధించక బిక్షమెత్తి జీవించుట మేలుగద. అర్థకాములగు గురువులను వధించినయెడ నేను వారి నెత్తురుచే తడిపిన భోగములనే అనుభవించవలెనుగదా.

తో॥ పూజ్యుల గురువుల బాధలు పెట్టక
భిక్షాన్నముచే బ్రతుకుటయు
పూజ్యమనుచునే తలచెద కృష్ణ!
పుణ్యశరీరా వినవలయు ॥శ్రీ॥

తో॥ మహానుభావులు భీష్మద్రోణులు
సుఖభోగముకై వధింపక
బిక్షాశనమున బ్రతుగక వచ్చును
వారల రక్తము పడనీక ॥శ్రీ॥

*తో॥ అర్థకాములని ఆర్యుల చంపియు
ఆ భోగముల భుజించుటయు
వ్యర్థంబుగదా వారి రక్తముచె
తడసిన వస్తువులే యవియు ॥శ్రీ॥ ౫

శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ 6

తా॥ గాకను మనము వారిని జయింపవలయునో, లేక వారలు మనలను జయించవలయునో, ఇందులో ఉత్తమపక్ష మెయ్యదియో తెలియజాలకున్నాను. ఎవరిని వధించినవెనుక మనము బ్రతుకగోరమో అట్టిప్రియబంధువులు ధార్తరాష్ట్రులు మనయెదుట నిలచియున్నారు.

తో॥ గాకను మనమే వారి జయించుట
లేకను వారిచె జచ్చుటయు
యుక్తమెయ్యదియొ తోచదె తండ్రి
ఇవుడేవని చేయగ వలయు ॥శ్రీ॥

తో॥ మనకు జయంబో వారికి జయమో
యెరుగను మాకే జయమైన
వ్యాకుల జీవన మవునుగాని సుఖ
లేశము కనుబడదే కృష్ణ ॥శ్రీ॥



*తో॥ ఎవరి వధించియు బ్రతుకగ జాలమొ
అవ్వారగు ప్రియబంధువులు
ఎదుటనున్న వారలుగను కృష్ణ
అదిగో చూడుము కౌరవులు ॥శ్రీ॥ ౬

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7

తా॥ కార్పణ్య దోషముచే నా శౌర్యస్వభావము మారినది. ధర్మమేదో తెలియకున్నాను. కావున నిన్నడుగుచున్నాను. నాకు ఏది శ్రేయస్సో దానిని నిశ్చయించి అనుగ్రహించుము. నేను నీకు శిష్యుడను. ప్రపన్నుడయిన నన్ను శిక్షించుము.

తో॥ స్వభావమిప్పుడు మారిపోయినది
కార్పణ్య మనే దోషముచే
శిష్యుడనయితిని సద్గురువర్యా
శిక్షచేయుమను నీ దయచే ॥శ్రీ॥

తో॥ కార్పణ్యము నా భావము జెడచెను
ధర్మనిశ్చయము తెలియదుగ
నిశ్శ్రేయసమును తెలుపుము తండ్రి
దండించుము నీ శిష్యునిగ ॥శ్రీ॥

*తో॥ ధర్మమెట్టిదియో ఎరుగగ చాలను
మర్మము తెలుపుము నా తండ్రి
కూర్మి శిష్యుడను శ్రేయస్సెయ్యదొ
నిశ్చయించి తెల్పుము తండ్రి ॥శ్రీ॥ ౭

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణమిన్ద్రియాణామ్ ।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ ౮

తా॥ నిష్కంటకమగు సర్వసంపదలతో కూడిన భూమి రాజ్యాధికార మొచ్చినను లేక సురలోకాధిపత్యము గలిగినను, ఇంద్రియముల శోషింప చేయుచున్న ఈ అత్యంత దుఃఖముతొలగెడి మార్గము చూడచాలకున్నాను.

తో॥ ఇంద్రియ సంతాపకరంబౌ దుఃఖము
దేవేంద్రత్వము వచ్చినను
శత్రుహరణమై రాజ్యమొచ్చినను
ఈ దుఃఖము నే పడజాలన్ ॥శ్రీ॥

*తో॥ నిష్కంటకమగు రాజ్యము చేరిన
నిర్జర లోకాధిపుడయినన్
నీ అనుగ్రహము గలుగక యుండిన
మనోదుఃఖ మెటు బాపనగున్ ॥శ్రీ॥ ౮

సంజయ ఉవాచః-

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః ।
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ॥ ౯

తా॥ శత్రుతాపనుడయిన అర్జునుడీరీతి హృషీకేశునితో విన్నవించి యుద్ధము చేయచాలనని గోవిందునితో తెలిపి వూరకుండె. ఆశ్చర్యము.

తో॥ శత్రుతాపకుండగు అర్జునుడా
హృషీకేశునితో ఇట్లనియున్
మిత్రవింద నాయక నేయుద్ధము
చేయననుచు నూరకయుండెన్ ॥శ్రీ॥

తొ॥ ఈరీతిగ కృష్ణునితో బల్కియు
యుద్ధముచేసిన కష్టముగన్
దురితమువచ్చును గోవిందాయని
ఊరకనుండెను పార్థుండున్ ॥శ్రీ॥

*తొ॥ అంతశ్శత్రువులగు కామాదులు
అంతమొంద ప్రార్థన చేయు
కుంతీసుతు పార్థుని గాచిన శ్రీ
కృష్ణుని సేవింపగవలయు ॥శ్రీ॥ ౯

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!।
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః॥ 10

తా॥ భారత! ధృతరాష్ట్రా! విను. అపుడు ఆ రెండు సేనలమధ్యే ఖిన్నుడయికూర్చొనియున్న పార్థునిగురించి హృషీకేశుడు కొంచము నవ్వుచు ఈ వాక్యము పలికెను.

తొ॥ విషాదమొందియు సేనమధ్యమున
యూరకుండు పార్థునిగనియు
హృషీకేశుడును పరిహాసముగా
బలికెను భారతకులుడయనియు ॥ శ్రీ ॥

*తొ॥ ఎంతదయో కుంతీ తనయులపై
చింతలెల్ల వారికి తీర్చి
కుంతీతనయాగ్రజునకు పట్టము
కట్టితివో సంతోషించి ॥శ్రీ॥ ౧౦

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః॥ 11

తా॥ ఎవరివిషయమై శోకమవసరము లేదో వారివిషయమై నీవు శోకపడుచున్నావు, పిమ్మట జ్ఞానులవలె మాటలాడెదవు. పండితులు చచ్చిన వారికి వున్నవారికి శోకపడరు.

తో॥ అనవసరంబగు నేడ్పునేడ్చెదవు
వివేకివలెనే బల్కెదవు
వున్నవారికిని పోయినవారికి
శోకముపొందరు పండితులు ॥శ్రీ॥

*తో॥ ఆత్మారాముని అనుదినంబునను
సత్పురుషులు ధ్యానించెదరు
పుత్రాదులె గతియని పాపాత్ములు
భ్రాంతిచె తహాతహా పడియెదరు ॥శ్రీ॥ ౧౧

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామ స్సర్వే వయమతఃపరమ్ ॥ 12

తా॥ అహం=నేను ఒకప్పుడును లేకపోయినవాడును కాదు. త్వం= నీవును లేకపోయినవాడువు కాదు. ఈ రాజులందరును లేకపోయినవారలు కారు. మనమందరము ఈ దేహములు పోయినను పిమ్మట యుండక పోవు వారము కాము.

తో॥ నేను నీవు ఈ రాజులందరును
యెప్పుడు నుండెడి వారమయా
మనమెల్లరమును అటు పిమ్మటయును
పోయెడి వారము కామయ్యా ॥శ్రీ॥

*తో॥ సిగ్గులేదవో చిన్ని గోపాలా
ఆగుర్రములను అవలీలా
పగ్గములును గొని పార్థుని రథమును
పరువిడతోలితివే లీలా ॥శ్రీ॥ ౧౨

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి ॥ 13

తా॥ దేహికి ఈ దేహంలో బాల్యత్వము యౌవనత్వము వృద్ధాప్యము కల్గు
నట్లు వేఱే దేహప్రాప్తి అవుచుండును. ఇదిచూచి ధీరుడు మోహావశముపొందడు.

తో॥ దేహికి దేహమునందున బాల్యము
యౌవనమును వృద్ధాప్యంబు
దేహాంతరమును గలుగు బెఱంగియు
ధీరుడు పొందడు మోహంబు ॥శ్రీ॥

*తో॥ బాల్యము యౌవన జరావికారము
గలుగునట్లు దేహాంతరము
గలిగిన యాత్మకు మార్పులులేదని
ధీరుడుపొందడు మోహంబు ॥శ్రీ॥ ౧౩

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత ॥ 14

తా॥ భారత! మాత్రలు అనగా ఇంద్రియములు వీటికి శబ్దాదివిషయ
ముల కలయికచే కౌంతేయా! శీతోష్ణము మొదలగు సుఖదుఃఖములు గలుగు
చుండును. అవి రాకపోకలుగలవి అన్ని, అనిత్యములని సహించుచుండుము.

తో॥ శబ్దాదులు ఇంద్రియ సంస్పర్శచె
శీతోష్ణములగు సుఖదుఃఖం
బబ్బును భారతమారును పోవును
అని సహార్యము ఈ సుఖదుఃఖం ॥శ్రీ॥

*తో॥ ఇంద్రియలోలత గలుగుచుండగ
సుఖదుఃఖంబులు భువిలోనన్
ఇవి శాశ్వతములుగావని తెలియుము
వీటి సహించుము మదిలోనన్ ॥శ్రీ॥ ౧౪

శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ 15

తా॥ పురుషవర్యా! సుఖదుఃఖములను సమానముగ లెక్కచేయు ఏ ధీరుడు గలడో, వాని అవి బాధించచాలవో అతడే అమృతత్వముపొందు సమర్థుడగును.

తో॥ పురుషశ్రేష్ఠుడ సుఖదుఃఖములకు
చలనమునొందని వాడుగద
ధీరుడు మోక్షము నొందుట కర్హుడు
సుఖదుఃఖ సముండతడెగద ॥శ్రీ॥

*తో॥ సుఖదుఃఖములను సమముగచూడగ
నాకెప్పుడు లభ్యంబగును
హే కరుణాకర అనుగ్రహించుము
ఇక జన్మము రాకుండగను ॥శ్రీ॥ ౧౫

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥ 16

తా॥ ఏదిలేదో (అసత్) దానికి సత్తలేదు. మరి ఏదివున్నదో (సత్) దానికి అభావములేదు. తత్త్వదర్శులకు ఈ రెంటియొక్క (సత్-అసత్తుల) సంగతి తెలిసినది.

తో॥ ఆత్మవేత్తల యభిప్రాయమువలె
అసత్ వస్తు వెప్పుడులేదు
ఆత్మస్వరూపు డెప్పుడు మారడు
అర్జున దుఃఖము పనిలేదు ॥శ్రీ॥

*తో॥ అన్ని హృదయముల కాధారుడవై
అన్నియు నీవై నావుహరి
మన్నించుము నిను నెప్పుడు మరియక
కన్నతండ్రి శ్రీ కృష్ణహరి ॥శ్రీ॥ ౧౬

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి ॥ 17

తా॥ ఏ (సత్ )వలన ఇదంతయును విస్తారమైనదియో అది నాశరహిత మయినదని తెలిసికొనుము. ఆ అవ్యయమయిన తత్త్వమును నాశముచేయ యెవ రున్ను సమర్థులుగారు.

తో॥ సత్తనబడు యే బ్రహ్మముగలదో
సర్వమునకు నాధారంబై
నిత్యంబై వెలుగుచుండు నెవరికి
నాశము చేయు నసాధ్యంబై ॥శ్రీ॥

*తో॥ సత్తాసత్తుల సంగతి తెలుపుము
నిత్యుడవగు ఆత్మారామ
ఉత్త ప్రపంచము నమ్మినవారికి
యుత్తమగతి లేదాత్మారామ ॥శ్రీ॥ ౧౭

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥ 18

తా॥ దేహస్వామియగు (ఆత్మ) నాశనము గానివాడని అప్రమేయుడని నిత్యుడనియు ఈ దేహములు నాశనముగలిగినవని చెప్పబడినది కావున హే భారత! యుద్ధము చేయుము.

తో॥ ఆత్మనిత్యుడగు నాశరహితుడగు
నప్రమేయుడగు శరీరము
నిత్యము గాదిదియని చెప్పబడినది
భారత యుద్ధమును చేయుము ॥ ॥శ్రీ॥

*తో॥ నిత్యుండవు నిర్వికారుడవుహరి
సత్యవ్రతుడవు శ్రీ రామ

ఉత్తమధర్మము నుద్ధరించుటకు
అవతారము ఆత్మారామ ॥శ్రీ॥ ౧౮

శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే। 19

తా॥ (శరీరస్వామియగు) ఆత్మవధించువాడని తలచువాడు, ఆత్మ హతుడవునని తలచువాడు వీరిద్దరు నిజము తెలిసినవారుగారు. ఎందుకనగ ఆత్మ వధించుటలేదు, వధింపబడుటయులేదు.

తో॥ ఎవ్వడు ఆత్మవధించువాడనియు
వధింపబడువాడనియున్ను
ఎవరు తలంతురో వారరయరుగా
జంపుట జచ్చుట మిథ్యఅను ॥శ్రీ॥

*తో॥ సర్వమునకు సాక్షివి శ్రీ రామ
సూర్యునివలె శ్రీ రఘురామ
సర్వము నీలోనిదె శ్రీ రామ
సర్వము నీదే రఘురామా ॥శ్రీ॥ ౧౯

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే। 20

తా॥ ఆత్మ ఒకప్పుడును పుట్టదు వకప్పుడును చావదు. ఒకప్పుడుండి మరియొకప్పుడు వుండకపోవువాడుగాడు. అజుడు నిత్యుడు శాశ్వతుడు పురాణుడు. శరీరము వధింపబడినను ఆత్మ హతుడుగాడు.

తో॥ ఆత్మవకప్పుడు పుట్టదుగిట్టదు
వకప్పుడుండియు వకప్పుడు

ఆత్మవుండకను పోవుటయు లేదు
అజుండు నిత్యుడు శాశ్వతుడు ॥శ్రీ॥

తో॥ పురాతనుండని యెరుగుముపార్థ
శరీరములు పోయినగాని
పురాణుడెప్పుడు పోవడు వినుము
పూర్ణుడనుచు యెరుగుము నతని ॥శ్రీ॥

*తో॥ పుట్టుటగిట్టుట నెప్పటికినిలే
దవ్యయుడజుడు పురాణుండు
నష్టము దేహము పొందుచుండినను
శాశ్వతంబుగా తానుండు ॥శ్రీ॥ ౨౦

శ్లో॥ వేదాఽవినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్॥ 21

తా॥ పార్థ! ఆత్మను నాశములేనివాడు నిత్యుడు అజుడు అవ్యయుడు అని ఏ పురుషుడెరుంగునో అతడు ఎవ్వనియెట్లు చంపించును? ఎట్లుచంపును?

తో॥ ఆత్మవినాశము లేనివాడనియు
పరిణామము నొందండనియుఁ
అజాడవ్యయు డనువాడెటు చంపును
ఎటుజంపించును తెలిసియును ॥శ్రీ॥

*తో॥ పరిణామము లేకుండెడిరామా
పరమపురుష ఆత్మారామా
నిర్వికార నిగమ వినుత రామా
నినుతలచెద ఆత్మారామా॥ ॥శ్రీ॥ ౨౧

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।

తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22

తా॥ మనుష్యుడు చినిగినవస్త్రములు విడచి వేరే ఎట్లు క్రొత్తవస్త్రములుధరించునో అట్లే ఆత్మ జీర్ణ దేహములు వదలి వేరే నూతనదేహములు పొందుచున్నాడు.

తో॥ పురుషుడు చినిగిన గుడ్డలనువిడచి
నూతన గుడ్డను ధరించుగా
అరీత్యాత్మయు శిథిలమువదలియు
నూతన దేహము ధరించుగా ॥శ్రీ॥

*తో॥ ఆత్మనుమరచిన జీవికికోరిక
లాథిరగు టాశ్చర్యముగా
ఆత్మరామునిను అనుదినమునెదను
జన్మపరంపర లేదాగా ॥శ్రీ॥ ౨౨

శ్లో॥ నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥ 23

తా॥ ఈ యాత్మను ఆయుధములు నరుకజాలవు. అగ్నియు ఇతని దహింపజాలదు, జలము ఈఆత్మని తడుపజాలదు, వాయువు ఎండింపజాలదు.

తో॥ ఈ యాత్ముని ఆయుధములు నరుకవు
అగ్నియు దహింపజాలదుగా
ఈ ఆత్ముని జలముతడుప జాలదు
వాయువు శోషిల చేయదుగా ॥శ్రీ॥

*తో॥ ఎంతటి ఘనుండ వాత్మారామ
భూతము లన్నియు శ్రీరామ
పంతంబున బంధించదురామ
చింతకుచిక్కని శ్రీరామా ॥శ్రీ॥ ౨3

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః॥ 24

తా॥ ఈ ఆత్మ ఛేదింపనలవిగానివాడు. అట్లనే దహింప సాధ్యపడడు. తడుప ఈ ఆత్మ సాధ్యపడడు. శోషింప సాధ్యుడుగాడు. నిత్యుడు అంతట వ్యాపించివుండువాడు స్థిరుడు చలించడు అనాదిఅయినవాడు.

తో॥ ఈతనినరకగ దహింపతడపగ
శోషిలచేయగ గాదండ్రు
ఈతడునిత్యుడు సర్వగతుండును
స్థాణుడచలుడు సనాతనుడు ॥శ్రీ॥

*తో॥ నిత్యుడవట అంతట నీవేనట
కదలుట లేదట రఘురామా
సత్యమె నీరూపంబట స్థిరుడట
సనాతనుడ వాత్మారామా ॥శ్రీ॥ ౨౪

శ్లో॥ అవ్యక్తోఽయమచిన్త్యోఽయ మవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ 25

తా॥ ఈ ఆత్మ చక్షురాదులకు అగోచరుడు. చింతించుట కీఆత్మ అసాధ్యుడు. ఈ ఆత్మవికారాస్పదుడు గాడు అని చెప్పబడును అని తెలసియు ఏడ్పుమానుట మంచిది.

తో॥ అవ్యక్తుండని యచింత్యుడనియును
అవికార్యుండని బలికెదరు
కావునఫల్గున ఇట్లెరంగియును
ఏడుపువిడువుము పలుమారు॥

*తో॥ మనోబుద్ధులకు న గోచరుండని
మారాముని మర్మము గనుడు

మనోరోగములు మానియునాత్మా
రాముని ధ్యానించుమ నెపుడు ॥శ్రీ॥ ౨౫

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాఽపి త్వం మహాబాహో! నైనం శోచితుమర్హసి॥26

తా॥ మహాబాహూ! అట్లుగాక ఈ ఆత్మ సదా పుట్టెడివానిగను సదా మృతుడగువనియు తలచెదవేమో! అట్లయిన నీవు ఆత్మనుగురించి దుఃఖపడుటకు తగవు.

తొ॥ దేహముపుట్టిన ఆత్మపుట్టునని
దేహముపోయిన పోవునని
తలచిన దుఃఖము బొందగనేలా
పుట్టినదెప్పుడు పోవునను ॥శ్రీ॥

*తొ॥ దేహముపై ఆశపడగనేలా
దేహము దహించిపోవు నిలా
దేహము దాచిన నుండదు చాలా
దేహముకై దుఃఖము ఏలా॥ ౨౬

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥ 27

తా॥ యెందుకనగ పుట్టినవానికి చావు తప్పదు. చచ్చినవానికి జన్మము తప్పదు. ఇట్లు అనివార్యమయిన విషయములో శోకించుట తగదు.

తొ॥ పుట్టినవానికి మరణముతప్పదు
మరణమునకు జన్మము దృఢము
అట్లనివార్యంబగు దానికి నిక
శోకించుటచే నేమిఫలమ్ ॥శ్రీ॥

*తొ॥ పుట్టుట పోవుట లేఖికట్టమిది
పురాణపురుషాత్మారామ

పుట్టనిగిట్టని మార్గముచూపుము
పట్టాభిరామా పరమాత్మా ॥శ్రీ॥ ౨౭

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ 28

తా॥ భారత! సర్వభూతములు ఆదిలో అవ్యక్తమయినవి. మధ్యలో వ్యక్తమయి వుండును. మరియూ మరణమయిన అవ్యక్తమయిపోవును. కావున శోకమేల? (అన్ని భూతములు కడపటంతే)

తో॥ భారతగను ఈ భూతసమూహము
పుట్టుకమును పవ్యక్తంబు
మధ్యకాలమున కనబడుకడపట
పోవును యిందుకు దుఃఖంబు ॥శ్రీ॥

*తో॥ అంతంబగు అవ్యక్తంబగు ఈ
అన్నిటికని దుఃఖంబేల
సంతోషంబున సర్వకాలమును
చింతించెద శ్రీ గోపాల ॥శ్రీ॥ ౨౮

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్॥ 29

తా॥ ఈ ఆత్మను ఒకానొకడు ఆశ్చర్యవస్తువువలె చూచును. మరియొకడు ఇదొక క్రొత్త ఆశ్చర్యమని చెప్పును. మరియొకడు ఆశ్చర్యమని వినును. ఈ రీతిచూచిన వర్ణించిన వినినను తత్వస్థితిలో ఎవరును నెరుంగరు.

తో॥ ఆశ్చర్యంబుగ జూచునొకడు నొక
డాశ్చర్యమనుచు పలుకునుగా
మరివక డాశ్చర్యంబని విను విని
ఆత్మనుయెవ్వరు తెలియరుగా ॥శ్రీ॥

*తో॥ నందయశోదా నందనకృష్ణ
 సముద్రోపగ రాధాకృష్ణ
ఇందీవరదళనయన శ్రీకృష్ణ
 ఇందురార రాధాకృష్ణ ॥శ్రీ॥ ౨౯

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత!
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి॥ 30

తా॥ భారత! సమస్త దేహములందుండెడి దేహి ఎప్పుడున్ను అవధ్యుడయి వుండును. గావున సమస్తదేహముల గురించి యేడ్చుట నీకు సరిగాదు.

తో॥ సర్వదేహముల నుండెడిదేహి
 సర్వదేహములు పోయిననూ
సర్వాత్మకుడెప్పుడు తానుండును
 భారత శోకంబేలవినుము ॥శ్రీ॥

*తో॥ నందయశోదా నందకంద గో
 విందదయాంబుధి శ్రీకృష్ణ
మందరోద్ధరణ మామనోరమణ
 వందనమిదిగో శ్రీకృష్ణ ॥శ్రీ॥ ౩౦

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే॥

తా॥ స్వధర్మమును, చక్కగ విచారించినను ఈ యుద్ధము విడుచుట కాదని తెలుసు. ఏలనగా ధర్మయుద్ధమునకంటె మరియొక శ్రేయస్కరమయిన కార్యము క్షత్రియునకు లేదు.

తో॥ స్వధర్మమేమని ఆలోచించిన
 యుద్ధభూమి తొలగుటకాదు
క్షత్రియులకు యుద్ధమె ప్రాముఖ్యము
 శ్రేయస్కర మన్యములేదు ॥శ్రీ॥

*త॥ నందయశోదా నందవర్ధన
సుందరాంగ రాధారమణా
ఇందురార రాకేందు నిభానన
సందర్శింపుము శ్రీకృష్ణ ॥శ్రీ॥ 3౧

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధమీదృశమ్॥ 32

తా॥ పార్థ ! ప్రార్థించకయే తెరవబడిన స్వర్గద్వార వాకిలిగలది అగు ఈ యుద్ధమును పొందు క్షత్రియులు మిక్కిలి సుఖవంతులని చెప్పవలెను.

త॥ స్వర్గద్వారమౌ యుద్ధభూమియగు
తెరవబడిన వాకిలిగలది
ధర్మయుద్ధమని సుఖవంతంబని
పార్థ క్షత్రియులు నడచెడిది ॥శ్రీ॥

*త॥ యోగముకైనను యుద్ధముకైనను
త్యాగము ముఖ్యము కావలయు
యోగీశ్వర నిను ప్రార్థన చేసెద
త్యాగము దయచేయగవలయు ॥శ్రీ॥ 3౨

శ్లో॥ అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥ 33

తా॥ ఇట్లుండ ఈ ధర్మోచితమగు యుద్ధము, నీవు చేయనిచో స్వధర్మము, కీర్తి పోగొట్టుకొని, పాపమునకు గురియగుదువు.

త॥ విధిచోదితమగు ధర్మయుద్ధమును
విడుచుట యెంతయు పనిగాదు
స్వధర్మమిడచిన పాపముకలదు
కీర్తియు ధర్మము నిలబడదు ॥శ్రీ॥

*తా॥ తనధర్మము తానాచరించవలె
త్యాగమె దీనికి ముఖ్యమగు
తానెవరని తా నెరుగగవలయును
ధైర్యము సంతోషముగల్గు ॥శ్రీ॥ 33

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తి ర్మరణాదతిరిచ్యతే ॥ 34

తా॥ ఇదిగాక ముందర సకలప్రాణులు బహుకాలమువరకు నీ అపయశస్సుయొక్క కథలు చెప్పుకొనుచుందురు. గౌరవముగలవానికి అపకీర్తి మరణమునకంటె హెచ్చగును.

తా॥ రణముచేయనని తొలగిన వచ్చును
అపకీర్తియు గల్గునుచాలు
గన్నవారలును తూలనాడుదురు
యంతకన్న మరణముమేలు ॥శ్రీ॥

*తా॥ శత్రులార్గురని జయించవలయును
శమాదిసద్గుణములు ఆరు
మిత్రులనుచు వారినిపోషించుము
కీర్తిని తనంతకు తాచేరు ॥శ్రీ॥ 3౫

శ్లో॥ భయాద్రణాదుపరతం మన్స్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥

తా॥ నీవు భయపడి రణమునుండి పరుగెత్తెనని మహారథులు తలంతురు. నిన్నివరకు యెవరు గౌరవించిరో వారే ఇక చులకనగచూతురు.

తా॥ భయపడిపార్థుడు పరుగెత్తెననియు
పరిహాసింతురు మహారథులు
భయంబుచెందనివాడని తలచిన
వారేచులకన వాడంద్రు ॥శ్రీ॥

*తో॥ కర్తా భోక్తా జనార్దనా అను
వారికి ఏ స్థానమున్న దయా
కర్తనేననియు భోక్తనేననియు
తలచిన చాల్యుయమున్నదయా ॥శ్రీ॥ 35

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ 36

తా॥ నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించి అనరానిమాట్లాడెదరు. అంతకన్న అధిక దుఃఖమేమున్నది? బహునిందల పాలుకాకుము.

తో॥ నీ శత్రువులును నినుగని అవాచ్య
వాక్యములనెదరు చులకనగ
ఓ శత్రుంజయ నెటుసహించెదవు
దుఃఖము వేరేమున్నదిగ ॥శ్రీ॥

*తో॥ ధర్మయుక్తమగు కర్మలుచేయుచు
పరమాత్మని కర్పించుచును
ధర్మాత్ముడనని గర్వముచెందక
సర్వము శ్రీహరిదనవలను ॥శ్రీ॥ 36

శ్లో॥ హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః॥ 37

తా॥ యుద్ధములో హతుడవైతివేని స్వర్గము పొందుదువు. జయించితివేని రాజ్యమనుభవింతువు. కావున కౌన్తేయ! ఇట్లునిశ్చయించి యుద్ధమునకు లెమ్ము

తో॥ హతుడవైనచో నాకమొందెదవు
రాజ్యమొందెదవు జయించిన
అందువలన ధైర్యమున యుద్ధమును
నిశ్చయించుమీ మనంబున ॥శ్రీ॥

*తో॥ భగవదాజ్ఞయే ప్రాముఖ్యంబని
భారము పరమాత్మని దనుచు
యోగర్యము బొందక సత్కర్మలు
యోగిచేయు శ్రీహరియనుచు ॥శ్రీ॥ 3౭

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥

తా॥ సుఖదుఃఖములను లాభనష్టములను జయాపజయములను సమముగ భావించి యుద్ధము చేయ ప్రయత్నించుము. అట్లుచేసినచో పాపముబొందవు.

తో॥ సుఖదుఃఖంబులు సమముగ చూచుచు
లాభాలాభ జయాజయము
అఖిలము సమముగ జూచుచు యుద్ధము
చేయుము పాపము బొందకుము ॥శ్రీ॥

*తో॥ శాస్త్రముచెప్పిన ఆచరించుచును
సుఖదుఃఖంబుల సమముగను
చూచువాడు పుణ్యాత్ముడు జ్ఞానియు
యోగివిరాగియు యనవలయుఁ ॥శ్రీ॥ 3౮

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి॥

"శుద్ధాత్మతత్త్వ విజ్ఞానసాంఖ్య మిత్యభిధీయతే" యని మహదుక్తి.

తా॥ హేపార్థ! ఇపుడు చెప్పబడినది సాంఖ్యము. అనగ ఆత్మ తత్త్వ జ్ఞానము బుద్ధిని తెలిపితిని. యోగమనగ కర్మయోగము. యోగమందైతే ఈ బుద్ధిని చెప్పెద వినుము. ఈ బుద్ధితో కూడినవాడవయి కర్మబంధమును విడువగలవు.

తే॥ ఆత్మతత్వమును తెలియుటకును నే
తెలిపితిని బుద్ధియోగమును
తత్వము తెలిసియు కర్మబంధముబాపు
బుద్ధిని తెల్పెద పార్థవినుము ॥శ్రీ॥

*తే॥ దేహాపటుత్వము కలిగినందులకు
దేహినిగనువాడుత్తముడు
మోహములోబడి ముక్తినిబడయని
మోసకాదు చాలధనుండు ॥శ్రీ॥ 3౯

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

తా॥ ఈ కర్మయోగమార్గములో ఆరంభము చేసిన కర్మ నాశము కాదు. దోషము లేదు. ఈ ధర్మమునొక్క స్వల్పమయిననూ అధికమయిన భయమునుండి రక్షించును.

తే॥ ఆత్మజ్ఞానము పూర్ణస్థితికై
కర్మయోగమును తెలిపెదను
ఈతత్వజ్ఞానముచే విఫలము
పొందక భయమును విడనగును ॥శ్రీ॥

*తే॥ కర్మయోగమును కరిసంబనకుము
కొంచమయిన దోషముకాదు
కర్మలుచేసియు కృష్ణార్పితమను
ధర్మయుక్తమే కాగలదు ॥శ్రీ॥ ౪౦

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

తా॥ కురునందన! పురుషార్థ సాధనబుద్ధి ఏకాగ్రముగనుండును. అదియే

వ్యవసాయాత్మబుద్ధి యనబడును. పురుషార్థదృష్టి లేనివారిబుద్ధి అనంతత్రయములు చిక్కి అనేకములుగ బహుశాఖలుగ నుండును.

తో॥ నిశ్చయాత్మకంబయిన బుద్ధియును
పురుషార్థక సాధనముగునయా
నిశ్చయాత్మకము లేని బుద్ధులును
పురుషార్థంబులు లేదగునయా ॥శ్రీ॥

*తో॥ సంసారము ఇటు సాగించెదనన
సాగదు నానావిధమగును
కంసారిని కోరియు సేవించిన
కడతేరుట నిశ్చయమగును ॥శ్రీ॥ ౪౧

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥ 42

తా॥ పార్థ! వేదములయొక్క (కర్మకాండయొక్క) (ఫలశ్రుతి) వాక్యములకు భ్రాంతులై ఇంతకన్న వేరేలేదని అపండితులుపలికెడి పుష్పమే ఫలమనెడి వన్నెలమాట లేమనగ వేదముల నిశ్చితార్థమును తెలియలేనివారలని తాత్పర్యము.

తో॥ మోదుగవృక్షము పుష్పంబులుగని
భ్రమపడు నట్లువివేకజనుల్
వేదవాదులన్యము లేదందురు
పార్థవినుము వారలపలుకుల్ ॥శ్రీ॥

*తో॥ బుద్ధికి గ్రాహ్యుండగు శ్రీ రామ
బుద్ధిని నీయందే నిల్పు
వద్దువద్దు నాకన్యచింతనము
తిద్దునన్ను దండననల్పు ॥శ్రీ॥ ౪౨

శ్లో॥ కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43

తా॥ (యజ్ఞయాగాదులనే) కర్మలవల్లనే పునర్జన్మ ప్రాప్తమగుననియు, భోగైశ్వర్యములు ప్రాప్తమగును అని స్వర్గకాములయిన కామ్యబుద్ధిజను లందురు.

తొ॥ భోగైశ్వర్యంబులకై యెప్పుడు
స్వర్గముబొందగ వలెననుచు
భాగ్యములెల్లను పొందెడివారలు
ఇహలోకంబున సుఖులనుచు ॥శ్రీ॥

*తొ॥ ఇహపరములలో సుఖములొందవలె
ఇందుకుకర్మలు చేయువలె
ఇంతకన్న వేరేమున్నదిలే
దనెదరు సామాన్యపుజాల్రే ॥శ్రీ॥ ४३

శ్లో॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే ॥ 44

తా॥ అట్టి వన్నెమాటలకు మనస్సు లొంగినవారు అయినందున భోగైశ్వర్యములందే చిక్కిపోవుచున్నారు. వ్యవసాయము చేయని బుద్ధిగల వారికి ఏకాగ్రబుద్ధి యెట్లుకలుగును?

తొ॥ ఇంద్రియసుఖములకై భోగంబుల
కాశపడిన మానవులకును
తొందరచే వ్యవసాయము లేమిని
నిశ్చలబుద్ధియు లేదువినుము ॥శ్రీ॥

*తొ॥ అజ్ఞానుల మాటలకు లోనగుచు
భోగసుఖంబులె మేలనుచు
సుజ్ఞానంబునుబొందక చచ్చుచు
బుట్టుచునుందురు నిజమనుచు ॥శ్రీ॥ ४४

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ 45

తా॥ అర్జున! (కర్మకాండాత్మకమయిన) వేదములు త్రైగుణ్య విషయములచే నిండికొనియుండును. నీవు త్రిగుణాతీతుడవును, సుఖదుఃఖ ద్వంద్వములకు చిక్కనివాడవును, ఎల్లప్పుడును సత్త్వగుణము గలవాడవును, యోగ క్షేమములు విడచినవాడవును అగుము.

తో॥ మూడుగుణంబుల విషయము వేదము
నిస్త్రైగుణ్యుడ వగుమయ్యా
శుద్ధసాత్వికుడవయి శీతోష్ణము
లాదియోర్చుకొనుచుండయ్యా ॥శ్రీ॥

*తో॥ సుఖదుఃఖంబులు వెన్నెలుమబ్బులు
సుఖ మెప్పుడు స్థిరమేమయ్యా
సుఖస్వరూపుండగు పరమాత్ముని
ఇక యెప్పుడు మరువకుమయ్యా ॥శ్రీ॥ రగ

శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ 46

తా॥ బావిమొదలగు జలాశయములందు పురుషుడు యెంత ప్రయోజనముపొందునో అంతట నిండియున్న మడుగునందును అంతే పొందును. అట్లే బ్రహ్మజ్ఞాననిష్ఠుడు వేదములందును మోక్షసాధనమాత్రమే పొందును.

తో॥ జలాశయంబుల పొందుఉదకమును
సంపూర్ణతటాకంబునను
జలమట్లు ప్రయోగింతురు ఆటులనె
బ్రాహ్మణుండు వేదంబులను ॥శ్రీ॥

*తే॥ అన్ని వస్తువుల ఆత్మజ్ఞానియు
చిన్న పెద్ద వస్తువులందుఁ
మన్ననపొందగను మహాత్ముడతడగు
వెన్నదొంగ నీ దయవలనఁ ॥శ్రీ॥ ౪౬

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి॥ 47

తా॥ (నిత్యనైమిత్తికాది) కర్మచేయుటకుమాత్రము నీకధికారముండును. ఫలములలో నీ కెప్పుడు అధికారముండదు. కొంచమయిన ఫలము పొందకోరి కర్మముచేయ ఎంచకు. మరియు కర్మలు చేయగాదని ఆగ్రహము పొందవద్దు.

తే॥ కర్మముచేయుగ నధికారంబగు
ఫలమునుకోరుటకును లేదు
కర్మఫలము ఏ మాత్రముకోరకు
కర్మలచేయును అనరాదు ॥శ్రీ॥

*తే॥ భగవంతునిచే పుట్టితి మనవలె
భగవంతుడెగతి యనవలయు
భగవంతుడె ఈ ప్రపంచమనవలె
భగవంతుని కోరగవలయు ॥శ్రీ॥ ౪౭

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

తా॥ ధనంజయ! ఆసక్తివిడచి కర్మసిద్ధఅయినను చింతలేదు. కర్మసిద్ధి కాకుండినను చింతలేదు. ఈరెండుఅంతే అని తెలసికొని యోగస్థుడవై కర్మ చేయుము. సిద్ధి అసిద్ధి ఈ రెండు ఒకటేఅని తెలుసుకొను సమభావనను యోగ మనిత్తురు. ఫలోద్దేశ్యములేక చేయుకర్మమునకే యోగమని నామకరణము.

తో॥ ధనంజయ వినుము యోగస్థుడవై
కర్మచేయుము హరిప్రీతిగను
సిద్ధ్యసిద్ధులలో సమచిత్తుడవై
యుండుటె యోగమనబడును ॥శ్రీ॥

*తో॥ రసనకు దాసులు కాకుండినచో
రాగము భోగముమీరుదురు
రసనము వశపరచువారలె త్యాగులు
యోగమార్గమును తెలియుదురు ॥శ్రీ॥ ౪౮

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49

తా॥ బుద్ధియొక్క సమత్వ యోగమునకంటె తక్కిన కోరికకర్మ చాలాహీనమయినది. అందువలన బుద్ధికి శరణాగతుడవు కమ్ము. ఫలమందు దృష్టియుంచి కర్మచేయువారు కృపణులు అనగ దీనులు. ధనంజయ! సమత్వ కర్మకు కామ్యకర్మ బహుదూరము.

తో॥ సమత్వబుద్ధికి నమస్కరింపుము
కామ్యకర్మ దూరముచేయుము
మమతనువిడచిన వారేయోగులు
లేనివారుదీనులు తెలియు ॥శ్రీ॥

*తో॥ రసనకు దాసుడు కాకుము రసనకు
రామనామమును తగిలించు
వ్యసనములన్నిటి వదలుము శ్రీ హరి
వాసుదేవయని ధ్యానించు ॥శ్రీ॥ ౪౯

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ 50

తా॥ (సమమయిన) బుద్ధితో కూడియినవాడు ఈ లోకములో పాప పుణ్యముల రెంటినుంచి లిప్తుడుకాకుండును. అందువల్లను యోగము యొక్క ఆశ్రయము చేసుకొనుము. కర్మలు చేయు జాణతనమునకు యోగమని బలికెదరు. ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వమగు బుద్ధియోగము నేర్పు చేత సాధించతగినది అని రామానుజభాష్యము. సంపూర్ణముగ దుష్కృతమును వదలుట అదియే కర్మములలో నేర్పును జ్ఞానోపాయమే యోగమని మధ్వభాష్యము.

తో॥ సమత్వబుద్ధిని పొందినధన్యుడు
పుణ్యపాపముల అలిప్తుడు
సమత్వబుద్ధిని నిలుపుయోగమున
కర్మయోగ కుశలముగనుడు ॥శ్రీ॥

తో॥ సమత్వబుద్ధిని బొందినధన్యుడు
పుణ్యపాపముల జోదోలు
క్రమముతో సమత్వబుద్ధిని పొందుము
కర్మయోగములో ఇదిమేలు ॥శ్రీ॥

*తో॥ సర్వకాలమును నిమగనువారికి
సుఖమెట్టిదో దుఃఖమెయేదో
సర్వేశ్వరనీయందు నామనసు
నిలుపు భాగ్యమివ్వగరాదా ॥శ్రీ॥ ౫౦

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ ॥ 51

తా॥ సమమయిన బుద్ధియోగముతో కూడిన పండితులు కర్మమువలన బుట్టిన ఫలమును విడచి జన్మబంధనమునకు లోబడక సర్వోపద్రవరహితమయిన పదమును పొందెదరు.

తో॥ బుద్ధియుక్తులగు జన్మసార్థకులు
కర్మఫలంబుల విడచియును

పుట్టుట యనియెడి బంధన విముక్తికై
పొందెద రవ్యయంబౌ పదంబును ॥శ్రీ॥

*తో॥ నాదుబుద్ధినీయందే నిలుకడగను
నాలోననుండి నినుస్మరించెదగా
నానాలుక నినుపలుకగచేయుము
నారదునివలె నినుస్తుతించెదగా ॥శ్రీ॥ ౫౧

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52

తా॥ (పరమాత్ముని అనుగ్రహము కావలసివుంటే జ్ఞానమవశ్యము. జ్ఞానప్రాప్తికి నిశ్చలబుద్ధి అక్కర. నిశ్చలబుద్ధి కావలసినయెడల వైరాగ్యము ముఖ్యము కావలయు. వైరాగ్యప్రాప్తికి మోహకలిలము అడ్డము. ఈ కలిలము పోవుటకు శ్రవణము కావలయును) కావున నీ బుద్ధి మోహకలిలము దాటి నట్లయితే ముందువిన్నది ఇంక వినవలసినది మాగినది. వైరాగ్యముకలిగిన నిశ్చలబుద్ధికి కారణమగును.

తో॥ ఎవ్వరి బుద్ధియు మోహపు కలిలము
లేక శుద్ధముగ నిలచినది
ఆవీరుడు వైరాగ్యమొందియును
వినునది విన్నది గడచినది ॥శ్రీ॥

*తో॥ అంతరింద్రియములకధీశ్వరుండగు
ఆత్మారాముని అనుగ్రహం
అందినవారల భాగ్యమె భాగ్యము
అట్టివారి స్నేహితము హితం ॥శ్రీ॥ ౫౨

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ 53

తా॥ (ఈ అధ్యాయము 42 శ్లోకమున చెప్పబడిన) వేదములయొక్క వాక్యములనుండి విభ్రమముపొందిన నీబుద్ధి ఎప్పుడు సమాధివృత్తిలో నిశ్చలముగ నిలువబడునో అపుడు సమబుద్ధిరూపమైన యోగము నీకు సంప్రాప్తమగును.

తో॥ వేదంబున కర్మకాండ ఫలితము
విని భ్రమచెందిన బుద్ధియును
సదమల జ్ఞానముచే నిశ్చలముగ
నిలచిన ఆత్మపదం బొందున్ ॥శ్రీ॥

తో॥ వేదములో బల్కిన వాక్యంబులు
వినితమాత్రమౌవదు బుద్ధియును
సదమల జ్ఞానముచే విషయంబులె
వదలిన యాత్మపదంబొందున్ ॥శ్రీ॥

*తో॥ పురుషోత్తమ నిను భావమూర్తిగను
బడసియు భక్తుండై నీచే
పరమార్థంబగు బుద్ధియోగమును
పార్థుడు పొందియు నినుగాంచె ॥శ్రీ॥ ౫3

అర్జున ఉవాచ:—

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ 54

తా॥ అర్జునుడు ప్రశ్నచేయుచున్నాడు. హే కేశవ! సమాధిస్థితుడైన స్థితప్రజ్ఞుడని యెవరిని చెప్పవలయును? ఆ స్థితప్రజ్ఞుడు మాట్లాడుట ఎట్లు? ఎట్లుకూర్చుండును? ఆయన నడత ఎట్టిది? చెప్పుము.

తో॥ స్థితప్రజ్ఞు భాషణమెట్టిదియా
సమాధి కేశవ యెట్టిదియా
స్థితప్రజ్ఞుడును ఏ విధిబలుకునో
ఎట్లుండెట్లు చరించునయా ॥శ్రీ॥

*తో॥ స్థిరబుద్ధియే స్థిరమునకును హేతువు
స్థిరబుద్ధికి స్థిరముగను విను
స్థిరా ఆహారము స్థిరుడగు ఆత్మను
స్థిరముగనమ్ముట స్థిరమగును ॥శ్రీ॥ ౫౪

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ ప్రజహాతి యదా కామా న్సర్వాన్పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ 55

తా॥ భగవంతుని వాక్యములు. పార్థ! (మనుష్యుడు) మనోగతములైన అన్ని కామములను (వాసనలను) విడచి 'ఆత్మన్యేవాత్మనా తుష్టః' (అనగ) తనలోనె తాను తృప్తుడయినయెడల అతనిని స్థితప్రజ్ఞుడని పిలిచెదరు.

తో॥ మనసున గలిగెడి సర్వకామములు
సంపూర్ణముగను విడచియును
తనయందే తానంతసిల్లుటయె
స్థితప్రజ్ఞుడని యనబడును ॥శ్రీ॥

*తో॥ సచ్చిదానందమగు పరమాత్ముడు
నిత్యుడు పరిపూర్ణుండునగు
పంచభూతముల కతీతుడగుతన
ఆత్మనుగను టానందమగు ॥శ్రీ॥ ౫౫

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధ స్థితధీర్మునిరుచ్యతే ॥ 56

తా॥ దుఃఖమువచ్చిన మనసులో వ్యసనమును నిలుపుకొనకయు, సుఖమయిన దానిలో ఆసక్తిలేకయు, అనురాగము భయము క్రోధములను విడచిన స్థిరబుద్ధిగలవాడు ముని అని అనిపించుకొనును.

తో॥ దుఃఖమువచ్చిన మనసు చలించదో
సుఖమబ్బిన యాశయులేదో
రాగము భయమును ఆశయులేదో
యాముని స్థిరబుద్ధ్యనరాదో ॥శ్రీ॥

*తో॥ దుఃఖము వచ్చిన కృశించి చావక
సుఖమబ్బిన ఉబ్బియు పడక
దుఃఖము సుఖంబు పూర్వకృతంబిక
యేమగు నను ముని చింతిలక ॥శ్రీ॥ ౫౬

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

తా॥ ఎవడు అన్నిటియందు నిస్సంగుడై యథాప్రాప్త శుభాశుభముల నుండి గలుగు ఆనంద దుఃఖములను తలంచక యుండునో వానిబుద్ధి నిశ్చలమని తాత్పర్యము.

తో॥ యెవనికి ఏమిట నాశయు లేదో
శుభాశుభంబుల తలచకను
అవమానము మానంబుల నెంచడో
ఆతనిప్రజ్ఞయె స్థిరమగును

*తో॥ ఆత్మకన్న వేరేమియు తలచక
అంతట ఆత్మయె గలడనుచు
ఆత్మచింతగల ఆత్మజ్ఞానికి
అంతయు ఆత్మగ గనుపించు ॥శ్రీ॥ ౫౭

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

తా॥ తాబేలు నాలుగు ప్రక్కలను తన అవయవములను ఏరీతిగ ఇమడించుకొనునో అట్లే పురుషుడు ఇంద్రియ విషయములనుండి తన ఇంద్రియములను ఎపుడు వశపరచుకొనునో అపుడు ఆతని బుద్ధి నిశ్చలమని చెప్పబడును.

తో॥ ఈవిధమున యువయువములు
జాగ్రత లోపల చేద్పుకొను
తన ఇంద్రియముల సర్వవిషయములు
మరల్చు ప్రజ్ఞావంతుడుమా ॥శ్రీ॥

*తో॥ మాచినదంతయు శ్రీవిష్ణువెయని
శ్రవణము శ్రీహరి కథయనియు
చవిచూచినదియు నామామృతమని
మననము మాధవుడనుమురియు ॥శ్రీ॥ ౫౮

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 59

తా॥ దేహికి ఆహారములచే విడచిన విషయములు మాత్రము నివర్తిల్లును. కోరికలు నివర్తిల్లదు. పరమార్థజ్ఞానము కలిగినట్లయితే కోరికలుకూడా నివర్తిల్లును. సంపూర్ణజ్ఞానికి రాగము పోవును గాని ఇతరులకు సాధ్యపడదు.

తో॥ నిరాహారునకు విషయములణగును
కోరికమాత్రము విడవదుగా
పరమార్థము చక్కగ తెలసినయెడ
కోరికలంతయు నశించుగా ॥శ్రీ॥

*తో॥ అంతటికిని ఆధారుడు రాముడు
ఆరాముని జ్ఞానము వరకు
అంతయు సుఖదుఃఖంబుల నిచ్చును
ఆనందమె రాముడుకడకు ॥శ్రీ॥ ౫౯

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ 60

తా॥ హే కౌంతేయ! వివేకి అయినవాడు ఆత్మజ్ఞానముకొరకు ఎంత పూనికతో నున్నను బలవంతమయిన యింద్రియములు వాని మనస్సును బలాత్కారముగ నాకర్షించును గదా.

తో॥ కుంతీతనయా వివేకియైనను
ప్రబలమయిన యా యింద్రియముల్
వంతువేసుకొని బలాత్కారమున
మనసును లాగును బలుమాఱు ॥శ్రీ॥

*తో॥ ఇంద్రియ లోలుఁడు తల్లిని తండ్రిని
తాతముత్తాతల గురువులను
ఇందిరారమణా కృష్ణనిన్నను
బుద్ధిని తలపడు నిర్దయను ॥శ్రీ॥ ౬౦

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61

తా॥ అందుకొఱకై ఆ ఇంద్రియములనన్నిటిని గ్రహించి ముక్తుడు మత్పరాయణుడు కావలెను. ఈరీతి ఇంద్రియములను వశము చేసుకొన్న బుద్ధియె స్థిరమయినదని చెప్పబడును.

తో॥ ఆ ఇంద్రియముల వశపరచుకొనుచు
వాసుదేవుఁడగు నాయందే
బాయని భక్తిని బుద్ధిని నిలపిన
ప్రజ్ఞాయుతుఁడగు ఇహమందే ॥శ్రీ॥

*తో॥ ఇంద్రియముల సాధించినవారలు
మాతాపితృ సుతభ్రాతృవుల
బంధువర్గముల బుధజనోత్తముల
సమభావన చూతురు మిగుల ॥శ్రీ॥ ౬౧

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥

తా॥ విషయముల చింతనచేయు పురుషునికి ఆ విషయములయందు ఆసక్తికలుగును. ఆ యాసక్తివలన కామము ఉత్పత్తియగును. ఆకామముచేత క్రోధము పుట్టును.

తో॥ విషయంబుల ధ్యానించుచుండినను
వానియందె సంగము గల్గు
విషయసంగమున కామము గల్గును
కామముచే క్రోధముగల్గు ॥శ్రీ॥

*తో॥ అన్ని విషయవస్తువులను రాముడె
అనిభావించిన ధన్యుడగుచు
అన్నతమ్ములను అఖిలప్రజలను
ఆత్మను గన తాసుఖపడును ॥శ్రీ॥ ౬౨

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ 63

తా॥ క్రోధమువలన సమ్మోహముపుట్టును. సమ్మోహమునుంచి స్మృతి విభ్రమమగును. స్మృతి విభ్రమమువలన బుద్ధి చెడును. బుద్ధిచెడినపుడు దానే నష్టమగును.

తో॥ క్రోధమువలనను మోహముగల్గును
మోహముచే స్మృతినశించును
స్మృతిభ్రంశముచె బుద్ధినాశమగు
నాశముచె పురుషుడు చెడును ॥శ్రీ॥

*తో॥ కామక్రోధాదుల చేర్చకహరి
నామభజన చేయుచు నున్న
ప్రేమగల్గు దాసులపై స్వామికి
నామభజన మరువకరన్న ॥శ్రీ॥ ౬౩

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ 64

తా॥ అయిన తనమనస్సును స్వాధీనము చేసుకొన్న మనుష్యుడు రాగద్వేషములు వదలి స్వాధీనములయిన ఇంద్రియములచేత (శాస్త్రోక్తము

లయిన) విషయములను అనుభవించిన ప్రసాదమును (చిత్తశుద్ధిని) పొందు మన్నాడు. స్వస్థత చెందును అని తాత్పర్యము.

తో॥ రాగద్వేషంబులు లేకుండెడి
భోగంబులు భోగించియును
యోగముచే ఇంద్రియముల మనసును
జయించి శాంతియు గనునతడు ॥శ్రీ॥

*తో॥ అంతహా బహిరింద్రియముల జయించు
అతనిభాగ్య మేమనవచ్చు
అంతహా హరినామమ్మును జపించు
అంతయు హరిమయమని యెంచు ॥శ్రీ॥ ౬౪

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65

తా॥ ఈ యోగికి హృదయము శుద్ధమగుచుండగ సర్వదుఃఖములకు హానికలుగుచున్నది. ఏలన ప్రసన్నమయిన మనస్సుగలవారికి శీఘ్రముగా నిశ్చయాత్మకమయిన బుద్ధి నిలుచును.

తో॥ ఎవ్వని చిత్తము శాంతిని బొందునో
సర్వదుఃఖములు బోవుగద.
ఆవీరుని బుద్ధియు నిశ్చలమై
ఆత్మాకారమై నిలుచుగద ॥శ్రీ॥

*తో॥ మందరగిరిధర మామనోహర
ఇందురాార సుందరరూపా
బృందారక వందితపాదారా
విందరాార అందము చూపా ॥శ్రీ॥ ౬౫

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతశ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్॥ 66

తా॥ అయుక్తుడనగ పైనవివరించిన ఇంద్రియ నిగ్రహము లేనివానికి స్థిరబుద్ధిగలుగదు. అతని భావన దృఢబుద్ధిగలుగవలయునను నిష్ఠయు లేదు. భావన లేనివానికి శాంతిలేదు. శాంతలేనివానికి సుఖమెక్కడిది?

తొ॥ చిత్తస్థైర్యము లేనివానికిని
బుద్ధియు ఏకాగ్రతగాదు
యుక్తమబుద్ధి నశించిన భావము
పోవును శాంతసుఖము లేదు ॥శ్రీ॥

*తొ॥ పరమేశ్వర నిను ప్రార్థించెదర
పాదములను బడిమ్రొక్కెదర
కరుణాసాగర కాపాడుమురా
స్థిరబుద్ధియు నాకొసగుమురా ॥శ్రీ॥ ౬౭

శ్లో॥ ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి॥ 67

తా॥ (విషయములందు) ఇంద్రియములు చరించుచుండిన ఏ మనసు పురుషుని చేత నియమింపబడక ఇంద్రియముల వెంట త్రిప్పబడునో (అపుడు) ఉదకమునందు ఓడను యెదురుగాలి వలె పురుషుని బుద్ధిని హరించుచూ విషయములందు బడవేయును.

తొ॥ ఇంద్రియములు విషయములం చేరిన
మనసువాని వెంబడిజనిన
ప్రజ్ఞయు విషయంబుల పడిపోవును
గాలిచె జలముల వాడవలెన్ ॥

*తొ॥ మనసునీదు పాదంబుల నుండగ
ఇంద్రియములు నీసేవకుగ
అనుగ్రహించుము నను నీవానిగ
మనవియువిను ఓ పాండురంగ ॥శ్రీ॥ ౬౮

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

తా॥ ఆకారణముచే ఓ మహాబాహో! తన ఇంద్రియముల విషయముల నుంచి ఎవడు ఇంద్రియములను అన్నివిధముల నిగ్రహించునో వానిబుద్ధి నిశ్చలమగునది. సమస్త విధముల నిగ్రహింపబడిన ఇంద్రియములు కలవాడే జ్ఞాని. అతనిప్రజ్ఞ ప్రతిష్ఠితమయినది.

తో॥ ఓ మహాబాహా విషయధ్యానము
విడిపించియు విష్ణువునందు
ఈమనస్సు చేర్చిన ఘనుండగును
బుద్ధియు నిలుచును నాయందు ॥శ్రీ॥

*తో॥ ఇంద్రియ జయులే పుణ్యపురుషులుగ
ఇంద్రవంద్యనే తలచెదను
ఇందిరారమణ నీసేవకు నా
ఇంద్రియముల వప్పించెదను ॥శ్రీ॥ ౬౮

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥

తా॥ సమస్త ప్రాణులకు రాత్రిగ వుండునది సంయమికి జాగ్రతగ నుండును. ప్రాణిమాత్రులు ఎచ్చరికగ వుండునది విచారవంతుడయిన మునికి ఆదేరాత్రిగ నుండును. సర్వభూతములకు రాత్రియగునది ఆత్మజ్ఞానము. జ్ఞానికి రాత్రి అగునది శబ్దాది విషయజ్ఞానము.

తో॥ సర్వప్రాణుల కప్రకాశమై
నదిజ్ఞానికి వెలుతురు నగును
సర్వప్రాణికి ప్రకాశమయినది
జ్ఞానికి వెలుతురు లేదువినుమ ॥శ్రీ॥

*తో॥ ఇంద్రియ సుఖములు అజ్ఞులకుప్రేమ
జ్ఞానికి నీయందేప్రేమ
ఇంద్రియజయులకు నీయందుప్రేమ
ఇతరులు నీయందప్రేమ ॥ ౬౯

శ్లో॥ ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ ॥ 70

తా॥ (యెపుడు) నిండుతూవుండిన చెలియలికట్ట మేర మీరని సముద్రమును నదీజలములు చేరునట్లు (శాంతినిపొందిన) ఏ పురుషుని సకలమయిన విషయములు చేరినను కొంచమయిన వికారములు పొందకవుండువాడే శాంతిని పొందును కాని కామాపేక్షగలవారు యెప్పటికిని శాంతిని పొందజాలరు.

తో॥ సర్వనదులు తనలోచేరినను
చేరకనిలచిన సముద్రము
గర్వపడుట తగ్గుటయును లేదో
అటుజ్ఞానియు తలపడు కామమ్ ॥శ్రీ॥

*తో॥ సర్వేంద్రియముల జయించు పుణ్యుడు
శాంతిపొందు సుఖమును పొందు
సర్వేంద్రియములకును లోబడియెడి
కామికి శాంతిసుఖములేదు ॥శ్రీ॥ ౭౦

శ్లో॥ విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకార స్స శాన్తిమధిగచ్ఛతి ॥ 71

తా॥ ఏ పురుషుడు సమస్తకామములనువిడచి దేనియందును నిస్పృహుడై అనగ ఆశలేనివాడై మమకారమును అహంకారమును విడచి నడచునో అతడు శాంతినిపొందును.

తో॥ యెవ్వడుసమస్త కామములువిడచి
నిస్పృహుడై చరియించుచును
అహంకార మమకారములు లేని
యాతడు శాంతియు బొందువిను ॥శ్రీ॥

*తో॥ సర్వకాలమును మనసు ఆత్మపై
చక్కగనిలపిన ఆతనికి
సర్వమునందును నిస్పృహాత్ముడై
సర్వాత్ముని గను నెప్పటికి ॥శ్రీ॥ ౭౧

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72

తా॥ పార్థ! ఇదే బ్రాహ్మీస్థితి. ఇది పొందినవానికి మోహమువుండదు. అంతకాలమునందునూ ఈ స్థితిలోనున్నవాడు బ్రహ్మనిర్వాణము పొందును.

తో॥ ఇదియే బ్రాహ్మీస్థితి పార్థావిను
ఈ స్థితిపొందిన మరలడుగా
అంతకాలమున ఈ స్థితిపొందిన
బ్రహ్మానందము నొందునుగా ॥శ్రీ॥

*తో॥ బ్రహ్మానందము పరమ సుఖంబగు
పరమపావనం బైనదియు
బ్రహ్మానందము నొందిన వారలు
మోహము బొందరు వినవలయు ॥శ్రీ॥ ౭౨

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే
సాంఖ్యయోగోనామ ద్వితీయోఽధ్యాయః.
ఓమ్ తత్ సత్



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతాసంగీతము

## తృతీయాధ్యాయము — కర్మయోగము.

పల్లవి॥ శ్రీరామజయ శ్రీరామజయ
శ్రీరామజయ శ్రీరామ
శ్రీరామజయ శ్రీరామజయ
శ్రీరామజయ శ్రీరామ ॥

తో॥ గృహస్థుడెప్పుడు గీతాగ్రంథము
గృహములో కృష్ణుని గుడిలోన
గృహము పవిత్రము గలుగగనుంచియు
గీతను పూజించు బిరాన ॥శ్రీ॥

తో॥ జగచ్చక్రమున నుండుటకొరకై
కర్మఫలంబుల గోరకను
జగచ్చక్ర కర్మంబులు శ్రద్ధతో
చేయుము పవిత్ర బుద్ధిగను ॥శ్రీ॥

*తో॥ సూర్యుడాదిగను సూరులందరును
స్వధర్మంబులును సల్పగను
ఆర్యుల మతమును ఆదరించవలె
వారివారి కార్యంబులును ॥శ్రీ॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ 1

తా॥ జనార్దన! కర్మమునకంటె జ్ఞానమే శ్రేష్ఠమని నీ అభిప్రాయమైన యెడల నన్ను భయంకరమయిన కర్మము చేయుమని యేల ప్రేరేపించు చున్నావు కేశవ?

తో॥ జనార్దన ప్రభో కర్మము కన్నను
జ్ఞానము యుత్తమ మనినీకు
మనసున తోచిన ఘోరతరంబగు
కర్మమేల తెలిపెదు నాకు ॥శ్రీ॥

*తో॥ కేశవ నినునే ప్రార్థనచేసెద
కేశినిషూదన శ్రీ కృష్ణ
క్లేశము బాపుము వాసవనుతనీ
కేశరణంటిని శ్రీ కృష్ణ ॥శ్రీ॥ ౧

శ్లో॥ వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥

తా॥ సందేహాత్మకమయిన మాటలచే నన్ను మోసముచేయువానివలె తోచుచున్నది. నాకు శ్రేయోదాయకమయిన ఒకే నిశ్చితమయిన వాక్యమును తెల్పుము.

తో॥ కేశవ సంకీర్ణపు మాటలచే
నంతః కరణము జెరిచెదవు
నాశ్రేయస్సుకు తగిన నిశ్చయము
నొకటిదెల్పు పరమాప్తుడవు ॥శ్రీ॥

*తో॥ నందకిశోరా నవనితచోరా
సందేహపు పలుకులుయాలా

వందనమిదిగో మందర గిరిధర

సుందరాకార గోపాలా ॥శ్రీ॥ ౨

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ లోకేఽస్మిన్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ।

జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥

తా॥ భగవంతుడిట్లనె. అనఘ! సాంఖ్యులకు జ్ఞానయోగము యోగులకు కర్మయోగము నను రెండు ముక్తిమార్గములు పూర్వమే నాచే చెప్పబడినవి.

తో॥ లోకంబుననే రెండు నిష్ఠలను

పూర్వము తెలిపితి లోకులకు

సాంఖ్యులకును విను జ్ఞానయోగమును

కర్మయోగమును యోగులకు ॥శ్రీ॥

*తో॥ జ్ఞానయోగమును కర్మయోగమును

ఇవిటిభేదముల వినుమనఘ

జ్ఞానకర్మ యోగులు ఇద్దరును

చేరుట నాయందే వినగ ॥శ్రీ॥ 3

శ్లో॥ న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।

న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4

తా॥ కర్మముల విడచితేనే పురుషుడు. నైష్కర్మ్యము పొందడు. మరియు కర్మల సన్యాసమాత్రముచేతనే జ్ఞానయోగనిష్ఠ అనగ సిద్ధి పొందడుగదా.

తో॥ కర్మములను ఆరంభింపమి

సన్యాసిని నేననరాదు

ఆరంభించిన కర్మవిడచినను

జ్ఞాననిష్ఠ వశేమునుగాదు ॥శ్రీ॥

*తో॥ యమనియమాదులు యెనిమిది విధములు
యెవడు భక్తితో సాధించు
యమలోకంబును జయించువాడగు
యోగము ఇది అని గమనించు ॥శ్రీ॥ ౪

శ్లో॥ న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5

తా॥ ఏలన యెవడుకానీ కర్మచేయక ఒకక్షణమైన యుండడు. సర్వులును ప్రకృతిసంబంధమైన గుణముల మూలకముగ కర్మచేయుచునే యుందురు.

తో॥ ఒక క్షణమైనను యెవ్వడైన వినుము
కర్మముచేయక నుండడుగా
ప్రకృతి జన్యమా గుణముల వలనను
ప్రాణులు కర్మలు జేతురుగా ॥శ్రీ॥

*తో॥ వినుము యమనియమ ప్రాణాయామము
ప్రత్యాహారం బనియు గను
ధ్యాన ధారణము మననము సమాధు
లనెదరు యష్టాంగంబులుగన్ ॥శ్రీ॥ ౫

శ్లో॥ కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥

తా॥ (హస్తపాదములు మొదలయిన) కర్మేంద్రియముల నిగ్రహించి మనస్సులో ఇంద్రియ విషయముల చింతనచేయుచున్న మూఢుడు మిథ్యాచారి అని పిలువబడును.

తో॥ కర్మేంద్రియముల నెవడు నిలపియును
ఇంద్రియములు కోరెడి విషయా
ములను కోరుచును మనసున వ్యథపడు
యాతడు మిథ్యాచారు డయ్య ॥శ్రీ॥

యమమనగ దశవిధములు.

*తో॥ సత్యము దయ క్షమ ధృతి మితంబునగు
ఆహారము ఆర్జవంబును
బ్రహ్మచర్య ఆస్తేయ మహింసయు
శౌచము అని పదివిధము లగుట ॥శ్రీ॥ ౬

శ్లో॥ యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే॥ 7

తా॥ అర్జున! ఎవడు మనస్సుచేత ఇంద్రియముల నిగ్రహించి కర్మేంద్రియములనుంచి కర్మయోగమును ఫలకాంక్షలేక ఆరంభించునో వాడే ఉత్తముడనబడును.

తో॥ తన మనసుచె ఇంద్రియముల నిలపియు
శాస్త్రవిహిత కర్మంబులును
అనుష్ఠించునో ఈశ్వరప్రీతిగ
అర్జున ఆతడు అధికుడను ॥శ్రీ॥

నియమము పదివిధములు.

*తో॥ తత్వము సంతోషము ఆస్తికత్వమును
దానము భగవంతుని పూజ
ఉపనిషదర్థ శ్రవణము లజ్జయు
మతిజపము వ్రతము మహాతేజ ॥శ్రీ॥ ౭

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥ 8

తా॥ నియతమయిన కర్మము నీవుచేయుము. ఏలనగ కర్మచేయకుండుటకంటె చేయుటమేలు. కాకను కర్మచేయనట్లయితే నీ శరీరయాత్ర నడచుట కష్టము.

తే॥ నియమితమగు కర్మము విడువకుము
విడుచుటకును మేల్ చేయుటయు
చేయక కర్మము నిలపిన శరీర
యాత్రయు జరుగదు వినవలయు ॥శ్రీ॥

ప్రాణాయామము.

*తే॥ నాసికాద్వారముల సంచరించు
వాయువు మంత్రంబున చేర్చి
హంస మంత్రమును మనశ్శాంతిగను
జపించుటయె వాయువుపీల్చి ॥శ్రీ॥ 5

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌన్తేయ ! ముక్తసంగస్సమాచర ॥ 9

తా॥ 'యజ్ఞోవై విష్ణుః' భగవత్ప్రీతిగ చేయబడు కర్మమేలు. ఇతరమైన కర్మ లోకమున బంధమును కలిగించును. అందువల్ల కౌంతేయ ! భగవత్ప్రీతిగ కర్మలను ముక్తసంగుడై ఆచరింపుము.

తే॥ యజ్ఞార్థంబుగ కర్మను చేయుము
పార్థా బంధము లేదు విను
అజ్ఞానుండై తనకై చేసిన
బంధకమగు విను తప్పకను ॥శ్రీ॥

ప్రత్యాహారము.

*తే॥ ప్రత్యాహారం బనగను పేర్మితో
ఇంద్రియములు విషయంబులను
ప్రవర్తించు చుండంగను నవిటిని
మరల్చుటయె యుత్తమమగును ॥శ్రీ॥ 6

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్ ॥ 10

తా॥ పూర్వము బ్రహ్మదేవుడు యజ్ఞములతో గూడ ప్రజాసృష్టి చేసి (వారికి) ఇట్లనెను. మీరు ఈ యజ్ఞముచేత వృద్ధిబొందుడు. ఇదేమీకు కామధేనువు మాదిరి ఇష్టార్థములు ఇచ్చుగాక.

తో॥ సృష్ట్యాదిని మును బ్రహ్మదేవుడును
ప్రజలను యజ్ఞములును గూడ
సృజించియనె యజ్ఞమునను ష్ఠించి
వృద్ధిగనుడు ఫలములతోడ ॥శ్రీ॥

ధ్యానము.

*తో॥ చంచలమేమాత్రంబును లేకను
శ్రీ హరియందే మనసుంచి
చింతనచేయుట సంతోషించుట
ధ్యానంబనెదరు నిర్ణించి ॥శ్రీ॥ ౧౦

శ్లో॥ దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః ।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥ 11

తా॥ ఈ రీతిగ యజ్ఞములచే దేవతలను సంతోషపరచండి. ఆ దేవతలు మిమ్ములను సంతోషపరచని. ఈ రీతిగ పరస్పరము సంతోషపరచుకొనుచు పరమశ్రేయస్సును పొందండి.

తో॥ యజ్ఞంబున ఇంద్రాదుల తృప్తిని
నొందించిన మిమ్మును వారు
వర్షాదుల తృప్తిని బొందింతురు
పరస్పరము సుఖమొందెదరు ॥శ్రీ॥

ధారణ యనగ.

*తో॥ ధారణ యనగను భగవదేతరము
తలచకయుండుట ధారణము
శ్రీ రమణుడె అన్నిటి కాధారము
అని పంతసించు నిరంతరము ॥శ్రీ॥ ౧౧

శ్లో॥ ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥

తా॥ యజ్ఞములచే సంతుష్టులయిన దేవతలు మీకు ఇష్టమయిన భోగములను ఇచ్చెదరు. వారు ఇచ్చినది మరలవారికి ఇవ్వక తానే ఎవడు అనుభవించునో వాడు దొంగకాని వేరుకాడు.

తో॥ ఇష్టమయిన భోగములు దేవతలు
మీ కివ్వగ వారికే మరలక
నష్టమనుచు నెవ్వడు తానివ్వడో
చోరుడుగా కింకేమగును ॥శ్రీ॥

మననము.

*తో॥ మననం బనగను రామనామమును
అనుదినమును తాజపియించు
మనమోహన సుందర రాఘవనా
మనవి వినుమనుచు మనసుంచు ॥శ్రీ॥ ౧౨

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥ 13

తా॥ దేవయజ్ఞాదులనుచేసి మిగిలిన యన్నమును భుజించు సత్పురుషులు సర్వపాపములనుండి విడువబడుదురు. ఎవరు తమకొరకే వండుకొనెదరో ఆ పాపులు పాపమునే భుజింతురు.

తో॥ దేవతార్చనలు చేసిన పిమ్మట
శేషాన్నము భుజియించినవారు
సర్వపాపముల నొందరు తమకై
చేసిన పాపము భుజింతురు ॥శ్రీ॥

సమాధి.

*తో॥ సమాధి యనగను సర్వేశ్వరునిలో
తమబుద్ధిని చేర్చుట యగును

రమాధిప శ్రీ రంగనాథనా
బుద్ధిని నీకిచ్చెద ననుమా ॥శ్రీ॥ ౧3

శ్లో॥ అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ 14

తా॥ ప్రాణిసమూహము అన్నమువల్లను పుట్టును. అన్నము వర్షమువల్లను గలుగును. వర్షము యజ్ఞమువల్లను గల్గును. యజ్ఞము కర్మము వల్లను గల్గును.

తో॥ అన్నముచే భూతములు పుట్టుమరి
అన్నము పర్జన్యుని చేతగా
యజ్ఞముచే వరుషము గలుగునుమరి
యజ్ఞము కర్మాచరణముచేతగా ॥శ్రీ॥

*తో॥ సమస్త భూతంబులును బ్రహ్మమగు
సమస్త ఓషధులును బ్రహ్మం
సమస్త నదులును బ్రహ్మంబునగును
సమస్త యజ్ఞంబులు బ్రహ్మం ॥శ్రీ॥ ౧౪

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ 15

తా॥ కర్మము బ్రహ్మనుండి పుట్టినది అని తెలియుము. బ్రహ్మ అక్షరమునుండి అనగ పరమాత్మనుండి వెడలును. సర్వాంతర్గతమయిన బ్రహ్మము యజ్ఞములో నిత్యము ప్రతిష్ఠితమయినది.

తో॥ కర్మము బ్రహ్మమునుండి కలిగినది
బ్రహ్మము అక్షర సముద్భవము
యజ్ఞములో నెప్పుడు ప్రతిష్ఠితము
సర్వాంతర్గత మగు బ్రహ్మమ్ ॥శ్రీ॥

*తో॥ సమస్తకర్మలు బ్రహ్మంబునగును
త్రిమూర్తులును బ్రహ్మమెయగును

సమస్తమునకును పరబ్రహ్మగతి
సమముగ చూడుము సర్వమును ॥శ్రీ॥ ౧౫

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి॥ 16

తా॥ పార్థ! ఇట్లు ప్రవర్తనచేయబడిన చక్రమును నడిపించుటకు ఈ లోకములో ఎవడు అనువర్తింపడో అతడు పాపమయమయిన ఆయువుగలవాడయి ఇంద్రియవిషయములలోబడి వ్యర్థముగ జీవించును.

తో॥ ఈ రీతి ప్రవర్తించు చక్రమును
ఇహమున నడుపని అతనిది
వ్యర్థజీవనము ఆయువు పాపము
విషయభోగముల చిక్కినది ॥శ్రీ॥

*తో॥ ఇంద్రియారాము డెరుగడు రాముని
జితేంద్రియుడు రాముని దెలియున్
ఇందిరారమణ హరినారాయణ
అనికర్మలు భక్తిగచేయుమా ॥శ్రీ॥ ౧౬

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే॥ 17

తా॥ ఎవడు ఆత్మచేతనే సంతోషించునో ఆత్మచేతనే తృప్తుడై యుండునో ఆత్మచేతనే ఆనందమును బొందునో అట్టివానికి చేయదగిన కర్మ యేదియులేదు.

తో॥ ఆత్మయందెరతి ఎవనికి గలుగునో
ఆత్మయందె తృప్తుండగును
ఆత్మలోన సంతోషము బొందునో
అతనికి కార్యము లేనిదగుమా ॥శ్రీ॥

*తో॥ గోవర్ధన ధరగోపికా రమణా
గోపాలక పాలకకృష్ణ
గోవిందహరే గోపాలహరే
గోబ్రాహ్మణ పాలకకృష్ణ ॥శ్రీ॥ ౧౭

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥ 18

తా॥ అట్టివాడు ఇహలోకములో (ఒకానొక) కార్యము చేసినను అనర్థము లేదు. చేయకుండిన హానిలేదు. అతనికి సమస్తభూతములయందును యే ప్రయోజనము కానరాదు.

తో॥ ఆత్మరతుండగు బ్రహ్మవిదునకును
కర్మముచేయుట విడుచుటచే
ఆతనికి యనర్థమేమియు తోచదు
సుఖములేదు భూతంబులచే ॥శ్రీ॥

*తో॥ ఆత్మారాముని కర్తవ్యమేమి
అవనిలో కావలసినదేమి
అన్నిభూతముల ఆశ్రయమేమి
ఆతడు చూడగ నిష్కామి ॥శ్రీ॥ ౧౮

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః॥ 19

తా॥ ఆ కారణమువలన కోరికలేక కర్తవ్యకర్మము ఎపుడు ఆచరించుము. ఆసక్తివిడచి కర్మచేసిన పురుషుడు పరమగతిని పొందుచున్నాడు.

తో॥ కర్మఫలాశయు విడచియు నెప్పుడు
కర్తవ్యపు కర్మముచేయు
కర్మమనాసక్తిని చేసినతడు
పరమోత్కృష్టపుగతి బడయు ॥శ్రీ॥

*తో॥ నీరజలోచన నిర్మలాకార
నిఖిలాధార శ్రీకృష్ణ
నిరుపమాన కల్యాణగుణనిలయ
నిన్నేనమ్మితి హరికృష్ణ ॥శ్రీ॥ ౧౯

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః।
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్కర్తుమర్హసి॥ 20

తా॥ కర్మచేతనే జనకాదులు సంసిద్ధిని పొందినారు. లోకులు సన్మార్గమును పొందుటకై నీవుచూచి నిష్కామకర్మ చేయుటయు మంచిది.

తో॥ కర్మాచరణచే జనకాదులు విను
సిద్ధినిపొందిరి యో పార్థ
ధర్మసంగ్రహము లోకసేవయగు
సత్కర్మము చేయుము పార్థ ॥శ్రీ॥

*తో॥ జనకుని భాగ్యమె భాగ్యము చూడగ
శ్రీకృష్ణుని వాక్కులనుండి
జనకుని ప్రశంస చేయగ పడియెను
సత్కర్మలు మరువద్దండి ॥శ్రీ॥ ౨౦

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ 21

తా॥ శ్రేష్ఠుడు ఎట్లెట్లు ఆచరించునో అట్లనే ఇతరప్రజలు ఆచరించెదరు. అతడు ప్రమాణమని అంగీకరించినదే లోకము అనుసరించుచుండును.

తో॥ ఉత్తముడగు వాడే యే కర్మము
యాచరించునో మేలనుచు
ఇతరులు దానినె మేలని చేతురు
ప్రమాణ వచనం బిదియనుచు ॥శ్రీ॥

*తో॥ పెద్దల సుద్దులె ప్రమాణంబులగు
పెద్దల నడతే నడతయగు
పెద్దల ఆచరణాచరించ నగు
పెద్ద అనగ సుజ్ఞానియగు ॥శ్రీ॥ ౨౧

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ 22

తా॥ పార్థ! నాకు మూడులోకములయందును కొంచమైన కర్తవ్యమేదియులేదు. అథవా అప్రాప్తమైనది వస్తువు ప్రాప్తిచేసికొనవలసినదిలేదు. అయినను కర్మచేయుచునే యున్నాను.

తో॥ మూడు లోకముల చేయవలసినది
పార్థా నాకేమియు లేదు
పొందగ వలసిన వస్తువులేదు
కర్మమాచరించుట కలదు ॥శ్రీ॥

*తో॥ గోవిందాయని కొనియాడిన యా
కోమలి ద్రౌపతి గావగనూ
కోకలు అక్షయముగ నిచ్చితివా
కోర్కెలెల్ల కొనసాగగనూ ॥శ్రీ॥ ౨౨

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥ 23

తా॥ పార్థ! కదాచిత్ అప్రమత్తుడనై నేను కర్మలో ప్రవర్తించక పోతినేని మనుష్యులు అన్నివిధములుగ నాయొక్క మార్గమును అనుసరించెదరు.

తో॥ ఏమారియు నే కర్మచేయకను
పార్థా నేనట్లుండగను
ఆమనుష్యులును నన్నివిధంబుల
నన్ననుసరించి నడతురను ॥శ్రీ॥

*తే॥ కుచేలుండు నిను కోరియు వచ్చిన
కుశలవార్తలచె దనిపియును
కుసుమనాభ నీ అష్టభార్యలతో
సత్కరించితివి పార్థ మునకు ॥ ౨౩

శ్లో॥ ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః॥ 24

తా॥ నేను కర్మను చేయనిపక్షమున ఈలోకములు నిర్మూలమై పోవును. సంకరముకూడా చేసినవాడగుదును. ఈ ప్రజలను చెరిచినవాడనగుదును.

తే॥ కర్మనుచేయకనే యుండినచో
ప్రజలందరు చెడిపోవుదురు
వర్ణసంకరము చేసినట్లగును
ప్రజలు నాశమును పొందుదురు ॥శ్రీ॥

*తే॥ సత్కర్మలు చేయకయుండినచో
దుష్కర్మలు తప్పక నగును
సత్కథలును శ్రవణము లేదగుచో
దుష్కథ లెప్పుడు వినబడును ॥శ్రీ॥ ౨౪

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ 25

తా॥ భారత ! అజ్ఞానులు ఫలాపేక్షకలవారలై ఎట్లు కర్మలుచేయుదురో అట్లు విద్వాంసుడు ఫలాపేక్షలేనివాడై లోకులకు సన్మార్గప్రవర్తన చూపుటకొరకై కర్మము చేయవలెను.

తే॥ కర్మఫలాపేక్షయుగల యజ్ఞులు
యెట్లు కర్మమును చేయుదురో
కర్మఫలము కోరక లోకులకై
జ్ఞానులు కర్మలు చేయుదురు ॥శ్రీ॥

శతో॥ సత్సహవాసము చేయకుండినచో
దుస్సహవాసము సిద్ధమగు
సద్గురువుల దర్శనమ్ము లేనిచో
దుష్టుల దర్శన మెపుడునగు ॥శ్రీ॥ ౨౫

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరన్ ॥ 26

తా॥ కర్మఫలాసక్తులయిన యజ్ఞానులకు జ్ఞాని బుద్ధిభేదమును గలిగించరాదు. ఇంకేమన దానుపూనికతో గర్మములను చేయుచు వారివలన గూడ గర్మములను జేయించవలెను.

తో॥ ఫలోద్దేశ్యమునుగల అజ్ఞులకును
బుద్ధికి భేదము తిద్దకను
మేలుగ జ్ఞానియు కర్మచేయుచును
వారిచె చేయించగ వలెను ॥శ్రీ॥

శతో॥ హరిపాదము తీర్థము త్రాగనిచో
ఆస్పతౌషధ పానమగు
హరిపద సుమనాఘ్రాణము గానిచో
అరిసంఘసేవ ప్రాప్తమగు ॥శ్రీ॥ ౨౬

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే ॥ 27

తా॥ ప్రకృతియొక్క స్వభావములగు గుణములచే సర్వప్రకారముల కర్మలు చేయబడుచుండగ అహంకారమునుంచి మూఢుడైనవాడు తానే కర్త అని తెలుసుకొనుచున్నాడు.

తో॥ సర్వవిధంబుల ప్రకృతి గుణంబులు
కర్మలుచేయుచు నుండగను
కర్తనేనను మూఢాత్ముండగు
అహంకారితా నెరుగకను ॥శ్రీ॥

*తో॥ మన్నుతినె ననుచు అన్నయు తల్లికి
నిన్నుచూపగను శ్రీకృష్ణ
వెన్నదొంగ మన్నేలతింటివన
అన్నియు చూపిన హరికృష్ణ ॥శ్రీ॥ ౨౭

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥ 28

తా॥ మహాబాహూ! యధార్థము తెలుసుకొన్నవాడు గుణకర్మములు రెండు తనకంటె వేరైనవని ఎరింగి గుణములు తమ కర్మవిషయ గుణములకు పోవుచున్నవని తెలుసుకొని వాటియందు అసక్తుడు కాకుండును.

తో॥ గుణకర్మ విభాగంబులు తెలసిన
తత్త్వజ్ఞానియు ధనంజయ
గుణములు గుణకర్మలకు పోవునని
ఆసక్తుడు కాకుండునయ్యా ॥శ్రీ॥

*తో॥ నోరుతెరచి తల్లికి లోకంబులు
నదులు వనంబులు పర్వతముల్
నేరుగ రేపల్లెయు మరిగోవుల
చూపించితివా గోపకుల ॥శ్రీ॥ ౨౮

శ్లో॥ ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥

తా॥ ప్రకృతిగుణములనుంచి బుద్ధిచెడినవారు గుణ గుణకర్మలయందు ఆసక్తులగుచున్నారు. ఇట్టి అపూర్ణజ్ఞానులగు మందమతులను పూర్ణజ్ఞానులు వారి కర్మఫలాసక్తిని మార్చరాదు.

తో॥ ప్రకృతి వికారంబులచే చిక్కిన
అజ్ఞానులు త్రిగుణంబులను
గుణకర్మంబుల తామని తలతురు
వారలమార్చడు జ్ఞానియును ॥శ్రీ॥

తత్త్వ॥ యశోదనిట్లు నందునిగనియును
యశోద కృష్ణుల గాంచియును
యశోద ఆశ్చర్యము చెందుచును
కిశోరతనయూడుని ప్రొమెక్క్ ॥శ్రీ॥ 29

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ 30॥

తా॥ అధ్యాత్మబుద్ధినుంచి సర్వకర్మలను నాకు సమర్పించి ఆశనువిడచి మమత్వమునువదలి సంతాపమునుమాని యుద్ధమును చేయుము.

తత్త్వ॥ శ్రీ హరిప్రీతిగ కర్మము చేయుచు
మమకారము శోకము విడచి
అహంకారమును చేరనివ్వకను
యుద్ధము చేయుము ననుదలచి ॥శ్రీ॥

తత్త్వ॥ అధ్యాత్మముచే నడచును సర్వము
అధ్యాత్మముచే ప్రపంచము
అధ్యాత్మము అన్నిటి కాధారము
అధ్యాత్మలో చేర్చుముమనము ॥శ్రీ॥ 30

శ్లో॥ యే మే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః॥ 31

తా॥ ఈ నామతము (అసూయలేక) శ్రద్ధకలిగి నిత్యము ఎవరు అనుసరించిచున్నుచుకొందురో వారు సర్వకర్మ బంధములనుండి విడువబడెదరు.

తత్త్వ॥ ఈ నామతమును అసూయ లేకను
నిత్యము శ్రద్ధతో నడచినచో
అనుమానము లేకను మానవులు
విముక్తులగుదురు కర్మలచే ॥శ్రీ॥

తత్త్వ॥ మానవజన్మము పొందిన వారలు
మానమున భగవంతుని మతము

అనుసంధానము చేయుచు కర్మలు
అనువర్తించిన సమ్మతము ॥శ్రీ॥ ౩౧

శ్లో॥ యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్విద్ధి నష్టానచేతసః ॥ ౩౨

తా॥ అయితే అవివేకులయి ఎవరు ఈ నామతమును ద్వేషించినవారై అనుసరింపరో వారలను బుద్ధిహీనులుగాను భ్రాంతిగా జ్ఞానహీనులుగాను చెడినవారినిగాను ఎఱుంగుము.

తే॥ ఈ నామతమును దూషణ చేయుచు
ననువర్తన చేయని యెడల
జ్ఞానహీనులే వారలు మూఢులు
యవివేకులు నశియింతురిల ॥శ్రీ॥

*తే॥ ఆశ్రమముల కన్నిటికిని గృహస్థ
ఆశ్రమంబు నుత్తమమితర
ఆశ్రమంబులకు ఆశ్రయ మయినది
ఆచరించవలె ధర్మమిల ॥శ్రీ॥ ౩౨

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ ౩౩

తా॥ జ్ఞానవంతుడయినను తనప్రకృతి ననుసరించి నాచరించును. ప్రాణిమాత్రులు తమతమ ప్రకృతియెట్లో అట్లనె నడచెదరు కావున నిగ్రహము ఏమి చేయగలదు?

తే॥ ప్రకృతి ననుసరించుచునే చేయును
జ్ఞానవంతు డయిననుగాని
ప్రకృతివెంట తిరుగును భూతంబుల్,
నిగ్రహమున నేమగుగాని ॥శ్రీ॥

*తే॥ నాలుగు వర్ణంబులకాధారుడ నారాయణ విను నమ్మితిగా
నాలుగాశ్రమంబులకును మూలమునాల్గవస్థలకు నీవేగా ॥శ్రీ॥

శ్లో॥ ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ॥ 34

తా॥ ప్రతీంద్రియముయొక్క విషయమునందు ఇష్టానిష్టములు కలిగియుండును కావున ఆ రాగద్వేషములకు వశము కాగూడదు. ఏలన పురుషునకు రాగద్వేషములు శత్రువులు.

తో॥ ఇంద్రియ విషయంబుల నన్నిటను
రాగద్వేషము లుండునయా
మందల వాటికి వశంబు కాకుము
విషయములే శత్రువులయ్యా ॥శ్రీ॥

*తో॥ అన్నమె మొదటను సుఖముగ తోచును
అధికాహారము కష్టమగు
అన్నమె ప్రాణాధారంబగు మరి
అన్నమె ప్రాణాంత్యంబు నగు ॥శ్రీ॥ 3౮

శ్లో॥ శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ 35

తా॥ చక్కగా ననుష్ఠింపబడిన పరధర్మముకన్నను గుణములేనిదయ్యును స్వధర్మమే మేలు. స్వధర్మానుష్ఠానకాలమున మరణమొదిగినను మేలు. పరధర్మము భయాస్పదము.

తో॥ శ్రేయస్సగు పరధర్మము కన్నను
శ్రీయుతంబు నగు స్వధర్మము
శ్రేష్ఠంబగును స్వధర్మపు చావును
పరధర్మంబు భయావహము ॥శ్రీ॥

*తో॥ స్వధర్మమున్న ఆపదలు గల్గినను
స్వధర్మమందే మనసుంచు
స్వధర్మంబు వదలకు మెప్పుడును
స్వధర్మంబు సుఖమనియెంచు ॥శ్రీ॥ 3౫

అర్జున ఉవాచ:—

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ ! బలాదివ నియోజితః ॥ 36

తా॥ అర్జునుడు అడుగుచున్నాడు. వార్ష్ణేయ ! వృష్ణిరాజకులములో పుట్టిన కృష్ణ ! పురుషుడు తన కిష్టములేకుండినను నిర్బంధముచే ప్రేరేపింపబడినట్లు పాపము చేయుచున్నాడే. ప్రేరేపించునది ఏది?

తో॥ వార్ష్ణేయ తనకు భ్రమ లేకుండిన
బలాత్కారముగ పాపమును
జేయును యెవ్వరి ప్రేరేపణ యది
దెలుపుము వినవలె సర్వమును ॥శ్రీ॥

*తో॥ శమదమాది సద్గుణ గణ భూషణా॰శరణాగత పాలనరామా
కమలనయన శ్రీజానకీ రమణా॰నమస్కరించెద రఘురామా॥శ్రీ॥

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ 37

తా॥ రజోగుణమువలన బుట్టినది కామము అనగ ఆశ తృప్తిపొందునది గాదు. ఈ కామమే క్రోధరూపముగ పరిణమించును. అధికమయిన భక్షణ గలది మిక్కిలి పాపస్వరూపమైనది. కావున ఈ కామమును శత్రువుగా భావించుము.

తో॥ రజోగుణంబున బుట్టిన కామము
క్రోధరూపమును బొందునది
చాలాతిండియు తృప్తి లేనిదియు
పాపిష్ఠిది వైరముగలది ॥శ్రీ॥

*తో॥ కామమనగ తృప్తియు నొందనిది॰కోరికలెప్పుడు కోరునది
కామమునకు తడచేసిన వారిని॰క్రోధమూపులును చూచునది॥శ్రీ॥

శ్లో॥ ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేదమావృతమ్॥ ౩౮

తా॥ పొగచేత అగ్ని ఎట్లు కప్పబడినదో మురికిచేత అద్దము ఎట్లు కప్పబడినదో మావిచేత శిశువు కప్పబడినట్లు (శత్రువైన) కామముచేత జ్ఞానము కప్పబడినది.

తో॥ ధూమము గప్పిన వహ్నియు వలె విను
మురికిచె నద్దము రీతిగను
మావిచె పిండము మూసినట్లుగను
గప్పెను కామము జ్ఞానమును ॥ శ్రీ ॥

*తో॥ కామమె తడచే క్రోధంబగు విను
కామమునకు లడలే దయినన్
కామమె లోభ గుణంబయి మారును
కామమె కావున శత్రువగున్ ॥ శ్రీ ॥ ౩౮

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ। 39

తా॥ కౌన్తేయ! నిండింప నశక్యమైనదియు తృప్తిచెందనిదియు ఇచ్ఛారూపమైనదియు, జ్ఞానికి నిత్యశత్రువైనదియు, అగు ఈ కామము జ్ఞానమును కప్పినది తృప్తిని బొందని అగ్నివలె.

తో॥ కుంతిసుత ఈ కామము జ్ఞానితో
నిత్యవైరమును జేయునది
పూర్తి చేయుటకు గానిది విషయ
వ్యామోహము గలిగించునది ॥ శ్రీ ॥

*తో॥ అగ్నిని తృప్తిని చేయ నసాధ్యము
అటుకామము తృప్తియు పడదు
అన్నికాలముల ఆశకు చిక్కిన
ఆతని కోరిక కడగాదు ॥ శ్రీ ॥ ౩౯

శ్లో॥ ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతై ర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥ 40

తా॥ ఇంద్రియములు మనస్సు బుద్ధి ఇవి ఆ శత్రువైన కామమునకు అధిష్ఠానము. వీనితోచేరి దేహియొక్క జ్ఞానమును నాచ్ఛాదించి మోసగించుచున్నది.

తో॥ ఇంద్రియములు మనసును బుద్ధియును
ఈ కామమునకు యాశ్రయము
ఇంద్రియాదులను నెక్కొని దేహిని
బాధించును చాలకాలము ॥శ్రీ॥

*తో॥ తృప్తిపడని కామంబును గైకొని
ఎప్పుడేల దుఃఖించెదవు
తృప్తిపడుచు సంతోషము బొందుము
అపుడే జీవన్ముక్తుడవు ॥శ్రీ॥ ౪౦

శ్లో॥ తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41

తా॥ భరతర్షభ! అందుచే నీవు మొదట ఇంద్రియముల నిగ్రహించి (అధ్యాత్మ) జ్ఞానమును (విశిష్టజ్ఞాన) విజ్ఞానమును నశింపచేయు ఈ పాపి కామమును సంహరించుము.

తో॥ భరతర్షభ ఇంద్రియముల బట్టియు
జ్ఞానానుష్ఠానంబులును
పాడుచేయు కామమును జయించుము
పరమ పాపి నామాటవిను ॥శ్రీ॥

*తో॥ కామమె క్రోధము కామమె లోభము
కామమె మోహము కల్పించు
కామమె మదమగు మత్సరంబునగు
కావున కామంబు జయించు ॥శ్రీ॥ ౪౧

శ్లో॥ ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః॥ 42

తా॥ ఇంద్రియములు స్థూలదేహములో శ్రేష్ఠము. ఇంద్రియములకన్నను మనస్సు శ్రేష్ఠము. మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠము. అట్టి బుద్ధికంటె ఎవడు శ్రేష్ఠుడో అతడే ఆత్మయని పెద్దలుచెప్పుదురు.

తో॥ ఇంద్రియములు మేలందురు వాటికి
మేలౌ మనస్సు దానికిని
బుద్ధియు శ్రేష్ఠము యంతకన్నవిను
ఉత్తమంబె పరమాత్మయని ॥శ్రీ॥

*తో॥ జ్ఞానులకరుణచె ఆత్మతత్వమును ♦ అనుగ్రహంబును పొందియును
మానవుడు పరమాత్మను పయనిగను ♦ దెలసియు ఆశను జయించును ॥శ్రీ॥

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

తా॥ మహాబాహూ! ఈ రీతిగ బుద్ధికి అతీతమయిన ఆత్మను తెలిసికొని ఆత్మనుంచి ఆత్మను స్థిరపరచుకొని నిగ్రహింపరాని కామమను శత్రువును చంపుము.

తో॥ బుద్ధిని ప్రేరేపించెడి ఆత్మను
సూక్ష్మబుద్ధిచే తెలిసికొను
శుద్ధమనసుచే మహాబాహువిను
వధింపు కామపు శత్రువును ॥శ్రీ॥

*తో॥ పరులను బలివేసితిమని పలికెదు ♦ పాపబుద్ధిగల పామరులు
అరియగు ఆశను జయించజాలరు ♦ హరినామము చెప్పకనరులు ॥శ్రీ॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
కర్మయోగోనామ తృతీయోఽధ్యాయః.
ఓమ్ తత్ సత్.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతాసంగీతము

## జ్ఞానయోగము — చతుర్థాధ్యాయము.



పల్లవి॥ వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ
వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ॥

తో॥ కృతయుగంబునను త్రేతాయుగమున
గీతార్థము చక్కగ నెరగి
కృతకృత్యు లగుచు గృహస్థు లుండిరి
కృష్ణార్పిత కర్మలమెలగి ॥వా॥

తో॥ సద్గృహస్థులగు సత్పురుషు లెపుడు
సత్కర్మంబులు సల్పియును
సద్గురువులచే యోగము నెరగియు
సర్వేశుని కర్పించదగు ॥వా॥

తో॥ కర్మల నిర్మల బుద్ధియు గలిగియు
జ్ఞానయోగమును పొందియును
సూర్యవంశమున పుట్టిన రాజులు
ధన్యులయిరి యోపార్థవిను ॥వా॥

భగవానువాచః—

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1

తా॥ అవ్యయమయిన ఈ యోగమును నేను సూర్యునికి తెలిపితిని. సూర్యుడు తన కుమారుడయిన వైవస్వతమనువుకు ఉపదేశించెను. ఆ మనువు (తన కుమారుడగు) ఇక్ష్వాకునకు ఉపదేశించెను.

తో॥ నాశము జెందని యోగవిద్యయును
సూర్యున కుపదేశించితిని
ఆ సూర్యుడు మనువుకును బల్కెను
అతడు కుమారునకు తెల్పెగా ॥వా॥

*తో॥ దినమణి వంశపు రాజులందరును
ధన్యులు గావున తనయులకు
జ్ఞానయోగమును నుపదేశించిరి
జన్మము ధన్యత జెందుటకు ॥వా॥ ౧

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥ 2

తా॥ ఈరీతిపరంపరనుండి ప్రాప్తమైన యోగమును రాజరుషులు కనుగొనిరి. పరంతప, అట్టియోగము ఈలోకంలో చాలాకాలము గడచినందున నష్టమైనది.

తో॥ రాజర్షులు ఈ యోగంబును మది
నెరగియు ధన్యత నొందగను
కాలము ధీర్ఘము కడచె పరంతప
కావున నష్టము చెందెనిను ॥వా॥

*తో॥ ధన్యంబయినందున ఇనవంశము
నందున ఆ పరమాత్మయును
ఘనశ్యామసుందర విగ్రహుడై
కౌసల్యకు తనయుండాయెగా ॥వా॥ ౨

శ్లో॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥ 3

తా॥ నీవు నాకు భక్తుడవయినందునను స్నేహితుడ వయినందునను మిక్కిలి రహస్యమయిన పురాతనమయిన యోగవిద్యను నీకు తెలిపినవాడనయితిని యదుత్తమము.

తో॥ రహస్యమగు ఈ కర్మయోగమును
తెలిపితి నీ యందలి ప్రేమా
మహాబాహువో భక్తుడసఖుడ
యుత్తమంబు దీనిని వినుమా ॥వా॥

*తో॥ దశరథనందన దానవమర్దన
ఆశించితి శ్రీ రఘురామా
ఆశాదుఃఖము అనుభవించితిని
ఘోరాశి చాలు కావుమురామ ॥వా॥ 3

అర్జున ఉవాచ:—

శ్లో॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ? 4

తా॥ సూర్యునిపుట్టుక పూర్వముకలిగినది. నీవు ఇపుడు కలిగినవాడవు. నీవు సూర్యునకు పూర్వము తెలిపితి ననునది ఎట్లు తెలియవలయును.

తో॥ నీ జన్మముగన ఇపుడు గలిగినది
పూర్వపుజన్మము సూర్యునిది
తేజస్వరూపునకు బోధించితి
నను వాక్యము నమ్మకమేది ॥వా॥

*తో॥ పూర్వ జన్మకృత కర్మంబులచే
పొందిన ఫలములె చాలనక
పృథ్విలోగల వస్తువు లెన్నియైన
కోరియు చెడితిని కావుమిక ॥వా॥ ४

శ్రీభగవానువాచ:—

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
బాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప॥ 5

తా॥ అర్జున! నాకు నీకు అనేకజన్మలయి పోయినవి. పరంతప! వాటి యొక్క సంగతిఅంతయు నేనెరుంగుదును. నీవు యెరుంగవు.

తో॥ నాకును నీకును అనేకజన్మలు
అర్జున కడచిన వన్నియును
నాకును తెలియును నీకును తెలియదు
పరంతప వినుము తెలిపెదను ॥వా॥

*తో॥ భూమిలో పుట్టితె ఏమి సార్థకము
కామము క్రోధము విడుమన్న
స్వామిని సేవించియును జన్మమును
సార్థకమును గావించన్న ॥వా॥ ౫

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥

తా॥ నేను జన్మరహితుడనై వికారరహితమయిన ఆత్మగలవాడై భూతములకు (సకలప్రాణులకు) స్వామినై వుండినను నా ప్రకృతి నవలంబించి నా మాయవల్ల పుట్టుచున్నాను.

తో॥ జన్మరహితుడను అవికారియునై
బ్రహ్మాదులకును ఈశ్వరుడక్
మన్మాయను నేవశము చేసుకొని
జన్మించినవా డనబడుదుక్ ॥వా॥

*తో॥ పశువులు మాదిరి తినుట నిద్రభయ
మైథునంబులును బొందుటచే
పశుపతిని మరచి మనుజుడు కడపట
ఫలమేమగుతా చచ్చుటచే ॥వా॥ ౬

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥

తా॥ భారత! ఎపుడెపుడు ధర్మమునకు హానికలుగునో అధర్మాభివృద్ధి పొందునో అపుడపుడు నేను వచ్చుచున్నాను. నా మాయచే నన్ను బుట్టించుకొనుచున్నాను.

తత్త్వ॥ ఏయేకాలంబున వేదోక్తపు
ధర్మంబులకును హానియును
అధర్మమునకును అభివృద్ధగునో
అప్పుడు జన్మము నొందెదను ॥వా॥

*తత్త్వ॥ పరధనాపహారణముచే పెంచిన
పాపి శరీరము పోగానే
నరకమునకు యమదూతలతో జని
తాపము బొందగ వలెతానె ॥వా॥ ౭

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ 8

తా॥ సత్పురుషుల పరిపాలనకు పాపిష్ఠుల నాశనమునకు ధర్మసంస్థాపన చేయుటకు యుగయుగములలో అవతరించుచున్నాను.

తత్త్వ॥ సాధుపోషణకు దుష్టశిక్షణకు
ధర్మము స్థాపించుటకును నే
యుగ యుగమందును జన్మము పొందుదు
పరంతప వినుము నిజముగనే ॥వా॥

*తత్త్వ॥ సద్గ్రంథంబులు చదువుచు సాధుల
సహవాసముతా సల్పుచును
సద్గృహస్థుడై దొరికిన దానికి
సంతోషించును సజ్జనుడుగ ॥వా॥ ౮

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున! ॥ 9

తా॥ అర్జున! ఈ రీతిగనుండు నాదివ్యమైన జన్మలును కర్మలును ఎవడు తత్త్వరీతిగ తెలియునో అతడు దేహావసానానంతరము పునర్జన్మను పొందడు. నన్నే పొందుచున్నాడు.

తో॥ దివ్యమయిన నా జన్మ కర్మలును
తాత్త్వికముగ నెవ్వడు తెలియు
దేహము విడచియు మరలను పుట్టడు
పొందునన్ను ఫల్గున తెలియు ॥వా॥

*తో॥ ఈశ్వరుడిచ్చిన ఐశ్వర్యమునకు
తృప్తియు బొందెడి వానిముఖమ్
ఈశ్వరుముఖంబు రీతిగనుండును
లేకుండినచో వాడుముఖమ్। మరివాడుముఖమ్గా

శ్లో॥ వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥ 10

తా॥ ప్రీతి భీతి క్రోధముల విడచినవారు నాయందే చింతనగలవారు నన్నాశ్రయించినవారు అయిన అనేకులు జ్ఞానతపస్సుచేత శుద్ధులై నా స్వరూపమును పొందిరి.

తో॥ భయరాగము క్రోధాదులు విడచియు
నాయందే చింతన గల్గి
నాయనుగ్రహమె కోరియు జ్ఞానులు
పొందిరి పరిశుద్ధత గలిగి ॥వా॥

*తో॥ తృప్తియు నొందిన పుణ్యపురుషునకు
యెప్పటికిని భయమును లేదు
తృప్తియునొందని కోటీశ్వరునకు
యెప్పటికిని భయమునుపోదు ॥వా॥ ౧౦

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥ 11

తా॥ యెవరెవరు యే యే రీతిగ నన్ను భజించెదరో ఆరీతిగనె నేను వారిని అనుగ్రహించెదను. పార్థ! కాన ఎల్లవారును నామార్గమునే అనుసరించెదరు. ఏ కోరికచే ఏ ఏ దేవతలను భజించెదరో వారి ఇష్టముల ఇచ్చువాడను నేనే.

తో॥ ఎవరేకోరిక కోరిన నిత్తును
వారికార్యముల గుర్తించి
కావున సర్వులు జ్ఞాన కర్మముల
అనువర్తింతురు ననునెంచి ॥వా॥

*తో॥ చాలదనుచునను భజియించినచో॥ చాల ఇచ్చు వాడనునేనే
చాలునను చు ననుభజియించినచో॥ చాల శాంతి ఇచ్చెదనేనే॥ వా॥

శ్లో॥ కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥ 12

తా॥ కర్మఫలము కోరునట్టి జనులు కర్మఫలము మనుష్యలోకములో బహుజాగ్రతగ ప్రాప్తమగుచున్నది గాన ఇహలోకములో దేవతల ఆరాధనము చేయుచుందురు.

తో॥ దేవతలను పూజించుచు ఫలములు
కోరుచు బడయుదు రెల్లపుడు
శీఘ్రము భూలోకంబున బడయుగ
ఇతరలోకమున గాదెపుడు ॥వా॥

*తో॥ భూలోకంబున పుణ్యఫలంబును
పొందుట బహుసులభంబనిరి
మీలో మీరలు ఆలోచించియు
శ్రీలోలుని కొలవుడు కోరి ॥వా॥ ౧౨

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13

తా॥ గుణములు కర్మలు వీటి భేదము ననుసరించి నాలుగు వర్ణములు నాచే సృష్టి అయినవి. కావున నేనువాటికి కర్తనైనను అవికారుడు గనుక నన్ను కర్తగానని తెలియుము.

తో॥ నాలుగు వర్ణంబుల సృజించితిని
గుణకర్మలను విభాగించి
వారలకును నే కర్తగ తోచిన
అకర్త మూడాలోచించి ॥వా॥

*తో॥ అవ్యయుడజుడగు అంతటికిని తా
ఆధారుండని అరయరయా
అవ్యయ సుఖంబు అందగవలసిన
ఆతని ఆశ్రయ మందరయా ॥వా॥ ౧౩

శ్లో॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14

తా॥ కర్మలు నన్నంటుకొనవు. కర్మఫలములు నాకు కోరికలేదు. ఈ జ్ఞానమునుంచి నన్ను తెలియువాడు కర్మనుంచి బద్ధుడుగాడు.

తో॥ కర్మలు నన్నేమియు బాధించవు
కర్మ ఫలము నాకును వలదు
నిర్మలు డీరీతిగ నన్నెరిగిన
కర్మచేత బద్ధుడుగాడు ॥వా॥

*తో॥ ఆత్మసనాతను డజుడవ్యయుడని
ఆతని తలచుచు కర్మలను
ఆత్మప్రీతిగ ఆచరించినదొ
ఆతనికంటవు కర్మలును ॥వా॥ ౧४

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥

తా॥ ఈరీతిగ (ఈ తత్త్వమును తెలిసికొని) గ్రహించి పూర్వకాలపు ముముక్షువులు కూడా కర్మలు చేసిరి. కావున పూర్వీకులు పురాతన కాలము నుంచి చేస్తూవచ్చిన కర్మను నీవు చేయుము.

తో॥ ముక్తినిపొందిరి ఇట్లని తెలసియు
పూర్వపు జ్ఞానులు కర్మలచే
యుక్తితో కర్మలు చేయుము పార్థ
అనాసక్తి యను యోగముచే ॥వా॥

*తో॥ పురాతనపు కాలంబునుండియును
పుణ్యకర్మములు పూనికతో
పూర్వపు జ్ఞానులు పూర్తిగ చేసిరి
పురుషోత్తమునకు నర్పణతో ॥వా॥ ౧౫

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

తా॥ కర్మయెట్టిది, అకర్మయెట్టిది అను నీ యంశములో బుద్ధిమంతులుకూడా భ్రమచెందిరి. ఎద్దానిని తెలిసికొనిన నీవు పాపమునుండి విడుదలవుదువో అట్టి కర్మమును నేను నీకు చక్కగ తెలియ చెప్పెదను.

తో॥ కర్మాకర్మము సంగతి తెలియక
మోహంబును చెందిరి కవులు
కావున దేనిని తెలిసిన ధన్యత
బొందెదరో తెల్పెద మిగుల ॥వా॥

*తో॥ కరుణాసింధుడు కృష్ణుడు పార్థుని♦కరుణించియు తానిట్లనును
కర్మయు ఏబుద్ధితో చేసినచో♦కర్మచే♦మోక్షము గనువిధముల్॥వా॥

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17

తా॥ కర్మ అనగ ఏమనునది, వికర్మ అనగ నేమనునది, అకర్మమన నేమనునది చక్కగ తెలియవలయును. కర్మగతి తెలియుటు గహనమయినది.

తో॥ శాస్త్రంబున చెప్పిన కర్మదియని
వికర్మమేమని తెలియుటయు
కర్మాభావము తెలియగవలయును
గహనము కర్మము తెలియుటయు ॥వా॥

*తో॥ దారసుతాదులు ధన ధాన్యంబులు
దండిగ నన్నియు నుండినను
ధరలో జ్ఞానము ధన్యంబనుచును
ధనంజయునకుఁ దగ దెల్పెఁ ॥వా॥ ౧౭

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥

తా॥ కర్మయందు అకర్మమును, అకర్మమునందు కర్మను శోధించి చూచువాడే అన్ని మనుష్యులలో బుద్ధిమంతుడు. అతడే యుక్తుడు. అతడే సమస్తకర్మలు చేసినవాడగును.

తో॥ చేయుట అంతయు లేదని తెలియుట
చేయక నుండుట చేసినటుల్
ఈ యుక్తియు తెలిసిన మానవుడే
సమస్త కర్మాచరణు డటుల్ ॥వా॥

*తో॥ ఆత్మసన్నిధిలో సమస్త కర్మలు
ప్రకృతియెలా చేయుచునుండు
ఆత్మ సహాయము గావున కర్మలు
అన్నియు తా చేసినటుండు ॥వా॥ ౧౮

శ్లో॥ యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః॥ 19

తా॥ ఎవనియొక్క కార్యారంభమునవె కర్మలు, కామసంకల్పములు లేనివో, యెవనియొక్క కర్మలు జ్ఞానమనె నిప్పుచే గాల్పబడినవో అట్టివాని పండితుడని బుధులు బల్కుదురు. పండ అనగ - సర్వత్రబ్రహ్మమాత్ర గ్రాహి అను అఖండవృత్తిగలవాడు - పండితాః.

తో॥ యెవ్వని ప్రారంభములౌ కర్మలు
కామపు సంకల్పము లేవో
జ్ఞానాగ్నిచె కర్మలు దగ్ధములో
పండితుడతడని బుధులనరో ॥వా॥

*తో॥ సర్వకాలమును హరినిస్మరించుచు
సర్వము శ్రీ హరియేయనుచు
సర్వజ్ఞుల పాదసేవ చేయుచు
సర్వము హరిదను తలంచుచు ॥వా॥ ౧౯

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః॥ 20

తా॥ కర్మఫలమందు ఆసక్తినివిడచి నిత్యతృప్తుడై నిరాశ్రయుడైన అతను కర్మచేయుటలో ప్రవృత్తి వుండినను ఆయన యేమి చేయనివాడే.

తో॥ కర్మఫలా సంగంబును విడచియు
ఆశ్రయము లేక తృప్తుండై
కర్మలునన్నియు చేయుచుండినను
కొంచమయిన చేయనివాడె ॥వా॥

*తో॥ కర్మలునీదే కాయమునీదె
కరణంబులు నీదే కృష్ణ
కర్మఫలము లింకెవరికి తండ్రీ
కర్తృ భోక్తృ నీవే కృష్ణ ॥వా॥ ౨౦

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21

తా॥ ఆశవువదలి, చిత్తస్వాధీనతగలిగి విడువబడిన సమస్తవస్తు స్వీకారముగలవాడై శరీరమునుండి చేయవలసిన కర్మలుచేయుచుండు అతనికి పాపములు అంటవు.

తో॥ ఆశలు విడచియు జితమానసుడై
పరిగ్రహము నంతయు విడచి
వాక్శరీర మానసముల నుంచియు
కర్మచేయు దోషము లణచి ॥వా॥

*తో॥ ఆశలు దీర్చగ వలసిన నీవే
ఆశించెద నిను శ్రీకృష్ణ
ఆసించెడి మనసును నీ దాపును
ఆసించగ చేయుము కృష్ణ ॥వా॥ ౨౧

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే ॥ 22

తా॥ యథేచ్ఛగవచ్చిన లాభమునకు సంతోషించుచు సుఖదుఃఖములను ద్వంద్వముల దాటినవాడగుచు మత్సరములేనివాడగుచు సిద్ధి అసిద్ధి అనురెంటిని సమముగ చూచువాడు కర్మలనుండి బద్ధుడుగాడు.

తో॥ అప్రార్థిత లాభమున తుష్టుడై
ద్వంద్వంబులకును లోబడక
మత్సరములేక సిద్ధిని యెంచక
కర్మచేయు బద్ధుడుగాక ॥వా॥

*తో॥ దేవకీతనయ యశోదనందన
వసుదేవాత్మజ శ్రీకృష్ణ
దేవదేవ నంద గోపనందన
దీనజనావన హరికృష్ణ ॥వా॥ ౨౨

శ్లో॥ గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ 23

తా॥ సంగరహితుడై సంసారబంధమునుండి ముక్తుడై జ్ఞానమందే బుద్ధి గలవాడై కేవలము యజ్ఞార్థముగ కర్మముచేయును. అతనికర్మ సమగ్రముగా లయమగుచున్నది.

తో॥ జ్ఞానమునందే మనసును నిలపిన
సంగరహితుడగు ముక్తుడును
యజ్ఞార్థంబుగ చేసిన కర్మయు
జన్మాకరమును గాదు విను ॥వా॥

*తో॥ లోకసేవకై చేసెడి కర్మము
లోకేశ్వరునకు నర్పితము
లోకఖ్యాతికి చేసెడి కర్మము
లోకములో జన్మాకరము ॥వా॥ ౨౩

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥ 24

తా॥యజ్ఞపాత్ర బ్రహ్మమే,హోమద్రవ్యము బ్రహ్మమే,అగ్ని బ్రహ్మమే, హోమమాచరించువాడు బ్రహ్మమే; బ్రహ్మకర్మసమాధిచేత బొందనగుఫలము బ్రహ్మమే.

తో॥ యజ్ఞములో స్రుక్స్రువాదులును మరి
హోమము హవిస్సు అగ్నియును
యజ్ఞకర్మయును హోమ క్రియలును
పొందెడి ఫలమును బ్రహ్మమగు ॥వా॥

*తో॥ గోవిందాయని స్నానము చేయుట
వూర్ధ్వపుండ్రమును ధరించుట
గోవిందునికై సంధ్యావందన
జపార్చనాదులను సల్పుట ॥వా॥ ౨౪

శ్లో॥ దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ 25

తా॥ కొందరుయోగులు దేవతార్చనమనే యజ్ఞమును చేయుచున్నారు. మరికొందరు సమస్తము బ్రహ్మస్వరూపమని యెంచి బ్రహ్మజ్ఞానమునందు అజ్ఞానమనెడి హవిస్సును వ్రేల్చుచున్నారు.

తో॥ దేవతలను ఆరాధించుట యను
యజ్ఞము చేయుదురు కొందరును
యేయుపాధియును లేనిబ్రహ్మమును
నుపాసించెదరు కొందరును ॥వా॥

*తో॥ భగవద్గీతను బాగ పఠించుట
గీతార్థంబును గ్రహించుట
భగవంతుని ప్రీతిగను భుజించుట
సద్వ్యాపారమును సల్పుట ॥వా॥ ౨౫

శ్లో॥ శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

తా॥ కొందరు శ్రోత్రాదులగు ఇంద్రియములను నిగ్రహమను అగ్నిలో హోమము చేయుచున్నారు. మరికొందరు (రూప రస శబ్దము) శబ్దము మొదలుకొని (ఇంద్రియ) విషయములను ఇంద్రియరూపమయిన అగ్నియందు హోమము చేయుదురు.

తో॥ శ్రోత్రాదింద్రియములను కొందరును
నిగ్రహమను నగ్నినివ్రేల్త్రు
శబ్దాదిగ విషయంబుల కొందరు
ఇంద్రియాగ్నిలో వ్రేల్చెదరు ॥వా॥

*తో॥ సత్యము బలుకుట ధర్మము నడచుట
ప్రీతిగ ఇతరులను చూచుట
శ్రోత్రాదింద్రియ వర్గమునణచుట
ఆత్మయందె చిత్తము నిడుట ॥వా॥ ౨౬

శ్లో॥ సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ 27

తా॥ మరికొందరు అన్ని ఇంద్రియకర్మలను ప్రాణకర్మలను జ్ఞానప్రజ్వలితమయిన ఆత్మసంయమ యోగమను అగ్నియందు హోమము చేయుదురు.

తో॥ కొందరు సమస్త ఇంద్రియకర్మలు
ప్రాణకర్మలను జ్ఞానముచే
పొందుగ ఆత్మలో సంయోగంబను
యజ్ఞము చేతురు నియమముచే ॥వా॥

*తో॥ ఆత్మకన్న వేరేమియు లేదని•అంతఃకరణమున తలచుట
ఆత్మయె గతియని బుద్ధి స్థిరపడుట•ఆత్మానందమును చెందుట॥వా॥

శ్లో॥ ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః॥ 28

తా॥ సద్విషయములందు ద్రవ్యమువినియోగపరచుట ద్రవ్యయజ్ఞము, ఏకాదశి మొదలగు హరిదివసములయందు ఉపవాసము మొదలగు వ్రతములు చేయుట తపోయజ్ఞము, యమనియమాది అష్టాంగయోగములను యజ్ఞము, వేదాధ్యయనమనుయజ్ఞము, ఇంద్రియముల వశపరచుట అనుయజ్ఞము, ఇంకను తీక్ష్ణములగు నియమములు గలిగియుందురు.

తో॥ ద్రవ్యయజ్ఞమును తపోయజ్ఞమును
యోగయజ్ఞమును అధ్యయనమ్
జ్ఞానయజ్ఞమును తీక్ష్ణనియమములు
చేయుదురు పకరొకవిధము ॥వా॥

*తో॥ గోవుల గాచిన గొల్లవాడ నిను
కోరితి గోపాలాకృష్ణ
గోవింద గోగ్రాసము నొసగియు
గోవుల కాపాడుము కృష్ణ ॥వా॥

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ 29

తా॥ ఇక కొందరు ప్రాణాయామపరాయణు లయినవారు ప్రాణాపాన గతులను నిరోధించి ప్రాణవాయువును అపానమునందును, అపానవాయువును ప్రాణములోను హోమము చేయుదురు.

తో॥ అపానంబునను ప్రాణవృత్తియును
ప్రాణమునందునపానమును
ప్రాణాపానగతిని నిలుపుదురు
ప్రాణాయామ పరాయణులు ॥వా॥

*తో॥ వాసుదేవ దామోదర మాధవ
వసియించుము హృదయము నందు
కుసుమనాభ నామమనును లగ్నము
చేసికొనుము చక్రగపొందు ॥వా॥

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥ 30

తా॥ మరికొందరు నియతమయిన ఆహారముగల్గి ప్రాణములలో ప్రాణములనే హోమము చేయుదురు. వీరందరు యజ్ఞమును తెలిసినవారే. యజ్ఞము నుంచి పాపములను పోగొట్టుకొనినవారే అగుదురు.

తో॥ నియతమయిన ఆహారము గొనుచును
ప్రాణవాయువును ప్రాణములో
నియమించెదరీ యజ్ఞకర్తలును
సమస్తపాప ధ్వంసకులే ॥వా॥

*తో॥ పరిజనములు నా ప్రాణంబులు నగు
శరీరమొ నీకును గుడియు
పూజలు విషయపు భోగంబులునగు
పురుషోత్తమ నిద్రసమాధియు ॥వా॥ 30

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥

తా॥ అమృతరూపమయిన యజ్ఞశేషమును భుజించువారు సనాతన మయిన బ్రహ్మమును పొందెదరు. కురుసత్తమ! ఈ యజ్ఞములలో నొకటినయిన చేయనివారికి ఈ లోకమె లేనపుడు పరలోకమెక్కడిది?

తో॥ కురుసత్తమ ఈయజ్ఞ కర్మలలో
శేషించిన దివ్యామృతము
ప్రీతిభుజించిన బ్రహ్మనొందెదరు
అయజ్ఞులకు పూజ్యము నుభయమ్ ॥వా॥

*తో॥ సంచారమె నీప్రదక్షిణంబగు
స్తోత్రము సమస్తపలుకులగు
సర్వకర్మములు ఆరాధనయగు
సర్వేశ్వర కరుణించనగు ॥వా॥ 30

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే। 32

తా॥ ఈ పైచెప్పిన అనేకవిధములగు యజ్ఞములు బ్రహ్మముఖమునుండి అనగ వేదమునుండి విధింపబడినది. ఆ అన్నిటిని కర్మయోగములని తెలియ వలయును. ఇట్లెరిగిన సంసారబంధమునుండి తొలగినవాడవగుదువు.

తో॥ ఈవిధమగు యజ్ఞంబులు వేదము
వలన గలిగినవి కర్మములు
ఈవిధముగ సర్వంబును నెరగిన
విడువబడును నీ బంధములు ॥వా॥

*తో॥ కర్మములన్నియు నీ వచనంబులు
కృష్ణనిన్ను ధ్యానించుచును
కర్మలు చేసిన కడతేరగనగు
కృష్ణయ్య నీదయవలను ॥వా॥ 31

శ్లో॥ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప !
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥ ౩౩

తా॥ ఓపరంతప! ద్రవ్యసాధ్యమయిన యజ్ఞమునకంటె జ్ఞాన సాధ్యమయిన యజ్ఞమే ఉత్తమము. పార్థ! సర్వకర్మలపర్యవసానము జ్ఞానములో పూర్తియగుచున్నది.

తో॥ పరంతపవినుము ద్రవ్యమయంబౌ
యజ్ఞముకధికము జ్ఞానమగుఁ
సర్వకర్మలును బ్రహ్మజ్ఞానము
నందు లయించును పార్థవిను ॥వా॥

*తో॥ సమస్తకర్మలు నిమయెరుగుట కని
సమస్తమునకును నీవెయని
సమస్తలోకము నందునీవె యని
సమస్తకాలము తలచెదనిఁ ॥వా॥ 33

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ ౩4

తా॥ బ్రహ్మజ్ఞానము బడయుటకు తత్త్వజ్ఞానులచేరి సాష్టాంగ నమస్కారము చేసి పరిప్రశ్నచేసి సేవఁజేసిన జ్ఞానోపదేశము చేయుదురు.

తో॥ సద్గురువరునకు సాష్టాంగనమ
స్కారము సల్పియు సేవించఁ
అనుగ్రహించును మంచిప్రశ్నలచే
బ్రహ్మజ్ఞానము బడయుంగఁ ॥వా॥

*తో॥ సద్గ్రంథంబులు చదువుచు వినియును
సత్పురుషుల సాంగత్యముచే
సద్గురువర్యుని గనిసేవించిన
సద్విద్యనుగను వారలచే ॥వా॥ ౩౪

శ్లో॥ యత్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥ 35

తా॥ పాండవ! ఆ జ్ఞానము పొందితివేని మరల మోహమునొందవు. ఆ జ్ఞానమువలన అశేషమయిన భూతములు నీలోను మరియు నాలోను చూడ గలవు.

తో॥ బ్రహ్మజ్ఞానము పొందితివేనిక
మరల మోహమును బొందవుగా
పాండవ నీయందును నాయందును
అన్ని భూతముల చూతువుగా ॥వా॥

*తో॥ జ్ఞానభాగ్యమున అన్ని భూతముల
ఆత్మదృష్టిచే చూడనగుక
జ్ఞానము చేసర్వము శ్రీహరిఅని
పరమానందము బొందనగుక ॥వా॥ 3౭

శ్లో॥ అపిచేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 36

తా॥ పాపాత్ములలో నీవు మహాపాపివైనను, సర్వ పాపమను సముద్రమును, జ్ఞానమను తెప్పచేత దాటగలవు.

తో॥ పాపిష్ఠులలో మొదటివాడయిన
బ్రహ్మజ్ఞానము బొందగను
పాపసమూహం బను సముద్రమును
జ్ఞానప్లవముచె దాటనగుక ॥వా॥

*తో॥ హరియను నామాక్షరములు రెండును
హరియించును పాపపు రాశి
హరినారాయణ గోవిందా శ్రీ
హరిహరి యనుటెంతో వాశి ॥వా॥ 3౮

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున! ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

తా॥ అర్జున! ప్రజ్వలించు అగ్ని కట్టెలను కాల్చి బూడిదె చేయులాగున జ్ఞానరూపమయిన అగ్ని సర్వకర్మములను భస్మము చేయును.

తో॥ చక్కగమండెడి అగ్నికట్టెలను
ఏరీతిగ భస్మము చేయుగా
చక్కని జ్ఞానము కర్మరాసులను
అర్జున నిర్బీజముచేయుగా ॥వా॥

*తో॥ ధనధాన్యంబుల వనితవస్తువుల
ఘనతగృహము లార్జింపగనూ
జ్ఞానియనుచు మన్నింతురు కాదది
తనుతా దెలిసిన జ్ఞానియగుగా ॥వా॥ 37

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥ 38

తా॥ ఈ లోకములో జ్ఞానముతో సమానమయిన పవిత్రమయినది వేరొకటిలేదు. బహుకాలమునకు తాను యోగసంసిద్ధిచే అజ్ఞానమును తనయందు బొందుచున్నాడు.

తో॥ జ్ఞానమువంటిది పవిత్రమయినది
ఈలోకమ్మున గనబడదు
గానయోగ సంసిద్ధి కాలమున
జ్ఞానము తనలో తాబొందు ॥వా॥

*తో॥ కామక్రోధలోభములు దేహమున
కాపురముండెడి వరకున్ను
జ్ఞానము కలుగదు కావున వాటిని
వదలించుము జ్ఞానమును గను ॥వా॥ 38

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి ॥ 39

తా॥ జ్ఞానాభివృద్ధియందు శ్రద్ధగలిగి తక్కిన విషయముల జితేంద్రియుండై జ్ఞానతత్పరుడై జ్ఞానముపొంది శీఘ్రముగ పరమశాంతియను మోక్షము పొందును.

త॥ శ్రద్ధాభక్తిని జ్ఞానము పొందియు
శ్రవణాదులు చక్కగచేసి
జితేంద్రియుండై పరమశాంతియును
శీఘ్రమొందు గురుకృపబడసి ॥వా॥

*త॥ మదముమత్సరము మరి మోహంబును
మరచి మాధవుని మరువకను
మనసున తలచియు మరిమరివేడిన
మాధవుకృప జ్ఞానము గలుగున్ ॥వా॥ ౩౯

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయంలోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥40

తా॥ జ్ఞానరహితుడు అశ్రద్ధవల్లను సంశయాత్ముడై నాశమొందును. అతనికి ఈ లోకముననె సుఖములేదు. పరలోకమెక్కడిది?

త॥ అజ్ఞానపుతెర శ్రద్ధలేనిదియు
సంశయమెప్పుడు పొందుటయు
ప్రజ్ఞలేని అధమున కిహపరలోక
సుఖమెప్పుడు గలుగదు తెలియు ॥వా॥

*త॥ శ్రీకృష్ణసంశయ నాశనంబు
చేయుమయ్యా భారమునీదె
నీ ఇష్టమె నా ఇష్టముతండ్రి
నీ వానినిచేయుగ రాదె ॥వా॥ ౪౦

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ! ॥ 41

తా॥ హే ధనంజయ! నిష్కామకర్మ చేత విడువబడిన కర్మఫలము గలవాడును జ్ఞానోదయమగుటచే దెగగొట్టబడిన సంశయముగలవాడును నైన ఆత్మజ్ఞానిని కర్మములు బంధింపవు.

తో॥ పరమాత్మజ్ఞానము బొందియును
సర్వసంశయముల తొలగియును
సర్వకర్మబంధముల దాటియును
ధనంజయు ధన్యుండగును ॥వా॥

*తో॥ లోపలివెలుపలి ఇంద్రియములన్ని॰లోకేశ్వర నీవిచ్చినవే
లోపల నీకని సాధుకర్మంబు॰లోనర్పబంధనములు లేవే॥వా॥

శ్లో॥ తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత!॥ 42

తా॥ ఓ భారత! అజ్ఞాన సంభూతమైన నీ బుద్ధియందుగల సంశయమును జ్ఞానమనెడి ఖడ్గముచే ఖండించి ఆత్మజ్ఞానయోగమును ఆచరింపుము. యుద్ధమునకు లెమ్ము.

తో॥ భారత అజ్ఞానంబున బుట్టిన
హృదయములోగల సంశయము
పరమార్థ జ్ఞానంబున ద్రెంచుము
యుద్ధమునకు వేగిరపడుము ॥వా॥

*తో॥ భాగ్యంబుల వైరాగ్యభాగ్యమే॰భాగ్యంబని పెద్దల వచనం
భాగ్యము ఆత్మ జ్ఞానయోగమును॰భాగ్యము యుద్ధమునకు పయనం ॥వా॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో
నామ చతుర్థోఽధ్యాయః.

ఓమ్ తత్ సత్



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## కర్మసన్న్యాసయోగము — షష్ఠమాధ్యాయము.

భగవంతుని పలుకు.

తో॥ సర్వభూతముల హితంబుకొరకై
కర్మలు చేసిన భయమేమి
సర్వలోకముల ఈశ్వరుండనని
నను తెలిసితె చాలింకేమి ॥వా॥

తో॥ ఎవని మనసు నిర్మలమయినదియొ
ఎవనికి కోరికలును లేదో
ఎవనికి సుఖదుఃఖములు సమానమొ
ఎవనికి ద్వేషంబును లేదో ॥వా॥

తో॥ కర్మచేతను నను గర్వము లేదో
కర్మఫలాసక్తియు లేదో
సర్వభూతముల ఆత్మ తనదనునో
పరము నందె దృష్టియు గలదో ॥వా॥

తో॥ కామక్రోధముల వేగము నిలుపునో
కరుణారస భరితుండగునో
క్రమముగ సత్కర్మంబులఁ జేయునో
ఆమనుజుడె నావాడనెను ॥వా॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥ 1

తా॥ ఓ కృష్ణా! ఒకప్పుడు కర్మలు విడువుమనియు మరిఒకప్పుడు కర్మలు చేయుమనియు తెలిపెదవు. ఈ రెంటిలో నేది శ్రేష్ఠమో చక్కగ నిశ్చయింపబడిన ఒక్కదానిని నాకు చెప్పుము.

తో॥ శ్రీకృష్ణ కర్మములు విడువుమని
మరలను కర్మలు చేయుమని
వాక్రుచ్చెదు విపుడేమి శ్రేష్ఠమని
తెల్పుము నిశ్చయ మిదే యని ॥వా॥

*తో॥ యోగులకును భోగులకును వలసిన
యోగ్యమయిన మార్గంబులును
యోగీశ్వరు డగు కృష్ణుడుబల్కను
యోగ్యులక్కరతో నడువనగు ॥వా॥ ౧

శ్రీభగవానువాచ:—

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే॥ 2

తా॥ సన్న్యాసము కర్మయోగము ఈ రెండుమార్గములును మోక్షహేతువులే. అయినను ఈ రెంటిలోను సంన్యాసముకన్నను కర్మయోగమే హెచ్చగును.

తో॥ సన్న్యాసంబును కర్మయోగమును
జ్ఞానోత్పత్తికి హేతువులే
వీనిలో సన్న్యాసంబు కంటెవిను
కర్మయోగ ముత్తమమౌలే ॥వా॥

*తో॥ సన్న్యాసము కోరక కర్మిష్ఠులు♦ధన్యులు బాగుగ కావచ్చున్
సన్న్యాసము చక్కగపాలించి ♦ కర్మలేక కడతేరనగు ॥వా॥

శ్లో॥ జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో! సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥

తా॥ ఓ మహాబాహూ! దేనిని ద్వేషింపక దేనిని ప్రేమింపక రాగ ద్వేషములను జయించి కర్మలు చేయుచున్నవాడు నిత్యసన్న్యాసియే. అతడు సులభముగా సంసార బంధమునుండి విముక్తిఁ బొందునని తెలియవలయును.

తో॥ సుఖమునందు కాంక్షయు లేకుండుటను
దుఃఖము వలోద్వేష నసందు
రాగద్వేషము లేని గృహస్థుని
సన్న్యాసియనుచు నందువు ॥వా॥

*తో॥ ఓ మహాబాహూ ఎంతటి భాగ్యమో
కర్మచేయు కాలంబునను
ఓ మహాదేవ యని బలుకుచుండు
నిత్యసన్న్యాసియై తానుండుఁ ॥వా॥ 3

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥ 4

తా॥ బాలాః — మూఢులు సాంఖ్యము వేరని యోగము వేరని బలుకుచున్నారు. పండితులు అట్లు పలుకరు. ఒక మార్గమును చక్కఁగ పాలించిన రెంటినుండి నయ్యెడు ఫలమును బొందుచున్నాడు.

తో॥ సాంఖ్యము యోగము భిన్నఫలప్రద
మనెదరు జ్ఞానులు పల్కరుగా
సుఖముగ దేనిని నాచరించినను
ఫలముబొందెదరు సమంబుగా ॥వా॥

*తో॥ విషయము లందకర్రగల మనసును
విష్ణువునందున గూర్పుటయుఁ
విషయలంపటుడు గాక సుఖంబుగ
నుండుట పండిత విజ్ఞేయమునగుఁ ॥వా॥ ౪

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥ 5

తా॥ సాంఖ్యయోగులు పొందుస్థానమును కర్మయోగులు పొందుచున్నారు. ఎవడు సాంఖ్యమును, కర్మను ఒకటిగా తెలిసికొనుచున్నాడో, అతడే చక్కగ తెలిసినవాడు.

తో॥ సన్యాసులు పొందెటి స్థానంబును
కర్మయోగులును పొందెదరు
సమముగ సాంఖ్యము యోగము గనియెడి
వారే సమ్యగ్దర్శులు ॥వా॥

*తో॥ ఈశ్వరుడిచ్చిన ఇంద్రియంబులచె
ఈశ్వరప్రీతిగ కర్మలను
ఈశ్వర భజనతో చేసెదననియెడి
ఈశ్వర భక్తుడు ధన్యుడగుకా ॥వా॥ ౫

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి। 6

తా॥ మహాబాహు! సన్యాసముగూడా కర్మయోగము కాక ప్రాప్తమగుట కఠినము. కర్మయోగియగు మననశీలుడు శీఘ్రముగ బ్రహ్మమును పొందుచున్నాడు.

తో॥ యోగములేకను సన్యాసంబును
పొందుట దుఃఖకరంబౌను
యోగయుక్తుడౌ మునియు శీఘ్రముగ
బ్రహ్మపదంబును పార్థగను ॥వా॥

*తో॥ ఈశ్వరభజనతో చేసినకర్మము
ఈశ్వర జ్ఞాన సాంఖ్యంబు
ఈశ్వర జపమును చేయు జన్మంబు
ఈశ్వరార్పితము ధన్యంబు ॥వా॥ ౬

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7

తా॥ కర్మయోగమునందుండు నతడు చిత్తశుద్ధి పొంది మనస్సును స్వాధీనములో నుంచుకొని ఇంద్రియజయుడై సర్వభూతముల ఆత్మయే తన ఆత్మగా నున్నవాడు, కర్మలు చేసినను బద్ధుడు గాడు.

తే॥ కర్మయోగమున సత్త్వశుద్ధియై
దేహేంద్రియములు జయించియు
సర్వ భూతముల కాత్మ తానయై
యుండును బంధము నంటకయు ॥వా॥

*తే॥ జిహ్వోపస్థల నెప్పుడు తలచిన
ఈశ్వర భక్తుం డెట్లగును
శ్రీహరిసేవయు శుద్ధ సాధులకు
శీఘ్రంబుగనే సిద్ధించుగా ॥వా॥ ౮

శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥

తా॥ యథార్థమును తెలిసిన యుక్తుడు కొంచమయినను నేను చేయుట లేదని చూచుచు, వినుచు, తాకుచు, వాసనచూచుచు, తినుచు, వెళ్ళుచు, నిద్రించుచు, నిట్టూర్పు విడుచుచు.

తే॥ తత్త్వవిదుడు తానేవియు జేయను
యని జూచును వినుస్పృశించును
మూర్కొను భుజించు నడుచు నిద్రించును
నిట్టూర్పులు తావిడుచుచును ॥వా॥

*తే॥ విశ్వాధారుడు వికారరహితుడు
విశ్వములో నడచెడివన్ని
విశ్వాధారుని విలాసమనుచును
విశ్వమునకుతా సాక్షి అని ॥వా॥ ౯

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్॥ 9

తా॥ పలుకుచు విడుచుచు గ్రహించుచు కనులు తెరచుచు మూయుచున్నను ఇంద్రియములు ఇంద్రియార్థములందు వర్తించుచునని సమాహిత చిత్తుడై యుండును.

తో॥ పలుకుచు విసర్జనంబును చేయుచు
గ్రహించు కన్నులు తెరచుచును
మూయుచు విషయంబుల ఇంద్రియములు
వర్తించును అని తలంచును ॥వా॥

*తో॥ సమాహితంబగు చిత్తముతోడను
సర్వము ఈశ్వర మయంబని
సమాధి నొందియు సంతోషించును
సర్వేశ్వర నీ అంశమని ॥వా॥

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా॥ 10

తా॥ బ్రహ్మార్పణమని కర్మలను ఫలాసక్తి విడచిచేయువానికి కమల పత్రమునకు నీరు తగలని విధమున పాపములంటవు.

తో॥ విధి యుక్తంబగు కర్మలుచేయును
కర్మఫలాసక్తతలేక
పద్మపత్ర తోయంబు రీతిగను
సర్వకర్మ లేపములేక ॥వా॥

*తో॥ విధియుక్తంబగు కర్మలుచేయును
విధికెచ్చన్ని విధంబులను
విధిని విడచి యేవిధమునడువక
విధిసంబంధపు దేహమును ॥వా॥

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే॥ 11

తా॥ కాయముచే మనస్సుచే బుద్ధిచే ఇంద్రియములచే అహంకారము విడిచి కర్మఫలాపేక్షవదలి యోగి ఆత్మశుద్ధికై కర్మాచరించును.

తో॥ కాయము మనస్సు బుద్ధీంద్రియముల
భగవంతుని ప్రీతియు కొరకై
నియమంబున సత్కర్మలు చేయును
యోగి చిత్తశుద్ధియు కొరకై ॥వా॥

*తో॥ గోపికలందరు గృహకృత్యంబులు
గావించుచు నినుగోరియును
గోపాలా గోవిందా యనుచును
కోరిభజించిరి నిరతమును ॥వా॥ ౧౧

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12

తా॥ యుక్తుడు కర్మఫలము హరికర్పించి నిష్ఠాపరుడై శాంతినిపొందుచున్నాడు. అయుక్తుడు కామప్రేరణచే కర్మఫలాసక్తుడై బద్ధుడగుచున్నాడు.

తో॥ ఫలమంతయు భగవంతుని దనుచును
కర్మను చేయుచు శాంతుండౌ
ఫలముల కోరియు శాంతము లేకను
కర్మచేసి తాబద్ధుండౌ ॥వా॥

*తో॥ భక్తులభాగ్యమె భాగ్యము కృష్ణ
భారము నీపై వేతురుగా
భక్తిలేని పామరులు బద్ధులై
భయపడెదరు నిను తెలియరుగా ॥వా॥ ౧౨

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్॥ 13

తా॥ వశీ — ఇంద్రియ జయుఁడగు దేహి సకల కర్మలు మనస్సుచేత త్యాగముచేసి నవద్వారపురమను దేహమున సుఖముగ తాను యేమి చేయక ఏమి చేయనియ్యక వుండును.

తో॥ నవద్వారములు గల దేహంబను
పురమందున ఆత్మయుదూరమై
ఏ విచారమును విడచియు సుఖముగ
ప్రకాశించు తానేతానై ॥వా॥

*తో॥ గోపగోపికలు గోవిందనిను
గోరియు మనసుచె ఇతరమును
గోరక కర్మలు చేసియు మరచిరి
గోపాలా నిను కూడియును ॥వా॥ ౧౩

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ 14

తా॥ ప్రభువు లోకమునకు కర్తృత్వమునుగాని కర్మలనుగాని కర్మఫల సంయోగముగాని సృజింపడు. స్వభావస్తు అనగ ప్రకృతి చేయుచున్నది మాయాకార్యములని తెలియుము.

తో॥ ఆత్మయు కర్తృత్వము కల్పింపడు
కర్మంబుల కల్పింపడుగా
ఆత్మయు ఫలముల నిచ్చుట లేదు
అవిద్య అన్నియు చేయునుగా ॥వా॥

*తో॥ మాయా జగత్తు యని తెలియగవలె
మాయాకార్యము లనవలయు
మాయను మాయముగా చేయగవలె
మాధవ నిను వేడగ వలయు ॥వా॥ ౧౪

శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥ ౧౫

తా॥ విభుడు ఎవరి పాపమును గాని ఎవరి పుణ్యమును గాని గ్రహింపడు. జ్ఞానము మాయచే నావరింపబడినదిగాన జంతువులు మోహమును పొందుచుండురు.

తో॥ ఎవ్వని పాపము పుణ్యము నయినను
ఆత్మయు పరిగ్రహించడుగా
అవివేకము జ్ఞానంబును మూసెను
గాన కర్తృత్వము గల్గెనుగా ॥వా॥

*తో॥ మాయా కార్యము యేమనంగ వలె
ఉన్నది లేనిదిగా తోచుట
మాయలేనిచో వుండునటుండును
మాధవ నిను ప్రార్థించెదను ॥వా॥ ౧౫

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16

తా॥ అయితే ఎవరు తమ అజ్ఞానమును జ్ఞానముచేత పోగొట్టుకొన్నారో వారికి జ్ఞానము సూర్యునివలె పరమాత్మను స్పష్టముగ ప్రకాశపరచుచున్నది.

తో॥ తమ అజ్ఞానము జ్ఞానమువలనను
నశింప చేసెడి వారలకు
తమ జ్ఞానము పరమార్థము చూపును
దినమణివలె నాసుజనులకు ॥వా॥

*తో॥ మాధవుని దయను సంపాదించిన
మానవు భాగ్యమె భాగ్యంబు
మాయను మీరియు మోదము చేతను
మాధవుని గనును నిత్యంబు ॥వా॥ ౧౬

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 17

తా॥ జ్ఞానముచే పోగొట్టుకొన్న కల్మషములు పరమార్థమందే బుద్ధిగలవారలై ఆ పరబ్రహ్మమే ఆత్మస్వరూపముగలవారై నిష్ఠాపరులై ఆ పరబ్రహ్మమే యుత్కృష్టగతిగలవారై పునర్జన్మ రహితులగుదురు.

తో॥ పరబ్రహ్మమున బుద్ధియు గలిగియు
తత్పరులై నిష్ఠాపరులై
పరమాత్ముడె మాగతి అనువారలు
మరలిరారు గతకల్మషులై ॥వా॥

*తో॥ నీలోబుద్ధియు నిలకడచేయర
నిష్ఠావరునిగ చేయుమురా
నీవె పరమగతి యని నియమించర
నినుకోరితినే పరాత్పర ॥వా॥ ౧౭

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పణ్డితాస్సమదర్శినః ॥ 18

తా॥ విద్యావినయ సంపన్నుడగువ బ్రాహ్మణునియందును గోవునందును ఏనుగునందును శునకమునందును కుక్కమాంసము తినువానియందును పండితులు సమాన (ఆత్మ) దృష్టి గలవారగుదురు.

తో॥ జ్ఞానులు ఘాతుర విద్యయు గలిగిన
విప్రునందు ధేనువునందుగ
యేనుగునందును శునకమునందును
శ్వపాకు నందును సమదృష్టిగ ॥వా॥

*తో॥ దేహము సమమా గేహముసమమా
గ్రామముసమమా చూడగను
వూహలు సమమా జన్మలు సమమా
ఆత్మసమంబౌ అరయగను ॥వా॥ ౧౮

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

తా॥ ఎవరియొక్క అంతఃకరణము సమభావమున నిలచినదో వారిచే ఈ లోకమందే సంసారము జయింపబడినది. కారణమేమన నిశ్చలమయిన బ్రహ్మము దోషరహితమగుటచే సమదర్శనులు బ్రహ్మమందున్నవారలు.

త్రో॥ ఎవ్వరిబుద్ధియు సర్వభూతముల
సమభావన చూడంగలదో
అవ్విమలాత్ములు ఈ జన్మముననే
ధన్యులు బ్రహ్మానందముతో ॥వా॥

*త్రో॥ ఏ నిమిషమునను రామభజనలో
ఏమానవు డానందపడు
వానిజన్మమె జన్మము నతడే
సంసారము దాటగలండు ॥వా॥ ౧౯

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః॥ 20

తా॥ ఇష్టార్థము ప్రాప్తించినచో హర్షము పొందరాదు. చెడితే చింతకు లోబడరాదు. మోహము పొందక స్థిరబుద్ధిగల బ్రహ్మజ్ఞానియే బ్రహ్మమందుండువాడు.

త్రో॥ బ్రహ్మవిదుండును ప్రియాప్రియంబుల
హర్షవిషాదము నొందడుగా
బ్రహ్మానందమునందే నుండును
ఇతరము లేవియు నెరుగడుగా ॥వా॥

*త్రో॥ బ్రహ్మజ్ఞానము పొందినవాడే
భాగవతులు పరమోత్తములు
బ్రహ్మజ్ఞానము పొందనివారలు
బహువిధముల భువి పుట్టుదురు ॥వా॥ ౨౦

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥ 21

తా॥ బయట శబ్దాది విషయములయందు అంటని అంతఃకరణముగల వాడు బ్రహ్మమునందు నిర్మలాంతఃకరణముగలవాడై అక్షయమైయిన సుఖమును పొందుచున్నాడు.

తో॥ బ్రహ్మనిష్ఠుడును బాహ్యవిషయముల
ప్రీతియు లేకుండును గాన
ఆత్మానందము నందే యుండును
అక్షయంబు నదియగు గాన ॥వా॥

*తో॥ బ్రహ్మజ్ఞానము పొందగ తండ్రి
బహువిధముల నిను పొగడెదను
బ్రహ్మకు తండ్రివి పరమాత్మ హరె
పాదంబులనే పడియెదను ॥వా॥ ౨౧

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః॥ 22

తా॥ కౌంతేయ! విషయేంద్రియముల వల్లను పుట్టిన సుఖము లాద్యంతములు గలవి గావున ఆసుఖములును దుఃఖకారణములుగా నెరుగుము. పెద్దలు ఆ విషయ సుఖములయందాసక్తినుంచరు.

తో॥ అర్జున విషయేంద్రియ సంయోగపు
సుఖము చూడ దుఃఖము నగును
ఆద్యంతంబును అనిత్యమునగు
దీనిని కోరడు పండితుడుౕ ॥వా॥

*తో॥ గోపికామణులు నినుమది కోరియు
కాళిందీనది గ్రుంకులిడౕ
గోకలు కొనియును గోరికలొసగిన
గోకులపతి నిను కోరెదను ॥వా॥ ౨౨

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥ 23

తా॥ దేహత్యాగము కాకమునుపే, ఈ లోకమందుండు నపుడే, కామక్రోధములనుండి కలిగెడి తాపమును సహించు శక్తిగల మనుష్యుడే యుక్తుడు. అతడే సుఖియు.

తో॥ కామక్రోధంబుల వేగంబును
దృఢదేహము కలిగుండగనే
యేమానవుచే జయింపబడునో
వాడే యుక్తుడు సుఖి తానే ॥వా॥

*తో॥ సాధనంబునకు అనుకూలంబగు
ఈ దేహము విడువక మునుపే
బాధించగవలె క్రోధసమూహము
సాధుజనావన నీదాపే ॥వా॥ ౨౩

శ్లో॥ యోఽన్తస్సుఖోఽన్తరారామస్తథాఽన్తర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24

తా॥ ఆత్మసుఖియు, ఆత్మారాముడును, అంతఃప్రకాశకుడును అగు యోగి బ్రహ్మస్వరూపియై బ్రహ్మానందమును పొందుచున్నాడు.

తో॥ అంతఃసుఖి యాత్మారాముండై
అంతర్జ్యోతి స్వరూపుడై
చింతకు దూరంబగు బ్రహ్మంబై
పంతసించు యోగీశ్వరుడై ॥వా॥

*తో॥ చింతలేల శ్రీకాంతా నినుమది
చింతించెడి పుణ్యాత్ములకు
అంతరంగమున సంతసమొందుచు
కంతుజనక మ్రొక్కెద నీకు ॥వా॥ ౨౪

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః॥ 25

తా॥ సమస్త కల్మష నాశకులు సంశయమును ఛేదించినవారలు ఇంద్రియ నిగ్రహులు సర్వభూతహితులు నగు ఋషులు బ్రహ్మానందమును పొందెదరు.

తో॥ జ్ఞాననిష్ఠులకు పాపఘ్నులకును
ఛేదించిన సంశయులకును
ఆత్మ స్వాధీనులకును హితులకు
గల్గును బ్రహ్మానందంబుగ ॥వా॥

*తో॥ దర్శనంబు శ్రవణంబు జ్ఞానమును
అన్యము గాకుండెడి ఆత్మ
పూర్ణస్వరూపు భక్తితో నెరుగుచు
పూర్ణమగును ఆనందాత్మ ॥వా॥ ౨౫

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥ 26

తా॥ కామక్రోధములు లేనివారును జయించిన మనస్సు గలవారును ఆత్మజ్ఞానమెరింగినవారునగు యతులకు బ్రహ్మసాయుజ్యము అంతటనున్నది.

తో॥ కామక్రోధము విడచిన యతులకు
ఎరిగిన ఆత్మజ్ఞానులకు
బ్రహ్మ నిర్వాణ సుఖము లభించును
స్వాధీనాంతః కరణులకు ॥వా॥

*తో॥ ఎంతదయో నాయందున కృష్ణ
ఎన్నరాని యోగుల దూరి
ఎంతో కష్టము నొందగ కృష్ణ
అనుగ్రహించితి విపుడు హరి ॥వా॥ ౨౬

శ్లో॥ స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరేభ్రువోః।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ ॥ 27

తా॥ వెలుపలి విషయమ్ముల చింతించక వెలుపలనుంచి భ్రూమధ్య స్థానంబున దృష్టినిలిపి నాసాభ్యంతరముల చరించు ప్రాణాపానముల సమముగ నిలిపి.

తా॥ బాహ్యవిషయముల బయటనె వుంచి
భ్రూమధ్యంబున దృష్టించి
నాసాభ్యంతరముల చరియించు
శ్వాసలు శాంతత బంధించి ॥వా॥

*తా॥ వెలుపల నుండెడి విషయంబులను
వెలుపలనె నిలిపియు తాను
భ్రూమధ్యంబున చూపును నిలపియు
ప్రాణాపానము సమముగను ॥వా॥ ౨౭

శ్లో॥ యతేన్ద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥ 28

తా॥ నియమింపబడిన ఇంద్రియ మనోబుద్ధులుగలవాడును, ఇచ్ఛా భయ క్రోధాదులు లేనివాడును, మోక్షపరాయణుడైన ముని నిరంతరము ముక్తుడనే తెలియవలయును.

తా॥ ఇంద్రియంబులను మనస్సు బుద్ధిని
స్వాధీనంబున నిలుపుకొని
ఇచ్ఛా భయ క్రోధంబులు గెలచిన
తలంపుము మోక్ష పరుండని ॥వా॥

*తా॥ నియమిత ఇంద్రియ మనోబుద్ధిగల
ఇచ్ఛా భయ క్రోధము లేని
నియతుండగు ఆ ముని క్షేమ్మని
తలంపు మెప్పుడు ముక్తుడని ॥వా॥ ౨౮

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి॥

తా॥ నేనే యజ్ఞ తపస్సులను అనుభవించువాడనియు, సర్వలోకములకు ప్రభువనియు (నియామకుడనియు), సర్వభూతములకు ఉపకారి అనియు తెలిసి మోక్షమును బొందును; శాంతిని పొందును.

తే॥ యజ్ఞతపస్సుల భుజించువాడని
సర్వలోకనాయకుడనియు
యల్లభూతముల కుపకారుండని
నను గన శాంతతయుంబడయు ॥వా॥

*తే॥ సర్వాధిప నిను సర్వకాలమును
స్మరింపతలచితి సర్వేశా
సర్వజగంబులు సర్వదేవతలు
సర్వమునీవే పరమేశా ॥వా॥ ౨౯

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాస యోగో నామ పంచమోఽధ్యాయః.

ఓమ్ తత్ సత్





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతాసంగీతము

## ఆత్మసంయమయోగము — షష్ఠాధ్యాయము.



తో॥ వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ
వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ ॥వా॥

తో॥ యోగభ్రష్టుని గతి యేమగునని
ప్రశ్నయుచేసిన పార్థునికి
యోగి కులంబున యోగిగ బుట్టును
భయమేమున్నది అతనికి ॥వా॥

ప్రార్థన.

తో॥ ఎన్ని జన్మములు నైతేనేమి
నిన్ను మరువకుంటే చాలు
యున్న దొంగరో చిన్నికృష్ణనను
కన్నతండ్రి నీదయమేలు ॥వా॥

తో॥ జగదోత్పత్తియు వృద్ధినాశములు
చేయుటయే నీ కర్తవ్యము
భగవంతా నీవాదిదేవుడవు
భగవదాజ్ఞ మా కర్తవ్యము ॥వా॥

శ్రీభగవానువాచ:—

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥ 1

తా॥ కర్మఫలాపేక్షలేక కార్యమైన కర్మము చేయునతనే సంన్యాసియు యోగియుకానీ అగ్నియు క్రియయు విడచిన అతనుకాదు.

తో॥ ఫలమును కోరని కర్మాచరణుడె
సన్న్యాసియు యోగియు నతడే
అగ్నికార్యమును తపో దానమును
ఆగిన అపుడెట్లగు కాడే ॥వా॥

*తో॥ సత్కర్మలు స్వామికి సమర్పించు
సత్పురుషుని జన్మమె జన్మం
మత్కర్మలు దూరంబున తొలగిన
ధన్యాత్ముని పుణ్యమె పుణ్యం ॥వా॥ ౧

శ్లో॥ యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన ॥ 2

తా॥ పాండవ! దేనిని సన్న్యాసమని పలికెదరో దానిని యోగముగ నెరుంగుము. ఏలన సంకల్పరహితముకానిదే యోగి కాజాలడు.

తో॥ సన్న్యాసంబని దేనిని ననెదరో
అదే యోగమర్జున వినుము
సంకల్పత్యాగము చేయనిదే
కర్మయోగమును కాదనుము ॥వా॥

*తో॥ మనసును శ్రీహరికొప్పగించవలె
యోగియైన సన్న్యాసైన
మనసు భక్తిగను మాధవ మాధవ
యని ధ్యానంబున మునగదగుగా ॥వా॥ ౨

శ్లో॥ ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥ 3

తా॥ జ్ఞానయోగసిద్ధి పొందగోరు మననశీలునకు నిష్కామకర్మ సాధనము ముఖ్యము. యోగసిద్ధిని పొందిన మునికి కర్మసన్న్యాసము ముఖ్యము.

తో॥ ఆత్మజ్ఞానము నొందగ గోరెడి
మునికి కర్మయోగము మేలు
ఆత్మ జ్ఞానము నొందిన మునికిని
కర్మనివృత్తియె కనమేలు ॥వా॥

*తో॥ శ్రీకృష్ణాజయ శ్రీకృష్ణ జయ
శిష్ట జనావన శ్రీకృష్ణ
వాక్పతివినుత వసుదేవ తనయ
గోపీసన్నుత శ్రీకృష్ణ ॥వా॥ 3

శ్లో॥ యదా హి నేన్ద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ 4

తా॥ ఎప్పుడైతే ఇంద్రియ భోగములయందు మనస్సును మరలించి కర్మలయందుకూడ మరుపుకలుగునో అట్టి సర్వసంకల్ప త్యాగియగు అతడు యోగారూఢుడని చెప్పబడును.

తో॥ విషయములందును కర్మలయందును
యాసక్తియు తగ్గించుచును
దోషరహితమగు మనసును ఆత్మలో
నిలపిన యోగారూఢుడగు ॥వా॥

*తో॥ అది ఇది ఇది అది అని విషయంబుల
ఆశకు లోబడి బద్ధుండై
తుదమొద లెరుగక తూగడించి
యమలోకములోబడు స్తబ్ధుండై ॥వా॥ ౪

శ్లో॥ ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపురాత్మనః ॥ 5

తా॥ (మనుష్యుడు) తన ఉద్ధారము తానే చేసుకొనవలయును. తన్ను నాశనము చేసుకొనరాదు. ఎందుకనగ తనకు బంధువు తానే - తనకు శత్రు వనగ తానే.

తో॥ తన్నును తానే తన మనస్సుచే
ఉద్ధరింప చేయగ వలయుఁ
తన్ననుసరించు మనస్సె బంధువు
అటుగాకుండిన శత్రువగుఁ ॥వా॥

*తో॥ వైకుంఠంబును చేరగవలసిన
వేరెవ్వరు తన మనసుగదా
వైవస్వత పురమునకును బోవగ
తన మనస్సె కారణము కద ॥వా॥ ౫

శ్లో॥ బన్ధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ 6

తా॥ ఎవడు తాను తన్నును జయించినాడో అట్టి ఆత్మబంధు వెవరనగ తానే. ఎవనికి స్వయంప్రజ్ఞ లేదో అట్టివాడు తన వైరి ఎవరనగ తానే.

తో॥ ఇంద్రియముల తన మనస్సు చేతను
వశపరచినవాడే ఘనుడు
ఇంద్రియ దేహంబుల వశపరచని
మనసే శత్రువుగానుండు ॥వా॥

*తో॥ మనసే బంధము మనసే మోక్షము
మనసే భయమగు నెప్పటికి
మనసే దుఃఖము మనసే సుఖమగు
మనసే కారణ మన్నిటికి ॥వా॥ ౬

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ 7

తా॥ తన ఆత్మను జయించిన సంపూర్ణ శాంతిగల్గిన ఆతని పరమాత్మ శీతోష్ణములచేతను సుఖదుఃఖములచేతను మానావమానములచేతను సమాహితముగ నుండును.

తా॥ జితేంద్రియుండై శాంత చిత్తుడై
శీతోష్ణము సుఖదుఃఖములన్
ప్రీతిగ మానము అవమానంబును
చూడగల్గ పరమాత్మయగున్ ॥వా॥

*తా॥ తను మన ధనములు రాముని కొసగిన
ధన్యుడుగద దానెప్పటికి
మనసును మాయము చేసిన ఘనునికి
మరి బాధలులే డాతనికి ॥వా॥ ౭

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥ 8

తా॥ జ్ఞాన శాస్త్రజ్ఞానము విజ్ఞాన అనుభవజ్ఞానములచే తృప్తుడును ద్వంద్వములకు చిక్కని కూటస్థుడును జితేంద్రియుడునునగు యోగి యుక్తుడన బడును. అట్టి యోగికి బంగారు మట్టి రాళ్ళు సమానముగ నుండును.

తా॥ జ్ఞానము అనుభవ జ్ఞాన తృప్తుడై
జితేంద్రియుండౌ యోగియును
పెంకురాయి బంగారును సమముగ
కను కూటస్థుడె యుక్తుడగున్ ॥వా॥

*తా॥ పరదారను బంగారును చూచిన
పాపి మనసు మోహము చెందూ
పరంధామ నిను ప్రార్థన సల్పెద
భక్తి నొసగు నీపదమందు ॥వా॥ ౮

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబన్ధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ 9

తా॥ స్నేహితుల మిత్రుల శత్రువుల ఉదాసీనుల మధ్యస్థుల అప్రియుల బంధువుల సాధువుల పాపాత్ములగువారి యందరియందు సమబుద్ధి గలవాడు ఉత్తమయోగి అనబడును.

తో॥ ఉపకారుల మిత్రుల శత్రువులను
ఉదాసీన మధ్యస్థులను
అపకారుల సాధుల పాపిష్ఠుల
సమదృష్టిని గన ఘనుండగుగా ॥వా॥

*తో॥ అందు ఇందు యెందును నీవుందువు
మందరగిరిధర మారరమణ
సుందరాంగ సంక్రందన వందిత
అందగాడవే హరికృష్ణ ॥వా॥ ౯

శ్లో॥ యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ 10

తా॥ యోగి రహస్యస్థలమున ఏకాకియైయుండి చిత్తమును ఆత్మను నియమించి నిరాశుడై అపరిగ్రహుడై సర్వకాలమును ఆత్మావలోకనమందు మనస్సును అలవరచవలెను.

తో॥ ఏకాంతపు స్థలమున వంటరియై
నియమించిన చిత్తాత్ముండౌ
ఏ కోరిక లేక పరిగ్రహుడై
యోగి ఆత్మసాధన పరుడౌ ॥వా॥

*తో॥ యశోదనందన యమునాతటమున
బృందావన ప్రాంత్యమునందా
ఇందీవరనయనల హృదయంబుల
యందుండిన ఓ గోవిందా ॥వా॥ ౧౦

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ॥ 11

తా॥ పవిత్రస్థానమున దర్భాసనమును జింక చర్మము వస్త్రము నొక దానిపై నొకటిగపరచి చాల తగ్గుగాని చాల ఎత్తుగాని లేక భద్రమైన ఆసనము తనకుగా సిద్ధపరచి.

తో॥ ఎత్తుతగ్గు లేకుండెడి నిర్మల
స్థలమున చేలాజిన కుశలు
మెత్తగ యాసనమును తనకుగాను
కుదిరించుట యెంతయు మేలు ॥వా॥

*తో॥ కౌంతేయులు యెంతటి పుణ్యాత్ములో
కృష్ణుడు సేవకుడై చెలియై
మంత్రియగుచు సద్గురువర్యుండై
చింతితార్థ ఫలదుండయ్యె ॥వా॥ ౧౧

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥ 12

తా॥ ఆ ఆసనమున కూర్చొని చిత్తము అట్లనె ఇంద్రియములను నియమించి మనస్సు ఏకాగ్రము చేసి ఆత్మవిశుద్ధికొరకు యోగాభ్యాసము చేయవలెను.

తో॥ ఏకాగ్రంబుగ మనసు నిలుపుకొని
ఇంద్రియముల వశపరచుకొని
ఏకభక్తి ఆసనమున కూర్చొని
ఆత్మశుద్ధిచేయగవలెను ॥వా॥

*తో॥ పూర్వజన్మమున నరునిగ కల్పన
ద్వాపరయుగమున బంధువుగ
పూర్ణవిశ్వాసముచేతను శిష్యుని
చేసి పోషించితివీ ఇలను ॥వా॥ ౧౨

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 13

తా॥ సమముగా శరీరమును శిరస్సు మెడను చక్కగ నిలిపి స్థిర చిత్తముతో దిశలుచూడక తన నాసికాగ్రమునందు చూపును నిలుపవలయును.

తో॥ దేహము శిరమును మెడను చక్కగను
నిలపియు స్థిర చిత్తముతోడ
దిశలను చూడక నాసికాగ్రమును
చక్కచూడ ప్రేమపుజాడ ॥వా॥

*తో॥ పంచప్రాణములు పాండవులనుచును
బాధలనుండియు విడపించి
పంచశరజనక పోషించితివో
పంకజలోచన దయయుంచి ॥వా॥ ౧౩

శ్లో॥ ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ 14

తా॥ మిక్కిలి శాంతమయిన మనస్సుగలిగి భయరహితుడై బ్రహ్మచర్య వ్రతమందు నిలచి మనస్సును నిలపి చిత్తము నాకర్పించి నన్నే పరమావధిగ నమ్మి యుండవలయును.

తో॥ బహుశాంతుండై భయమును విడచియు
బ్రహ్మచర్య వ్రతమును బూని
మనసును నిలపియు మచ్చిత్తుండై
యుక్తుండై హాయిగ నుండుమా ॥వా॥

*తో॥ నీవేగతియని నిఖిలేశ్వరుని
నిజముగ నమ్మిన యానరుడు
నిర్భయుడై నిత్యానందుండై
నిఖిలము హరిమయమనుచుండు ॥వా॥ ౧౪

శ్లో॥ యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15

తా॥ ఇట్లు నియతమానసుడు నిత్యము ఆత్మను స్వాధీనమును చేసికొనినవాడై సర్వోత్కృష్టమైన నాస్వాధీనమగు మోక్షసుఖమును అనగ పరమ శాంతిని బొందుచున్నాడు.

తో॥ నియమిత మానసమును గలయోగియు
ఆత్మకు సమాధానమును చేయుగా
భయరహితంబగు నాస్థానంబును
బొందు పరమ శాంతతతోనుగా ॥వా॥

*తో॥ శాంతము లేకను సుఖమెక్కడిది
శాంతమె శ్రీహరిస్థానంబు
శాంతమె పరమోత్కృష్టపదంబు
శాంతమె నిర్వాణ సుఖంబు ॥వా॥ ౧౫

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16

తా॥ అర్జున! అధికాహారము తినువానికి, ఏమి తిననివానికి, అధికనిద్ర పోవువానికి, సుతరాం నిద్ర లేనివానికి ఈ యోగము సిద్ధించదు.

తో॥ ఈ యోగంబతి తిండిపోతునకు
నిరాహారి యగువానికిని
ఓ యర్జున అతి నిద్రాపరుని
కనిద్రునకు దొరకదుగాని ॥వా॥

*తో॥ పండగ యనుచును తిండిబాగతిని
భక్తిగహరి భజనయు లేక
పండుకొనియు గురక పెట్టువారికి
పరమాత్ముని గతిలేదెరుక ॥వా॥ ౧౬

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ 17

తా॥ దుఃఖమును పోగొట్టు ఈ యోగము మితాహారము మిత సంచారము యుక్తమైన వ్యాపారముగల కర్మయు మితనిద్ర మితముగ మేల్కొనువారికే ప్రాప్తమగును.

తో॥ తగు ఆహారము తగు సంచారము
తగు కర్మయు తగు నిద్రయును
తగు జాగ్రతయునుగల మానవులకు
తగు యోగముప్రాప్తంబగును ॥వా॥

*తో॥ యుక్తాహార విహారులె ధన్యులు
యుక్తులనగ మరి ఇంకెవరు
భక్తితో పరమాత్ముని భజియింతురు
ముక్తజనులతో మెలగుదురు ॥వా॥ ౧౭

శ్లో॥ యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥

తా॥ ఎపుడు స్వాధీనమైన చిత్తము ఆత్మలోనే నిలువబడునో అపుడు సకల కామముల నిస్పృహుడనియు యుక్తుడనియు చెప్పబడును.

తో॥ చిత్తము స్వాధీనంబై బ్రహ్మము
నందే స్థిరముగ నిల్వదగు
అత్తరి కోరికలెల్లయు విడచియు
సమాధియందే యుండదగు ॥వా॥

*తో॥ యుక్తుల చిత్తము శ్రీహరియందే
యుండును వేరే తలపరుగా
భక్తితో రాముని భజన చేయుదురు
రాముడె దిక్కని తలతురుగా ॥వా॥ ౧౮

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥

తా॥ గాలిలేని ప్రదేశమునందుంచిన దీపము ఎట్లు చలించదో అట్లే ఏకాగ్రత మనోనిగ్రహము గావించి ఆత్మయోగము అభ్యసించువానికి దృష్టాంతమైనదని పలికెదరు.

తో॥ గాలిలేని చోటున దీపము యెటు
కదలకుండ వెలుగునో యట్లు
చలియించక ధ్యానించును యోగియు
ననిపలికెద రార్యులు ఇట్లు ॥వా॥

*తో॥ రాముడె సత్యము రాముడె సర్వము
రామనామమే ఆధారం
రాముని తలచిన దినమే దినమను
రాముడె గతి అను నిరంతరం ॥వా॥ ౧౯

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥

తా॥ యోగసేవచే చిత్తము నిగ్రహింపబడి యెచ్చట యుపరతిని బొందునో, యెపుడైతే తన మనస్సుచేత పరమాత్మను దర్శించి తనయందే ఆనందమును బొందునో.

తో॥ ఎప్పుడు యోగానుష్ఠానముచే
చిత్తము స్వాధీనత గలుగు
ఎపుడు మానసము ఆత్మరహస్యము
గనుగొన సంతోషము గలుగు ॥వా॥

*తో॥ యోగసేవచే యేమిలాభమగు
రాముని స్మరణే లాభమగు
బాగుగ స్మరించి ఆత్మారాముని
భక్తితో గనుటే ధన్యమగు ॥వా॥ ౨౦

శ్లో॥ సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ 21

తా॥ ఏ స్థితియందు ఇంద్రియములకు గోచరముగాక బుద్ధికి గ్రాహ్యమైన అనంతమైన సుఖము ననుభవించునో ఎక్కడ నిలచి అక్కడనుండి జారడో.

తో॥ ఇంద్రియముల కగపడకను బుద్ధికి
గ్రాహ్యంబై ఆనందమున
తొందర లేకను తత్త్వము గ్రహించి
చలింపడో యేస్థితిలోన ॥వా॥

*తో॥ సూక్ష్మబుద్ధిచే ఆత్మారాముని
సుఖస్వరూపుని స్థితినెరిగి
ఈక్షించియు నానందము బొందిన
ఆయోగి చలించడు యెరిగి ॥వా॥ ౨౦

శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే ॥ 22

తా॥ ఏస్థితిని పొందిన వెనుక వేరేలాభములు హెచ్చైనవని తోచదో యెచ్చట నిలువబడిన వెనుక మహత్తర దుఃఖములు అతని చలింప చేయజాలవో.

తో॥ సుఖస్వరూపుడై నిలచిన వెనుకను
యేలాభము నక్కరలేదో
దుఃఖమెట్టిదైనను గన్పింపదో
ఆయోగమె ముఖ్యముగాదో ॥వా॥

*తో॥ భాగవతులలో ప్రహ్లాదుడు ఈ
భావము బొందియు ధన్యుండై
భాగవతులలో మొదటివాడనియు
బేర్కొనబడియెను ముక్తుండై ॥వా॥ ౨౨

శ్లో॥ తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥ 23

తా॥ ఆస్థితి అనగ దుఃఖమేమాత్రము లేనిదానినే యోగమని తెలియ వలయును. నిశ్చయించి విసుగులేని మనస్సుచే అనుష్ఠించవలయును.

తో॥ ఏ మాత్రము దుఃఖము లేకుండునో
దానిని యోగంబనియెదరు
ప్రేమచేత సాధించగ వలయును
నిర్మల మనసుచె గనియెదరు ॥వా॥

*తో॥ ప్రహ్లాదుడు తండ్రియు బహువిధముల
బాధించిన భయమొందకను
ఆహ్లాదంబున హరిని భజించియు
ఆనందించెను నియమమున ॥వా॥ ౨౩

శ్లో॥ సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వానశేషతః।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ 24

తా॥ సంకల్పమువలన బుట్టు సమస్తకోరికలన్నిటిని నిశ్శేషముగా వదలి పెట్టి మనస్సుచే ఇంద్రియసముదాయమును అన్నివైపుల నియమించి.

తో॥ సంకల్పముచే గలిగినకోర్కెలు
నిశ్శేషంబుగ విడచియును
నిగ్రహించవలె ఇంద్రియంబులను
యోగము ప్రారంభించవలెన్ ॥వా॥

*తో॥ బహిర్ముఖములయి ఇంద్రియ సముదయ
మెప్పుడు కోర్కెలు కోరుచును
తహతహ పడుచును నుండును గావున
శ్రీహరి నామమె మందగును ॥వా॥ ౨౪

శ్లో॥ శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥ 25

తా॥ ధృతిని (ధైర్యము) పొందిన బుద్ధిచే మెల్ల మెల్లన శాంతి పొంద వలయును. ఆత్మయందే మనస్సు నిలిపి యుపరతి బొందవలయును. వేరేవస్తు చింతన విడచిపెట్టవలయును.

తో॥ ఆత్మయందు మనసును దృఢబుద్ధిచె
మెల్లమెల్లగను నిలుపుచును
ఆత్మదృష్టి గాకను వేరేమియు
చింతింపక నుండగ వలయున్ ॥వా॥

*తో॥ ఆత్మారాముని అనుదినంబునను
ఆనందంబుగ నుడువుచును
ఆత్మ తప్ప అడుగారెడు ఉపాల
అనుసంధానము నుడగవలెన్ ॥వా॥ ౨౫

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥ 26

తా॥ చంచలమైన అస్థిరము అయిన మనస్సు ఎచ్చటెచ్చట సంచరించుచున్నదో అచ్చటినుండి దానిని కట్టి తెచ్చి ఆత్మయందే వుండేలాగున చేయవలయును.

తో॥ ఏయే విషయంబుల లగ్నంబయి
చంచల మనస్సు చేరినదో
ఆయావిషయంబుల మరపించియు
చేర్చవలయు రామునియందే ॥వా॥

*తో॥ ఉదయము మొదలుగ విషయభోగముల
వశవర్తుండై జీవుండు
ఊపిరి వెడలెడి వరకును చింతన
చేయుచుండు కడులోభుండై ॥వా॥ ౨౬

శ్లో॥ ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27

తా॥ శాంతమనస్సుగలవాడును పోయినరజోగుణముగలవాడును బ్రహ్మభూతుడును కల్మష రహితుడునగు యోగిని శ్రేష్ఠమైన బ్రహ్మానందము తనకు తానే పొందును.

తో॥ శాంత చిత్తమును రజోరహితమును
కల్మష రహితుండగు యోగికి
స్వాంతము ఆత్మానందము నొందగ
బ్రహ్మ సుఖము తానే పొందుకా ॥వా॥

*తో॥ నంద నందన నవనీతచోరా
సుందరాకార శ్రీకృష్ణ
మందరగిరిధర మానినీవర
ఇందురార శ్రీహరికృష్ణ ॥వా॥ ౨౭

శ్లో॥ యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖమశ్నుతే ॥ 28

తా॥ ఈ రీతి ఎపుడును మనస్సును వశము చేయుచున్న విగతకల్మషుడగు యోగి సుఖముగ బ్రహ్మనుదర్శించి శ్రేష్ఠమైన సుఖమును పొందుచున్నాడు.

తో॥ సదా కాలమును కల్మషరహితుడై
మనసును తన వశపరచుకొని
హృదయము బ్రహ్మలో చేర్చియు యోగియు
అత్యంత సుఖంబును పొందుకా ॥వా॥

*తో॥ గోపీరమణ గోవర్ధన ధర
గోపవినుత హరి శ్రీకృష్ణ
మాంపాలయ ఆపన్న జనావన
వేణుగోపాల హరికృష్ణ ॥వా॥ ౨౮

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ 29

తా॥ యోగయుక్తమైన ఆత్మగలవాడు సర్వత్ర సమాన దృష్టిగలవాడై తన ఆత్మ సకలభూతములలో విలసిల్లుచున్నదనియు, సకల భూతములు తనలో విలసిల్లుచున్నవనియు తెలియును.

తో॥ సర్వత్రను సమదర్శన యోగియు
సర్వభూతముల గల ఆత్మగా
సర్వవిధంబుల తానే యనియును
సర్వము తనలోనిదె యనుచుగా ॥వా॥

*తో॥ సర్వకాలముల సర్వేశ్వర నిను
సర్వము నీవని నెరుగుచును
సర్వాధారుడ సమముగ చూడగ
అనుగ్రహించుము మ్రొక్కెదను ॥వా॥ ౨౯

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ 30

తా॥ ఎవడు నన్ను సర్వవస్తువులలోను, సర్వవస్తువులను నాలోను చూచునో అతనికి నేను పరోక్షమును పొందను. వాడును నాకు పరోక్షమును పొందడు.

తో॥ అన్ని వస్తువుల ననుగనుటయు మరి
అన్నివస్తువులు నాలోను
కన్నవానికినే నాకును నాతడు
కనపడుచుందుము నిరతమును ॥వా॥

*తో॥ ననుభజియించెడి వాడును ననుగను
వాని నేను నేమారకను
గనుచుందును ప్రత్యక్షంబుగను
పరోక్షులము గామెప్పుడును ॥వా॥ ౩౦

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31

తా॥ ఏ యోగి సర్వభూతముల యందుండు నన్ను అభేద బుద్ధిచేత భజించుచున్నాడో అతడు సర్వప్రకారములచేత వర్తించుచున్నను నాయందు వర్తించుచున్నవాడగును.

తే॥ సర్వభూతముల నుండెడి నన్నును
అభేద దృష్టిచే భజించిన
సర్వవిధంబుల వర్తించినను
ఆ యోగియు నాలో యుండుగ ॥వా॥

*తే॥ ఈశ్వర దత్తంబగు దేహముచే
ఈశ్వరప్రీతిగ కర్మలను
ఈశ్వర భజనతో సల్పియు సర్వము
ఈశ్వరుడేయను త్యాగిలను ॥వా॥ ౩౧

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32

తా॥ అర్జున! ఎవడు సుఖమైనను దుఃఖమైనను ఆత్మభావనచేత సర్వత్ర సమముగాచూచునో ఆ యోగి శ్రేష్ఠుడని తలపబడినవాడు.

తే॥ అర్జున అందరి సుఖదుఃఖంబులు
తనవని ఎప్పుడు భావించు
పరులకు ప్రతికూలంబును చేయక
పరగునతడు సమ్మతుడంచు ॥వా॥

*తే॥ సర్వత్రను పరమాత్ముం డొక్కడని
సమదృష్టిచె చూచెడి అతడు
సర్వుల సుఖదుఃఖంబులు తనవని
సహాయ పడువా డుత్తముడు ॥వా॥ ౩౨

అర్జున ఉవాచ:—

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన।
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్స్థితిం స్థిరామ్ ॥ 33

తా॥ మధుసూదన! నీచేత చెప్పబడిన సమాధాన బుద్ధిచే ఈ యోగము ఉత్తమపక్షమే. చంచలతచే ఈ యోగము స్థిరముగ నుండుట నాకు చూడ కనపడదు.

తో॥ మధుసూదన ఈ యోగము నీచే
విన్నది నడచుట బహుకష్టమ్
మనసు దృఢముగను నుండదె ఇంకెటు
చూడవచ్చు ఈ సమత్వము ॥వా॥

*తో॥ అన్నిటికిని నీవాధారుడవని
ఆర్యులచే విన్నాను హరి
అన్నిటి గన అన్యముగను తోచక
ఆధారుడ వగుపడుము హరి ॥వా॥ 33

శ్లో॥ చఞ్చలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ 34

తా॥ ఎందుకనగ కృష్ణ! మనస్సు చంచలమైనది. క్షోభపెట్టునది. నిగ్రహింప శక్యముగానిది. దృఢమైనది. వాయువును నిగ్రహించుట ఎట్లనో అట్లే నిగ్రహించుట అశక్యమని తలచెదను.

తో॥ కృష్ణా మనస్సు క్షోభపెట్టు మరి
నిలువపెట్ట సాధ్యముగాదు
గాలిని కట్టుట ఎట్లో అట్లే
మనసు నిలుప శక్యము గాదు ॥వా॥

*తో॥ చంచలంబు ఈ మనసు తమాధవ పంచన లేకను బల్లైదను
సంచిత పాపవినాశన ఇదెనీ పంచలో నుంచుము మ్రొక్కెదను॥వా॥

శ్రీభగవానువాచ:—

శ్లో॥ అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥ 35

తా॥ మహాబాహుఁడవగు కౌంతేయ! చంచలమైన మనస్సును నిగ్రహించుట దుర్ఘటమనునది సందేహములేదు. అయినను అభ్యాసముచేతను వైరాగ్యమువల్లను దానిని కట్టవచ్చును.

తే॥ చంచల మయినది మనసు నిశ్చయము
నిగ్రహింప శక్యముగాదు
సంచలింపకను వైరాగ్యంబున
అభ్యసింప లోఁపడగలదు ॥వా॥

*తే॥ ఆరామంబుల ధనధాన్యంబుల
భార్యల యందలి భ్రాంతియును
శ్రీరాముని పాదారవిందముల
చేర్చుటయే వైరాగ్యమగుగా ॥వా॥ 35

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః॥36

తా॥ మనోనిగ్రహము లేనివానికి యోగము సాధ్యములేదని నా అభిప్రాయము. అయితే మనస్స్వాధీనముగలిగి ప్రయత్నపడువానికి ఉపాయమువల్ల యోగము ప్రాప్తమగుట శక్యము.

తే॥ మనోనిగ్రహము లేనివానికిని
యోగము పొందగ నలవడదు
మనోనిగ్రహంబునను ప్రయత్నత
ఉపాయమున యోగము గలదు ॥వా॥

*తే॥ జగదీశ్వర నేలక్కర వేడెద•జాగునేయకను శ్రీకృష్ణ
జన్మసార్థకము నొందగ ప్రజ్ఞ యు•చేర్చుము నీలో శ్రీకృష్ణ॥వా॥

అర్జున ఉవాచః—

శ్లో॥ అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి ॥ 37

తా॥ కృష్ణా! శ్రద్ధతో కూడుకొన్నవాడయినను అయతిః - మనోనిగ్రహ శక్తిలేదు. ఇట్టివాడు యోగమునుండి చలింపబడిన మనస్సుగలవాడై యోగసంసిద్ధి పొందక ఏగతి పొందుచున్నాడు?

తో॥ శ్రద్ధ గలిగినను యోగము నుండియు
చలించు మానస మనుజుండు
శ్రీకృష్ణ సిద్ధిని పొందక మరి
యే గతి పొందును చపలుండు ॥వా॥

*తో॥ నీవేగతియని నమ్మిన వాడను॰దేవకీ తనయ శ్రీకృష్ణ
సావధానమున నా బుద్ధియు నీ॰సేవలో నిలుపవె హరికృష్ణ॥వా॥

శ్లో॥ కచ్చిన్నోభయ విభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి॥ 38

తా॥ మహాబాహో! శ్రీకృష్ణమూర్తీ! మోహగ్రస్తుడై బ్రహ్మప్రాప్తి మార్గములో విమూఢః-మూఢుడైన పురుషుడు అనగ స్థిరబుద్ధి లేనిదానిచ్చే ఉభయములను పోగొట్టుకొని చెడిన మేఘమువలె చెడిపోడా యేమి?

తో॥ బ్రహ్మమార్గమున పట్టువిడచియును
మోహామార్గమున బడి కృష్ణ
రెంటను భ్రష్టుడై చెదరిన మేఘము
గతి చెడకుండున శ్రీకృష్ణ ॥వా॥

*తో॥ దేహేంద్రియ సుఖ భోగంబులకై
దేహీ అని కోరుట లేదు
మోహ నాశనము చేసెద వనుచును
మోహించితి నీ పదమందు ॥వా॥ 3౮

శ్లో॥ ఏతన్మే సంశయం కృష్ణ! ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 39

తా॥ కృష్ణా! ఈనాసంశయమును నీవే నిశ్శేషముగ పోగొట్టవలయును. ఇట్టి సంశయము నివారణ చేయుటకు నీవుగాక మరొకరు లేరు.

త॥ ఈ సంశయమును నిశ్శేషంబుగ
పోగొట్టగ నేవేడెదను
వాసుదేవ నీకన్నను వేరే
గానను సంశయ ముడుపగను ॥వా॥

*త॥ కేశవనారాయణ మాధవ నీకే శరణంటిని శ్రీకృష్ణ
వాసుదేవ దామోదర మాధవ ఆశదీర్పు శ్రీహరికృష్ణ॥వా॥

శ్రీభగవానువాచ:—

శ్లో॥ పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి ॥ 40

తా॥ పార్థ! అట్టివానికి ఇహలోకమునను పరలోకమునను ఎప్పటికి వినాశము కలుగదు. ఏలనగ నాయన! కల్యాణకరమైన కర్మలు చేయువాడు ఎవడేకాని అతడు దుర్గతి పొందడు.

త॥ అర్జున యోగ భ్రష్టుడు ఇహపర
ములను చెడడు నా తండ్రి విను
పరమార్థముకై ప్రయత్నపడువా
డెన్నడు దుర్గతి గనడుగను ॥వా॥

ప్రార్థన:—

*త॥ సాధు సత్పురుషుల పాలిటి కృష్ణ
బాధల పోదోలుము కృష్ణ
క్రోధాదుల తొలగింపుము కృష్ణ
ఓ దయామయుడ హరికృష్ణ ॥వా॥ ౮౦

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥41

తా॥ పుణ్యవంతుల శుచియైన లోకమునుపొంది అచట బహువత్సరములవరకు ఉండుకొని ఆ యోగభ్రష్టుడైన పురుషుడు సదాచారవంతులైన శ్రీమంతుల గృహములయందు పుట్టుచున్నాడు.

తో॥ యోగభ్రష్టుడు పుణ్యము చేసిన
వారి లోకమును బొందియును
భోగములొందియు చాలకాలమును
శ్రీమంతుల ఇండ్లను బుట్టుగ ॥వా॥

*తో॥ తండ్రీదయానిధివి శ్రీకృష్ణ
పాండు కుమారుల బ్రోచితివి
నిండుదయను నాపై శ్రీకృష్ణ
దండిగ నిడవే వినుమనవి ॥వా॥ ౪౧

శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ 42

తా॥ అథవా ఆతడు బుద్ధిమంతులైన యోగి కులమున బుట్టును. ఈ ప్రకారమయిన జన్మధరించుట లోకములో బహుదుర్లభమైనదే.

తో॥ అథవా యాతడు నిశ్చలాత్ములగు
యోగి కులంబున జన్మించుగ
అతిదుర్లభమిది యోగుల ఇండ్లను
జన్మము నెత్తుట చూడగను ॥వా॥

*తో॥ రామహరేయని కృష్ణహరేయని
నామము బలుకుచు శ్రీకృష్ణ
నేమంబున సత్కర్మలు చేసియు
నీకర్పించెద శ్రీకృష్ణ ॥వా॥ ౪౨

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన ॥ 43

తా॥ అట్లు జన్మించి కురునందన! పూర్వజన్మపు బుద్ధిసంస్కారము పొందుచున్నాడు. పిమ్మట హెచ్చైన సిద్ధినిపొంద ప్రయత్నపడుచున్నాడు.

తో॥ కురునందన యోగాముఁడు జన్మమునను
మునుపటి జన్మపు సంబంధం
కర్మబుద్ధిచే ధన్యుఁడగుటకును
చేయును జన్మము ధన్యత్వం ॥వా॥

*తో॥ యోగీశ్వర శ్రీకృష్ణ నీవును
సిద్ధత్తుండగు అర్జునుడున్
భాగవతుల పాదధూళి యగునా
హృదయంబున వసియింప వలెన్ ॥వా॥ ४३

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44

తా॥ అతడు తానుగా ప్రయత్నింపక నుండినను పూర్వజన్మ అభ్యాసముచేత విషయవిముఖుడై యోగమునకు లాగబడుచున్నాడు. ఇచ్ఛగల సాధకుడైతే యోగముచే శబ్దబ్రహ్మమును మీరుచున్నాడు.

తో॥ చిత్తము స్వాధీనము లేకుండిన
పూర్వపు యభ్యాసపు క్రమము
ఉత్తమమార్గము జూపును కర్మపు
ఫలమును మీరును ఇదినిజము ॥వా॥

*తో॥ సాధకులైతే రాముని మఱువరు
సాధన లేకుండెడి వారున్
సాధనగల వారల సహాయమున
సాధింతురు వారిప్రసాదమున్ ॥వా॥ ४४

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్ ॥ 45

తా॥ యోగి ప్రయత్నపూర్వకముగ యత్నముచేయుచున్నవాడై పాపములనుండి విడుదలగలవాడై అనేకజన్మములకునైనను సిద్ధినిపొంది కడకు ఉత్తమ స్థానమును పొందుచున్నాడు.

తో॥ ప్రయత్నంబునను పాపరహితుడై
యత్నము చేయుచు యోగియును
బహుజన్మంబులకైనను సిద్ధిని
బొందియు యుత్తమ గతిపొందుగా ॥వా॥

*తో॥ శ్రీకృష్ణా నీభజన చేయుటయు
బహుజన్మంబుల కడపటనే
వాక్కుతోను శ్రీకృష్ణుని తలపగ
సత్పురుషుల దయగలుగగనే ॥వా॥ ౪౫

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 46

తా॥ ఓయి అర్జున! తపస్వులకంటెను జ్ఞానులకంటెను కర్మిష్ఠులకంటెను యోగి అధికుడు కావున నీవు యోగివికమ్ము.

తో॥ తపసులకంటెను జ్ఞానులకంటెను
కర్మఫలాసక్తుల కంటే
పాపరహిత యోగియు నుత్తముడగు
కావున యోగియు కమ్మంటి ॥వా॥

*తో॥ యోగియు శ్రీహరి నామము తలంచి
సుఖదుఃఖంబుల తామరచు
భోగించును న్యాయార్జిత ధనముల
శ్రీకృష్ణుండిచ్చిన దనుచు ॥వా॥ ౪౬

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా ।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥

తా॥ యోగులందరిలో నైనను ఎవడు నాయందుచేరిన అంతఃకరణముతో శ్రద్ధావాన్ - భక్తుడై, మాం భజతే - నన్ను భజనచేయునో అట్టివాడు యోగులలో నుత్తముడనుచు మే మతః - నాయొక్క మతము.

తో॥ భక్తియుక్తముగ అంతఃకరణము
నాయందే నిలపియు చాల
భజియించిన వాడందరి లోనను
యుక్తుడు నాకౌంతేయ చాల ॥వా॥

*తో॥ అంతరంగమున ఆత్మారాముని
ఆనందంబున భజియించు
సంతసంబునను సద్గుణమణులను
స్వామికి ప్రీతిగ నర్పించు ॥వా॥ ౪౭

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే ఆత్మసంయమ యోగో
నామ షష్ఠోఽధ్యాయః.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతాసంగీతము

## విజ్ఞానయోగము — సప్తమాధ్యాయము.



తో॥ వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ
వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ ॥వా॥

తో॥ విజ్ఞానంబన తన అనుభవమగు
తను తానెరగిన ధన్యుడగు
ఈ జ్ఞానము నెరిగిన వేరేమియు
యెరుగడు నాదావే మరగు ॥వా॥

తో॥ మనుజులందరీ జ్ఞానము నెరుగగ
మునుచేసిన పుణ్యపు రాశి
అనుకూలంబును అందిన వారలు
అందెద రానందపు రాశి ॥వా॥

తో॥ వేల సంఖ్య మనుజులలో నొక్కడు
ప్రయత్నవడునని పరమాత్మ
పలికెను గావున పుణ్యాత్ములిపుడు
ప్రయత్న పడి గనవలె నాత్మ ॥వా॥

శ్రీభగవానువాచ:—

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుఞ్జన్మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ 1

తా॥ పార్థ! నాయందు ఆసక్తమయిన మనస్సుగలవాడై నన్నే ఆశ్రయించి యోగమును ఆచరించితే నీవు సమగ్రముగ సంశయములేక ఎట్లు నా జ్ఞానము తెలియగలవో అది నీకు తెలిపెదను వినుము.

తో॥ నాయందే మనసుంచియు నేనే
ఆశ్రయమని నమ్మియును విను
నాయోగము సల్పుచును పార్థనను
తెలియు విధానము తెలిపెదను ॥వా॥

*తో॥ నను సమగ్రముగ నిస్సంశయముగ
నాస్వరూపమును నెరుగగనూ
నను మనమున ధ్యానించగవలయును
నను వినహా లేదనవలెను ॥వా॥ ౧

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః।
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే॥ 2

తా॥ నీకొరకు అనుభవ విజ్ఞానముతో కూడిన శాస్త్రీయ జ్ఞానమును విశదముగ నీకు తెలిపెదను. ఈ జ్ఞానమును తెలిసితివేని మోక్షవిషయమై నిక తెలియతగినది మరియొకటి మిగిలి ఉండదు.

తో॥ దేనిని దెలిసిన పిమ్మట భువిలో
దెలియగలది యేదియు లేదు
విజ్ఞానముతో కూడిన జ్ఞానము
దెలిపెద విను బలుకులు నాదు ॥వా॥

*తో॥ నీవే గతి అని కోరిభజించిన•దేవకి వసుదేవుల కొరకై
శ్రీవర కారాగారములో అవ•తార మెత్తితివి భక్తులకై ॥వా॥

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3

తా॥ వెయ్యింటి కొకడేవడో మనుష్యుడు సిద్ధి బొందవలయునని ప్రయత్నపడును. (ఇట్లు) ప్రయత్నపడు సిద్ధులలో ఎవడో ఒకడు నాయొక్క నిజమైన స్వరూపజ్ఞానము తెలియుచున్నాడు.

తో॥ పది నూరుల మనుజులలో నొక్కడు
పరమార్థ జ్ఞానము కొరకుగా
ప్రయత్నపడు వారలలో నన్నును
ఒకానొకడు చక్కగ నరయుగా ॥వా॥

*తో॥ కారాగారములో కాపురము
కాపాడుము తండ్రీ! అనగ
మీరలు తలితండ్రులనుచు వారల
కొడుకుగ జన్మంబై తివిగ ॥వా॥ 3

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4

తా॥ భూమి జలము అగ్ని గాలి ఆకాశము మనసు బుద్ధి అహంకారము ఈ రీతి నా ప్రకృతి అంతయూ ఎనిమిది విభాగములుగ నున్నది.

తో॥ పృథివీ జలమును అనలము వాయువు
గగనము మనసును బుద్ధియును
కుంతీతనయ అహంకారమును
అని యెనిమిది ప్రకృతిలని గను ॥వా॥

*తో॥ దేవకి వసుదేవుల నోము పంట
దేవదేవ వందనమిదిగో
శ్రీవల్లభ నా చిత్తము నీలో
చేర్చవయ్యా చిత్తంబిదిగో ॥వా॥ ४

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥

తా॥ ఇది నికృష్టమయినది. మహాబాహో! దీనికన్నను వేరొక శ్రేష్ఠమయిన నాప్రకృతి యున్నది. జీవరూపమయినది ఈ జగత్తును ధారణచేయునట్టిదని నీవెరుంగుము.

తో॥ ఈ ప్రకృతియు విను కనిష్టమయినది
వేరొకటున్నది ప్రకృతిగను
ఈ ప్రపంచమును ధరించునాదగు
జీవరూపమది మేలగును ॥వా॥

*తో॥ నందయశోదల భాగ్యమేమందు
అందముగను నీ ఆటలను
చందురు బోలెడి నీదుముఖంబును
చూచు భాగ్యమును పొందగను ॥వా॥ 5

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ 6

తా॥ సకలమయిన భూతములు (ఈ రెండు ప్రకృతులవల్లనే) వీటినుండియే పుట్టునని యెరుంగుము. సర్వజగత్తు పుట్టుటకు పోవుటకుకూడా నేనే కారణమని యెరుంగుము.

తో॥ సర్వభూతములకును కారణములు
రెండుప్రకృతులే యనితెలియు
సర్వజగత్తును పుట్టుటకును మరి
పోవుటకును నేనేయనియు ॥వా॥

*తో॥ ప్రపంచమునకును ప్రభుడవు కృష్ణ
ఉత్పత్తి స్థితులకు కృష్ణ
ప్రపంచ నాశన వేళలో కృష్ణ
ప్రకాశించెదవు హరికృష్ణ ॥వా॥ 6

శ్లో॥ మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7

తా॥ ధనంజయ! నాకన్నను శ్రేష్ఠమయినది వేరే మరొకటి ఏదియును లేదు. దారములో మణులసముదాయము కట్టబడినట్లు ఇదంతయు నాలో కట్టబడియున్నది.

తో॥ ఓయి ధనంజయ శ్రేష్ఠమయినదియు
నాకంటెను వేరేలేదు
సూత్రమునందలి మణులవలెను ఈ
జగత్తులున్నవి నాయందు ॥వా॥

*తో॥ బ్రాహ్మణ జనములు బాలకృష్ణునిను
పరబ్రహ్మమని భావించి
బ్రహ్మతంత్రి ఓ పరమపురుష యని
ప్రార్థనచేసిరి నినుతలచి ॥వా॥ 2

శ్లో॥ రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః॥
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8

తా॥ కౌంతేయ!నీటియందలి రసము నేనే. చంద్రసూర్యుల కాంతి నేనే. వేదములయందలి ప్రణవము నేనే. ఆకాశమందలి శబ్దము నేనే. మనుష్యులలో పౌరుషము నేనే.

తో॥ జలమున రసమును శశిసూర్యులతే
జము వేదంబుల ఓంకారం
గగనములో శబ్దము పురుషులలో
పౌరుషమును నేనని గనుము ॥వా॥

*తో॥ బ్రాహ్మణ పత్నులు పరతెంచియునిను
పరికించియు దీవించియును
బ్రహ్మ స్వరూపమని భావించిరి
బ్రహ్మానందము నొందుచును ॥వా॥ ౩

శ్లో॥ పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ 9

తా॥ భూమియందలి సుగంధము నేను. వహ్నియందలి వేడిమి నేను. తాపసుల తపస్సు నేను. సర్వభూతముల జీవనమే నేను.

త॥ భూమిసుగంధము అగ్నిలో తేజము
సర్వభూతముల జీవనము
నేమంబునుగల తాపసుల తపము
కుంతీసుత నేననిగనుము ॥వా॥

*త॥ నందయశోదా నందవర్ధనా
నందిత సురగణ గోవిందా
మందిత పూతన మందర ధారణ
నందవ్రజ సుజనానందా ॥వా॥ ౯

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥ 10

తా॥ పార్థ! సనాతనుడయిన నేను సర్వభూతముల బీజమని నెరుగుము. బుద్ధిమంతుల బుద్ధియు, తేజస్సుగల వానియందు తేజస్సు నేనే అనియెంచు.

త॥ సర్వభూతముల అనాది బీజము
బుద్ధిమంతుల వివేకమును
పార్థ ప్రకాశవంతుల తేజము
నేనని గమనించియును విను ॥వా॥

*త॥ పురాణ పురుషుడ పుణ్యశరీరా
పూతన సంహార శ్రీకృష్ణ
పురుషోత్తమ నిను పూజచేసెదను
పోషించుము ప్రేమను కృష్ణ ॥వా॥ ౧౦

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ! ॥ 11

తా॥ భరతర్షభ! బలవంతులయందలి కామరాగములేని బలము నేను. భూతములయందు ధర్మమునకు విరుద్ధములేని కామము నేనే.

తో॥ బలవంతులలో కామము రాగము
లేకుండెడి బలమును నేను
భూతములందున ధర్మము మీరని
భరతర్షభ కామము నేను ॥వా॥

*తో॥ సకలావని పాలక పూజిత పద
శకటాసురభంజన కృష్ణ
సకలలోకములకును తలితండ్రివి
అకళంకుండవు హరికృష్ణ ॥వా॥ ౧౧

శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ 12

తా॥ సాత్త్వికమనునవి రాజసమనునవి తామసమనునవి భావములు నానుంచి అయినవని తెలియుము. అవి నాయందు అయినవయినను నేను వాటిలో లేను.

తో॥ సాత్త్విక రాజస తామస గుణముల
భావము లంతయు నాయందుఁ
ఉత్పత్త్యైనవి ఎవిగను ఎవిటిలో
నేలే నవి నాయందుండుఁ ॥వా॥

*తో॥ చంప తలచి నిను గొనిచన కృష్ణ
తృణావర్తునకు తూకంబై
పెంపడరగ కంఠము బట్టుకొనియు
చంపితివాతని భారంబై ॥వా॥ ౧౨

శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్॥13

తా॥ త్రిగుణమయమైన భావములచే మోహితమైన ఈ సర్వజగత్తు ఈ గుణములకన్నను విలక్షణుడైన అవ్యయుడగు నన్ను కనుగొనజాలదు.

తో॥ సర్వజగత్తును మూడు విధంబుల
గుణముల భావంబుల నొందు
సర్వ గుణాతీతుండగు నన్నును
అవ్యయు ఆనందుని గనదు ॥వా॥

*తో॥ సుఖముగ నినుగొని చులకనవాడని
చూచినందులకు భారంబై
సుఖమిచ్చితివా తృణావర్తునకు
ప్రయాణ సమయపు భాగ్యంబై ॥వా॥ ౧౩

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥ 14

తా॥ గుణాత్మకమైన ఈ నాదివ్యమాయయు దుస్తరమైనది. అందువలన నన్ను ఎవరు ప్రపత్తిచేయుచున్నారో వారు ఈ మాయను అతిక్రమించెదరు.

తో॥ గుణమయమగు ఈ దివ్యమయిన నా
మాయను మీరుట దుర్లభము
గురు కృప నన్నే శరణని నమ్మిన
మాయను మీరుటయు సులభము ॥వా॥

*తో॥ నంద కుమారా! నవనీత చోరా
శ్రీవత్సాంకిత శ్రీకృష్ణ
మందరగిరిధర మామనోహర
తులసీమాల ధరకృష్ణ ॥వా॥ ౧౪

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥ 15

తా॥ దుష్కర్మలు చేయు మూఢులగు నరాధములు అసురీబుద్ధి నాశ్రయించి మాయచే జ్ఞానశూన్యులై నన్ను శరణు చెందరు.

తో॥ దుష్కృత్యములును చేసెడి మూఢులు
మాయచేత మోహితులగుచు
రాక్షసభావముచే నరాధములు
నను తలపరు శరణంబనుచు ॥వా॥

*తో॥ సత్వగుణుండై గుణరహితుండగు
నిన్ను భజించుచు శ్రీకృష్ణ
సత్యాన్వేషణ చేయుచునుండిన
దర్శనమిత్తువు హరికృష్ణ ॥వా॥ ౧౫

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున!।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!॥ 16

తా॥ భరతర్షభ! పుణ్యవంతులగు నలుతెరంగుల జనులు నన్ను భజించుచున్నారు. (వారెవరనిన) ఆర్తులు జిజ్ఞాసులు అర్థార్థులు జ్ఞానులు.

తో॥ నలుగురు నన్ను భజింతురు సుకృతులు
ఆర్తులు జిజ్ఞాసులు మరియున్
పలువిధ కోరికలను గల మనుజులు
ఆత్మజ్ఞానులు పార్థ! విను ॥వా॥

*తో॥ ఆర్తులయిన జిజ్ఞాసువులయినను
కోర్కులు కోరెడి వారయినన్
ఆత్మజ్ఞానులు నగు ఈ నలువిధ
మనుజులు ధన్యులు నిను తలపన్ ॥వా॥ ౧౬

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః॥17

తా॥ వీరిలో నిత్యయుక్తుడు ఏకభక్తిగల జ్ఞానియే ఉత్తముడు. నేను ఆ జ్ఞానికి అత్యంతమైన ప్రియుడను. నాకైతే అతడు చాలాప్రియుడు.

తో॥ వీరిలో నిత్యము ఏకభక్తిగల
ఆత్మజ్ఞానియె నుత్తముడు
వీనికి నేమిక్కిలి ప్రియవంతుడ
నాకైతే చాలాప్రియుడు ॥వా॥

*తో॥ గోకులమున నిను గోప గోపికా
గోమతులును గోవిందా రా
గోపాలాయని కోరిపిలుచుచును
గొనియాడిరి ధన్యులుగారా ॥వా॥ ౧౭

శ్లో॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥18

తా॥ ఈ నలుగురువారును ఉత్కృష్టులే. అయినను జ్ఞానియైతే నా ఆత్మే అని నేనెంచినాను. ఏలనగ యుక్తచిత్తుడైన వతడు నన్నే శ్రేష్ఠమైన ప్రాప్యస్థానమని నాలోనే స్థిరుడై యుండును.

తో॥ నాల్గు మార్గముల వారలందరును
ఉత్తములనియే నా మతము
నా గతినే కోరిన యాజ్ఞానియు
నా ఆత్మే అని నా మతము ॥వా॥

*తో॥ తన మనసును నీపదమందర్పణ
సల్పిన జ్ఞానియు గాకేమి
తను మన ధనములు నీకర్పించిన
ధన్యుడగును గాకింకేమి ॥వా॥ ౧౮

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19

తా॥ అనేకజన్మములు ఎత్తి కొనవు ఇదంతయు వాసుదేవుడే అని జ్ఞానివన్ను పొందుచున్నాడు. అట్టి మహాత్ముడు అరుదు.

తో॥ బహుజన్మంబుల గడపట జ్ఞానియు
భక్తితో నను నమ్మియు నుండు
ప్రపంచమంతయు వాసుదేవుడను
బహుదుర్లభుడా మహాత్ముడు ॥వా॥

*తో॥ బహుజన్మంబులు గడవగ జ్ఞానము
గల్గియు నన్నే సేవించుగా
ప్రపంచమంతయు వాసుదేవుడను
నతడే మహాత్ముడన నొప్పుగా ॥వా॥ ౧౯

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా॥20

తా॥ వారివారి ప్రకృతి నియమానుసారము జ్ఞానశూన్యులై భోగముల కొరకై ఆయా అన్యదేవతారాధన నియమానుసారము అవలంబించి శరణు బొందెదరు.

తో॥ ప్రకృతి స్వభావము ననుసరించుకొని
జ్ఞానంబును పడగొట్టుకొని
లోకసుఖముకై అన్యదేవతల
నర్చింతురు ఆనియమమున ॥వా॥

*తో॥ గోపికాంగనలు గోవిందా నిను
కోరిమొత్తుకొని గృహములను
గోరికతో నవనీతము నొసగియు
గోమరొప్పగ ప్రేమించియును ॥వా॥ ౨౦

శ్లో॥ యోయో యాంయాం తనుం భక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥ 21

తా॥ ఎవడెవడు నేయే కోరికలచేత ఏ ఏ దేవతా విగ్రహమును భక్తి శ్రద్ధలతో గొలువనో వానివానికి ఆయా దేవతలయందు శ్రద్ధను చలింపకుండు నట్లు చేయుచున్నాను.

తొ॥ ఎవడెవడేయే కోరికచేతను
ఏ యే దేవతా మూర్తిని
సేవను చేయునో ఆయా దేవత
లను కల్పింతును నిజ భక్తిన్ ॥వా॥

*తొ॥ చిన్ని యన్నరా వెన్న దొంగరా
మన్ననచూపర మానాథా
పన్నగ శయనా పన్నజనావన
అని కొనియాడిరి శ్రీనాథా ॥వా॥ ౨౧

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే।
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్హితాన్ ॥ 22

తా॥ ఈ రీతి స్థిరమైన శ్రద్ధగలవాడై ఆ దేవతామూర్తిని ఆరాధన చేయువాడగును. అపుడాతడు నానుంచియే ఇవ్వబడినకామఫలములుబొందును.

తొ॥ ఆ భక్తుడు శ్రద్ధావంతుండై
ఆ దేవత నర్చించగను
ఆ దేవత మూలముగను నాచే
అందించిన ఫలమును బొందున్ ॥వా॥

*తొ॥ నంద వ్రజమున నారీజనులా
నందంబున తమ గృహములను
అందంబుగ నిను ఆరాధించియు
పొందిరి బ్రహ్మానందమును ॥వా॥ ౨౨

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి ॥ 23

తా॥ అయితే ఆ అల్పబుద్ధులకు లభించెడిఫలములు నాశనమగునవి. దేవతా రాధన చేయువారు ఆయా దేవతాలోకమును పొందెదరు. నాభక్తులు నన్నే పొందెదరు.

తో॥ అల్పబుద్ధులును పొందెడి ఫలములు
నశించు పూజించెడి వారు
ఆయా దేవతలను పొందెదరు
నా భక్తులు నను పొందెదరు ॥వా॥

*తో॥ యశోద నందులు ఎంతటి పుణ్యులో
ఎల్లకాలమును నిను తలచి
కిశోర కృష్ణ రార తండ్రియని
కొనియాడిరి ప్రేమను పెంచి ॥వా॥ ౨౩

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।
పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్ ॥ 24

తా॥ నేను అవ్యయుడు, అత్యుత్తముడు అను శ్రేష్ఠతరమైన భావమును తెలియక మూఢులు అవ్యక్తుడైన నన్ను వ్యక్తునిగ ఎంచుచున్నారు.

తో॥ అవ్యయు డత్యుత్తముండు ననియును
అరయరు నా పరమోత్తమము
అవ్యక్తుండని తెలియక మూఢులు
వ్యక్తుడనుచు తలతురు తాము ॥వా॥

*తో॥ దేవకి వసుదేవులు తమ కృష్ణుడు
నంద వ్రజమున నుండగను
దేవదేవ సర్వోత్తమ నవ్యయ
దాసపోష అని తలచిరను ॥వా॥ ౨౮

శ్లో॥ నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్॥ 25

తా॥ నేను అందరికి ప్రకాశించెడివాడుగాను. నాయందలి బాయని భక్తులకు మాత్రము అగపడుదును. ఈమూర్ఖలోకము యోగమాయచే నావరింపబడినదై నన్ను ఉత్పత్తి నాశనములు లేనివాడని తెలియకున్నది.

తో॥ అజు డవ్యయుడని మూఢులెఱుంగరు
యోగమాయచే నావృతులై
అందరికిని నేనగబడ నా గతి
గలవారలె కనెదరు నిలలో ॥వా॥

*తో॥ మూడు గుణంబుల మాయ ముసుకుచే
మూఢులకును వ్యక్తుడ గాను
మూడు గుణంబులు మీఱినవాడను
అజు డవ్యయుడని గను నన్ను ॥వా॥ ౨౫

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26

తా॥ అర్జున! వెనుక గడచిన భూతములను ఇపుడుండెడి భూతములను ఇకముందు రానున్న భూతములను నే నెరుగుదును. అయినను నన్నుమాత్రము నెవరు నెరుగరు.

తో॥ భూత భవిష్య ద్వర్తమాన కా
లంబుల నుండెడి ప్రాణులను
నే తెలియుదు వారలలో నెవ్వడు
నెరుగడు కౌంతేయా నన్ను ॥వా॥

*తో॥ బాలులతో బలరామునితోడను
బాలకృష్ణు డానందముతో
బాల క్రీడలు సలుపుచుండ రో
హిణి యశోద లానందముతో ॥వా॥ ౨౬

శ్లో॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప! ॥ 27

తా॥ భారత! సర్వభూతములు ఇచ్ఛాద్వేషములచేత కలిగినసుఖదుఃఖాది ద్వంద్వ రూపకమగు మాయచేత పరంతప! జనన సమయముననే అజ్ఞానము పొందుచున్నవి.

తో॥ ఇచ్ఛాద్వేషములను ద్వంద్వముచే
భారత సర్వప్రాణులును
తుచ్ఛంబగు పూర్వవాసనలచే
జన్మవేళ మోహము నొందుఁ ॥వా॥

*తో॥ అన్న తమ్ములారా రాండీయని
వెన్నముద్దలం దియ్యగనూ
మన్ననగైకొని బాలురందరికి
పొంచిరి తల్లులు నివ్వగనూ ॥వా॥ ౨౭

శ్లో॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః॥ 28

తా॥ పుణ్యకర్మలు గలవారు వారి పాపముల నశింపచేసుకొని ద్వంద్వ గుణములైన సుఖదుఃఖములకు కారణమైన అవివేకమునుండి విడువబడి నిశ్చల నియమముచే నన్ను భజించుచున్నారు.

తో॥ సత్కర్మల చేసెడి పుణ్యాత్ములు
పాపంబుల పో దోలియును
ద్వంద్వపు మోహము దూరముగాగా
దృఢముతో భజియింతురు నన్ను ॥వా॥

*తో॥ శ్రీకృష్ణ నిను యేకర్మంబున
చేరగల్గు సత్కర్మంబు
శ్రీకృష్ణ చేయించుము నాచే
చేర్చుము నీ దివ్య పదంబు ॥వా॥ ౨౮

శ్లో॥ జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥29

తా॥ ముసలితనము మరణము పడజాలమని విడువలకై నన్నాశ్రయించి యత్నించువారలు ఆ బ్రహ్మమును సమస్త భూతాంతర్యామి అగు అధ్యాత్మను సమస్త కర్మలను తెలిసికొనినవారగుదురు.

తో॥ ఎవరు జరామరణ మోక్షమునకై
నను గోరియు ప్రార్థించెదరు
ఆవారలు బ్రహ్మము నధ్యాత్మయు
సర్వకర్మములు తెలియుదురు ॥వా॥

*తో॥ సర్వభూతముల కాధారుండవు♦అఖిలేశ్వరువు హరికృష్ణ
పరమేశా నిను ప్రార్థించెద నీ♦ప్రాపు చేర్పు శ్రీహరి కృష్ణ ॥వా

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః॥ 30

తా॥ ఎవరు అధిభూతాధిదైవతాధియజ్ఞములతో గూడియున్న నన్ను తెలిసికొందురో అట్టివారంత్యకాల మనకూడ అచంచలమైన మానసముచే నన్ను దెలిసికొనెదరు.

తో॥ జ్ఞానులు అధిభూతాధి దైవతా
అధి యజ్ఞములతో కూడిననన్
గనువారలు మరణకాలముననూ
స్థిరబుద్ధితో తెలియుదురు నను ॥వా॥

*తో॥ నిను వేడెద పాడెద నాడెదనే♦ నీయందును నామనసుంచు
నిన్నువిడచినేనన్యులవేడను♦కన్నతండ్రిహరిమన్నించు॥వా॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విజ్ఞాన యోగో నామ సప్తమోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## అక్షర పరబ్రహ్మయోగము – అష్టమాధ్యాయము.



తో॥ వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ
వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ ॥వా॥

తో॥ అన్ని కాలముల హరియే గతి అని
ఆదరమున భజియించినచో
అంత్యకాలమున హరి కృప గల్గును
మారు వస్తువుల మరచినచో ॥వా॥

తో॥ నాశరహితమగు పరబ్రహ్మమును
నెరుగగ పార్థుడు ప్రార్థింప
వాసుదేవు డాదరమున తనదగు
స్వరూప జ్ఞానంబును తెలుప ॥వా॥

తో॥ సర్వభూతముల నసియించెడి ఆ
వాసుదేవ తత్వమె ఆస్తి
సర్వము మారిన ఆస్తి మారదని
నెరిగెను పార్థుడు తన ఆస్తి ॥వా॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం? కిం కర్మ? పురుషోత్తమ! ।
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే॥ 1

తా॥ పురుషోత్తమ! ఆ బ్రహ్మమనగ నేమి? అధ్యాత్మమంటే నేమి? కర్మ మేది? అధిభూతమని చెప్పిన అర్థమేమి? మరియు అధిదైవతమను పేరు ఎందుకు?

తో॥ ఓ పురుషోత్తమ ! బ్రహ్మమనంగను
అధ్యాత్మంబన కర్మమన
అధిభూతంబది యెద్దియొ బల్కుము
అధిదైవంబన నన్నియును ॥వా॥

*తో॥ పరబ్రహ్మ పరమాత్మ పరాత్పర
పురుషోత్తమ శ్రీహరి కృష్ణ
వరదా నిను వేడెద నిను తలచెద
నీ కథలను వినెదను కృష్ణ ॥వా॥ ౧

శ్లో॥ అధియజ్ఞః కథం కోఽత్ర? దేహేఽస్మిన్మధుసూదన! ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2

తా॥ మధుసూదన! ఈ దేహమునందు అధియజ్ఞుండెవడు? వాడెట్లుండును? మనోనిగ్రహము గలవారిచే నీవు ప్రాణప్రయాణకాలమున ఎట్లు తెలిసికొనబడుదువు?

తో॥ మధుసూదన ఈ దేహమునందున
అధియజ్ఞుం డెవ డెట్లుండుర్
ఇంద్రియ జయు లేవిధమున అంత్యపు
కాలంబున నినుగన నగును ॥వా॥

*తో॥ సర్వకాలమును రామనామమును
స్మరియించితె ఇంద్రియ జయము
సమకూరుననుచు తలచెద రాఘవ
పలికించుము ప్రార్థన వినుము ॥వా॥ ౨

శ్రీభగవానువాచ:—

శ్లో॥ అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥ 3

తా॥ పరమం—తనకన్నను హెచ్చులేనిది. అక్షరం—కడకు నాశములేని తత్త్వము బ్రహ్మమనెదరు. స్వభావమె అధ్యాత్మమనియు ప్రత్యగాత్మమనియు చెప్పబడును. (అక్షరపరబ్రహ్మనుండి పుట్టినవి.) విసర్గః—భూతముల నుత్పత్తి కర్మమని చెప్పబడును.

తో॥ స్థిరమయినది యీ పరబ్రహ్మమగు
స్వభావమే అధ్యాత్మనగున్
కారణంబు విను ప్రాణోత్పత్తికి
కర్మమనంగను చెప్పబడున్ ॥వా॥

*తో॥ సర్వభూతములకును కారణుడవు•సర్వాధారుండవు రామ
సర్వ స్థలముల సర్వకాలముల•స్వయంప్రకాశక రఘురామ ॥వా॥

శ్లో॥ అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర!॥ 4

తా॥ దేహధారులలో ఉత్తమక్షరము స్థితి. ఉత్పత్తి అయిన సర్వభూతములు నాశనమగునవి అధిభూతమనెదరు. ఈ భూతముల నన్నిటియందు అధిష్ఠాత్మ్రుడే అధిదైవతమనెదరు. అతడే విరాట్పురుషుడు. సర్వయజ్ఞముల అధిపతి అయిన నేనే అధియజ్ఞుడను.

తో॥ దేహధారులలో నుత్తమ వినుము
నాశనమయ్యెడి దేక్షరము
విరాట్ పురుషుడగు అధిదైవము విను
నేనే అధియజ్ఞుండనుము ॥వా॥

*తో॥ సర్వభూతముల వెలిగెడి వాడవు
విరాట్ పురుషుడవు శ్రీరామ
సర్వభూతములు నాశనమయినను
సర్వత్రను వెలిగెడి రామ ॥వా॥ ౪

శ్లో॥ అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥ 5

తా॥ మరియు ఎవడు అంతకాలములో నన్ను స్మరించుచు కళేబరము విడుచుచున్నాడో అతడు నా స్వరూపమును పొందును అనుదానికి సందేహము లేదు.

తో॥ ఎవడంతపు కాలంబున నన్నును
స్మరించి కళేబరము విడచి
పోవువాడు నా స్వరూపమొందును
వలదనుమానము సవ్యసాచి ॥వా॥

*తో॥ వేడెద నాడెద నారద సన్నుత
ప్రార్థించెద హరి శ్రీకృష్ణ
ఎడలేకను దేహాంతము వరకును
నుడివించుము నిను శ్రీకృష్ణ ॥వా॥ ౫

శ్లో॥ యం యం వాఽపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ! సదా తద్భావభావితః ॥ 6

తా॥ కౌంతేయ! మరణకాలమందు ఏ ఏ స్వరూపమును స్మరించుచు కళేబరము విడుచునో అతడా స్వరూపమునె పొందును. సదా భావమందు భావింపబడినదే లభ్యమగు.

తో॥ కౌంతేయ సదా యేమిటి తలచునో
అంతకాలమున నది తలచి
చింతన చేసిన దానినె బొందును
స్వాంతపు కళేబరము విడచి ॥వా॥

*తో॥ నంద వ్రజమున నంద నందనుడు
సుందరవతులగు గోపికల
మందిరముల నవనీతము దొంగిలి
అందరికిని పంచియు మిగుల ॥వా॥ ౬

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ।
మయ్యర్పిత మనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥ 7

తా॥ అందువలన సర్వకాలములలోను నన్ను స్మరించుచుండుము. మరియు యుద్ధము చేయుము. నాకు సమర్పించిన మనస్సు బుద్ధిగలవాడవైతే నిస్సంశయముగ నన్నే పొందగలవు.

తొ॥ ఆ కారణమున సర్వకాలమును
నను తలచుము యుద్ధము చేయుము
నాకర్పించుము మనోబుద్ధులును
నను పొందెదు నిస్సంశయము ॥వా॥

*తొ॥ సుందర గాత్రులు తను వెదుకగ తా
మంద గమనమున మరలి తన
మందిరమును చేరేమియు నెరుగని
మందునివలె తల్లిని గనెను ॥వా॥ ౭

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్॥ 8

తా॥ అర్జున! ఎవడు అభ్యాససహాయముచే చిత్తము వేరేవస్తువునుకోరక పరమపురుషుని విడియక చింతన చేయునో అతడా దివ్య పరమ పురుషునే పొందుచున్నాడు.

తొ॥ పార్థా! అభ్యాసముతో చేరిన
మనసుచే ఇతరము తలచకను
సార్థకముగ పరమపురుషు దివ్యుని
దలచియు ధన్యత చెందనగున్ ॥వా॥

*తొ॥ పరమ పురుష పరమాత్మ హరేయని
పాటితప్పకను శ్రీకృష్ణ
పరిపరి విధముల బొగడుచునుండిన
పొందనగును సన్నిధి కృష్ణ ॥వా॥ ౮

శ్లో॥ కవిం పురాణమనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః।
సర్వస్య ధాతారమచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ 9

తా॥ ఆ దివ్య పురుషుడు సర్వజ్ఞుడు. పురాణ పురుషుడు. అన్నిటిని శాసించువాడు. అణువుకన్నను సూక్ష్ముడు. సమస్త చరాచరములకు కర్మ ఫల దాత. అచింత్యరూపుడు. ఆదిత్యవర్ణుడు. తమస్సునకుదూరమైనవాడు. అనుస్మరేత్ చింతించునో వాడు (ఆపురుషుని పొందుచున్నాడని) యుత్తరశ్లోకసంబంధము.

తో॥ సర్వమెరింగిన వాడు పురాణుడు
శాసకు డణువుకు సూక్ష్ముండు
సర్వకర్మ ఫలదుడు నచింత్యుడు
ఇనవర్ణుడు తమసుకు పరుడు ॥వా॥

*తో॥ పురాణ పురుషుని పట్టగవలెనని
పుణ్యాంగనలగు గోపికలు
పురమంతయు నరయుచు స్మరించుచు
రా రమ్మని పిలచిరి స్త్రీలు ॥వా॥ ౯

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్॥ 10

తా॥ ప్రయాణకాలమున భక్తియుక్తుడై చలించని మనస్సుచే యోగ బలమున ప్రాణమును రెండు కనుబొమ్మల నడుమ చక్కగ నిలపి (స్మరించిన) ఆ దివ్యమైన పరమపురుషుని బొందును.

తో॥ చావుకాలమున నిశ్చలమనసుచె
భక్తియుక్త యోగంబునను

భ్రూవోర్మధ్యమున ప్రాణము నిలపియు
ఆత్మచింత నాత్మను బొందుర్ ॥వా॥

*తో॥ ప్రతియింటను పుణ్యాంగనలందరు
మాయింటిలో నవనీతమును
ప్రతిగ్రహించిన వాడెక్కడ యని
పరమపురుషు వెతకిరి భ్రమను ॥వా॥ ౧౦

శ్లో॥ యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11

తా॥ వేదవేత్తలు దేనిని యక్షరమందురో, విజితేంద్రియులగు యతులు దేనిని ప్రవేశింతురో, దేనిని యెరుంగుటకై బ్రహ్మచర్యనియమము పాటించు చున్నారో అట్టి పరమోత్కృష్టమగుస్థానమును నీకు సంగ్రహముగ చెప్పెదను.

తో॥ అక్షరమని వేదజ్ఞులు నుడివెడి
రాగదూరు లేగతి నొందెడిది
బ్రహ్మచర్యమును నడిపి కోరెడిది
సంక్షేపము తెల్పెద వినుమట్టిది ॥వా॥

*తో॥ ఇక్కడక్కడను వెదుక నేలయో
అక్కలార చక్కని వాడు
మక్కువతోడుత యశోద పక్కను
చక్కనక్క డాడుచునుండు ॥వా॥ ౧౧

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ ॥

తా॥ ఇంద్రియరూపములైన సర్వద్వారములను సంయమనముచేసి మనస్సును హృదయమందునిలపి తన ప్రాణమును భ్రూమధ్యమందుంచి యోగ ధారణ చేయుము.

తో॥ సర్వద్వారంబుల నియమించియు
మనసును హృదయంబున నిలపి
ప్రాణవాయువును సహస్రారమున
నిలపియు యోగంబును సలిపి ॥వా॥

*తో॥ నందవ్రజమున సుందర వదనులు
నందనందనుని తలంచుచు
సందడిలేకను మందగమనమున
యశోదనందను నింగనుచు ॥వా॥ ౧౨

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాంగతిమ్ ॥ 13

తా॥ ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ — ఓం అను అక్షర బ్రహ్మయొక్క నామమంత్రమును స్మరించి తత్స్వరూపుడయిన నన్ను ధ్యానించి దేహమును విడచునతడు శ్రేష్ఠమయిన గతిని పొందును.

తో॥ బ్రహ్మవాచకంబగు ప్రణవాక్షర
మును స్మరించియును నాభక్తి
దేహము వదలిన యాతడు పొందును
యుత్తమ పరమ పదప్రాప్తి ॥వా॥

*తో॥ ఓం శ్రీ గోవిందాయ నమోనమః
యశోదతనయా హరికృష్ణ
వాసుదేవ నిను కన్నుల కంటిమి
మాసరి యెవ్వరు మాకృష్ణ ॥వా॥ ౧౩

శ్లో॥ అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ 14

తా॥ హేపార్థ! ఎవడు ప్రతిదినము ఎల్లపుడు ఇతరము తలంచని మనస్సుచే నన్ను స్మరించునో అట్టి నిరంతర ధ్యానపరుడైన యోగికి నేను సులభుడను.

తో॥ జితేంద్రియుండై సర్వకాలమును
నేనేగతియని నమ్మియును
చింతించినయా యోగీశ్వరునకు
పార్థచాలనే సులభుడను ॥వా॥
*తో॥ మావాడని మేమన్య మెరుగకను
మంచివాడవని యెంచితిమె
మోసగించి పాలారగించి ఇట
వచ్చిన నిన్నను విడచెదమే ॥వా॥ ౧౪
శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః ॥ 15
తా॥ నన్ను చేరిన పరమోత్కృష్టమయిన యోగసిద్ధిని పొందిన మహా
త్ములు దుఃఖాస్పదము అశాశ్వతమునయిన పునర్జన్మమును పొందరు.
తో॥ నన్నుభజించు మహాత్ములు దుఃఖపు
పుట్టినిల్లునగు మరుజన్మం
బొందరు యశాశ్వతంబని తెలసియు
చేరుదురుత్తమ గతివినుము ॥వా॥
*తో॥ భక్తునియందా సక్తిగలదనుచు
పలికినపలుకులు శ్రీకృష్ణ
యుక్తములగుచో మనసుననీ ఆ
సక్తిని గలిగించుము కృష్ణ ॥వా॥ ౧౫
శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ 16
తా॥ అర్జున! (జీవులు) బ్రహ్మలోకము మొదలుకొని సకలలోకములకు
పోయినను పునర్జన్మముతప్పదు. నన్ను పొందిన వెనుకమాత్రము పునర్జన్మములేదు.
తో॥ కౌంతేయ వినుము బ్రహ్మలోకమె
మొదలగు సమస్త లోకములు

పునర్జన్మ హేతువులగు నన్ను నను
పొందిన గలుగదు జన్మములు ॥వా॥

*తో॥ అమ్మయశోదా ఆనందంబున
ఆడెడి ఈ కృష్ణుని గనుము
నమ్మకముగ మాయింటను ఆడుచు
సమ్మానము పొందెను వినుము ॥వా॥ ౧౬

శ్లో॥ సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః॥

తా॥ సహస్రయుగముల కాలపరిమితమయినది బ్రహ్మదేవుని పగలనియు, సహస్రయుగములు చేరినకాలమే అతని రాత్రిఅనియు ఏ గొప్పవారు తెలియుదురో అట్టివారే రాత్రింబగళ్ళు తెలసినవారలుగానున్నారు.

తో॥ సహస్రయుగముల పర్యంతరమును
బ్రహ్మయొక్క పగలనియున్న
అంతకాలమే బ్రహ్మరాత్రియని
ప్రౌఢులు తెలియుదు రిన్నియును ॥వా॥

*తో॥ మేములేని కాలంబున మీగడ
పాలు వెన్నలను భక్షించి
మేమొచ్చెడి కాలమునకు కడవలు
పొరుగింటిలో తాజోడించి ॥వా॥ ౧౭

శ్లో॥ అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే॥ 18

తా॥ బ్రహ్మయొక్క పగలుకాగానే అవ్యక్తమను ప్రకృతినుండి వ్యక్తమైన స్థావర జంగమాత్మకమగు భూతములు పుట్టుచున్నవి. రాత్రి కాగానే దానియందే లీనమగుచున్నవి.

తో॥ పగటికాలమున అవ్యక్తంబున
బుట్టును వ్యక్తపు భూతములు

పగలు కడవగనె యవ్యక్తంబును
 పొందును కనబడు భూతములు ॥వా॥

*తో॥ కృష్ణుడు కంటికి కనపడకుండగ
 కృష్ణుని నరయుగ మేమింట
 కృష్ణుని తోడను గోరసములు గల
 కడవలు కనపడ లేదింట ॥వా॥ ౧౮

శ్లో॥ భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।
 రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవత్యహరాగమే॥ 19

తా॥ భూతముల సమూహము పుట్టిపుట్టి రాత్రి అయిన వెంటనే స్వతంత్రము లేక లయము పొందును. పార్థ! పగలు రాగానే మరల పుట్టును.

తో॥ భూతసమూహము పుట్టియు పుట్టియు
 రాత్రిలో స్వాధీనము లేక
 గతమవును పార్థ! పగలురాగ విను
 మరల పుట్టుయత్నము లేక ॥వా॥

*తో॥ పొరుగింటిలో గోరసముల కడవలు
 పొందుగనుండుట గని మేము
 పొరుగువారలతో కలహమాడితిమి
 నీ పుత్రుడు కృష్ణుని మాయికము ॥వా॥ ౧౯

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః।
 యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ 20

తా॥ అయితే పైనచెప్పిన అవ్యక్తమునకు అతీతమైన వేరొక సనాతనమైన అవ్యక్తభావమున్నది, తక్కిన భూతములు నాశమగుచున్నను వినాశమొందక వుండునది.

తో॥ అవ్యక్తంబని చెప్పిన దానికి
 కారణంబునగు సనాతనం

బవ్యక్తం బోకటున్నది భూతము
లన్ని పోయిన పోవదు నిజము ॥వా॥

*తో॥ అమ్మా! నీబిడ్డడు నీముందర
ఏమెరుగనివాడై యుండు
అమ్మా! ఈ కృష్ణుని మాయలుగన
అద్భుత మవ్యక్తము చూడు ॥వా॥ ౨౦

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 21

తా॥ ఆ అక్షరమైన అవ్యక్తమునకే పరతరమైనగతి అనిపేరు. అదే నా పరంధామము. దానిని పొందినవారు మరలరారు.

తో॥ అవ్యక్తంబని అక్షరంబునని
శ్రేష్ఠంబని నేచెప్పినయా
దివ్యస్థానము తెలిసియు జేరగ
మరలరు అది నా స్థానమయ ॥వా॥

*తో॥ దుడుకుల కృష్ణుని దోషములెన్నియొ
తెలుపగ తరమె యశోదమ్మ
ఆడుచు పాడుచు నుండును చూడగ
అందగాడు గాడేమమ్మ ॥వా॥ ౨౧

శ్లో॥ పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా।
యస్యాన్తస్స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22

తా॥ పార్థ! భూతములన్నియు ఏగొప్పవానియందున్నవో ఏపురుషునిచే ఈ భూతములంతయు వ్యాపింపబడినవో ఆట్టి పరమపురుషుడు ఇతరాసక్తిలేని చలించని భక్తికి సులభముగ లభింపగలడు.

తో॥ ఏ యజమానుని యందీలోకము
లన్నియు లీనంబయినదియో

ఏ మహాపురుషు డన్నిటనిండియు
అనన్యభక్తికి సులభుడయా ॥వా॥
*తో॥ శ్రీకృష్ణా! నిను నమ్మినందులకు
జన్మము లేకుండగ చేయు
శ్రీకృష్ణ నిను సర్వకాలమును
ధ్యానంబును చేయుగచేయు ॥వా॥ ౨౨

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ! ॥ 23

తా॥ భరతర్షభ! యోగులు యేకాలమున మరణమొందితే మరల జన్మమును పొందరో, యేకాలమున మరణించితే మరల జన్మింతురో ఆ కాలమును చెప్పుచున్నాను.

తో॥ భరతర్షభ! యేకాలంబుననూ
మరణించెడి యోగులలోను
మరల జన్మమును పొందని కాలము
తెలిపెద మరలెడి కాలమును ॥వా॥
*తో॥ తండ్రీ! మరణపు కాలంబున నిను
తెలియువశమె హరి శ్రీకృష్ణ
తండ్రీ! బుద్ధియు నిమగన జేయుము
పురుషోత్తముడవె శ్రీకృష్ణ ॥వా॥ ౨3

శ్లో॥ అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥24

తా॥ అగ్ని జ్యోతి పగలు శుక్లపక్షము, అట్లే ఆరు మాసములతో చేరిన ఉత్తరాయణము, ఇట్టికాలమున దేహమును విడచిన బ్రహ్మవిదులు బ్రహ్మనే పొందుదురు. (మరల జన్మించరని తాత్పర్యము)

తో॥ అగ్నియు జ్యోతియు పగలు శుక్లమును
ఉత్తరాయణము షణ్మాసము

మార్గంబున జను బ్రహ్మవేత్తలును
పొందెద రుత్తమ బ్రహ్మపదము ॥వా॥

*తో॥ నంద వ్రజమున గోపికలందరు
నందసుతుని దుందుడుకులను
నందునిభార్య యశోదకు చెప్పగ
మందగమన నందర గనియుగా ॥వా॥ ౨౮

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25

తా॥ ధూమము రాత్రి కృష్ణపక్షము షణ్మాసముతో చేరిన దక్షిణాయనము ఈ కాలమున మరణము చెందిన యోగి చంద్రలోకమునుపొంది మరల జన్మము పొందును.

తో॥ రాత్రియు ధూమము కృష్ణపక్షమును
దక్షిణాయనము షణ్మాసము
మార్గమునను జను యోగియుచంద్రుని
లోకమొంది మరలును వినుము ॥వా॥

*తో॥ వనితలార మాకృష్ణుడు నెప్పుడు
నను బాసియు నెక్కడజనడు
వెన్న పాలు మీగడ దధిఘృతమిదో
నున్నది మాయింటను గనుడు ॥వా॥ ౨౯

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః ॥

తా॥ ఇట్లుండేడి ఈశుక్లము కృష్ణమనగ తేజోమయము అంధకారమయమును రెండు జగత్తులో శాశ్వతమయిన గతులని చెప్పబడినది. మనుజుడు మొదటిగతినుంచి పునరావృత్తిరహితమును రెండవ గతినుంచి మరల జన్మించుటయును పొందును.

తొ॥ శుక్లమార్గమని కృష్ణమార్గమని
జగతిలో శాశ్వతమార్గములు
శుక్లమార్గము జన్మరహితమగు
అన్యము జన్మము సమ్మతముల్ ॥వా॥

*తొ॥ అన్న మెరుంగడు తనలోనాడును
శ్రీకృష్ణుని చూడండమ్మ
మన్ననతో మాబిడ్డను చూడుడు
దయతో శాంతించండమ్మ ॥వా॥ ౨౬

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ 27

తా॥ పార్థ! ఈ చెప్పబడిన ఈ రెండుమార్గములను ఎరిగినట్టి యోగి యెవ్వడును మోహమునొందడు. అందువలన అర్జున! నీవు సర్వకాలములయందు యోగముతో కూడినవాడవుకమ్ము.

తొ॥ ఇప్పుడు తెల్పిన రెండుమార్గములు
తెలసిన యోగియు నెన్నడును
త్రిప్పుమార్గమున చేరండర్జున
యోగికమ్ము నీ వెప్పుడును ॥వా॥

*తొ॥ కాంతలు తల్లితో దనగుణంబులను
తగదెల్పగ శ్రీకృష్ణుండు
శాంతునివలె తాచేష్టలులేకను
నూరకుండె పరమాత్ముండు ॥వా॥ ౨౭

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥ 28

తా॥ పయిన వివరించిన తత్వమును ఎరిగినవాడై యోగి వేదములందు యజ్ఞములందు తపస్సులందు అట్లేదానములందు చెప్పిన పుణ్యఫలమును మీరి దానికవతలనుండు ఆదికారణమయిన పరమస్థానమును పొందుచున్నాడు.

త్రో॥ వేదము యజ్ఞము తపస్సుదానము
ఇందలి పుణ్యఫలముకంటే
అధికఫలమనుచు ఆత్మపదంబును
యోగిపొందు అర్జున వింటే ॥వా॥

*త్రో॥ నీవేగతియని నిన్నేనమ్మియు
నినుతలంచెదను శ్రీ కృష్ణ
ఏ వేళను నను ఎడబాయకవిను
కావగవలయును హరికృష్ణ ॥వా॥ ౨౮

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షర పరబ్రహ్మ యోగోనామ అష్టమోఽధ్యాయః.

ఓం తత్ సత్





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## రాజవిద్యారాజగుహ్యాయోగము — నవమాధ్యాయము.



తో॥ వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ
వాసుదేవ జయ వాసుదేవ జయ
వాసుదేవ జయ వాసుదేవ ॥వా॥

తో॥ అనేకవిద్యలు అభ్యసించితిమి
అనేక శాస్త్రము లెరిగితిమి
అనదరు అయినను తానెవరనునది
అరయరు మూర్ఖులు ఇదిఏమి ॥వా॥

తో॥ భగవద్గీతా పారాయణమును
భగవంతునివాక్యార్థమును
భగవంతుని కృపబడయగవలయును
భగవద్భక్తుడు కావలెను ॥వా॥

తో॥ విద్యలలో అధ్యాత్మవిద్యయని
విబుధుల పాలిటి ధర్మమని
విద్యల నన్నిట రాజవిద్యయని
విజయునకును తెల్పెనుదీని ॥వా॥

---

మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాద్యభివర్ణనము * ఈగురుతో వారలో వున్నది

శ్రీభగవానువాచ: —

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యద్‌జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

తా॥ అసూయలేని వాడవయినందున మిక్కిలి రహస్యమయిన విజ్ఞానసహితమగు జ్ఞానమును లెస్స జెప్పెదను. అది తెలసినయెడల అశుభమునుండి ముక్తుడయ్యెదవు.

తో॥ లోపల అసూయ లేని పార్థవిను
అనుభవ సహితంబుగ జ్ఞానము
ఇపుడు తెలిపెదను రహస్య మగునది
తెలిసిన జేకూరును మోక్షము ॥వా॥

*తో॥ ఒక్కనాడు బలరాముడు మొదలుగ
గోపకుమారులు యశోదతో
శ్రీకృష్ణుడు మృత్తికను తినెననగ
శీఘ్రంబున తనబాలునితో ॥వా॥ ౧

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ 2

తా॥ ఇది రహస్యములలో శ్రేష్ఠమయినది, విద్యలలో రాజు, పవిత్రమయినది, ఉత్తమము, ప్రత్యక్షబోధకనుకూలము, ధర్మ్యము, ఆచరణకు సులభము, నాశముగానిది.

తో॥ తెలియగ వలసిన దానిలో రాజిది
గుహ్యము పవిత్ర ముత్తమము
ధర్మ్యము సుఖ మనుభవ గోచరము
నాశములేనిది ఇదినిజము ॥వా॥

*తో॥ రమ్మని బాలుని కేలు బట్టుకొని
నామాటలు వినకను కృష్ణ
ఇమ్మాడ్కిని మన్నేల తినెదవుర
సమ్మతితో నుండక కృష్ణ ॥వా॥ ౨

శ్లో॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప!
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని॥ 3

తా॥ పరంతప! ఈ ధర్మములో శ్రద్ధలేని పురుషులు నన్ను పొందక మృత్యువుతో చేరిన సంసారమార్గమును బట్టి తిరుగుచుందురు.

తో॥ ఆత్మజ్ఞానము దెలియని మూఢులు
శ్రద్ధా రహితులు గావునను
మృత్యురూపమగు సంసారంబున
పడిపోదురు ననుపొందకను ॥వా॥

యశోదపల్కులు.

*తో॥ నీయన్నగు బలరాముడు మొదలుగ
ఈ బాలురు అందరు నీపై
బాయని భ్రమగలవారలు గావున
న్యాయముగను నీవుండుటకై ॥వా॥ 3

శ్లో॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్థ్సాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ 4

తా॥ అవ్యక్తమూర్తియగు నాచేత సమస్తభూతములు వ్యాపింపబడినది. సర్వభూతములు నాయందున్నవి. నేనన్నను ఆ భూతములయందు ఉన్నవాడను గాను.

తో॥ అవ్యక్తుండగు నాచే జగములు
అన్నియు నిండియు యున్నదను
అన్ని భూతములు నాయందున్నవి
ఆ భూతములలో నేలేను ॥వా॥

*తో॥ నా తోడను నీనడతలు నుడివిరి
నా వాక్కులు విను నా తండ్రి
నాయన నానావిధ భక్ష్యములను
నారగించు నిచ్చెద తండ్రి ॥వా॥ ౪

శ్లో॥ న చ మత్థ్సాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ 5

తా॥ భూతములన్ననో నాయందున్నవిగావు. నాస్వరూపమగు పరమాత్మ యన్ననో భూతముల పుట్టించునదియు,భూతముల వృద్ధిపొందించునదియు అయినను భూతములయం దుండునది గాదు. నా అద్భుతమైన ఈశ్వరశక్తిని చూడుము.

తో॥ నా యోగము సామర్థ్యంబును గను
భూతములన్నిటి కాధారమ్
అయినను నా యాత్మయు భూతంబుల
చిక్కదు చూడుము అవికారమ్ ॥వా॥

*తో॥ అమ్మయ్యో నేమన్న తినెదనా?
ఆకొంటెన లేకను శిశువా
అమ్మయ్యో నాకేమి వెర్రియా
నమ్మకు వీరిని నా నుడివినవా? ॥వా॥ ౫

శ్లో॥ యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్థ్సానీత్యుపధారయ ॥ 6

తా॥ సర్వత్ర సంచరించు గొప్పవాయువు నిత్యము ఆకాశమం దేవిధముగ నణగియున్నదో, ఆ విధముగ సమస్తభూతములు నాయందున్నవని యెరుంగుము.

తో॥ అంతట తిరిగెడి గొప్ప సమీరము
నభమున నిత్యము నణగినదో
ఆ విధమ్మునను అన్ని భూతములు
నాయందే యున్నవి గాదే ॥వా॥

*తో॥ నన్నును గొట్టగ వీరలు నీతో
మన్ను తినెను అని పలికెదరు
నా నోరును చూడుము నా నోటను
మన్నున్నను దండించెదరు ॥వా॥ ౬

శ్లో॥ సర్వభూతాని కౌన్తేయ! ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ 7

తా॥ కౌన్తేయ! కల్పాంతములో అన్ని భూతములు నా ప్రకృతిని పొందుచున్నవి. పునః కల్పాదిలో (బ్రహ్మ పగలురాగానే) నేనే వాటిని సృష్టించెదను.

తో॥ కౌంతేయ! వినుము కల్పాంతంబున
సర్వభూతములు నా ప్రకృతిఁ
పొందును కల్పప్రారంభంబున
భూతములన్నిటి పుట్టింతుఁ ॥వా॥

*తో॥ లీలామానుష విగ్రహుండునగు
బాలకృష్ణు డీరీతిగను
మేలు మేలనగ పల్కియు నోరును
తెరచియు తల్లికి చూపగను ॥వా॥ ౭

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్॥8

తా॥ ప్రకృతికి లోబడి యస్వతంత్రమగు ఈ సమస్త భూత సమూహమును నా ప్రకృతిని అవలంబించి మరల మరల పుట్టించుచున్నాను.

తో॥ ప్రకృతికి లోబడి స్వతంత్ర శక్తియు
పొందని భూత సమూహమును
ప్రకృతిచేతనే పుట్టించెద నే
మరల మరల ఈ ప్రాణులను ॥వా॥

*తో॥ ఆ యశోదగనె తనయుని ముఖమున
అఖిల జగంబుల దేవతల
అఖండలు డాదిగ దిక్పతులను
అఖిల భూతముల నగరముల ॥వా॥ ౮

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ!
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు ॥ 9

తా॥ అయితే ధనంజయా! ఈ కర్మలలో నేను అనాసక్తుడై ఉదాసీనుని వలె ఉన్నవాడ గాన ఆకర్మలు నన్నెంతమాత్రము బంధింపదు.

తో॥ ఉపేక్షకునివలె వుందును కర్మల
కావున కర్మలు యంతయును
చపలుని బంధించినవలె నన్నును
బంధింపవు యో పార్థ! విను ॥వా॥

(యశోద కుమారుని ముఖమును చూచి తనలో)

*తో॥ కలయో వైష్ణవ మాయయో ఈతని
కల్పితమో సత్యంబేనో
తలపం నేరక యున్నదాననో
యశోదాదేవి నేగానో ॥వా॥ ౯

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్।
హేతునాఽనేన కౌన్తేయ! జగద్విపరివర్తతే॥ 10

తా॥ కౌంతేయ! నా అధ్యక్షతచేతనే చేతనాచేతనాత్మకమైన సమస్త భూతములను ప్రకృతి పుట్టించుచున్నది. అందుచేతనే ఈ ప్రపంచము మార్పులు చెందుచున్నది.

తో॥ నా యధ్యక్షత ప్రకృతియుగనును
చరాచరాత్మక జగత్తును
నా యధ్యక్షత చేతనె జగంబు
కౌంతేయా! పరివర్తించుగా ॥వా॥

*తో॥ నందవ్రజమిదో నానాథుండగు
నందరాజు నిందున్నాడే
నందవ్రజమున యశోద నున్నదె
నందనందనుండున్నాడే ॥వా॥ ౧౦

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥ 11

తా॥ సకల భూతముల మహేశ్వరుడైన నా పరంభావమును తెలియని మూఢులు మనుష్య దేహధారినైన నన్ను అలక్ష్యము చేయుచున్నారు.

త్రో॥ సకల భూతముల ప్రభువగు నన్నును
పరమపురుషుడని తెలియకను
ప్రాకృత దేహము ధరించి నందున
లక్షించరు మూఢులు నన్ను ॥వా॥

*త్రో॥ గోవులు గోపీ గోప జనంబులు
గోముఖ లందరు నున్నారే
గోవిందుడు గోపెమ్మకు ముఖమున
గోవుల చూపుచు నున్నాడే ॥వా॥ ౧౧

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12

తా॥ అట్టివారు వ్యర్థాశ వ్యర్థకర్మలు వ్యర్థజ్ఞానము కలిగిన మూఢులు. హింసారూపమైన ఆసురీ స్వభావ మోహనరూప ప్రకృతిని ఆశ్రయించి యుందురు.

తో॥ వ్యర్థాశయు వ్యర్థపు కర్మంబును
వ్యర్థ జ్ఞానపు ఆ మూఢుల్
సార్థక రహితులు రాక్షస ఆసుర
ప్రకృతికి లోబడి పోవుదురు ॥వా॥

యశోద బాలుని విష్ణువుగ భావించుట.

*త్రో॥ బాలుడనుచు నే భ్రాంతిని చెందితి
బాలుని ముఖమున ప్రపంచము
భాసిలుచున్నది పరమాత్మ ఇతడు
బాగుగ విష్ణువె అగు నిజము ॥వా॥ ౧౨

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ 13

తా॥ అయితే పార్థ ! దైవీ ప్రకృతిని ఆశ్రయించిన మహాత్ములు సర్వ భూతములకు కాదియగు అవ్యయుడగు నన్ను ఎరింగి అనన్య భావనచేత భజించు చున్నారు.

తో॥ దైవీ ప్రకృతిని ఆశ్రయించియును
భూతాదుల కాధారుడని
అవ్యయు డనినను మహాత్ము లెరగియు
భజన చేసెదరు పార్థ విని ॥వా॥

*తో॥ ఏ జగదీశ్వరు ముఖమున జగములు
ఏడు సముద్రములును నదులు
ఏడు నగంబులు పుణ్యస్థలములు
నేడుగంటినే వనంబులు ॥వా॥ ౧౩

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే 14

తా॥ మరియు దృఢవ్రతులు నన్ను పొంద యత్నించి నాకు నమస్కరించి స్మరించి ఎపుడు నాయందే చిత్తముంచి భక్తినుంచి నా ఉపాసన చేయుచు సతతము నాకీర్తనయందే మరులుకొని యుందురు.

తో॥ యత్నశీలురగు దృఢవ్రతులు నను
సతతము కీర్తన చేయుదురు
నిత్యము భక్తితో నుపాసించెదరు
చేసెదరు నమస్కారములు ॥వా॥

*తో॥ పుణ్యాశ్రమములు పుణ్యక్షేత్రములు
పుణ్య తీర్థములు నేగంటి
పుణ్యలోకములు పుణ్యపురంబులు
పురాణపురుషుని లోగంటి ॥వా॥ ౧౪

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్॥ 15

తా॥ మరికొందరు నన్ను జ్ఞానయజ్ఞమునుంచి పూజించి సేవించెదరు. కొందరు హరియొకడే యనియు కొందరు బ్రహ్మరుద్రాదులనియు, కొందరు విశ్వతోముఖుడని బహుప్రకారములుగ సేవించెదరు.

తో॥ మరికొందరునను జ్ఞాన యజ్ఞమున
పూజించియు సేవించెదరు
హరియొకడేయని హరిహరులనియును
విశ్వముఖుండని తలచెదరు ॥వా॥

*తో॥ బ్రహ్మలోకమును విష్ణులోకమును
కైలాసంబును గనుగొంటి
బ్రహ్మాండంబుల సూర్యచంద్రులను
బాలుని ముఖమున గనుగొంటి ॥వా॥ ౧౫

శ్లో॥ అహం క్రతురహం యజ్ఞస్స్వధాఽహమహమౌషధమ్।
మన్త్రోఽహమహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్॥ 16

తా॥ క్రతువనగ శ్రౌతయజ్ఞము నేనే. యజ్ఞమనగ స్మార్త యజ్ఞము నేనే. స్వధా అనగ పితృవులకు అర్పించు అన్నము నేనే. ఔషధీ అనగ యజ్ఞార్థముగ వనస్పతులనుంచి నిర్మితమగు అన్నము నేనే. మంత్రము నేనే. ఆజ్యాది హవిస్సు నేనే. అగ్ని నేనే. ఆహుతి నేనే.

తో॥ క్రతువు నేన యజ్ఞంబును నేన
పైతృకాన్నమును ఔషధము
మంత్రము ఆజ్యము అగ్నియు నేన
ఆహుతియును నేనని గనుము ॥వా॥

*తో॥ పితృలోకంబును పితృదేవతలను
పితపితామహ ప్రపితులను
హితులగు దేవతలను నేగంటిని
సుతుడగు కృష్ణుని ముఖమునను ॥వా॥ ౧౬

శ్లో॥ పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్రమోంకార ఋక్సామయజురేవ చ॥ 17

తా॥ నేనీజగత్తుకు తండ్రిని తల్లిని ఫలప్రదుడును తాతయు వేద్యుడు పవిత్రుడు ఓంకారము ఋగ్యజుస్సామవేదములు నేనే.

తో॥ జగత్తుకంతకు తల్లిని తండ్రిని
దాతా తండ్రికి తండ్రియును
తెలియతగినదియు పవిత్రమయినది
ఓంకారము వేదంబులును ॥వా॥

*తో॥ బ్రహ్మ ఋషులు మరి దేవ ఋషులును
రాజ ఋషులు ఋషిగణములును
బ్రహ్మాండము నంతయు నీ బాలుని
బొజ్జలో నున్నవి చూడగను ॥వా॥ ౧౭

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్।
ప్రభవః ప్రలయస్థానం నిధానం బీజమవ్యయమ్॥ 18

తా॥ గతి పోషకుడు ప్రభువు సాక్షి నివాసము శరణం ఆశ్రయింపదగిన చైతన్యము స్నేహితుడు ఉత్పత్తిస్థానము లయస్థానము స్థితిస్థానము అవ్యయమైన బీజము నేను.

తో॥ గతియు భర్త ప్రభు సాక్షియు నేనను
యునికి పట్టు యాశ్రయము విను
హితుడును యుత్పత్తిస్థితి లయమును
నిధానమవ్యయ బీజమును ॥వా॥

*తో॥ ఈతడు చూడగ సర్వేశ్వరుడగు
ఈ లోకంబులు నన్నియును
ఈతని ముఖమున కనుబడుచున్నది
ఈతడె గతియని నమ్మెదను ॥వా॥ ౧౮

శ్లో॥ తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥ 19

తా॥ అర్జున! తపింపచేయుచున్నాను. వర్షము నిరోధించుచున్నాను. కురిపించుచున్నాను. నేను అమృతము మృత్యువు. సత్తు అసత్తు నేనే.

తే॥ తపింపజేయుదు వర్షము నిలుపుదు
వర్షము కురిపింతును నేను
అమృతము మృత్యువు సత్తాసత్తులు
అర్జున తెలియుము నేననియూ ॥వా॥

వైష్ణవ మాయ:—

*తే॥ పరమేశ్వరుడని భావన చేసెడి
పరమ పతివ్రత యశోదకు
పరమేశ్వరుడగు కృష్ణుడు వైష్ణవ
మాయను బొందించె మాతకు ॥వా॥ ౧౫

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక
మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్॥ 20

తా॥ వేదత్రయ వేత్తలై యజ్ఞములచే నిష్పాపులై సోమపానముచేసి నన్నుపూజించి స్వర్గప్రాప్తిని పొందగోరి వారు పావనమయిన ఇంద్రలోకమును పొంది దేవతాసుఖమనుభవింతురు.

తే॥ మూడువేదముల నెరిగియు నన్నును
యజ్ఞములచె పూజించియును
బిడౌజలోకము దోషరహితులై
పొందియు భోగము లొందియును ॥వా॥

*తే॥ యరుకక మారి సర్వాత్ముండనకను
బాలుండని తాభావించి

త్వరితంబుగ తన తొడపై నిడుకొని
కడువేడుకగనె మమతుంచి ॥వా॥ ౨౦

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీ ధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే॥ 21

తా॥ ఆ జనులు విస్తారమగు స్వర్గలోకమును పొంది భోగములనుభవించి పుణ్యక్షీణమైనవెంటనే మనుష్యలోకమును పొందెదరు. ఇట్లు వేద ధర్మమును ఆశ్రయించి విషయభోగములు కోరెడివారికి పోయివచ్చుచుండుటయే వారిపని.

తో॥ విస్తారంబగు స్వర్గలోకమున
సుఖభోగము లొందియు మరలన్
వసియింతురు ఈ మర్త్యలోకమున
కోరిక కోరినవారిలను ॥వా॥

*తో॥ వేదవిధిని సత్కర్మలు చేసియు
మాధవార్పితము చేయుదురు
వాదజనులు విషయేచ్ఛల కోరియు
వచ్చుచు పోవుచు తిరుగుదురు ॥వా॥ ౨౧

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥22

తా॥ అనన్య భావన గలవారై నన్నే చింతించి నా వుపాసన చేయునట్టి నిత్య యోగయుక్తులైన జనుల యోగక్షేమమును నేనే నడిపించెదను.

తో॥ ఇతరము తలచక నన్నే తలచియు
సతతము నాభజనను సల్పు
నిత్య సమాహిత చిత్తుల యోగ
క్షేమము వహింతునని తలపు ॥వా॥

*తో॥ నీవే తల్లివి నీవే తండ్రివి
నిన్నే నమ్మితి శ్రీకృష్ణ
నీవే గురుడవు నీవే దైవము
నీవే పరమాత్మవు కృష్ణ ॥వా॥ ౨౨

శ్లో॥ యేఽప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్॥ 23

తా॥ ఎవరైతే అన్యదేవతా భక్తులగుచు శ్రద్ధగలవారై పూజించు చున్నారో వారలుకూడా కౌంతేయ! నన్నే విధ్యుక్తముగాక ఆరాధింపు చున్నారు.

తో॥ ఇతర దేవతా రాధన భక్తులు
శ్రద్ధతోడ పలిపెద రదియు
కుంతీసుత విధిరహితంబగు యా
పూజయు నా పూజని తెలియు ॥వా॥

*తో॥ నీ స్వరూపమును నిజముగ తెలియని
నిర్మల రహితులు శ్రీకృష్ణ
ఈశ్వర ఇహ పర లోకంబులలో
సుఖమును చెందరు హరికృష్ణ ॥వా॥ ౨౩

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే॥ 24

తా॥ ఎందుకనగ సకలవిధములగు ఆరాధనలకు ప్రభువు నేనే. అనుభ వించువాడను నేనే అయియున్నాను. ఐతే సకాములకు నాయొక్క తత్త్వత జ్ఞానము లేనందున వారు జారుచున్నారు.

తో॥ సర్వ యజ్ఞముల ప్రభువును నేనే
అనుభవించువాడను నేనే
తత్త్వత నన్నును తెలియనివారలు
జారిపోయి పడెదరు తానే ॥వా॥

*తో॥ సర్వయజ్ఞముల కాధారుండవు
భోక్తవు నీవే హరికృష్ణ
సర్వము నీవని తెలిపియు వేగమె
సర్వేశ్వర గావుము కృష్ణ ॥వా॥ ౨౪

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపిమామ్॥25

తా॥ దేవతోపాసకులు దేవతలను పొందుదురు. పితృవుల పూజించు వారు పితృవులను, భూతముల పూజించువారు (ఆయా) భూతములను, నన్ను భక్తిశ్రద్ధలతో పూజించువారు నన్ను పొందెదరు.

తో॥ దేవతల పూజ దేవ పదంబును
పితరుల భజింప పితరులను
భూతముల పూజ భూతంబులను
నా పూజయు నను పొందవగున్ ॥వా॥

*తో॥ దేవతలకు పితృదేవతలకు మరి
భూతములకు నీవే దిక్కు
దేవ దేవ వసుదేవ దేవకీ
సుత అక్కర మ్రొక్కెద నీకు ॥వా॥ ౨౫

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥ 26

తా॥ ఎవడు భక్తిపూర్వకముగ పత్రము పుష్పము ఫలము తోయంబేని నాకు సమర్పించుచున్నాడో ఏకీభావముగల ఆతడు భక్తి పురస్సరముగ సమర్పించిన దానిని నేను అత్యాదరమున సేవించుచున్నాను.

తో॥ భక్తితోడ పత్రము పుష్పంబును
ఫలమునైన తోయంబైనన్
అక్కర గలవాడర్పించిన నే
ఆదరమున గొని సేవింతున్ ॥వా॥

*తో॥ తులసీదళమున తూగిన మాధవ॥తులసీ కెవ్వరు శ్రీకృష్ణ
ఇలసీమహిమయు తెలిసెనురుక్మిణి॥సత్యభామ నెరుగు నెకృష్ణ ॥వా॥

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27

తా॥ కౌంతేయ! నీవు దేనిని చేయుచున్నావో ఏమి భుజించెదవో నీవు చేయు హవిస్సను దానమేమిచ్చెదవో నీతపస్సు అంతయును నాకు సమర్పించుము.

తో॥ ఏమి చేయుదువో ఏమి భుజింతువో
హోమంబేదియు చేసెదవో
ఏమిచ్చెదో తపమేమి చేసెదవో
నాకర్పించుము కౌంతేయ ॥వా॥

*తో॥ నా వాక్కున నీవేమి పల్కెదవో
ఆ వాక్యము లన్నియు నీదె
ఓ వాసుదేవ నాకహ ముంచకు
పాలించుము మోదయానిధె ॥వా॥ ౨౭

శ్లో॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥28

తా॥ ఈ రీతి ఆచరించితే శుభాశుభ రూపమైన కర్మబంధనమునుంచి నీవు విముక్తుడవు కాగలవు. అట్లు మానససన్న్యాసమనెడు త్యాగయుక్తిచే నాస్థానమైన మోక్షమును పొందగలవు.

తో॥ ఈ విధముగ సన్న్యాసయోగమున
కర్మ శుభాశుభ ఫలములను
ద్వివిధమునుండియు విడువంబడుచును
నన్ను చేరెదవు సుఖముగను ॥వా॥

*తో॥ చేసిన కర్మలు ఈశ్వరార్పితము॥చేసినవాడే ధన్యుండు
చేసిన దంతయు నేనే నాకని॥ఆశపడితె తా బద్ధుండు ॥వా॥ ౨౮

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥ 29

తా॥ నేను సకల జీవులయందు సమానుడను. నాకెందున్ను శత్రువు మిత్రులు లేరు. ఎవరైతే నన్ను మిక్కిలి ప్రపత్తిచే భజించెదరో అట్టివారు నాయందున్నవారే యగుదురు. నేను వారియందుండుదును.

*తో॥ సర్వభూతముల సముడను నాకును
ద్వేషిగాని ప్రియుడును లేదు
ఎవ్వరు భక్తితో నను భజించెదరో
నాలో వారలు వారిలోనుండు ॥వా॥

*తో॥ నాలో నమ్మిక గలవారలె నా
నామస్మరణము సల్పెదరు
నాలో నుందురు నను యెడ బాయరు
నను హృదయంబున తొల్చెదరు ॥వా॥ ౨౯

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః॥ 30

తా॥ చాలా దురాచారి ఐనవాడేకాని అతడు అనన్యభావనచే నన్ను భజించితే అతడు సాధువనియే తలంచనలయును. ఏలన అతడు దృఢ వ్యవసాయము చేసినవాడే అనవలయు.

తో॥ చాల దురాచారము గలిగినను
అనన్యగతి నను భజించినన్
చాల వ్యవసాయము గలుగుటచె
సాధువె యనుచును తలపవలెన్ ॥వా॥

*తో॥ పరాత్పరుడవని భక్తితో నిన్నును
పామరుడును బలుకగ కృష్ణ
పావనుడని భావించి పలికితివె
పరమపురుష హరి శ్రీకృష్ణ ॥వా॥ ౩౦

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥ 31

తా॥ ఆభక్తుడు అపుడే ధర్మాత్ముడగును. అట్లనే శాశ్వతమైన శాంతిని పొందును. అర్జున! నా భక్తునికి ఎప్పటికి నాశనములేదని నీవు ప్రతిజ్ఞ చేయుము.

తో॥ నా భక్తుడు నాశము చెందడు గను
శీఘ్రమె ధర్మాత్ముండగును
నా భక్తియు శాంతియు గల్గించని
అర్జున బల్కుము ప్రతిజ్ఞను ॥వా॥

*తో॥ భక్తుడు చాలా ధర్మాత్ముండగు
ధర్మాత్ముడు శాంతుండగును
భక్తుడన్నిటను ఉత్తముడగునని
భక్త పరాధీనుడు పల్కెన్ ॥వా॥ ౩౧

శ్లో॥ మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాంగతిమ్॥32

తా॥ పార్థ! స్త్రీలు వైశ్యులు శూద్రులు మరియు పాపము చేసినవారు కూడా భక్తితో నన్నాశ్రయించి పరమగతిని పొందెదరు.

తో॥ హీన జన్మలును స్త్రీలును వైశ్యులు
శూద్రులు మొదలుగ భక్తిగను
నన్నాశ్రయించి పరమపదంబును
పార్థ! పొందెదరు నిజ సుఖమున్ ॥వా॥

*తో॥ దనుజులు భుజగులు యక్షులు పక్షులు
దైత్యులు సమస్త జంతువులు
వనజనాభు భక్తిని భజియించిన
ముక్తిని సిద్ధము పొందెదరు ॥వా॥ ౩౨

శ్లో॥ కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్॥ 33

తా॥ ఇంక పుణ్యవంతులైన బ్రాహ్మణులు రాజర్షులైన క్షత్రియులు ఐన నా భక్తులమాట చెప్పవలయునా? అనిత్యమైనదియు సుఖములేనిదియునగు ఈ లోకములో నున్నావు. గనుక నన్ను భజించుచుండుము.

తో॥ పుణ్యవంతులయినను భజియించెడి
బ్రాహ్మణ రాజర్షులు చూడగ
పుణ్యులె అనిత్య మసుఖంబగు ఈ
భువి భజియించుము పార్థ నన్ను ॥వా॥

*తో॥ మహమ్మదీయుల కులమున పుట్టిన
కబీర్ కమాల్ మొదలగు వారు
అహంకారమును విడచియు నిను మది
తలంచి ధన్యులైరె నారు ॥వా॥ 33

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥ 34

తా॥ నాయందే మనస్సుంచినవాడవగుము. నాకు భక్తుడవగుము. (మద్యాజీ) నన్నే పూజించుము, నాకు నమస్కరించుము. నన్నే పరమ ప్రాప్యమని తలంచుము. నీ మనస్సు నాయందే చేర్చుము. నన్నే పొందగలవు సుమా!

తో॥ నీ మనసును నాయందే నిలుపుము
నా భక్తుడవై పూజించు
నమస్కరించుము గతి నేనంచును
నను పొందెదు నను భజియించు ॥వా॥

*తో॥ మానవ జన్మంబొసగిన కృష్ణ ♦ మనసును నిను చేర్చుము కృష్ణ
దానవభంజన దయచే కృష్ణ ♦ నను దాసుని చేయుము కృష్ణ॥వా॥ 34

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్య యోగోనామ నవమోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## విభూతియోగము – దశమాధ్యాయము.

తో॥ సర్వ లోకముల సర్వ దేవతల
సర్వ మానవుల జంతువుల
సర్వ నదుల స్థావర జంగమముల
సర్వేశ్వరు తెలియుడి మిగుల ॥వా॥

తో॥ అనేకాంశముల నొక యంశమె ఈ
అగపడు ప్రపంచమంతయును
అనేకముగ తోచెడి యాభరణంబుల
ఆర్యాదుగను బంగారుగను ॥వా॥

తో॥ సర్వము నీయందుండును కృష్ణ
సర్వంబును నీవే కృష్ణ
సర్వాత్మక యోగీశ్వర కృష్ణ
సర్వేశ్వర హరి శ్రీకృష్ణ ॥వా॥

తో॥ అన్నియు నేనని నా రూపములని
ఆదరమున ఆ పార్థునకు
అన్నియు నేనని తెలియ పలికితివి
అటు నిలకడ చేయుము నాకు ॥వా॥

శ్రీభగవానువాచ:—

శ్లో॥ భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥1

తా॥ మహాబాహుడవగు అర్జున! సద్వాక్యములు విని సంతోషపడు నీకు నీహితమునుకోరి నేను మరలను పరమ ఉత్తమమైన ఏ వాక్యమును నేను చెప్పబోవుచున్నానో దానిని వినుము.

తో॥ ప్రీతిగ వినియెడి నీకును మంచిది
చేయగను మహా బాహుడ నే
పలికెద పరమ శ్రేష్ఠంబయినది
మరల వినుము బహుప్రీతిగనే ॥వా॥

*తో॥ నిన్ను భజించెడి వారలు శ్రేష్ఠులు
తక్కిన వారలు అట్లట్లే
అన్యాయము చేయకు నేమనుజుడ
నీవేగతి నమ్మితి కృష్ణ ॥వా॥ ౧

శ్లో॥ న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥ 2

తా॥ నా ఉత్పత్తియు (పుట్టాయెననుసంగతి) సురగణములకు తెలియదు. మహర్షులకు తెలియదు. ఏలనగ నేనే సర్వప్రకారములచేత దేవతలకు మహర్షులకు ఆదికారణుడను.

తో॥ దేవసమూహము మహర్షి సంఘము
నా యుత్పత్తియు నెరుగరు గా
దేవతలకు మరి ఋషి సంఘములకు
ఆది కారణము నేనేగా ॥వా॥

*తో॥ సర్వప్రకారముల చూడంగను
సర్వమునకు నాధారుడవు
సర్వాధిప నిను స్మరణ చేసెదను
సర్వ విధంబుల ననుగావు ॥వా॥ ౨

శ్లో॥ యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసంమూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3

తా॥ నన్నెవఁడైతే పుట్టువు లేనివానిగను ఆదిలేనివానిగను సమస్త లోకములకు ప్రభువుగాను తెలియునో అట్టివాడు మనుష్యులలో మోహరహితుఁడనబడు. అతఁడు సకల పాపములనుంచి విడువబడును.

తో॥ ఎవ్వఁడజుండని అనాదియనియును
లోకాధారుండని నన్ను
ఎవ్వఁడు తెలియునో మోహరహితుఁడై
సర్వ పాపముల విడువబడుఁగా ॥వా॥

*తో॥ ఆది పురుషుఁడవు పురుషోత్తముఁడవు
ఆదికనాదివి హరికృష్ణ
ఆది నారాయణ అనాథ పోషక
ఆశ్రితుఁడను గావుము కృష్ణ ॥వా॥ 3

శ్లో॥ బుద్ధిర్జ్ఞానమసంమోహః క్షమా సత్యం దమశ్శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥ 4

తా॥ బుద్ధి జ్ఞానము మోహరహితము ఓర్పు సత్యము దమః - బాహ్యేంద్రియ నిగ్రహము, శమః - అంతరింద్రియ నిగ్రహము సుఖము దుఃఖము జననము మరణము భయము అభయము నానుండిరే.

తో॥ బుద్ధియు జ్ఞానము మోహరహితమును
యోర్పు సత్యమును శమదమము
భయాభయంబులు సుఖదుఃఖంబులు
పుట్టుట పోవుట సమ్మతిము ॥వా॥

*తో॥ సుఖమయినను బహు దుఃఖమయినను
సఖుఁడవు నీవె శ్రీకృష్ణ
సుఖస్వరూపుఁడవని నిను దలచితె
ఇక భయమెవరికి హరి కృష్ణ ॥వా॥ ర

శ్లో॥ అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥ 5

తా॥ అహింసా సమచిత్తము సంతుష్టి తపస్సు దానము యశస్సు అపయశస్సు మొదలైన అనేకవిధమైన ప్రాణిమాత్రుల భావములు నానుంచి పుట్టుచున్నవి.

తో॥ అహింస సమతయు తుష్టి తపస్సును
దానము యశంబు అపయశము
అర్జున భూతములకు గల్గును నా
వలన భావములు బహువిధము ॥వా॥

కృష్ణ కీర్తన:—

*తో॥ కీర్తియు అపకీర్తియు నీ వలనన
గలుగు చుండగను భయమేమి
కీర్తన పాడెద నీదగు పావన
కీర్తనకన్నను ఇంకేమి ॥వా॥ ౫

శ్లో॥ మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥ 6

తా॥ ఏడుగురైన మహర్షులు నలుగురు పూర్వీకులు అన మనువులు వీరందరు నామానసులైన భావముగలవారు. వీరివల్లనే లోకమందు ఈప్రజలు పుట్టిరి.

తో॥ మహర్షులేడ్వురు నలువురు మనువులు
బ్రహ్మాత్మకమగు నావలనన్
మద్గత భావములను జన్మించిరి
గలిగె చరాచర భూతములున్ ॥వా॥

*తో॥ ఎవ్వని కరుణచె బ్రహ్మేంద్రాదులు
ఆత్మ పదంబున వెలయుదురు
ఎవ్వని కాంతిచె ఇన చంద్రాగ్నులు
తేజో మహిమచె వెలుగుదురు ॥వా॥ ౬

శ్లో॥ ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥ 7

తా॥ ఎవడు ఈ నాదగు విభూతి అనగా విస్తారమును, యోగమనగా ఈవిస్తారమునుచేసెడి యుక్తి తత్త్వముగ తెలుసుకొన్నవాడో వాడుచలించక యోగసిద్ధిని నిస్సంశయముగ పొందుచున్నాడు.

తో॥ ఈనా విభూతి యోగము చక్కగ
ఎవ్వడెరుంగునో యతండుఁ
తనమనస్సు చక్కగ నిలుపుకొనుచు
నిస్సందేహము భక్తుడగుఁ ॥వా॥

*తో॥ వాసుదేవుడాత్మారాముండని
సంకర్షణుడే జీవుడని
ప్రద్యుమ్నుడె మానసంబు ననియును
అహంకార మనిరుద్ధుడని ॥వా॥ ౭

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥ 8

తా॥ నేను సమస్తమునకు ఉత్పత్తికారణమైనవాడనియు, నానుంచి సమస్తము ప్రవర్తించుచున్నదనియు బుధులు-అనగ పండితులు నెరింగినవారై నా భావయుక్తముగ నా భజన చేసెదరు.

తో॥ సర్వంబునకును నేనేప్రభువును
సర్వము నావలననె నడుచుఁ
ఇవ్విధమెరంగి బుధులు భావమున
భక్తిగ భజియించెదరునను ॥వా॥

*తో॥ సర్వజగమ్ములు పుట్టుట పెరుగుట
పోవుటకును కారణుడొకడే
సర్వేశ్వరుడగు వాసుదేవుడని
దలంచి ధన్యులుగారాదే ॥వా॥ ౮

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥ 9

తా॥ పండితులు నాయందు చిత్తముగలవారై నాయందే ప్రాణము లర్పించినవారై నాస్వభావమహిమయు తా మెరంగి యొకరికొకరు ఉపదేశము చేసికొనుచు నా కథామృతమువలన సంతుష్టులై ఎప్పుడు ఆనంద మనుభవింతురు.

తో॥ నాపై చిత్తము నాపై ప్రాణము
నొకరికొకరు బోధించడము
నాకథలను వర్ణించి సంతసము
నొందిరమింతురు యనవరతము ॥వా॥

*తో॥ నీ భజనయె అనుకూలము కృష్ణ
నీ స్మరణే ముఖ్యము కృష్ణ
నీకథశ్రవణానందము కృష్ణ
నీవేగతి నిజముగ కృష్ణ ॥వా॥

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥ 10

తా॥ ఇట్లు సతతము నాయందాసక్తి గలిగి ప్రీతిగ నన్ను భజించువారలకు బుద్ధియోగమును ఇచ్చెదను. అందుచే వారలు నన్ను పొందెదరు.

తో॥ ఈరీతిగ యేవేళను నన్నే
భజన చేయు పుణ్యాత్ములకున్
ఇచ్చెదవేగమె బుద్ధియోగమును
అందుచె పొందెదురా నన్ను ॥వా॥

*తో॥ నిన్ను భజించెడి బుద్ధియు నిమ్మ
నీ అనుగ్రహమె ముఖ్యముగా
నిన్నువిడచి నేనన్యము గోరను
నీదయ గల్గితె చాలునుగా ॥వా॥

శ్లో॥ తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11

తా॥ నన్ను భజించెడి వారల అనుగ్రహించుటకునై వారల ఆత్మభావమున అనగ హృదయమునందే నేనుండి జ్ఞానమనెడి దీప ప్రకాశముచె (వారి) అవివేకమువలన బుట్టిన అంధకారమును నశింపచేసెదను.

తో॥ భారత భక్తుల బోషించుటకై
హృదయపీఠముల నివసించి
వారల అవివేకము బోదోలుదు
జ్ఞానదీపమును వెలగించి ॥వా॥

*తో॥ ఎంతదయో నీదాసుల గావగ
ఆత్మజ్ఞానము గలిగించి
చింతలన్నియును తొలగించియు నీ
చెంత చేర్చెదవు దయయుంచి ॥వా॥ ౧౧

అర్జున ఉవాచ:—

శ్లో॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవమజం విభుమ్॥ 12

తా॥ నీవు పరబ్రహ్మమని శ్రేష్ఠస్థానముగలవాడవని పవిత్రుడని దివ్యుడు శాశ్వతుడు అయిన పురుషుడవని ఆదిదేవుడని అజుడని విభుడని పరమోత్కృష్టుడని.

తో॥ పరబ్రహ్మమని పరంధాముడని
పరమ పవిత్రుండని నిన్ను
పురుషుడు దివ్యుడు శాశ్వతుడజుడని
ఆదిదేవుడని విభునిన్ను ॥వా॥

*తో॥ పరబ్రహ్మ పరమాత్మ హారేయని
పట్టువిడువకను శ్రీకృష్ణ
పరమపురుష పరమేశ్వరయని నే
పలుకగ చేయవె హరికృష్ణ ॥వా॥ ౧౨

శ్లో॥ ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షి ర్నారదస్తథా।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే॥ 13

తా॥ నిన్ను సమస్త ఋషులు దేవర్షి అగు నారదులు మరియు అసిత దేవల వ్యాసులు కొనియాడెదరు. నీవు అట్లనె నాకు తెలిపించెదవు.

తో॥ ఈరీతిగ నిను ఋషి సమూహములు
దేవఋషియు నగు నారదుడున్
పరాశరాత్మజ అసితోదేవలు
లనెదరు అనెదవు నీవున్ను ॥వా॥

*తో॥ నీతిగనడచుచు నిన్ను స్మరించుచు
నీరజభవుడాదిగ సురులున్
స్తుతిచేయుచు దిక్పతులు పొగడెదరు
పతితపావనుడవగు నిన్ను ॥వా॥ ౧౩

శ్లో॥ సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ!।
న హి తే భగవన్! వ్యక్తిం విదుర్దేవా న దానవాః॥ 14

తా॥ కేశవ! నీవునాకుపదేశించిన సమస్త సంగతులు సత్యమని తలచుచున్నాను. భగవంత! నీ వ్యక్తిం - మూలము దేవతులుగాని అసురులుగాని తెలియజాలరు.

తో॥ నాపై ప్రేమచె నీవుబల్కినది
సత్యంబను చును నామతము
కృపాసాగరా నీమహామహిమ
దేవాసుర తెరుగరు నిజము ॥వా॥

*తో॥ ఓ శరణాగత పోషక కేశవ (కేశవ)
దాశరథే వో దయానిధి
నేశరణా గతుడను భగవంత (భగవన్)
వాసుదేవ త్రిజగాధిపతే ॥వా॥ ౧౪

శ్లో॥ స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ!
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే! ॥ 15

తా॥ సర్వభూతములను పుట్టించునట్టి భూతేశ! దేవదేవ! జగత్పతే! పురుషోత్తమ! నిన్ను నీవె స్వతః ఎఱుంగుదువు.

తో॥ నీ మహామహిమ నీవెఱుంగనగు
నిఖిలభూతముల కాధార
నిర్మలాకార నిఖిలేశ హరి
పురుషోత్తమ దేవాధార ॥వా॥

*తో॥ పురుషోత్తమ ఓ పురాణపురుష
జగత్పతే శ్రీ హరికృష్ణ (జగత్పతే)
కరుణాసాగర నిన్నుగనుగొనగ
నీ కరుణయె ముఖ్యము కృష్ణ ॥వా॥ ౧౫

శ్లో॥ వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

తా॥ యేవిభూతులచే నీవు ఈలోకములను వ్యాపించియున్నావో ఆ దివ్యమైన ఆత్మవిభూతులను సంపూర్ణముగ తెలుపుము.

తో॥ యేవిభూతులచె ఈ జగంబులను
వ్యాపించితి వో సర్వేశా
దివ్యవిభూతులు నిశ్శేషముగను
దెలుపవలయు యో వృష్ణీశా ॥వా॥

*తో॥ ఆత్మప్రకాశ మానమెజగంబు (ఆత్మ)
లన్నియు అఖిలేశ్వర ఈశా
ఆత్మయగుచు నా అంతరంగమున
అంతయు నీవే సర్వేశా ॥వా॥ ౧౬

శ్లో॥ కథం విద్యామహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్! మయా॥17

తా॥ యోగీశ్వర! సర్వకాలమును నిన్ను చింతన చేయుచు నేను ఎట్లు తెలియవలయును? మరియు భగవంత! ఏ ఏ భావములచే నేను నిన్ను చింతన చేయవలయును? (తెల్పుము)

తో॥ హే యోగీశ్వర! నిను యేవేళను
ఏ రీతిగ భజియించవలెన్
ఏ ఏ భావంబుల తలపందగు
భగవంతుడ దెల్పుముదయను ॥వా॥

*తో॥ నానా విషయంబుల కోరుచు తా
నా చిత్తము వ్యర్థంబాయెగా
నా చిత్తము బహుచపలము తండ్రి
నీ చింతన గలిగించుమయా ॥వా॥ (చింతయన్)

శ్లో॥ విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన!
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥

తా॥ జనార్దన! నీ యోగమును విభూతిని మరల విస్తారముగ తెల్పుము. నీ అమృత మయమయిన వాక్యములు వినుచున్న నాకు తనివి కాలేదు.

తో॥ ఆత్మయోగమును ఐశ్వర్యంబును
మరల తెల్పు విస్తారముగన్
అమృతవాక్యములు వినగోరెదను
జనార్దనుడ తృప్తిగ నాకున్ ॥వా॥

*తో॥ నాబుద్ధియు నీయందే నిలువదు
నామనసన్యుల దూషించు
నా అహంకార మహంకారమే
నారాయణ ననుపోషించు ॥వా॥

శ్రీభగవానువాచ:—

శ్లో॥ హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యన్తో విస్తరస్య మే ॥ 19

తా॥ (నాయన మంచిది) కురుశ్రేష్ఠ! నా దివ్యమయిన ఆత్మ విభూతులు నీకు ప్రాధాన్యమయినవి తెల్పెదను. (ఏలన) నా లీలా విభూతి విస్తారమునకు అంతమే లేదు గదా.

తో॥ ఆత్మవిభూతిలో ముఖ్యమైనదియు
కురుశ్రేష్ఠ బల్కెద వినుము
అంతమే లేదు నా విభూతికిని
మాహాత్మ్యము దివ్యము గనుము ॥వా॥

*తో॥ అయ్యో యెంతటి భాగ్యశాలుడవు (హంత)
అర్జున ధన్యుడవవుదువునా
ఆత్మవిభూతిని వినంగగోరితి (ఆత్మవిభూతయః)
వందులో ముఖ్యము వినునాయన ॥వా॥ ౧౯

శ్లో॥ అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥ 20

తా॥ గుడాకేశ! సర్వభూతముల అంతర్యామి అయిన ఆత్మను నేను. మరియు భూతములకాదియు మధ్యము అంతము అయివున్నాను.

తో॥ అన్ని భూతముల అంతరంగముల
ప్రకాశించు ఆత్మయు నేను
అన్ని భూతముల యాదియు మధ్యము
గుడాకేశ యంతము నేను ॥వా॥

*తో॥ నామనసస్యల ద్రవ్యము గోరును
నాలుబిడ్డలను భూషించు
నామనసన్య స్త్రీలను దలచునె
అన్యాయము నను శాసించు ॥వా॥ ౨౦

శ్లో॥ ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ 21

తా॥ ద్వాదశాదిత్యులలో నేను విష్ణువు. తేజస్సులలో కిరణపూర్ణుడయిన సూర్యుడను. మరుద్గణములలో మరీచి నేను. నక్షత్రములలో చంద్రుడను నేను.

తొ॥ ఆదిత్యులలో విష్ణువు నేను
తేజోవంతుల సూర్యుడను
మరుద్గణంబుల మరీచినేను
నక్షత్రంబుల చంద్రుడను ॥వా॥

*తొ॥ నాబుద్ధిని ఏకాగ్రత చేసియు
నిన్నుగ్రహించగ గావించు
నాచిత్తము విషయంబుల గోరక
నీ చింతనలో మరిగించు ॥వా॥ ౨౧

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22

తా॥ వేదములలో నేను సామవేద మయినాను. దేవతాగణములలో ఇంద్రుడయినాను. ఇంద్రియములలో మనస్సు నేను. భూతములలో చేతనము నేన.

తొ॥ వేదంబులలో సామవేదమును
దేవతలను దేవేంద్రుడను
ఇంద్రియంబులను మనస్సు నేనే
ప్రాణికోట్ల చైతన్యమును ॥వా॥

*తొ॥ నామనసన్యుల ద్రవ్యము గోరక
స్త్రీలను భ్రాంతితో చూడకను
ఏమిని కోరక నిన్నే గోరిన
నామనంబు ధన్యంబునగున్ ॥వా॥ ౨౨

శ్లో॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్॥ 23

తా॥ ఏకాదశరుద్రులలో శంకరుడు నేనే. యక్ష రాక్షసులలో కుబేరుడు నేను. అష్టవసువులలో అగ్నియగుచున్నాను. సప్త కులపర్వతములలో మేరువు నేనే

తో॥ రుద్రులలో నేశంకరుడగుదును
యక్ష రాక్షసుల కుబేరుడగా
అష్టవసువులను అగ్నిహోత్రుడను
కొండలలో మేరువు నేనే ॥వా॥

*తో॥ విడుచుట మననే చేర్చుట మననే
తడబడచుండుటయును మననే
విడువక నిను సేవించుట మననే
కడుబంధము మోక్షము మననే ॥వా॥ ౨3

శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కన్దః సరసామస్మి సాగరః ॥ 24

తా॥ పార్థ! పురోహితులలో ముఖ్యుడయిన బృహస్పతి నేనే అని యెరుంగుము. సేనానాయకులలో కుమారస్వామిని నేనే. జలాశయములలో సముద్రము నేనే.

తో॥ పౌరోహితులను ముఖ్యుడయినయా
బృహస్పతాచార్యులు నేను
పార్థ సరస్సుల సాగరమవుదును
సేనాపతులను స్కందుడను ॥వా॥

*తో॥ సుఖమును మననే దుఃఖము మననే
సుఖదుఃఖ సమూహము మననే
సుఖమునకై నినుకోరుట మననే
సుఖరూపుని చేరుటమననే ॥వా॥ ౨౪

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥

తా॥ ఋషులలో భృగుమహర్షి నేను. వాక్కులలో ఓంకారము నేను. యజ్ఞములలో జపయజ్ఞము నేను. స్థావరములలో హిమవత్పర్వతమును.

తో॥ భృగువునేను ఋషిసమూహంబునను
వాక్కులలో ప్రణవాక్షరము
యజ్ఞంబులలో జపయజ్ఞంబును
స్థావరంబులను హిమశైలము ॥వా॥

*తో॥ అహంకారమున అంధకారుడై
యమకింకరులచే బాధపడి
ఓంకారంబును జపమునుచేయుచు
శంకలేక సాధన్యుండౌ ॥వా॥ ౨౫

శ్లో॥ అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః ॥ 26

తా॥ సర్వవృక్షములలో అశ్వత్థ వృక్షము నేనే. దేవఋషులలో నారదుడు నేనే. గంధర్వులలో చిత్రరథుడు నేనే. సిద్ధులలో కపిలముని నేనే.

తో॥ వృక్షములను నేనశ్వత్థంబును
దేవర్షుల నేనారదుడౌ
గంధర్వులనే చిత్రరథుండను
కపిలాచార్యుడ సిద్ధులను ॥వా॥

*తో॥ అహంకారమున జన్మమరణములు
సంకటములు తానొందియును
అహంకారమును విడచియు నీకును
కింకరుడై ధన్యుండగును ॥వా॥ ౨౬

శ్లో॥ ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27

తా॥ అశ్వములలో నమృతముతో బుట్టిన ఉచ్చైశ్శ్రవసము నేనే. గజశ్రేష్ఠములలో నైరావతము, నరులలో రాజును నేనే యని తెలియుము.

త్రో॥ గుఱ్ఱంబులలో నమృతముతోడను
గలిగిన యుచ్చైశ్శ్రవసము నే
ఐరావతమని తెలియు మేనుగుల
నరసమూహమున రాజును నే ॥వా॥

*త్రో॥ బాల్యజరా మరణంబుల గానని
అహంకృతియు యవ్వనమందు
లీలసల్పి గురుకృపగలుగగనే
తాళినీదు సన్నిధిబొందు ॥వా॥ ౨౭

శ్లో॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ 28

తా॥ ఆయుధములలో నేను వజ్రాయుధము, ధేనువులలో కామధేనువు నేను. ప్రజోత్పాదకుడయిన కందర్పుడు నేను. సర్పములలో వాసుకి నేను.

తో॥ ఆయుధములలో వజ్రము నేను
కామధేను వావులలోను
అనంగుడను నే ప్రజోత్పత్తికిని
సర్పంబుల వాసుకి నేను ॥వా॥

*తో॥ సత్కార్యంబులు అహంకారమున
సల్పుచునుండగ నీదయచే
సంస్కారబలంబున ధన్యుండౌ
సర్వముహరి యని తలచుటచే ॥వా॥ ౨౮

శ్లో॥ అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతామహమ్॥

తా॥ మరియు నాగులలో నేను అనంతుడను. జలవాసులలో నేను వరుణుడను. పితృవులలో అర్యముడు నేనే. (ఆర్యుడు) నియమించుటలో నేను యముఁడే.

తో॥ నాగుపాములలో అనంతుడనునే
జలదేవతలలో వరుణుండఁగా
పితృదేవతలలో ఆర్యముడనునే
నియమించుటలో యముఁడనునే ॥వా॥

*తో॥ దండధరుడవై దండించెదవో
దయామయా శ్రీహరికృష్ణ
దండనచేసియు ననునీవానిగ
దయచేయుము కోరెదకృష్ణ ॥వా॥ ౨౯

శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥

తా॥ దైత్యులలో నేను ప్రహ్లాదుడను. మ్రింగువారిలో కాలుడు నేను. మృగములలో నేను సింహమును, పక్షులలో గరుడపక్షిని.

తో॥ రాక్షసులలోను ప్రహ్లాదుండను
గణికులలో కాలము నేను
పక్షిసంఘములో వైనతేయుడను
మృగములలో సింహము నేను ॥వా॥

*తో॥ ప్రహ్లాదవరద పరమాత్మయనుచు
పరిపరి విధముల శ్రీకృష్ణ
ఆహ్లాదంబున ననుదినంబు నిను
అనుటయు గల్గింపుము కృష్ణ ॥వా॥ ౩౦

శ్లో॥ పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ 31

తా॥ వేగవంతులలో వాయువు నేను. విలుకాండ్రలో రఘురాముడను. జలజంతువులలో మకరము నేను. నదులలో గంగానది నేను.

తో॥ వేగము గలవారలలో వాయువు
శస్త్రపాణులలో రాముడను
మకరమేను జలజంతు వర్గమున
నదులలోను గంగానదిని ॥వా॥

*తో॥ శ్రీరామయనుచు శ్రీకృష్ణయనుచు
శ్రీరాఘవ యాదవయనుచు
శ్రీరామకృష్ణ యనిభజించెదము
నీ దాసులతో చేరికొనుచు ॥వా॥                    ౩౧

శ్లో॥ సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున !
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥

తా॥ అర్జున ! సృష్టియొక్క ఆదియు మధ్యమము అంత్యము నేనే. విద్యలలో అధ్యాత్మవిద్య నేనే. వాదులు మూడువిధములు అనగ వాద జల్ప వితండ అనునవి. వాద – సిద్ధాంతముచేయునది, జల్ప – ఉపయుక్తములేని మాటలు, వితండ – స్వపక్షమాటలు. ఇందులో వాదము నేనే.

తో॥ కుంతీసుత సృష్టులకును మొదలును
మధ్యము అంత్యము నేనేను
విద్యలలో అధ్యాత్మవిద్యనే
వాదులలోవాదము నేను ॥వా॥

*తో॥ బ్రహ్మసత్యమని పలికెడి పలుకే
వాదమనుచు ఎంచగదగును
జగత్ సత్యమను పలుకు జల్పమగు
తర్కమున వంత వితండమగుగా ॥వా॥                    ౩౨

శ్లో॥ అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వస్సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః॥

తా॥ అక్షరములలో అకారము నేనే. సమాసములలో ద్వంద్వసమాసము నేనే. అక్షయకాలము నేనే. నలుదెసల ముఖములుగల బ్రహ్మ నేనే. అనగ విశ్వముఖుడని తాత్పర్యము.

తో॥ అక్షరములలో అకారమాదును
సమాసముల ద్వంద్వము నేనే
అక్షయమగు కాలంబును నేనే
విశ్వముఖుండగు విధినేనే ॥వా॥

*తో॥ వారివారి కర్మానుసారముగ
వారిముఖంబుల వ్రాసెదవు
వారిజనాభుని వరసుతవాణీ
వరదా నీవాడను బ్రోవు ॥వా॥ 33

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥ 34

తా॥ సర్వసంహారకుడైన మృత్యువు నేనే. ముందుపుట్టేవారి ఉత్పత్తి హేతువు నేను. స్త్రీలలో కీర్తి, లక్ష్మి, వాణి, స్మృతి, మేధా, ధృతి, క్షమా ఇవన్నియు నేనే.

తో॥ సర్వహరణమగు మృత్యువునేనే
ఉత్పత్తిస్థానము నేనే
స్త్రీలకీర్తి శ్రీవాక్స్మృతిమేధా
ధైర్యము క్షమాదులును నేనే ॥వా॥

*తో॥ భగవద్వాక్యములను భద్రముగను
పాటించెడి పుణ్యాంగనల
భాగ్యమె భాగ్యము పరమపతివ్రత
లగుదురు వారేమాడఖిల ॥వా॥ 34

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసామహమ్।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥

తా॥ సామవేదములలో బృహత్సామము నేనే. ఛందస్సులలో గాయత్రియు, అట్లనే మాసములలో మార్గశీర్షమాసము, ఋతువులలో వసంతమును నేనేను.

తో॥ సామవేదమున బృహత్సామమును
ఛందస్సుల గాయత్రియును
మాసంబులలో మార్గశీర్షమును
ఋతువుల వసంత ఋతువవుదుగా ॥వా॥

*తో॥ గాయత్రీమంత్రంబుకంటె మరి
ఉత్తమ మంత్రంబిక లేదు
శ్రేయస్సని సంధ్యావందనమును
చేయవలయు తప్పుటగాదు ॥వా॥ 35

శ్లో॥ ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥

తా॥ వంచకులలో జూదము నేను. తేజోవంతుల తేజము నేను. జయము నేను. వ్యవసాయము నేను. సత్త్వముగలవారల సత్త్వము నేను.

తో॥ జగద్వంచకుల జూదము నేను
తేజోవంతుల తేజమును
సత్త్వవంతులలో సత్త్వము నేను
వ్యవసాయము జయమును నేను ॥వా॥

*తో॥ నలుడు ధర్మజుడు న్యాయము తప్పక
పలుకష్టంబుల పాలయిరి
ఇలవారలకీర్తియు నిప్పటికిని
వెలసె జూదమున ధన్యులయిరి ॥వా॥ 36

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః॥ 37

తా॥ యాదవులలో వాసుదేవుడను, పాండవులలో ధనంజయుడను, మునీశ్వరులలో వ్యాసముని నేను. కవులలో శుక్రాచార్యుడు నేను.

తో॥ యాదవకులమున వాసుదేవుడను
పాండుపుత్రులలో పార్థుడను
విద్వాంసులలో శుక్రాచార్యుడ
మునీశ్వరులనే వ్యాసుడను ॥వా॥

శ్రీ వ్యాసస్తుతి:—

*తో॥ ఏకముఖంబున చతుర్ముఖుండవు
రెండు భుజంబుల శ్రీహరివి
రెండుకన్నులను ఫాలనేత్రుడవు
భగవంతా వినునామనవి ॥వా॥ 32

శ్లో॥ దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥

తా॥ దండనలలోని దండనీతి నేను. జయేచ్ఛగలవారిలో రాజనీతి నేను. రహస్యములలో మౌనము నేను. తత్త్వవేత్తల జ్ఞానము నేను.

తో॥ శిక్షించెడి యోగ్యుల శిక్షయును
జయేచ్ఛవారల నీతియును
గుహ్యంబులలో మౌనము నేను
జ్ఞానుల జ్ఞానము నంతయును ॥వా॥

*తో॥ పరబ్రహ్మ పరమాత్మ పరాత్పర
పురుషోత్తమ శ్రీహరికృష్ణ
వరదా నినువేడెద నినుతలచెద
నీ కథలను వినెదను కృష్ణ ॥వా॥ 3౮

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున !
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్॥

తా॥ అర్జున! సర్వభూతములకు ఆదికారణమైన బీజము నేనే. చరాచరములయిన భూతములు ఏమియున్ను నన్ను విడచిలేవు. (అనగ సమస్తము నావిభూతియే అని తాత్పర్యము).

తో॥ హే అర్జున ఈ సర్వభూతముల
ఉత్పత్తికి బీజము నేనే
హేతువు ననువిడచియును చరాచర
భూతంబులు లేవనిగను విను ॥వా॥

*తో॥ మాస్వామికి గల ఆస్తియు వినగను
ఆనందము హరి గోవింద
నాస్వామికి గల ఆస్తియునాదే
నాకేమికొదవ గోవింద ॥వా॥ 39

శ్లో॥ నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప !
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా॥ 40

తా॥ పరంతప ! నా దివ్యమయిన విభూతులకు అంతములేదు. ఈ విభూతియొక్క విస్తారమును నాచేత సంక్షేపముగ చెప్పబడినది.

తో॥ దివ్యంబగు నా విభూతులకు మరి
అంతము లేదర్జున గనుమా
ఈ విస్తారము సంక్షేపముగను
తెలిపితిని పరంతప వినుమా ॥వా॥

*తో॥ అంతములేనట్టిది మాకృష్ణునివిభూతి విస్తారము చూడ
చింతలేదు అత్యంతానందము నాదేవుని భాగ్యము జాడ॥వా॥

శ్లో॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్॥ 41

తా॥ విభూతి (వైభవము) గలది, లక్ష్మీశ్రీయుతమయినది, ఊర్జితమనగ ప్రభావముగలది అయిన ఏ ఏ సత్త్వమున్నదో అదంతయు నా తేజోంశముచే గలిగినదని యెరుంగుము.

తో॥ సంపదచేరియు కాంతితో నిండియు
శ్రీమంతంబై స్వచ్ఛంబై
ఇంపై ప్రకాశయుతమగునది నా
తేజోద్భవ మయినది సొంపై ॥వా॥

*తో॥ పదునాలుగు లోకములకు కృష్ణుడు
ప్రభువగు అతని మూలమున
ప్రపంచమంతయు ప్రకాశించు ఆ
పరమానందుని భక్తుడను ॥వా॥ ౪౧

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥ 42

తా॥ అథవా అర్జున! ఇదంతయు నీవు యెరింగి చేయునదియేమి? నేను నాయొక్క ఏకాంశమునుంచి ఈజగత్తంతయు వ్యాపించి మరి నిలిచినాను. ("పాదోస్య విశ్వా భూతాని" అని శ్రుతి)

తో॥ అర్జున నాబహు విభూతివినియును
ఆచరించు నదియును పలుకు
ఊర్జితమగు నాయొకయంశముచే
జగత్తునిలచిన దని పలుకు ॥వా॥

*తో॥ మా గోపాలుని ఐశ్వర్యంబును•అంతఇంతయని అననగునే
మాగోవిందుని పంపదెసంపద•మాపలికిని నిజదాసుడనే॥వా॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## ఏకాదశాధ్యాయము – విశ్వరూప సందర్శనయోగము.



తో॥ విశ్వమంతయును తనరూపంబని
విశ్వాధారుడు బల్కిపిని
విశ్వరూపమును చూడగవేడిన
దర్శనమొసగెను విజయునికిన్ ॥వా॥

తో॥ పరీక్షించగను ప్రయత్నపడియును
ప్రార్థించిన యా పార్థునికిన్
కరుణాకరుడగు కృష్ణుడు కరుణతో
జ్ఞానకన్నొసగె నాతనికిన్ ॥వా॥

తో॥ అన్నియోగములకన్నను మిక్కిలి
భక్తియోగమే మేలనుచు
అన్నిటికిని నేనగపడ భక్తికి
అర్జున అగపడితిని యనుచు ॥వా॥

తో॥ మర్మమంతయును మాధవునిచే విని
మాన్యుడవయితివి భువిలోను
ధర్మానుజ నీవెంత ధన్యుడవు
దాపుచేర్చునను మ్రొక్కెదను ॥వా॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥ 1

తా॥ నన్ననుగ్రహించుటకొరకు ఉత్తమమగు రహస్యమయిన అధ్యాత్మ సంజ్ఞకమాటలు నీచేత చెప్పబడినది. అందుచే నా మోహము పరుగిడెను.

తో॥ తండ్రీ యెంతదయో నాపై నను
తత్త్వరహస్యము దెలుపగను
ఉండిన మోహము వూడిపోయెనీ
కృపారసము దయ చల్లగను ॥వా॥

*తో॥ యరుకమాలి ఈఆత్మజ్ఞానము
యెరుగకుంటినే నా తండ్రి
పరమోత్తమ మగు పరమ రహస్యపు (పరమం గుహ్యం)
పల్కులు పల్కితి వోతండ్రి ॥వా॥ ౧

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా।
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్యమపి చావ్యయమ్॥

తా॥ కమలపత్రాక్ష! భూతముల ఉత్పత్తి లయములను నీ అక్షయమయిన మాహాత్మ్యమును నీనుంచి నేను విస్తారముగ వింటిని.

తో॥ తండ్రీ నీవలనను భూతంబులు
పుట్టుట పోవుటలను వింటి
యుండెడి నీమహిమయు అవ్యయమని
పుండరీకాక్ష అనుకొంటి ॥వా॥

*తో॥ విస్తారంబుగ వివరించితివో (విస్తరశో)
వింటిని శ్రవణానందముగ
విస్తారంబుగ చూడగ గల్గునో
విధిలిఖితము నోచటున్నదో ॥వా॥ ౨

శ్లో॥ ఏవమేతద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర !
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ! ॥ ౩

తా॥ పరమేశ్వర ! నీవు నీ ఆత్మ వర్ణనమును పలికితివి. అది అట్లే వుండును. అట్టినీ ఈశ్వరీరూపమును పురుషోత్తమ! చూడనపేక్షించుచున్నాను.

తో॥ పరమేశ్వర నీవాక్యము సత్యము
నీ యైశ్వర్యపు రూపమును
పురుషోత్తమ నీచే సెవినినది
గనుపింపుము నీదయతోను ॥వా॥

*తో॥ గురువులలో నీవాది గురువుగద
గొనియాడెద నే శ్రీకృష్ణ
మరువక నినుమది మరిమరి తలచెద
అనుగ్రహించుము హరికృష్ణ ॥వా॥ 3

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్॥

తా॥ ప్రభు! అట్టి నీరూపమును నాచుంచి చూడ శక్యమగునని నీఅభిప్రాయమయిన యోగేశ్వర! నీవు నీ అవ్యయమయిన ఆత్మను నాకు చూపుము.

తో॥ యోగేశ్వర నీ దివ్యరూపమును
దర్శించుట నాకును చూడ
యోగ్యత గలదని దలచిన ఇప్పుడు
కనుపించుము నీదయతోడ ॥వా॥

*తో॥ ప్రభుడవు పరమేశ్వర ప్రార్థించెద (ప్రభో)
పట్టువిడువకను చేపట్టు
ప్రభులింకెవ్వరు నీకన్నను మరి
పరమరహస్యము చూపట్టు ॥వా॥ ౪

శ్రీ భగవానువాచః—

శ్లో॥ పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ 5

తా॥ పార్థ! నానాప్రకారములుగ నానావర్ణములు గలిగియు అనేక రూపములు గలిగివుండే ఈ నూరారుసావిరారు దివ్యరూపములను చూడుము.

తో॥ ఓయిపార్థ! నా ఆకృతిచూడుము
నూరులు సహస్రములు గలది
దివ్యము నానావిధ వర్ణంబులు
నానా ప్రకారములు గలది ॥వా॥

*తో॥ చాలా భక్తుండవు ఓపార్థ!
చాలా అద్భుత దర్శనము
చాలా ప్రేమతో చూడుము తాతా
చాలా దివ్యస్వరూపము ॥వా॥ ౫

శ్లో॥ పశ్యాదిత్యాన్వసూన్రుద్రా నశ్వినౌ మరుత స్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత!॥ 6

తా॥ భారత! ఇదో (౧౨) ఆదిత్యుల (౮) వసువుల (౧౧) రుద్రుల (౨) అశ్వనీకుమారుల (౪౯) మరుద్గణంబుల చూడుము. అలాగుననే ఎపుడు చూడ నసాధ్యమగు బహువిధ ఆశ్చర్యములను చూడుము.

తో॥ భారతగను ఆదిత్యుల వసువుల
రుద్రుల అశ్వనీ దేవతల
మరుద్గణంబుల మరి ఎపుడెరుగని
అనేకమగు ఆశ్చర్యముల ॥వా॥

శంకర స్మరణ.

*తో॥ శంకర కాలభయంకర మునినుత ♦ కింకర మార్కండేయనుత
లంకాపతి సేవిత పాదాంబుజ ♦ పంకజాసనాదివందిత ॥వా॥

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ 7

తా॥ గుడాకేశ! ఈ నాయొక్క దేహమునందు ఇపుడు చరాచరాత్మకము సర్వజగత్తును ఇంకేమైనను చూడవలయునని నీకు ఇష్టముండినచో నీవు చూడుము.

తో॥ గుడాకేశగను నాదేహంబున
చరాచరంబగు జగత్తును
చూడగ ఏమిటి కోరెదవో అది
యొక స్థానంబున చూడనగుగా ॥వా॥

*తో॥ పదునాలుగు లోకంబుల యాత్ర
మరి నీ సంకల్పపుయాత్ర
హృదయాకాశంబున గనుపార్థ
ముదమును పొందించునుయాత్ర ॥వా॥ 2

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥8

తా॥ అయితే ఈ నీకన్నుల చేతనే నన్ను చూచే శక్తి నీకు సాధ్య పడదు. నీకు నేను దివ్యదృష్టి ఇచ్చెదను. నీవు నాదగు యోగశక్తియొక్క ఐశ్వర్యమును చూడుము.

తో॥ నీనేత్రములచె నాదగురూపము
నాయున చూడగ గాదిపుడు
నేనిపుడిచ్చెద దివ్యదృష్టియును
యోగపు ఐశ్వర్యము చూడు ॥వా॥

*తో॥ పరమదయాళుడు పార్థునికిని తా
పరమార్థజ్ఞానము దెలిపి
పరిపాలించగ పూర్ణకటాక్షము
పొందియు హృదయంబును నిలిపి ॥వా॥ ౧

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥ 9

తా॥ రాజా! ధృతరాష్ట్రా! విను. మహాయోగీశ్వరుడగు హరి ఈరీతిని పలికి పార్థునికి తన శ్రేష్ఠమయిన విశ్వరూపసందర్శన మొసంగెను.

తో॥ రాజ విను మహాయోగేశ్వరు డగు
రాజీవాక్షుడు పల్కియును
విశ్వరూప సందర్శన మిచ్చెను
పరమోత్తమంబు పార్థునికిగా ॥వా॥

*తో॥ పార్థుడు పరమాత్మని ధ్యానించెను
భక్తి జ్ఞానవైరాగ్యముచే
పరమదయాళో పాపవిభంజన
పావన యనుచును తానిలచె ॥వా॥

శ్లో॥ అనేక వక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥ 10

తా॥ ఆ విశ్వరూపమునకు అనేక ముఖములు కన్నులుగలిగి అనేక అద్భుతమయిన వింతలుకలిగుండెను. దివ్యాభరణములతోను ఆయుధములతోను గూడుకొనియుండెను.

తో॥ అనేకంబులగు వక్త్రనయనములు
అద్భుతదర్శన మనేకము
అనేక దివ్యాభరణంబులును
ఆయుధములు మరి అనేకము ॥వా॥

*తో॥ విశ్వాధారా విశ్వాకారా॰విశ్వములోగాను విశ్వేశా
విశ్వాపంబుగ ప్రార్థించెదనే॰విశ్వరూపదర్శన ఈశా॥వా॥

శ్లో॥ దివ్యమాల్యాంబరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్॥ 11

తా॥ దివ్యములగు హారములు, వస్త్రములు ధరించి పరిమళమగు గంధము పూతగలిగి యెల్లెడలముఖములుగలిగి ఆశ్చర్యకరమై అంతములేని స్వరూపమును (అర్జునుడు చూచెను).

తో॥ దివ్యాంబర హారంబులతోడను
దివ్యగంధలేపముతోను
దేవుడు అంతటముఖములు గలిగియు
తేజరిల్లె ఆశ్చర్యముతోను ॥వా॥

*తో॥ దీనుండను నే దీనజనావన
దాత నీవు నేదాసుడను
నే నజ్ఞానుడ సర్వజ్ఞుండవు
నిను తెలియగ నెంతటివాడఁ ॥వా॥ ౧౧

శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః॥ 12

తా॥ ఆకాశమున సహస్రసూర్యులు ఏకకాలమున ప్రకాశించిన ఎంత కాంతి గలిగియుండునో దానికి సమానముగ ఆ మహాత్ముని కాంతి గలిగి యుండెను.

తో॥ ఏకకాలమున వేయి సూర్యులును
ఆకాశమున ప్రకాశించ
ఏకాంతియు కనుపడు నారీతిగ
మహాత్ముడపుడు ప్రకాశించె ॥వా॥

*తో॥ ఆయా కాలంబుల ఆరీతిగ
అగపడు తన ఆకృతికృష్ణ
అర్జునునకు నీవనుగ్రహించియు
అగపడితివి గద హరికృష్ణ ॥వా॥ ౧౨

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా ॥ 13

తా॥ అనేకవిధములుగ విభాగింపబడిన జగత్తంతయు ఆ దేవదేవుని దేహమున ఒకప్రక్కన వుండుట అప్పుడు అర్జునుడు చూచెను.

తో॥ అనేక విధముల నేర్పడియుండెడి
సమస్త జగత్సమూహమును
అర్జునుడావేళను శ్రీకృష్ణుని
శరీరమునగనె నొకమూలగా ॥వా॥

*తో॥ దేవదేవు దేహంబున నొకచో
దేవేంద్రుని పుత్రుడు గనెను
దేవ మర్త్య పాతాళ లోకములు
దలచిన పుణ్య స్థలములను ॥వా॥ ౧౩

శ్లో॥ తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలిరభాషత ॥ 14

తా॥ పిమ్మట ధనంజయుడు ఆశ్చర్యమొంది గగుర్పాటుచెందిన వెంట్రుకలుగలిగి విశ్వరూప ధరుడయిన శ్రీకృష్ణుని శిరసా నమస్కరించి చేతులు జోడించి ఇట్లు పలికెను.

తో॥ పిమ్మట ఆశ్చర్యంబును పొందియు
పార్థుడు చేతులు జోడించి
పులకాంకితుడై భగవంతుని గని
పలికెను తన శిరసునువంచి ॥వా॥

*తో॥ సాష్టాంగ నమస్కారముచేసియు (ప్రణమ్యశిరసా)
సాక్షాత్ భగవంతుని గనియు
చేతులు జోడించియు భయపడియు
ధనంజయుడు నని ఇట్లనియు ॥వా॥ ౧౪

అర్జున ఉవాచ:—

శ్లో॥ పశ్యామి దేవాంస్తవ దేవ దేహే
సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15

తా॥ దేవా! నీ యీ దేహములో సర్వదేవతలును అనేకవిధములగు ప్రాణికోట్లును కమలాసనస్థుడగు బ్రహ్మదేవుడును సమస్తులయిన ఋషులును దివ్యసర్పములును కనులార చూచుచున్నాను.

తో॥ దేవా నీ దేహమున దేవతలు
కమలాసనుడగు బ్రహ్మయును
దివ్యోరగములు భూతసంఘములు
ఋషిసంఘము నాకగపడెను ॥వా॥

*తో॥ సామాన్యుండని తలచుచునుంటిని
సర్వేశ్వరుడని తెలియకను
సర్వదేవతల సర్పాల తాతను
సర్వఋషుల నీలోకంటిన్ ॥వా॥ ౧౫

శ్లో॥ అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతో౽నన్తరూపమ్।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర ! విశ్వరూపమ్ ॥ 16

తా॥ విశ్వరూపుడయిన విశ్వేశ్వర! అనేక బాహువులు, ఉదరములు, అనేకముఖములు, నేత్రములు వుండే అనంతరూపుడయిన నీవు ఎక్కడచూస్తే అక్కడ కనుబడుచున్నావు. నీ కడ యెక్కడనో మధ్యమేదో ఆది ఏదో ఎరుంగను.

తో॥ అనేక బాహువు లుదర మనేకముల్
వక్త్ర నేత్రము లనేకములు

ఆదిమధ్య మంతము తెలియ బడదు
హరి నీకనంత రూపములు ॥వా॥

*తో॥ అనంతరూపుడ వఖిలేశ్వరుడవు (అనంతరూపం)
అంతట నిండియు నున్నావు (సర్వతః)
ఆద్యంతము మధ్యము మగబడదు
అఖండ రూపుడ వే నేవు ॥వా॥ ౧౬

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తానలార్క-ద్యుతి మప్రమేయమ్ ॥ 17

తా॥ కిరీటము గదా చక్రములు ధరించినవాడవు. తేజోరాశివి. అంతట వెలుంగువాడవు. మండే అగ్నివలె వెలిగెడి సూర్యునివలె ప్రకాశించెదవు. చూడనలవిగానట్టివాడవు. అప్రమేయ ! నిన్ను అంతట చూచెదను.

తో॥ కిరీటగద చక్రముల ధరించియు
తేజోరాశివై వెలుగుచును
సూర్యాగ్నులవలె కాంతియు గలిగిన
అప్రమేయ నిను గాంచెదను ॥వా॥

*తో॥ సర్వస్థలముల ప్రకాశించెదవు (సర్వతో దీప్తిమంతం)
సూర్యాగ్నులవలె వెలగెదవు
సర్వత్రను నిండిన దేవుడవు
సర్వేశ్వర మ్రొక్కెద గావు ॥వా॥ ౧౭

శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే ॥ 18

తా॥ నీవే కడకు తెలియవలసిన శ్రేష్ఠమయిన అక్షరుడవు. నీవే ఈ విశ్వమునకు పెద్ద ఆధారుడవు. నీవే అవ్యయుడవు. శాశ్వతధర్మ రక్షకుడవు. నీవే సనాతనుడయిన పురుషుడవు అని నా నమ్మకము.

తో॥ నిను తెలియగవలె అక్షరబ్రహ్మవు
లోకంబుల కాధారుడవు
నీవవ్యయుడవు ధర్మరక్షకా
తలచెద పురాణ పురుషుడవు ॥వా॥

*తో॥ నాశనంబు గానట్టి దేవుడవు॰నారాయణ నిను నమ్మెదను
నాశనమగు వారిని నేనమ్మను॰ననుగాచెదవని తలచెదను॥వా॥

శ్లో॥ అనాది మధ్యాన్త మనన్త వీర్య
మనన్తబాహుం శశిసూర్య నేత్రం ।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ 19

తా॥ ఆదిమధ్యాంత రహితుడవు. అనంత వీర్యుడవు. అనేక బాహువులు గలవాడవు. సూర్యచంద్ర నేత్రుడవు. ప్రజ్వలించు అగ్నిముఖము గలవాడవు. స్వంత కిరణములచే ఈవిశ్వమును తపింపచేయు నిన్ను చూచుచున్నాను.

తో॥ ఆదిమధ్య యంతములు కనపడదు
అనంతవీర్య అతిబాహు
అనల ముఖము ఇనశశినేత్రుడవు
అన్నిటి తపింప చేసెదవు ॥వా॥

*తో॥ నీతేజస్సుచె విశ్వ సృష్టియును
నీతేజస్సుచె వర్ధిలుట
నీతేజస్సుచె నాశన మగుటయు (స్వతేజసా)
నీలీలలు నేగంటి నిట ॥వా॥ ౧౯

శ్లో॥ ద్యావాపృథివ్యో రిదమన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20

తా॥ మహాత్మ! భూమ్యంతరాళముల మధ్యభాగమంతయును దిశలన్నియును నీ వొక్కనిచేతనే వ్యాపింపబడినది. అద్భుత ఉగ్రస్వరూపుడగు నినుగని త్రిలోకములు మిక్కిలి వ్యథపడుచున్నది.

తో॥ భూమ్యాకాశము లంతరాళముల
అన్ని దిక్కులను నీవేను
త్రిలోకు లద్భుత వుగ్రుడ వగునిను
గని వ్యథపడిరిదొ మహాత్మునిగ ॥వా॥

*తో॥ నీవొక్కడవే దిక్కులు జగములు (త్వయైకేన)
నిండినావు నిఖిలేశ హరి (వ్యాప్తం)
నీవు దక్క మరివేరే మున్నది
నిర్వికార నిఖిలాత్మ హరి ॥వా॥ -౨౦

శ్లో॥ అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి ।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21

తా॥ ఈ దేవతా సమూహములు నీలో చేరుకొనుచున్నవి. కొందరు భయపడి చేతులుజోడించి ప్రార్థన చేయుచున్నారు. మహర్షులు సిద్ధులు స్వస్తి అని చెప్పి బహువిధ స్తుతులచే నిన్ను కొనియాడుచున్నారు.

తో॥ సురసంఘంబులు నీలో చేరెను
కొందరు భయపడి పొగడెదరు
సిద్ధులు ఋషి సంఘంబులు చాలా
స్వస్తిచెప్పి స్తుతి చేసెదరు ॥వా॥

*తో॥ నరరూపము దాల్చిన సురసంఘము
నీలో చేరెను హేస్వామి
నరరూపులు కొందరు మ్రొక్కెద రిదో
నమస్కరించెద నాస్వామి ॥వా॥ ౨౧

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22

తా॥ రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీదేవతలు, మరుద్గణములు, పితృగణములు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మొదలగువారు విస్మితులగుచు నిన్ను చూచుచున్నారు.

తో॥ రుద్రాదిత్యులు వసువులు సాధ్యులు
విశ్వేదేవత లశ్వినులున్
పితృదేవతలును మరుద్గణంబులు
విస్మితులై చూచెదరు నిను ॥వా॥

*తో॥ యక్షులు అసురులు సిద్ధ సంఘములు
గంధర్వులు మొదలగువారు
వీక్షించియు నిను విస్మితు లగుచును
వీరందరు నిదో చూచెదరు ॥వా॥ ౨౨

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్ ॥ 23

తా॥ ఓ మహాబాహూ! బహుముఖములు, కన్నులు, బహుబాహువులు, తొడలు, పాదములు, బహుకడుపులు గలిగి అనేక కోరలుగల భయంకరమయిన

గొప్ప నీ ఆకారమును చూచి ప్రాణులు వ్యథపడుచున్నారు. నా అవస్థయు అట్లనే అయినది.

తే॥ ఎన్నో ముఖములు కన్నులు చేతులు
తొడలు పాదములు కడుపులును
మన్నించని నీ కోరలు గనిభయ
మందిరి లోకులు నేనున్ను ॥వా॥

*తే॥ లోకులు గొప్పగు ఆకారముగని (మహాత్మే)
వ్యాకులమును బొందెదరయ్యో
లోకుల గతియే నాకును గల్గెను
హే కమలాక్ష మహాబాహో॥ (మహాబాహో)

శ్లో॥ నభస్స్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రమ్।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం నవిన్దామి శమం చ విష్ణో!॥ 24

తా॥ హే విష్ణో! ఆకాశమంటెడి ప్రకాశించు నానావర్ణములు గల తెరచిన ముఖములు గల మండే విశాలనేత్రములు గల నిన్ను చూచి భయపడుచున్నాను. ధైర్యము నిలువదు. మనశ్శాంతి పొందజాల.

తే॥ బహువర్ణంబులు తెరచిన ముఖములు
మండుచుండు కన్నులు పొంది
భగవంతా ఆకాశమంటు నీ
ఆకారము గన సుఖమేదీ ॥వా॥

*తే॥ భూమినుండి ఆకాశము వరకును
పెరగి ప్రకాశించెడి కృష్ణా
భయమగు చున్నది ధైర్యము నిలువదు
మనశ్శాంతి పొందను విష్ణో ॥వా॥ ౨౪

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ ! జగన్నివాస ! ॥ 25

తా॥ జగన్నివాస ! నీకోరలచే భయంకరమగు ప్రళయాగ్నినిబోలు నీ ముఖమును చూచి దిక్కులు తెలియకున్నాను. సుఖమయితే లేనేలేదు. దేవదేవ! ప్రసన్నుడవగుము.

తో॥ కాలానిల సన్నిభమగు ముఖమును
కోరలు గని భయపడియెదను
కాపాడుము దిక్కులు దోచదు శ్రీ
కృష్ణా కరుణించుము దయను ॥వా॥

*తో॥ జగదాధారా జగద్రక్షకా
జగన్నివాస జగదీశా (జగన్నివాస)
జగన్నటన సూత్రేశ దేవేశ (దేవేశ)
జాగ్రత సుఖమును ఇమ్మీశా ॥వా॥ ౨౫

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే సహైవావనిపాలసఙ్ఘైః ।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ 26

తా॥ఈ ధృతరాష్ట్రపుత్రులు సామంత రాజులసంఘముతో అట్లే భీష్మ ద్రోణకర్ణులును అట్లనే మాసేనలో గల యోధముఖ్యులు నిన్ను.

తో ॥ సర్వరాజులును ధార్తరాష్ట్రులును
భీష్మద్రోణులు కర్ణుడును
త్వరితంబుగ నా వారలు ముఖ్యులు
గుంపులు గూడియు నీలోను ॥వా॥

తో॥ అనేకంబులగు నదులు వేగమున
సముద్రమే రీతిగచేరు
ఆ విధంబునను చేరిరిరాజులు
వెలగెడి నీముఖముల దూరి ॥వా॥

*తో॥ తమనాశమునకు తామేకర్తలు
తగువగు కర్తవ్యము విడచి
తరముగాని కార్యములును చేయుచు
తామే చెడుదురు నశియించి ॥వా॥ ౨౮

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29

తా॥ మండుచుండు అగ్నిలో నశించుటకు మిడతలు అధిక వేగముగ ఏ ప్రకారము ప్రవేశించునో అట్లనే ప్రాణులు నశించుటకునై అతివేగముగలిగి నీ యొక్క ముఖముల ప్రవేశించెదరు.

తో॥ పతంగములు నాశము చెందుటకై
ప్రజ్వలించు అగ్నిలోపడెడి
రీతిగ అనేక ప్రాణులు నీముఖ
ములఁ జెందిరి వేగము తోడి ॥వా॥

*తో॥ సృష్టిస్థితిలయ ములకాద్యుడవు
దుష్టుల శిక్షించెడి కృష్ణ
శిష్టజనుల పాలించెడి కృష్ణ
శాంతాకార శ్రీకృష్ణ ॥వా॥ ౨౯

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానస్సమన్తా
ల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః ।

తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥ 30

తా॥ మండుచున్న ముఖములచే సమస్త జనులను మ్రింగువాడనై అంతట ఆస్వాదించుచున్నావు. హే విష్ణో! నీ భయంకరమయిన కాంతులు జగత్తును నిండి తపింపచేయుచున్నది.

త॥ జ్వలించుచుండెడి నీ ముఖములచే
యెల్ల ప్రాణులను మ్రింగెదవు
నాలుక చేతను పెదవి నాకెదవు
జగత్తు తపించ చేసెదవు ॥వా॥

*త॥ క్రూర కృత్య మేమాత్రము చేయకు
క్రూరుల సహవాసము వీడు
క్రూరంబున శ్రీహరి కోపించును
క్రూరంబున ఇహపరము చెడు ॥వా॥ ౩౦

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద ।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31

తా॥ దేవశ్రేష్ఠా! నీకు నమస్కారము. ప్రసన్నుడవగుము. నీ ప్రవృత్తి నేనెరుగ జాలను. భయంకరాకార! నీవు ఎవడవు? ఓ ఆది పురుషుడ! నిన్ను తెలియ గోరుచున్నాను. దయయుంచి తెల్పుము.

త॥ దేవదేవ నే నీకు మ్రొక్కెదను
దయయుంచుము ఓ శ్రీకృష్ణ
ఈ వృత్తియుగల నీ వెవ్వడవో
ఆదిదేవుడవు హరికృష్ణ ॥వా॥

*త॥ ఈభయంకరా కారము గలిగిన (ఉగ్రరూపో)
నీ ప్రవృత్తి తెలుపుము తండ్రి (విజ్ఞాతుమిచ్ఛామి)

ఈడులేని లోకేశ్వర దయతో
ఈదీనుని బ్రోవుము తండ్రీ ॥వా॥ 31

శ్రీభగవానువాచ:—

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తు మిహ ప్రవృత్తః ।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32

తా॥ లోకనాశన కరమయిన బలిష్ఠమైన కాలస్వరూపిని నేను. లోకములను సంహరించుటకు ఇపుడు ఉద్యోగించినవాడనయినాను. ఈ ఉభయ సేనలలో యోధులందరు ఉండువారు నీవు చంపకున్నను బ్రదుకజాలరు.

తో॥ కాలపురుషుడను కావున యుభయపు
సేనల నుండెడి వారలను
కాలగతిని పొందించెద నీవును
కాలహరణమును చేసినను ॥వా॥

*తో॥ బలమగు లోకక్షయ కారణుడను
బలివేయుట ఉద్యోగముగన్
బలిష్ఠులగు వారల సహితంబుగ
బలిగొను కాల స్వరూపుడన్ ॥వా॥ 32

శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్! ॥ 33

తా॥ అందుచే నీవు యుద్ధమునకు లెమ్ము. శత్రువులను గెలిచి కీర్తిని పొందుము. నిష్కంటకమగు రాజ్యమును అనుభవించుము. ఈ నీ పగవారలు మునుపే నాచేత చంపబడిరి. ఓ సవ్యసాచి ! నీవు నిమిత్తమాత్రుడవగుము.

తో॥ కావునఅర్జున యుద్ధము చేయుము
శత్రుల గెలచియు కీర్తియును
దేవుని దయచే రాజ్యము పొందుము
నిమిత్త మాత్రుడవగుచున్న ॥వా॥

*తో॥ నిష్కంటక మగు రాజ్యము అన్నకు
నిచ్చి సుఖంబును పొందుమయా
నీ పగవారలు నాచే ముసుపే
నీల్గి రనుచు నీ వెంచుమయా ॥వా॥ 33

శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్ ॥ 34

తా॥ ఇప్పటికే నాచే జయించబడిన భీష్మ ద్రోణ సైంధవ కర్ణాదులను అట్లనే ఇతరయోధవీరులను నీవు జంపుము. వ్యథ చెందకు. నీకు యుద్ధములో జయమగును. యుద్ధము చేయుము.

తో॥ నాచేచచ్చిన వారల జయించు
ద్రోణ భీష్మ జయద్రథాదులన్
నానాయోధుల కర్ణుని సహితము
జయమందెదు వదలుము భయమున్ ॥వా॥

*తో॥ నేచంపెద నను గర్వంబేలను
రాజ ధర్మమిదుచుట యేల
నే చేసెద నను అహమును విడచియు
యుద్ధంబును చేయుము చాల ॥వా॥ 35

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ ।

నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35

తా॥ భగవంతుని పల్కులు విని వణకుచు కిరీటి నమస్కరించి ముకుళితహస్తుడై మాటిమాటికి భయపడి భగవంతునికి మరల నమస్కరించి నమ్రుడై తొట్రుపాటుతో ఇట్లనెను.

తో॥ ఇటుపల్కిన కేశవు వాక్యము విని
గడగడ వణుకుచు పార్థుడును
ఇట్లనె నమస్కరించియు భయమున
మరల వందనము సల్పుచును ॥వా॥

*తో॥ పార్థుడు భగవంతుని వాక్యమువిని
ప్రకంపిల్లుచు ముకుళిత కరుడై
శిరమును వంచియు మనమున భయపడి
చల్లని వాక్యము గలవాడై ॥వా॥ 35½

అర్జున ఉవాచ:—

శ్లో॥ స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః ॥ 36

తా॥ హృషీకేశ ! నీ (గుణ) సంకీర్తనమును విని లోకమంతయు సంతోషభరితమై నీయందే ఆసక్తిగలిగియుండుట విదితమె. రాక్షసులు నీకు భయపడి దిక్కులకు పరుగెత్తుచున్నారు న్యాయమే. సిద్ధగణములు నీకు నమస్కరించుట సహజమే.

తో॥ హృషీకేశ! నీమహిమ పొగడెదరు
నీపై ప్రీతియు సలిపెదరు
హృదయంబుల భయపడిరి రాక్షసులు
సిద్ధులు నమస్కరించెదరు ॥వా॥

*త్రో॥ లోకంబులు నిను పొగడుట న్యాయమె
రాక్షస పలాయనము సరియె
లోకములోగల సాధులు సిద్ధులు
నీకు దాసులగుటయు సరియె ॥వా॥ 36

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్॥ 37

తా॥ హే మహాత్మ! మిక్కిలి శ్రేష్ఠుడైన బ్రహ్మకు ఆదికారణుడవు. అనంతుడవు. దేవదేవుడవు. జగన్నివాసుడవు. అక్షరుడవు. సదసత్తులకు పరమైనవాడవు. ఇట్టి నిన్ను సమస్త ప్రపంచములు పూజించుట సాధారణ ధర్మమే అగును.

త్రో॥ అనంత దేవాధిప జగత్ప్రభో
అక్షర సదసత్పరుండవు
అరయగ బ్రహ్మకు ఆదిదేవుడవు
అంతటనీవై యున్నావు ॥వా॥

*త్రో॥ ఓమహాత్మ దేవాది దేవ ఓ
బ్రహ్మాండంబుల కాధార
సమస్తజగములు నిను పూజించుట
సహజంబగు నాముద్దదొర ॥వా॥ 37

శ్లో॥ త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్తరూప! ॥వా॥ 38

తా॥ నీవు ఆదిదేవుడవు. పురాణపురుషుడవు. ఈ చరాచరములకు

పరమాధార భూతుడవు. తెలిసినవాడవు. తెలియదగిన వాడవు. సర్వోత్కృ
ష్టమగు ముక్తికి స్థానుడవు. నీచేతనే ఈజగత్తంతయు వ్యాపింపబడియున్నది.

తో॥ ఆదిదేవుడవు పురాణ పురుషుడ
ఈవిశ్వమునకు ఆధార
అనంతరూపుడ సర్వాధార
వేదవేద్య పరమాధార ॥వా॥

*తో॥ సమస్త దేవతలకు దేవుండవు
ఆధారంబుల కాధార
ముమ్మూర్తులకును మూలపురుషుడవు
అవ్యక్తుడ నా ముద్దదొర ॥వా॥ 38

శ్లో॥ వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ 39

తా॥ వాయువును, యముడును, అగ్నియు, వరుణుడు, చంద్రుడును, ప్రజాపతి (అనగ) బ్రహ్మదేవుడును నీవె. ముత్తాతకు ముత్తాతనీవే. నీకొరకు వేయి మార్లు నమస్కారములు. పునః నమస్కారము. భూయోఽపి - మరల నమస్కారము అగుగాక.

తో॥ నీవే వాయువు యముడును అగ్నియు
వరుణుడు చంద్రుడు బ్రహ్మయును
నీవే బ్రహ్మకు తండ్రివి దండము
దండము లిదొ వైయ్యారులును ॥వా॥

*తో॥ అష్ట దిక్కులును అష్ట దిక్పతులు
అఖిల జగద్రూపము నీదె
అష్టవసువులును అందరునీవే
సాష్టాంగ నమస్కార మిదె ॥వా॥ 39

శ్లో॥ నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ !
అనన్తవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ 40

తా॥ హే సర్వస్వరూపుడ ! అనంతవీర్యుడవు. అమితవిక్రముడవు. సర్వవ్యాపకుడవు. కావున నీకు ఎదుటను, వెనుకను నమస్కారము. నీకన్ని దిక్కులను నమస్కారమగుగాక.

తో॥ సర్వస్వరూప వందన మిదిగో
ముందువెనుక దిక్కులయందు
సర్వేశ్వర రామా అనంతవీర్యా
నిండినావు సర్వము నందు ॥వా॥

*తో॥ అమితవిక్రమా అనంతవీర్యా
అంతయునీవే శ్రీకృష్ణ
అన్ని దిక్కులను నమస్కరించెద
అనుగ్రహించుము హరికృష్ణ ॥వా॥ ౪౦

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హేకృష్ణ ! హేయాదవ ! హేసఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥ 41

తా॥ నీయొక్క ఈమహిమ నెరుంగక నీవు సఖుడని నెరంగి చాలా పరిచయము చేతను, ప్రమాదము చేతను హే కృష్ణ! హేయాదవ! హే మిత్రుడ! అని చులకనగ నీతో మాట్లాడుచుంటిని.

తో॥ నీ ఈ మహిమను నెరుగక నచ్యుత
సఖుడని బహుచులకన నిన్ను
నీ ఈ పరిచయ ప్రమాదములచే
యాదవ సఖ కృష్ణని అంటిగా ॥వా॥

*తో॥ నీ మహామహిమ నెరుగక పోతిని
చిన్ననాటి నుండీ నిన్ను
ప్రేమచె భావా హే సఖ హే అని
పలికితి మన్నించుము నన్ను ॥వా॥ ౪౧

శ్లో॥ యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు ।
ఏకోఽథవాఽప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ 42

తా॥ మరియు ఆహార విహారముల యందు శయనాసన సమయములందు ఒంటిగవుండినపుడు నలుగురు ముందర అచ్యుత! పరిహాసమునకై నేను అసాధు మాటలాడినది క్షమించవలె. అప్రమేయుడయిన నిన్ను వేడుకొనుచున్నాను.

తో॥ అప్రమేయ భోజన విహారముల
ఆసన శయనపు సమయముల
అపరాధము ఎదుటను లేనప్పుడు
చేసితి క్షమించు దయమిగుల ॥వా॥

*తో॥ అప్రమేయుడవు అని నేనెరుగను
అనేక విధముల అల్పముగ
అచ్యుత హాస్యము గనునే నాడితి
అపరాధిని క్రోవుము వేగ ॥వా॥ ౪౨

శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ! ॥ 43

తా॥ నీవు యీచరాచరాత్మకమైన లోకముల తండ్రివి. నీవు పూజ్యుడవు. శ్రేష్ఠుడయిన గురువు. ఈ లోకత్రయమందు నీకు సమానుడు లేడు. అనిన వెనుక అతులప్రభావ! నీకు హెచ్చైనవాడెవడున్నాడు. (స్వామి)

తో॥ ఈడునులేని ప్రభావము గలిగిన
చరాచరంబులకును తండ్రి
మూడులోకముల జోడులేదు నీ
కన్నను అధికుడు యెందుండు ॥వా॥

*తో॥ పూజించితే నిను పూజించగవలె
పూజ్యుండవు ముల్లోకముల
పూజ్యపాద శ్రీసద్గురు వర్యా
పూర్ణానుగ్రహ మిడు మిగుల ॥వా॥ ౪౩

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యం।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్॥ 44

తా॥ కావున ఈశా! ఇదిగో శరీరమును పడవేసి నమస్కరించి స్తోత్రార్హుడవయిన నిన్ను ప్రసన్నుడు కావలయునని వేడెద. పుత్రునియందు తండ్రియెట్లో, సఖునియెడ స్నేహితుడెట్లో, భార్యయెడ పతియెట్లో అట్లే నాయందు దయవుంచి మన్నించవలెను దేవ!

తో॥ ఈశా ఇదిగో నమస్కరించెద
తనయుని తప్పును తండ్రివలె
స్నేహితుని తప్పు మిత్రుని మాదిరి
భార్యనుపతి వలె బ్రోవవలె ॥వా॥

*తో॥ దేవ ఇదో పడ వేసెద దేహము
దేవ నమస్కారము గొనుము
దేవర స్తోత్రార్హుండవె లెమ్ము
దేవ ప్రసన్నుండవు కమ్ము ॥వా॥ ౪౪

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవ ! రూపం
ప్రసీద దేవేశ ! జగన్నివాస ! ॥  45

తా॥ దేవ! ఎప్పుడుగానని నీవిశ్వరూపమును చూచి నాకు హర్షమయినది. ఐననూ నామనసు భయపడి తల్లడించుచున్నది. కావున దేవేశ ! జగన్నివాస ! ప్రసన్నుడవుకమ్ము. నీ (మొదలు) రూపమును కనుపించుము.

తో॥ దేవర ! నెప్పుడు దర్శించని ఈ
దివ్యరూపమును దర్శించి
దేవ ! హర్షమును పొందితి నీదగు
దయకు పాత్రుడనై తిని మించి ॥వా॥

*తో॥ పావన నా ఈమనంబు భయపడె
మిక్కలి వ్యథ ఇది వినవలయు
ప్రసన్నుడై మునుపటి రూపంబును
జగన్నివాసక దయచేయు ॥వా॥  ౪౫

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే! ॥  46

తా॥ కిరీటముగలిగి గదా చక్రములు ధరించిన చేతులతో నిన్ను చూడ అపేక్షగలవాడను. మరి విశ్వమూర్తే! సహస్రబాహుడవయిన నీవు చతుర్భుజ రూపమును ధరించినవాడవు కమ్ము.

తో॥ సహస్రబాహో! దివ్యకిరీటము
గదచక్రంబులు ధరించిన
సహజరూపమును నాలుగు భుజముల
చూడనిమ్ము నీదయతోన ॥వా॥

*తో॥ దేవదేవ! దయచేయుము తండ్రి
హే విశ్వమూర్తె నా తండ్రి
దేవకి కడుపున పుట్టిన రీతిగ
దేవర! దయచేయుము తండ్రి ॥వా॥ ౪౬

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనన్తమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47

తా॥ అర్జున! నీయందు ప్రసన్నుడై ఆత్మయోగముచే ఆదియు అనంతము తేజోమయము పరమోత్కృష్టమైన విశ్వరూపమును నీకన్న నితరులకు దర్శన మివ్వని (ఈ దివ్య) రూపము నీకు నేను కనుపించితిని.

తో॥ అర్జున నీయందనుగ్రహంబున
అనంతమాదియు అతిశ్రేష్ఠమ్
ఆత్మయోగమున దర్శనమిచ్చితి
విశ్వరూప తేజోమయము ॥వా॥

*తో॥ నాయనవిను ఈ విశ్వరూపమును
నెవ్వరుకానరు నా తండ్రి
శ్రేయస్కరంబు భక్తిసాధనము
దర్శించితి వెంతయు తండ్రి ॥వా॥ ౪౭

శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర! ॥ 48

తా॥ కురుప్రవీర! ఈ మహత్తైన విశ్వరూపమును ఈమర్త్యలోకమున

నీ కొక్కనికే దర్శనము ఇచ్చితి. ఇతరులు వేదయజ్ఞాధ్యయనములు చేసిన దాన
ములు చేసిన క్రియలును ఉగ్రతపస్సు చేసినను దర్శనమివ్వను.

తో॥ కురుశ్రేష్ఠవినుము వేద యజ్ఞములు
అధ్యయనము దానంబులును
ఉగ్ర తపక్రియలను గానరు నను
నీ భక్తికి కను పడినాను ॥వా॥

*తో॥ ఉత్తమమగు ఈ విశ్వరూపమును
ఉత్తమా కనుపించితి నీకు
మర్త్య లోకమున మరి యెవ్వరికిని
దుర్లభంబు నను చూచుటకు ॥వా॥ ౪౮.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49

తా॥ ఈరీతి ఘోరముగ కనుబడు నా ఈ రూపమునుచూచి నీవు
భయపడకుము. విమూఢభావమునువిడచి నిర్భయుడవై ప్రీతి మనస్సుగలిగి
ఇదో నా సహజరూపమును మరలచూడుము.

తో॥ కడుభయమగు నా రూపము చూచిన
కళవళముడుగుము నెమ్మదితో
జూడుము సహజంబగు నారూపము
భయమును వదలుము సుఖంబుతో ॥వా॥

*తో॥ ప్రీతిగల్గు మానసము వహింపుము
ప్రీతితో విడు నీ మూఢత్వమ్
ప్రీతితోడ నీకన్నుల జూడుము
ప్రీతిగల్గు నా స్వరూపము ॥వా॥ ౪౯

సంజయ ఉవాచ:-

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేవం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా ॥ 50

తా॥ ఇట్లు వాసుదేవుడు అర్జునునిగూర్చి ఆలాగున పలికి తిరిగి స్వకీయమైన రూపమును దర్శింపచేసెను. మహాత్మ! శాంతశరీరముగలవాడై భయపడిన పార్థుని మరల ఊరడించెను.

తో॥ వాసుదేవుడీ రీతిగ బల్కుచు
సౌమ్యరూపమును చూపించి
దోషరహిత భయపడకు మనుచు
తానూరడించె ప్రీతినియుంచి ॥వా॥

*తో॥ దేవకి వసుదేవుల తపఃఫలము
నందయశోదల భాగ్యంబు
దేవేంద్రుని తనయుడు దర్శించియు
ధన్యుడగుచు పొందెనుముదము ॥వా॥ ౫౦

అర్జున ఉవాచ:—

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన !
ఇదానీమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః ॥ 51

తా॥ జనార్దన! ప్రసన్నమైన నీమానుషరూపమునుచూచి ఇప్పుడు స్వస్థత పొందితిని. చైతన్యముగలిగె. స్వభావమును పొందితి.

తో॥ ప్రసన్నమగు నీ మానుషరూపము
నిపుడు దర్శనంబును గలిగె
ప్రశాంతుడయితిని హే జనార్దన
స్వస్థతపొందితి భయముడిగె ॥వా॥

*త్రో॥ శాంతాకారా నందకుమారా॥శరణంటిని రా శ్రీకృష్ణ
చింతించెదర చింతలుదీర్చ॥సన్నిధిచేర్చర హరికృష్ణ॥వా॥

శ్రీ భగవానువాచ:-

శ్లో॥ సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥ 52

తా॥ అలభ్యమగు నా విశ్వరూప సందర్శనము ఇపుడు నీకు గలిగినది. ఈ రూపము చూచుటకు దేవతలు సదా కోరుచుందురు.

తో॥ దేవతలును కోరెదరు నాదయిన
దివ్యరూపమును జూడగను
ఎవరికి చూడగ నలవిగాని దిది
దర్శించితివో పార్థసను ॥వా॥

*తో॥ నారూపమె ఈ విశ్వంబును నగు॥నా భావనతో చూడవలెర
నిర్జరులకు నైనను దుర్లభమిది॥నీకుదర్శనం బొసగితిని॥వా॥

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53

తా॥ నీవిప్రుడు నన్ను చూచిన రీతిగ చూచుటకు వేదపారాయణము చేతను, తపస్సుచేతను, దానముచేతను, యజ్ఞము నుండియు సాధ్యము గాదు.

తో॥ నను నీ విట్లుగ గనుకొన్నట్లుగ
వేదపఠన కఠినవు వ్రతము
దానయజ్ఞములు దండిగచేసిన
దర్శనమగుటయు దుర్లభము ॥వా॥

*తో॥ ఉపవాసవ్రత శౌచ శీలముఖ॥జపదానాధ్యయ నాదులను
శ్రీపతిపదంబు చెంద దుర్లభము॥భాగవత ప్రమాణంబునగుర॥వా॥

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున !
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ 54

తా॥ పరంతప! అర్జున! ఇట్లు నన్ను తెలియుటకు చూచుటకు తత్త్వమార్గముగ నాలో చేరుటకు అనన్యభక్తి చేతనే సాధ్యమగును.

తో॥ అనన్యభక్తిచె ననుగన వచ్చును
అరయగవచ్చును పరంతప!
నను పొందగవచ్చును నాయనవిను
వేరు చింతలను విడువప్ప ॥వా॥

*తో॥ తత్త్వదృష్టిచే పరమాత్మునిలో
తాదాత్మ్యంబును బొందుటకు
భక్తియె ముఖ్యంబని భగవంతుడు
పార్థునకును తా బోధించె ॥వా॥ ౫౪

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ ॥ 55

తా॥ సమస్తకర్మలు నావనియెడి బుద్ధితో కర్మలుచేయుచు నేనే పరమగతి అని నాకు భక్తుడై సంగవర్జితుడై సర్వభూతములయందు ద్వేషము లేక ఉన్న వాడు నన్ను పొందును పాండవ!

తో॥ నాసంబంధపు కర్మలు చేయుచు
నావాడై భక్తుండగుచు
నా సంబంధములేనిది త్రోయుచు
నను చేరు సర్వ సముడగుచు ॥వా॥

*తో॥ పాండవోత్తమ! అనన్యభక్తిచె పరమంబౌ నా సాన్నిధ్యం
పొందగ గల్గును సర్వభూతముల పరమాత్ముడు
గలడన ముఖ్యం ॥వా॥ ౫౫

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూపసందర్శన
యోగో నామ ఏకాదశోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతాసంగీతము

## ద్వాదశాధ్యాయము — భక్తియోగము.



తో॥ భక్తిమార్గమును భగవంతుడు తన ♦ భావకు వల్కుచు నిట్లనెను
భక్తియనగ నన్నిటి కాధారుని ♦ యుక్తిగ గని సేవించవలె ॥వా॥ ౧

తో॥ లోకానుభవము వ్యక్తోపాసన ♦ భక్తియనుచు వాడుక గలదు
వ్యక్తంబనగను ప్రతీకార్చనము ♦ ముఖ్యంబని శాస్త్రము గలదు ॥వా॥ ౨

తో॥ భక్తి అనంగను వ్యక్తోపాసన ♦ ముఖ్యంబనుచును తలచెదరు
వ్యక్తు లెన్నో లోకంబున నున్న వి ♦ భిన్న భక్తి ముఖ్యంబనరు ॥వా॥ ౩

తో॥ అనేక ప్రతీకములు లోకంబున ♦ గలవన్నిట సర్వేశ్వరుడు
అన్నిరూపముల నున్న వాడనెడి ♦ భక్తియె ముఖ్యంబనగబడు ॥వా॥ ౪

తో॥ పరమతమున గల ప్రతీక దూషణ ♦ మరచియు పరమేశ్వరు దలచి
నిరతము తనదగు ఇష్టదేవతా ♦ అర్చన భక్తియు అనుపించు ॥వా॥ ౫

తో॥ ఈ త్రిలోకముల వ్యక్తులెన్నియో ♦ వున్నను నిజమగు భక్తుండు
సర్వవ్యాపకు డొక్కడనుచు నిజ ♦ భక్తితో నుండును యుక్తుండు ॥వా॥ ౬

అర్జున ఉవాచః—

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥ 1

తా॥ పూర్వోక్తప్రకారము కృష్ణ! ఏ భక్తులు సతతయుక్తులై నీ ఉపాసన చేయుదురో వారలు లేక అవ్యక్తమైన అక్షర బ్రహ్మోపాసన చేయువారి లోను ఉత్తమ యోగవేత్త లెవ్వరు?

తో॥ అటు సతతంబును ఏ భక్తులు నిను
ఉపాసించెదరో మరి ఎవరు
అక్షరమవ్యక్తు నుపాసింతురో
వీరిలోన ఉత్తము లెవరు ॥వా॥

*తో॥ సతతంబును యే భక్తులు నిన్ను
ధ్యానంబును చేసెడివారు
వ్యక్తరహితు ధ్యానంబును చేసెడి
యోగులలో ఉత్తము లెవరు ॥వా॥ (యోగ)

శ్రీ భగవానువాచః—

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః॥2

తా॥ ఎవరు నాయందే మనస్సుంచి శ్రద్ధాపరులై నిరంతర సమాహితులై నన్ను ఉపాసించెదరో వారలు యోగిశ్రేష్ఠులని నా సమ్మతము.

తో॥ నాయందే మనసుంచియు నిత్యము
నన్నే ప్రీతిగ ధ్యానించు
నాయందే శ్రద్ధయు భక్తియు గల
వారే యుక్తులు అని యెంచు ॥వా॥

*తో॥ యదువంశోత్తమ! ఎందుకు నాపై ♦యశోద నందన శ్రీకృష్ణ
నీదయ చూపవు రాధారమణా♦నిన్నే నమ్మితి శ్రీకృష్ణ॥వా॥

శ్లో॥ యే త్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ 3

తా॥ అనిర్దేశ్యమనగ చూపించుట కసాధ్యమయిన అవ్యక్తము అంతట నిండినదియు అచింత్యము కూటస్థమనగ అన్నిటికి మూలము, అచలము, ధ్రువము అయిన అక్షరోపాసనమును.

తో॥ చూపుట కసాధ్య మక్షరము ధ్రువము
సర్వము నిండియు కనుపడదు
చింతన కబ్బదు సర్వాధారము
అచల యుపాసకులకు గలదు ॥వా॥

*తో॥ ప్రపంచ వాసన లేని భక్తిచే
పట్టుపడెదవు శ్రీకృష్ణ
అపరాధిని నేచపల చిత్తుడను
కాపాడగ వలె హరికృష్ణ ॥వా॥ 3

శ్లో॥ సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూత హితే రతాః ॥ 4

తా॥ సర్వత్రను సమబుద్ధిగలవారై ఇంద్రియ సముదాయమును కట్టుతో నిలిపి సర్వభూతముల హితచింతయందు నిరతులైన అవ్యక్తోపాసకులు నన్నే పొందుదురు.

తో॥ ఇంద్రియముల నన్నిటిని బిగించియు
సర్వము సమబుద్ధితో జూచి
సర్వభూత హితులగు వారలు నను
చేరుదురు వినుము సవ్యసాచి ॥వా॥

*తో॥ సర్వత్రను సమబుద్ధితో చూచుట
సామాన్యంబన గావలదు
సర్వత్రను శ్రీరాముని చూచెడి
వారే ధన్యులు ఇహమందు ॥వా॥ ౪

శ్లో॥ క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ 5

తా॥ అవ్యక్తోపాసనాసక్తచిత్తులగువారలకు మిక్కిలి కష్టము. ఏలనగ (వ్యక్తమనుష్యులకు) దేహాభిమానముచే అవ్యక్తగతి దుఃఖముగ పొందబడును.

తో॥ అవ్యక్తోపాసకులకు కష్టము
ఏలన దేహపు మోహముచే
గావున భావన నాయందుండిన
పొందగల్గు నాభావనచే ॥వా॥

*తో॥ వ్యక్తదేహులకు అవ్యక్తపు గతి
సువ్యక్తంబుగ గాదుసుమా
వ్యక్తదేహముల ప్రేమను వదలితె
శ్రీరాముల దయ గలుగు సుమా ॥వా॥ ౫

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥ 6

తా॥ ఎవరు సర్వకర్మలను నాయందు సమర్పించి మత్పరాయణులై అనన్యమైన - అనగ - అస్మదితరాలంబనములేని యోగముచే నన్ను ధ్యానము చేయుచు వుపాసన చేయుదురో.

తో॥ ఎవ్వరు సమస్త కర్మంబులను
నాకే సమర్పణము చేసి
సర్వకాలమును నను స్మరించుచును
నే నే గతియని మనసుంచి ॥వా॥

*తో॥ కర్మలు నీదె కాయము నీదె
మనోబుద్ధి చిత్తము నీదె
పరమపురుష హరి ప్రాణము నీదె
శ్రీకృష్ణా సర్వము నీదె ॥వా॥ ౬

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ ! మయ్యావేశితచేతసామ్ ॥ 7

తా॥ అట్లు నాయందు ఆసక్తి గల చిత్తము గలవారిని మృత్యుమయ మయిన సంసార సాగరమునుంచి వెంటనే ఉద్ధరించువాడ నగుచున్నాను.

త॥ ఈ రీతిగ నాయందే మనసును
మరలించిన యా మానవులన్
పార్థ! మృత్యుసంసారాబ్ధిని నే
దాటించెద నతి శీఘ్రమునన్ ॥వా॥

*త॥ భక్తుని లక్షణములు తెలియగవలె
భక్తి యోగమును చదువవలె
మృత్యువనెడి సంసారాబ్ధిని హరి
కృపచే శీఘ్రము దాటవలె ॥వా॥ 2

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8

తా॥ నాలోనే నీ మనసుంచుము. బుద్ధిని నాయందే చేర్చుము. దేహము నశించిన వెనుక నిస్సంశయముగ నాయందే యుండగలవు.

త॥ నాయందే మనసుంచుము పార్థ!
నీ బుద్ధియు నాలో నిలుపు
నా యందే చేరెదవో అర్జున
తదుపరి సందేహము నిలుపు ॥వా॥

*త॥ నీ చింతన సుఖమని తామెరుగరు
నీచపు భావము గలవారు
నీ చింతన నా కోషగుము కృష్ణ
నా చిత్తము ధన్యత మీరు ॥వా॥ 3

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9

తా॥ ధనంజయా! నాయందు నీచిత్తము చలింపక నిలుపుటకు సాధ్యము లేకుండిన మాటిమాటికి నను చేరవలయునని నా తలంపుగలిగి అభ్యాసయోగ మాచరింపుము.

తో॥ దృఢముగ చిత్తము నాలో నిల్పగ
సాధ్యము లేకుండిన వినుము
ధనంజయా నను చేరవలయునని
యోగాభ్యాసంబును చేయుము ॥వా॥

*తో॥ యశోదనందన యాదవోత్తమ
శాశ్వతపదవిని నాకిమ్మా
కిశోరకృష్ణ కువలయ పాలన
నినుచేరగ నామనసిమ్మా ॥వా॥ ౯

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి ॥ 10

తా॥ అభ్యాస సాధనయు నీవలన కాకుండిన మత్కర్మ నా ప్రాప్తికి గాను శాస్త్రోక్తకర్మలను చేయుచుండుము. ఇట్లు నాకోసరము కర్మలు చేయుచుండిన నీవు సిద్ధిని పొందెదవు.

తో॥ అభ్యాసమ్మును గాకుండిన విను
నాకర్మలు అక్కరచేయు
ఆ రీతిగ సత్కర్మలు చేసిన
అర్జున సిద్ధిని పొందెదవు ॥వా॥

*తో॥ అన్నిటి కాధారుండవు కృష్ణ
అన్నియు నీవే శ్రీకృష్ణ
విన్నపమును వినియును శ్రీకృష్ణ
కన్నతండ్రి కావుము కృష్ణ ॥వా॥ ౧౦

శ్లో॥ అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11

తా॥ ఇదియును ఆచరించుటకు కాదేని నా యోగమును అనగ కర్మ యోగమును ఆశ్రయించి నాయందు భారము వేసి నియమితచిత్తముతో సమస్త కర్మఫలత్యాగము చేయుము.

త్రో॥ ఈ సేవయు నీకబ్బని యెడలను
నామీదను భారము వేసి
దోషము లేకను కర్మలు చేసి
కోరిక లేకుండుట వాసి ॥వా॥

*త్రో॥ చిత్తము శ్రీరాముని కర్పించుట
చేసిన కర్మలు వారివనుట
చిత్తము లోచుచ్చింతలు మానుట
ఉత్తమ యోగము వినుమాట ॥వా॥ ౧౧

శ్లో॥ శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్॥ 12

తా॥ అభ్యాసము కంటె జ్ఞానము శ్రేష్ఠము. జ్ఞానముకంటే ధ్యానమధికము. ధ్యానము కన్నను కర్మఫలత్యాగము సర్వోత్తమము. త్యాగమువలన శాంతి లభించును.

త్రో॥ అభ్యాసమునకు జ్ఞానము మేలగు
అంతకన్న ధ్యానము మేలు
ఆ ధ్యానమునకు కర్మఫలంబును
త్యజించి శాంతించుట మేలు ॥వా॥

*త్రో॥ సమస్త ఇంద్రియ వ్యాపారములను
ఆధారుని మరచుట కాదు
సర్వాధార సత్య మనోహర
అను కీర్తన పల్కేద నీదు ॥వా॥ ౧౨

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ॥ 13

తా॥ సర్వభూతముల యందు ద్వేషముంచక మిత్రుడును, కరుణగల వాడును, అహంకార మమకార రహితుడును, సుఖదుఃఖముల సమముగ నెంచువాడును, క్షమాశీలుడును.

తో॥ సర్వభూతముల ద్వేషము నొప్పడు
మిత్రుండును కరుణాత్ముండు
నిరహంకారుడు మమత్వ రహితుడు
ఓర్పును సుఖదుఃఖసముండు ॥వా॥

*తో॥ సర్వభూతముల రాముని చూచెడి
సర్వజ్ఞునికి విరోధెవడు
సర్వకాలముల వారిని భజించును
సర్వము వారిమయ మనుచుండు ॥వా॥ ౧౩

శ్లో॥ సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధి ర్యోమద్భక్తస్స మే ప్రియః॥ 14

తా॥ ఎపుడు సంతుష్టుడు, నియమిత మనోబుద్ధి గలవాడు, సంశయ రహితుడు, నాయందర్పించిన మనోబుద్ధి గలవాడు నాకు భక్తుడు అయిన యోగి నాకు ప్రియుడు.

తో॥ సర్వకాలమును సంతోషించుచు
సంయమియై దృఢ నిశ్చయుడై
అర్పించిన మానస బుద్ధియునై
నాకు ప్రియుండగు భక్తుండై ॥వా॥

*తో॥ రాముని తలచుచు సంతోషించుచు
రాముడె నాగతి యనుచుండు
రాముని ధ్యానము చేయుచు యోగియు (యోగీ)
రామభక్తుడై తానుండు ॥వా॥ ౧౪

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః॥

తా॥ యెవనిచే ఇతరులకు భయముండదో ఎవడితరులచే భీతి నొందడో, సంతోష శోకభయతాపము లెవనికి లేవో అతడే నాకు ప్రియుడు.

తో॥ లోకము యెవనిచే భయపడకుండునో
లోకముచే తా భయపడడో
శోకహర్షముల భయోద్వేగముల
లోపడడో అతడు ప్రియుడు ॥వా॥

*తో॥ రామభజన పరుడేల భయపడును
రామ భక్తునిచే భయమేల
రామ భజన కన్నను సుఖ మెయ్యది
రాముని భజనకు వ్యథయేల ॥వా॥ ౧౫

శ్లో॥ అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః॥ 16

తా॥ దేనిని కోరనివాడు, త్రికరణ శుద్ధి గలవాడు, ఇంద్రియ నిగ్రహమున దక్షుడు, విషయముల వుదాసీనుడు, దుఃఖము లేనివాడు, కోరిక లేక కర్మ చేయువాడు ఇట్టి భక్తుడు నాకు ప్రియుడు.

తో॥ దేహాదుల యందపేక్షలేకను
శుచి శక్తియు దాసీనుండై
ఊహలేక వ్యథలేమియు లేకను
నాకు ప్రియుండౌ భక్తుండై ॥వా॥

*తో॥ రాముని భజించ కోరుచు నుండును
రామునికై శుచిగా నుండు
రాముని కైంకర్యమ్మున దక్షుడు
రామ యనుచు పలుకుచు నుండు ॥వా॥ ౧౬

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥ 17

తా॥ ఎవడు వస్తువు ప్రాప్తించినపుడు సంతోషింపడో, రానపుడు ద్వేషింపడో, దుఃఖించడో, అపేక్షించడో, శుభాశుభములను పరిత్యజించినవాడో అట్టి నా భక్తుడు నాకు ప్రియుడు.

తో॥ వస్తువు లొదగిన సంతోషింపక
రాకుండిన ద్వేషింపకను
ఆశకు చిక్కక దుఃఖించకను
శుభాశుభ పరిత్యాగియగుచు ॥వా॥

*తో॥ రాముని భక్తుడు కోరిక కోరడు
రామ రామ యనియెడి వాడు
రామ నామమున పూర్ణానందుడు
రామ భక్తుడగు నావాడు ॥వా॥ ౧౭

శ్లో॥ సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః ॥ 18

తా॥ శత్రుమిత్రుల యందు మానావమానము లందు శీతోష్ణములందు సుఖదుఃఖముల యందు సముడు సంగవర్జితుడు.

*తో॥ శత్రుమిత్రుల సమత్వ బుద్ధియును
మానము అవమానము లందు
శీతోష్ణంబుల సుఖదుఃఖంబుల
సముండు సంగము లేకుండు ॥వా॥

*తో॥ శత్రుమిత్రులలో నీవే యుందువు
శీతోష్ణంబులు నీవిగద
సూత్రధారిగద ఆడించుటలో
శ్రీకృష్ణ రుక్మిణి నాథ ॥వా॥ ౧౮

శ్లో॥ తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః ॥ 19

తా॥ నిందాస్తుతులను నొకటిగ చూచువాడు మౌని అనగ మితభాషి, ఏమాత్రము దొరికితే అంతకు తృప్తిపడువాడు, అనికేతుడు, స్థిరచిత్తుడైన నా భక్తుడెవడో అతడు నాకు ప్రియుడు.

తో॥ నిందాస్తుతులను సముండు మౌనియు
యథాలాభ సంతుష్టుండు
నివాసరహితుడు స్థిరమతి భక్తుడు
నాకు చాల ప్రియుడగు వాడు ॥వా॥

*తో॥ రాముని భక్తుని నింద చేసినను
నేమంబున స్తుతి చేసినను
రాముని భక్తుడు సమముగ నుండును
స్థిరచిత్తము గల వాడగును ॥వా॥ ౧౯

శ్లో॥ యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥ 20

తా॥ ఈరీతిగ చెప్పబడిన ఈ అమృతమౌ ధర్మమును మత్పరాయణులై శ్రద్ధావంతులై యథోక్తముగ ఆచరించు భక్తులు నాకు అత్యంతమయిన ప్రియులు.

తో॥ ధర్మసంయుతము అమృతమయంబౌ
భక్తియోగమును ఎవ్వారు
నిర్మలత్వమున శ్రద్ధతో నడచిన
నియతులు నాకును ప్రియతములు ॥వా॥

*తో॥ భగవద్వాక్యము భక్తియుక్తముగ
భక్తియోగమును పఠియించి
భగవంతుని ప్రీతిగ నడవగవలె
భగవంతుని తనమది నెంచి ॥వా॥

*తో॥ నిను యెడబాసిన సన్నిధి ఏల
నిన్నాడని నాలుక ఏల
నీవారిని చేరని బ్రతుకేల
చేర్చుకో నన్నును గోపాల ॥వా॥ ౨౦

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే భక్తియోగో నామ
ద్వాదశోఽధ్యాయః.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ భగవద్గీత

# గీతాసంగీతము

## త్రయోదశాధ్యాయము — క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము.

---

తో॥ ఆత్మానాత్మవిచారము తెలియగ ◈ త్రయోదశాధ్యాయము జాలు
ఆత్మసోదరులు ఈ అధ్యాయము ◈ చక్కగ విచారించుట మేలు ॥వా॥ ౧

తో॥ విద్యాభ్యాసము చేసి నందులకు ◈ వివేక మార్జింపగ వలయు
విద్యార్థులు గీతాసంగీతము ◈ వితరణతో పాడగ వలయు ॥వా॥ ౨

తో॥ గీతార్థము చక్కగ నెరుగగవలె ◈ గీతార్థముతో నడువవలె
గీతాసంగీతము నుడువగవలె ◈ గీతార్థము ధ్యానించవలె ॥వా॥ ౩

తో॥ గర్వము డంభము లను వర్జించుమటె ◈ గౌరవమని పెద్దలమతము
గాన సోదరీ సోదరు లందరు ◈ గానము చేయుట ముఖ్యంబు ॥వా॥ ౪

తో॥ క్షేత్రజ్ఞుడె తానని హరి నుడివెను ◈ క్షేత్రమంతయును మారునది
క్షేత్రజ్ఞుడు నెప్పటికిని నొకడె ◈ క్షేత్రములన్నిట తాకాదె ॥వా॥ ౫

తో॥ క్షేత్రజ్ఞుని అంశము నీవనుకొను ◈ క్షేత్రజ్ఞుని నిజదాసుడను
క్షేత్రజ్ఞుని ధ్యానంబు మరువకను ◈ క్షేత్రజ్ఞునిలో చేరికొను ॥వా॥ ౬

తో॥ క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమును ◈ సద్గురు వర్యుల కృపబడసి
క్షేత్రజ్ఞ స్థితి శ్రవణము చేసియు ◈ క్షేత్రము తాకాదని తెలిసి ॥వా॥ ౭

తో॥ సర్వక్షేత్రముల సర్వలోకముల ◈ సర్వభూతముల నొకడనియు
సర్వకాలమును స్మరణచేసియును ◈ సర్వాత్మత్వత తాబడయు ॥వా॥ ౮

అర్జున ఉవాచ:—

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ।
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ!॥ 1

తా॥ ఓ కేశవ! ప్రకృతియనగా నేమి? పురుషుడనువాడెవడు? క్షేత్రమేది? క్షేత్రజ్ఞుడెవడు? జ్ఞానమేది? జ్ఞేయమేమి? ఈ సమస్తము తెలియగోరుచున్నాను.

తో॥ ప్రకృతిపురుష క్షేత్రజ్ఞ క్షేత్రముల
జ్ఞాన జ్ఞేయ తత్త్వంబులను
ప్రార్థించెద తెలుపుము హే కేశవ!
పరమార్థంబును దయతోను ॥వా॥

*తో॥ మోహనాకార ముద్దు కృష్ణయ్యా
మురళీగాన వినోదయ్యా
మోహించితిరా గను నన్నయ్యా
మోహము తీర్పర పూర్ణదయా ॥వా॥ ౧

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ 2

తా॥ కౌంతేయ! ఈ శరీరము క్షేత్రమని చెప్పబడుచున్నది. దీనిని ఎవడెరుగుచున్నాడో వానిని క్షేత్రజ్ఞుడని తద్విదు లనెదరు.

తో॥ కౌంతేయ వినుము దేహము క్షేత్రము
యని తెలిసినవా రనియెదరు
ఇంతే యని చక్కగ నెరింగినను
క్షేత్రజ్ఞుండని బల్కెదరు ॥వా॥

*తో॥ నాయనరారా నందకుమారా
నవనీరజదళ నయన హరే
నాయందనురాగంబును చూపర
నమస్కరించెద శ్రీనృహరే ॥వా॥ ౨

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత! ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥ 3

తా॥ భారత! సర్వక్షేత్రములలో మరి నేనే క్షేత్రజ్ఞుండని నెరుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానము తెలియుటయే జ్ఞానమని నా మతము.

తో॥ క్షేత్రజ్ఞుండను నేనని తెలియుము
భారత సర్వ క్షేత్రముల
క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమె జ్ఞానము
అని నా మతమగు వినుమిగుల ॥వా॥

*తో॥ అన్ని క్షేత్రముల యందును భారత
క్షేత్రజ్ఞుండను నేనేను
అంతర్గతుడగు ఆత్మను దెలిసిన
క్షేత్ర విమర్శయే జ్ఞానమగున్ ॥వా॥ 3

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 4

తా॥ ఆ క్షేత్రమేదియో, దాని స్వభావమెట్టిదో, దాని వికారము లేవియో, ఏ కారణముచే అది యుత్పత్తియైనదో వానిని క్షేత్రజ్ఞుని వాని స్వభావమును సంక్షేపముగ చెప్పెదను వినుము.

తో॥ క్షేత్రమెట్టిదో స్వభావమేదో
దాని వికారము లెవ్విధము
క్షేత్ర జన్మమేవిధి యోకారణ
పురుషుని ప్రభావమును వినుము ॥వా॥

*తో॥ భూతాత్ముండని క్షేత్రజ్ఞుండని
పురుషోత్తము డజు డవ్యయుడు
పురాణ పురుషుడు బుద్ధి సాక్షియని
బరగనంత నామము వాడు ॥వా॥

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ 5

తా॥ ఈ విషయమును అనేక ఋషులు ప్రత్యేక ప్రత్యేకముగ వివిధమైన ఛందస్సులచేతను, నిశ్చితమై హేతువులుగల బ్రహ్మసూత్ర పదములచేతను బహు పర్యాయములు చెప్పినారు.

తో॥ బహువిధములుగా ఋషులు వచించిరి
చతుర్వేదములు బలికినవి
బ్రహ్మసూత్రములు బాగ పలికినవి
నిశ్చిత హేతువు చూపినవి ॥వా॥

*తో॥ క్షేత్రజ్ఞుని మరి క్షేత్ర లక్షణములు
భారత భాగవత ములయందు
సూత్ర భాష్యములు ఆచార్యులు లో
కమునకు తెలిపిరి మున్ముందు ॥వా॥ గీ

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥ 6

తా॥ మహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, పదునొకండు ఇంద్రియములు, ఇంద్రియ గోచరములగు ఐదు విషయములు ఇవే చతుర్వింశతి తత్త్వములు.

తో॥ మహాభూతములు అహంకారమును
బుద్ధియు నవ్యక్తము మరియున్
మహాబాహు పదునొకండు ఇంద్రియ
ములు శబ్దాదులు అయిదున్ను ॥వా॥

తొంబదిఆరు తత్త్వముల వివరణము.

*తో॥ ద్వారంబులు పది ఇంద్రియములు పది
ఐదు భూతముల ఐదైదులు
వాయువులు పదియు నాడులు పదియును
మరి యెనిమిది యగు రాగములు ॥వా॥ క్షే

శ్లో॥ ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ 7

తా॥ ఇచ్ఛా, ద్వేషము, సుఖము, దుఃఖము, సంఘాతము, (దేహేంద్రియాది సమూహము) చేతనా అనగ(మనోవృత్తి) ధైర్యము. (ఈశ్లోకమున ౭ ముందు శ్లోకమున ౨౪ మొత్తం ౩౧ తత్వము గల సముదాయమునకు క్షేత్రమని పేరు. వికారముతో చేరినది.)

తో॥ఇచ్ఛా ద్వేషము సుఖదుఃఖంబులు॥సంఘాతము చేతనాధృతి సవికారముక్షేత్రంబని ఎరుగుము॥సంగ్రహముగ నేవచించితి॥వా॥

*తో॥ ఐదు శబ్దాదులు వచనాదు లైదు
మరియును ఏడగు ధాతువులు
ఆధారాదులు ఆరు చేరియును
౨౩ తొంబై ఆరగు తత్వములు ॥వా॥ ౭

శ్లో॥ అమానిత్వమదమ్భిత్వ మహింసా క్షాన్తిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ 8

తా॥ తన్నుతాను పొగడకొనకుండుట, డంభము లేకుండుట, అహింస, ఓర్పు, ఋజుస్వభావము, ఆచార్యసేవ, బాహ్యాభ్యంతరముల శుచి, స్థైర్యము, మనోనిగ్రహము.

తో॥ తనుపొగడక డాంబికము లేకను
అహింస క్షమ సరళత్వమును
తగు గురు సేవయు శౌచము స్థైర్యము
మనసు తనవశము చేయుటయు॥వా॥

*తో॥ విద్యను నేర్చియు వినయము తెలిసియు
పెద్దవారలను సేవించి
బుద్ధిమంతుడని పేరును పొందియు
మానదు తను పొగడుట గూర్చి ॥వా॥ ౮

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥ 9

తా॥ ఇంద్రియ విషయములందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖములందలి దోషములను నాలోచించుట.

తో॥ విషయ సుఖంబుల కాశపడక మిర
హంకారంబును ద్రోసియును
దోషములగు జన్మ జరాదుఃఖము
వ్యాధి మరణముల తలచుచును ॥వా॥

*తో॥ శాస్త్రము లెన్నో నేర్చియు చాలా
సర్వజ్ఞుండని పొగడబడి
శాస్త్రార్థంబులు పలికియు భ్రష్టగు
చెడు విషయంబుల లోన పడి ॥వా॥

శ్లో॥ అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥ 10

తా॥ విషయములందు అనాసక్తియు, పుత్ర దార గృహాదులయందు తన్మయత్వము లేకుండుట, ఇష్టానిష్టప్రాప్తులయందు సర్వదా సమచిత్తత్వము.

తో॥ ఆత్మేతర వస్తువులను గోరక•దారసుతాదుల గృహములను
భ్రాంతితో చూడక ఇష్టానిష్టము•లను సమబుద్ధితో
చూచుటను ॥వా॥

*తో॥ చదువులు కొన్నిటి చదివిన చాలును
చదువులలో గల అర్థమును
హృదయములో తా చింతన చేయుచు
హృషీకేశు మది నిలుపవలెగా ॥వా॥ ౧౦

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశ సేవిత్వ మరతిర్జనసంసది ॥ 11

తా॥ నాయందు అచంచలమయిన భక్తిని అనన్యభావనచే ఉంచుటయు, ఏకాంతమయిన స్థలమును ఆశ్రయించుటయు, జనసమూహామునందు అరతియు.

తో॥ నిశ్చలమగు భక్తియు నాయందును॰ఏకాంత స్థల వాసమును
నిశ్చలచిత్తము గలుగని వారల॰సహవాసంబును విడచుటను॥వా॥

*తో॥ గోవిందా నీయందే ఎప్పుడు॰అందముగను భక్తిని సలిపి
సుందరాంగ విను అనన్య భావన॰పొందగ నా హృద
యము నిలుపు ॥వా॥ ౧౧

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా॥ 12

తా॥ అధ్యాత్మ జ్ఞానమే నిత్యమని తెలివిగలిగియుండుట, తత్త్వజ్ఞాన సిద్ధాంతములను పరిశీలించుట, ఈ పై చెప్పబడిన (20) వన్నియు జ్ఞానమని చెప్పబడినది. దీనికంటే ఇతరములన్నియు అజ్ఞానమని చెప్పబడెను.

తో॥ అధ్యాత్మ జ్ఞానమె ముఖ్యంబని
తత్త్వార్థంబుల తెలియుటయు
ఇదే జ్ఞానమని తెలియగ వలయును
తక్కిన వజ్ఞానము తెలియు ॥వా॥

*తో॥ మానవ జన్మంబెత్తి నందులకు
మరణము చెందుటకును ముందే
మాధవ ఇతరము మరచియు నిరతము
మనసు నిలుపుటగు నీయందే ॥వా॥ ౧౨

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ 13

తా॥ జ్ఞేయమనునది చెప్పుచున్నాను. అది తెలుసుకొన్నవాడు అమృతత్వమును పొందును. అనాదియు హెచ్చైనదియు బ్రహ్మము. అది సత్తుగాదు. అసత్తని చెప్పబడుటయు లేదు.

తో॥ నాయన యేదియు తెలియఁగ వలయునో
దేనిని తెలిసిన మోక్షంబో
ఎయ్యది నాదియొ పరబ్రహ్మమో
సత్తాసత్తుల కతీతమో ॥వా॥

*తో॥ అన్నిటికన్నను ఆదిలో నుందువు॰అన్నిపోయిన నీ వుండెదవు
అగోచరుండవు అజ్ఞానులకును॰ఆత్మవిదులకును అగపడుదువు॥వా॥

శ్లో॥ సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 14

తా॥ ఆ పరబ్రహ్మమునకు అంతటను పాణి పాదములు అంతటను కన్ను తల ముఖములు, అంతటను శ్రోత్రములు గలిగియున్నది. అది లోకములో సకలమును వ్యాపించియు నిలచినది.

తో॥ ఆ పరమాత్మకు నెల్ల దిక్కులను
శిరములు చెవులును నేత్రములున్
ఆస్యములును చేతులు పాదంబులు
నుండును సర్వము తానుగను ॥వా॥

*తో॥ దేవకీ సుతునకు రెండు రూపములు
అవ్యక్తం మరియును వ్యక్తం
అవ్యక్తంబగు పరబ్రహ్మమని
వ్యక్తంబగు ఈ చరాచరం ॥వా॥ ౧౪

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 15

తా॥ ఆ బ్రహ్మమునకు సకలేంద్రియగుణము లున్నట్లు ఆభాసమయినను సకలేంద్రియ రహితమయినది. అసక్తమయినను అన్నిటిని భరించియున్నది. నిర్గుణమయినను గుణములను సేవించినదానివలె నున్నది.

తో॥ పరబ్రహ్మమున కఖిలేంద్రియములు ◆ నుండినట్లు దోచినలేవు
అలిప్తమైనను భరించు చుండును ◆ నిర్గుణమయినను గుణభోక్త॥వా॥

*తో॥ అఖిలంబునకును ఆధారుండవు॥ అంటీఅంటవు హరికృష్ణ
అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయక॥ ఆదినారాయణ హరికృష్ణ॥వా॥

శ్లో॥ బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥16

తా॥ ఆ బ్రహ్మము భూతముల అంతరంగమునందును బహిరంగము నందును వున్నది. అచరము చరము అయినది. సూక్ష్మమయినందున అవిజ్ఞేయము దూరము నందునున్నదనగ సమీపముననున్నది.

తో॥ భూతములనుండు లోపల వెలువల
చరాచరంబులు నైయుండు
అతిసూక్ష్మముచే తెలియ నశక్యము
దూరము సమీపముననుండు ॥వా॥

*తో॥ లోపల వెలుపల నీవేయుందువు॥ చరాచరంబులు నీవేను
శ్రీపతి నిను తెలియుంగ నశక్యము॥ అన్ని స్థళంబులు నీదేను॥వా॥

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 17

తా॥ (ఆ బ్రహ్మము) భూతములయందు ఏకాకారముగనున్నను, వేరుగానున్నట్లు దోచును. భూతముల భరించునదియు, మ్రింగునదియు, పుట్టించునదియు ఆ బ్రహ్మమే.

తో॥ భూతంబుల నవిభక్తంబగునది
విభక్తమయినటు నుండునది
భూతములను యది భరించు భుజించు
భూతోత్పత్తిని చేయునది ॥వా॥

*తో॥ సకల ప్రాణులను నిండియుండెదవు॥ సకల ప్రాణులను భరింతువు
సకల ప్రాణులను నశింపచేతువు॥ సకలోత్పత్తిని చేసెదవు॥వా॥

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥ 18

తా॥ (ఆ (బహ్మము)సూర్యాది తేజస్సులకును ప్రకాశింపచేయు జ్యోతి. అజ్ఞానమునకు వేరైనది. జ్ఞానమయినది. తెలియదగినది. జ్ఞానగోచరమయినది. సర్వప్రాణుల హృదయమునమున్నదని చెప్పబడుచున్నది.

తో॥ సూర్యాదులకును హెచ్చగు తేజము
అజ్ఞానమునకు బహు దూరం
సర్వప్రాణుల బుద్ధిలో నుండును
జ్ఞానము జ్ఞేయము జ్ఞాన గమ్యము ॥వా॥

*తో॥ సర్వప్రాణుల హృదయ వాసుడవు
సూర్యాదులకును వెలుతురవు
దుర్వాదమునకు దూరంబగుదువు
నిర్వాదంబున నుండెదవు ॥వా॥ ౧౮

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 19

తా॥ ఇట్లు క్షేత్రమును, అట్లనే జ్ఞానమును, జ్ఞేయమును సంక్షేపముగ చెప్పబడెను. నాభక్తుడు ఈ అర్థమును తెలుసుకొని నా స్వభావముకొరకు అర్హుడగుచున్నాడు.

తో॥ ఈ రీతిగ క్షేత్రము జ్ఞానంబును
జ్ఞేయము సంక్షేపంబుగను
వర్ణించితి నాభక్తుడు తెలసియు
నాస్వరూపమును పొందనగు ॥వా॥

*తో॥ క్షేత్రము క్షేత్రజ్ఞుని విచారమును
అమానిత్వాది గుణములను
క్షేత్రజ్ఞుని గను జ్ఞానజ్ఞేయమును
నా భక్తుడు పొందగ నగును ॥వా॥ ౧౯

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ 20

తా॥ ప్రకృతి పురుషు లిరువురు అనాదులని తెలియుము. వికారములును గుణములును ప్రకృతినుండి జనించినవిగా తెలిసికొనుము.

తో॥ ప్రకృతియు పురుషుండును నీ యిరువురు
అనాదులనియును యెరుంగుము
ప్రకృతివలన బుట్టినది వికారము
గుణంబు లనియును యెరుంగుము ॥వా॥

*తో॥ ప్రపంచమంతయు ప్రకృతిమయంబే
పరమాత్ముని సంబంధముచే
ప్రపంచోత్పత్తి వృద్ధి క్షీణము
పొందును వికారగుణములచే ॥వా॥ ౨౦

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే ।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥ 21

తా॥ కార్యమనగ దేహము. కరణమనగ ఇంద్రియములు. వీటియొక్క కర్తృత్వమునకు ప్రకృతియే హేతువని చెప్పెదరు. సుఖదుఃఖము లనుభవించుటకు పురుషుడే హేతువని చెప్పెదరు.

తో॥ కార్య కారణము కర్తృత్వంబుల
హేతువు ప్రకృతియె యనబడును
కారణమగు పురుషుడు సుఖదుఃఖము
లనుభవించుటలో వినతగును ॥వా॥

*తో॥ నిర్గుణుడైనను ప్రకృతి సంగమున
జీవాత్ముండని పేరొంది
త్రిగుణపు కర్మలచే సుఖదుఃఖము
లనుభవించు భ్రాంతిని చెంది ॥వా॥ ౨౧

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥ 22

తా॥ పురుషుడు ప్రకృతిలోనిలచి ప్రకృతినుండి పుట్టిన గుణములను అనుభవించుచున్నాడు. ఉన్నత నీచ జన్మములకు గుణముల సహవాసమే ముఖ్యకారణ మగుచున్నది.

తో॥ ప్రకృతి గుణంబుల ననుభవించుచును
సుఖదుఃఖంబులు తన వనును
ప్రకృతి గుణపు సంగముచే సదస
ద్యోనుల జన్మంబగుచుండుగ్ ॥వా॥

*తో॥ పురుషుడు ప్రకృతిలో నుండియు భుజించు
ప్రకృతి జన్యమగు గుణములను
పురుషుడు గుణముల సాంగత్యముచే
పుణ్యాపుణ్యపు జన్మమగుగ్ ॥వా॥ ౨౨

శ్లో॥ ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః॥ 23

తా॥ ఈ దేహమందు పరమపురుషుడు సాక్షిరూపుడై, అనుమోదించువాడై, భరించువాడై, అనుభవించువాడై, మహేశ్వరుడై, పరమాత్మ అని చెప్పబడుచు క్షేత్రజ్ఞుడు ఉత్కృష్టుడై వున్నవాడు.

తో॥ ఉపద్రష్టుడగు అనుమోదించును
భర్తాభోక్తా మహేశ్వరః
ఈ పేరులు యజమానుని కొప్పును
దేహమందునను పురుషః పరః ॥వా॥

*తో॥ ప్రకృతి విలక్షణ పరమాత్మ హరె
ప్రకృతికి బలమగు శ్రీకృష్ణ
నీకృప గలుగక నినుగన జాలము
నిగమగోచరా హరికృష్ణ ॥వా॥ ౨౩

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ 24

తా॥ ఈ రీతిగ పురుషుడు (నిర్గుణుడని) ప్రకృతి గుణసహితమని ఎవ డెరుంగునో అతడు సర్వప్రకారములచేత ఉన్నవాడైనను మరల జన్మించడు.

తో॥ ఈ రీతిగ పురుషుడు నిర్గుణుడని
గుణసహితంబగు ప్రకృతియని
ఈరీతెరిగిన వాడెట్లుండిన
పునర్జన్మమును పొందడను ॥వా॥

*తో॥ పరమేశ్వర నిను పరిపరి విధముల
భజించు భక్తుడు శ్రీకృష్ణ
పరవశమున ప్రాపంచిక నడతల
మరచితె నేమగు హరికృష్ణ ॥వా॥ ౨౪

శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 25

తా॥ కొందరు ధ్యానతత్పరులై మనస్సుచే తమలో నంతర్గతమగు పరమాత్మను చూచెదరు. మరికొందరు సాంఖ్యయోగేన - జ్ఞానయోగముచేతను, మరికొందరు కర్మయోగముచే చూచెదరు.

తో॥ హృదయ పీఠమున నుండెడి ఆత్మను
ధ్యానముచేతను తెలియుదురు
కొందరు సాంఖ్యముచేతను కొందరు
కర్మయోగమున కనియెదరు ॥వా॥

*తో॥ సోహంమంత్రము సద్గురు కృపచే
బడసియు ధన్యత పొందెదరు
సోహంహంసః హంసః సోహం
అని హంసను జపియించెదరు ॥వా॥ ౨౫

శ్లో॥ అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 26

తా॥ మరికొందరు ఈ ప్రకారము తెలియక ఇతర ఆచార్యులచే విని ఉపాసించెదరు. వేదాంతశ్రవణపరులయినవారలు మృత్యువును తప్పక దాటెదరు.

తొ॥ మరికొందరు తమ ఆత్మను తెలియక
గురూపదేశముచే వారు
వారి వాక్యముల నమ్మి యుపాసన
చేసియు మృత్యువు దాటెదరు ॥వా॥

*తొ॥ మహాభారతము భాగవతంబును
రామాయణమును పఠయించి
మహాభారతాంతర్గత భగవద్
గీతను శ్రవణము గావించి ॥వా॥ ౨౬

శ్లో॥ యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ! ॥ 27

తా॥ భరతశ్రేష్ఠ! స్థావరజంగమాత్మకమయిన ఏదయిన స్వల్పవస్తువుత్పత్తియగుటకు క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగమునుండియే పుట్టునని తెలియుము.

తొ॥ భరతర్షభ! విను కొంచమైనను
స్థావర జంగమ వస్తువులున్
క్షేత్రము క్షేత్రజ్ఞుని సంయోగము
చేనగునని తెలియుము చాలున్ ॥వా॥

*తొ॥ శ్రీ శ్రీ శ్రీ శ్రీ రామబ్రహ్మా
నంద సరస్వతీ స్వాములచే
శ్రీమద్భగవద్గీతా భాష్యము
తెలియుట మేలగు శ్రవణముచే ॥వా॥ ౨౭

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ 28

తా॥ పరమేశ్వరుడు సర్వభూతములయందును సమముగా నున్నవాడని, వినాశమగు వస్తువులలో నాశము లేక వున్నాడని యెవడెరుంగునో వాడే చూచువాడు.

తో॥ సర్వభూతముల సమముగ నుండును
పరమేశ్వరు డని గనువాడు
సర్వము నశించ ఆతడుండునను
వాడే నిజచూపుల వాడు ॥వా॥

*తో॥ పరమాత్మవారే యదుకుల భూషణ
శ్రీకృష్ణ జయ శ్రీకృష్ణ
పార్థుని బ్రోచిన పరమ కల్యాణ
హరికృష్ణ జయ హరికృష్ణ ॥వా॥   ౨౭

శ్లో॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్॥29

తా॥ ఈశ్వరుడు సర్వత్రను సమానముగ నిండి ఉన్నాడని తెలిసికొని (ఏ పురుషుడు) తన్ను తాను హింస చేసినవాడు కాడో అందువలన ఆతడు పరమగతిని అందుకొనునని తాత్పర్యము.

తో॥ అన్ని ప్రాణముల నంతర్గతుడగు
ఆత్మ నొక్కడని యెఱయుదురు
ఆనందింతురు వ్యథ కల్పింపరు
అందున నాగతి పొందుదురు ॥వా॥

*తో॥ ఈశ్వర! నీలో సర్వభూతములు
వసించుననుటను నెరుగుటచే
ఈశ్వర యెవ్వరు మిత్రులు శత్రులు
సర్వులు నీ యందుండుటచే ॥వా॥   ౨౮

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥ 30

తా॥ సకలకర్మలు సర్వప్రకారములుగ ప్రకృతినుండియే చేయబడుచున్నదని నెఱఁడెరుంగునో అపుడు అతడు ఆత్మను అకర్తయని చూచుచున్నాడు.

తో॥ సర్వవిధంబుల సమస్త కర్మలు
ప్రకృతిమూలముననే కలుగుఁ
పరమాత్మయు కర్తయు కాదనియును
ఎఱగినవాడే జ్ఞానియగుఁ ॥వా॥

*తో॥ ప్రకృతి నుండియే కర్మ లన్నియును
పరిణమించునని యెరిగినచో
పరమాత్మయు తాకర్తగా డనుచు
భాగవతుడు తా భావించు ॥వా॥ 30

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 31

తా॥ ఎవడు భిన్నభిన్నముగనుండు సమస్తభూతములు వొక్క పరమాత్మలోనే ఉండునట్లుగ చూచుచున్నాడో, ఆ పరమాత్మనుండియే ఇవన్నియు విస్తారమాయెననియు చూచునో అపుడతడు బ్రహ్మభావమును పొందును.

తో॥ నానా విధముల నుండు భూతములు
నాత్మయందె యున్నవి గాను
నానా భూతము లాత్మచె గలిగెను
ననిచూచిన ధన్యుండగును ॥వా॥

*తో॥ పదునాలుగు లోకంబుల కంతయు
పరమాత్ముండవు నీవేగా
పద్మనాభ బ్రహ్మాది దేవనుత
పాలించను నను నీవేగా ॥వా॥ 3౧

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ! న కరోతి న లిప్యతే ॥ 32

తా॥ కౌంతేయ! ఈ అవ్యయుఁడయిన పరమాత్మ అనాదియూ నిర్గుణుడు అయినందున శరీరములో నుండినను ఏకార్యము చేయడు. ఏమిటిని అంటించుకొనడు.

తో॥ అవ్యయుడగు ఆపరమాత్మయు విను
అనాదియును నిర్గుణు డయ్యా
అగుటచే శరీర మందుండినను
అంటడు చేయుడు కౌంతేయా! ॥వా॥

*తో॥ అనాది పురుషుడ అప్రమేయా ఓ
ఆద్యంతరహిత శ్రీకృష్ణ
అనాథబంధో అఖిలాధారుడ
అవ్యయకోని యాడెద కృష్ణ ॥వా॥ 32

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే॥ 33

తా॥ ఆకాశ మెట్లు సూక్ష్మరూపముగుటచే సర్వవ్యాపకమైనను, దేనిని అంటక యుండునో అట్లు ఈ ఆత్మ అన్నిదేహములందున్నను, దేనిని అంటదు. దేహమున సర్వత్రఉన్నదైనను, అంటబడదనియు తాత్పర్యము.

తో॥ అన్నిట నాకాశము నుండినను
సూక్ష్మమగుటచే నంటదుగా
అటు లాత్మయు దేహముల నుండినను
ఏ లేపములే కుండునుగా ॥వా॥

*తో॥ ఆకాశాదిగ పంచభూతముల
అంతట నిండియు నున్నావు
ఆకాశాదుల కాధారుడవై
అచ్యుత అన్నిటి నడిపెదవు ॥వా॥ 33

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత! ॥ 34

తా॥ భారత! సూర్యుడొక్కడే ఎల్లజగత్తులను ఎట్లు ప్రకాశింప చేయుచున్నాడో అట్లనే క్షేత్రజ్ఞుడు నగు పరమాత్మ సమస్త క్షేత్రములను ప్రకాశింపచేయుచున్నాడు. సమస్తమైన దేహమును ప్రకాశింప చేయుచున్నాడనియు తాత్పర్యము.

త్రో॥ భారత భానుడు సమస్తజగము◆ప్రకాశింప చేయునో అట్లే
క్షేత్రజ్ఞుడు ఈ క్షేత్రము లన్నిటి◆ప్రకాశింపచేయును అట్లే॥వా॥

*త్రో॥ దినమణి యొక్కడె దేశము లన్నిటి◆ తేజరిల్ల చేసిన యట్లే
దేహావాసి ఈ దేహము నంతయు◆ తేజరిల్ల చేయును అట్లే॥వా॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్॥35

తా॥ ఇట్లు జ్ఞాన కన్నులచేత క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదమును అట్లే అన్ని భూతముల ప్రకృతి మోక్షమును తెలిసినవారు పరబ్రహ్మమును పొందుదురు. (ప్రకృతికి మాయయనియు పేరు.)

త్రో॥ జ్ఞానదృష్టిచే క్షేత్రక్షేత్రజ్ఞుల◆చక్కని భేదము నెరిగియును
అన్ని వస్తువుల మాయా రహితులు◆పొందుదురుత్తమపదంబును

*త్రో॥ భూతములకు సంబంధము కలిగిన [॥వా॥
ప్రకృతి మోక్షమును జ్ఞానముచే
కర్తనుగానని మోహము విడచియు
ఉత్తముడగు శ్రీహరి కృపచే ॥వా॥ 36

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగో నామ త్రయోదశోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## చతుర్దశాధ్యాయము – గుణత్రయ విభాగయోగము.



తో॥ పరమాత్ముని సన్నిధి బలంబునను ◆ ప్రకృతియే పరిపరివిధంబులన్
పనులు చేయు నను పరిశీలనతో ◆ భద్రపరచు అధ్యాయ మిలన్ ॥వా॥

తో॥ ప్రకృతి గుణములచే పట్టు బడుటయే ◆ పునర్జన్మ హేతువు నగును
ప్రకృతి గుణంబుల పట్టుబడకయే◆పరమాత్ముని సన్నిధి బడయున్ ॥వా॥

తో॥ మానవ జన్మంబెత్తి నందులకు ◆ మరువక గురుసేవయు జేసి
మానక గుణత్రయ విభాగయోగము◆మరి తెలియుము గురు కృపబడసి॥

తో॥ సాత్త్వీక వస్తువ్వులను సేవించుము ◆ సద్గ్రంథంబుల పఠించుము
సాత్త్వీక గుణమున కాలము గడుపుము ◆ సచ్చిత్ సుఖరూపుడ వగుము॥

తో॥ సత్పురుషుల సహవాసము వల్లను ◆ సద్గురువుల బోధలవలన
సదాశివుని ధ్యానంబువల్లను ◆ సచ్చింతన సుఖరూపుడగున్ ॥వా॥

తో॥ ముల్లోకంబుల మూడుగుణంబులె ◆ ముల్లోకాధీశ్వరు డొకడె
ముల్లోకాధీశ్వరు ధ్యానించితె ◆ మూడు మీర సుఖముగ గాదె ॥వా॥

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥ 1

తా॥ జ్ఞానములలో ఉత్తమ జ్ఞానమును, మరల నీకుగాను చెప్పుచున్నాను. అట్టిజ్ఞానమును నెరింగియేగద సమస్తమునులు శ్రేష్ఠమయిన మోక్షమును పొందిరి.

తా॥ సమస్తమునులును యే జ్ఞానముచే
సంసార సముద్రము దాటి
సిద్ధియు నొందిరో సర్వోత్తమ మగు
ఆ జ్ఞానము వినుము కిరీటి ॥వా॥

*తా॥ పరమ దయాళుడు పార్థుని ప్రేమతో
పలికెద మరలను వినుమనుచు (భూయః)
పరమ ఋషులు పరమోత్తమ పదమును
పొందు జ్ఞానమును బోధించు ॥వా॥ ౧

శ్లో॥ ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥ 2

తా॥ ఈ జ్ఞానమును ఆశ్రయించి నాలో ఏకరూపమును పొందిన వారలు సృష్టియొక్క ఉత్పత్తికాలమున పుట్టరు. ప్రళయకాలమున వారు వ్యథ పొందరు.

తా॥ ఈ జ్ఞానంబును ఆశ్రయించియును
నా స్వరూపమును పొందియును
ప్రజ్ఞా హీనత భవమును పొందరు
ప్రళయంబున భయ మొందరను ॥వా॥

*తా॥ పార్థవారు ఈ ప్రపంచవాసన
బడకుండుటచే పావనులు
ప్రపంచ సృష్టి క్రమమున పుట్టరు (సర్గేపి)
ప్రళయకాలమున వ్యథపడరు ॥వా॥ ౨

శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।
సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత! ॥　　3

తా॥ భారత! మహద్బ్రహ్మ అనగ అన్నిటికన్నను పెద్దది యగు ప్రకృతి నాయోని యనబడును. దానిలో గర్భమును వుంచెదను. దానినుండి సర్వభూతములు పుట్టుటకు ప్రారంభమగును.

తో॥ భారత గొప్పది యగు మూలప్రకృతి
భూతోత్పత్తికి స్థానంబు
గర్భముంచెదను అందున సమస్త
భూతంబులు గల్గును వినుము ॥వా॥

*తో॥ జగదోద్ధారక శరణుచొచ్చెదను
జగద్యోని శ్రీకృష్ణ హరె
జగదుత్పత్తి స్థితి సంహారక
జాగ్రత పడ పాలించు హరె ॥వా॥　　3

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥ 4

తా॥ కుంతీతనయ! సకలయోనులందు ఏ యే మూర్తులుద్భవించుచున్నవో వాటికన్నిటికిని ప్రకృతి తల్లి, నేను బీజప్రదుడగు తండ్రిని.

తో॥ కుంతీపుత్రక సమస్తయోనుల
గలిగెడి మూర్తుల కన్నిటికి
ప్రకృతియె తల్లియు బీజ ప్రదుడగు
తండ్రి నేను మరి యెప్పటికి ॥వా॥

*తో॥ తలితండ్రుల పేరులు వేరుండిన
తలితండ్రులు నిజముగ మీరె
తలితండ్రుల రూపముల ధరించిన
శ్రీరుక్మిణీ శ్రీకృష్ణ హరె ॥వా॥　　౪

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహినమవ్యయమ్॥ 5

తా॥ మహాబాహూ ! ప్రకృతినుండి పుట్టిన సత్త్వము, రజస్సు, తమస్సు అను ఈ గుణములు దేహములోనున్న అవ్యయుని దేహములో కట్టివేయుచున్నది.

తొ॥ సత్వము రజస్సు తమస్సు యను నీ
గుణములు ప్రకృతిలో గలిగినవి
అవ్యయుడగు దేహినికట్టును ఓ
మహాబాహూ! దేహమున నివి ॥వా॥

*తొ॥ నీ మాయా గుణములు కృష్ణయ్య
నిలబెట్టియు నను బాధించె
నీనామ స్మరణచె నీ గుణముల
నిగ్రహించ చేయగ రాదె ॥వా॥ ౫

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశకమనామయమ్ ।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ! ॥ 6

తా॥ అనఘ! ఆ గుణములలో సత్త్వగుణము నిర్మలత్వము, ప్రకాశము, ఆరోగ్యకరమునై సుఖసంగముతోను జ్ఞానముతోను బంధించుచున్నది.

తొ॥ గుణములలో సత్త్వగుణము స్వచ్ఛము
గావున జీవుని సుఖంబుచే
జ్ఞాన ప్రకాశముల బంధించును
పాపరహిత ఆరోగ్యముచే ॥వా॥

*తొ॥ స్వయం ప్రకాశుడ వాదిదేవుడవు
అప్రమేయుడవు అవ్యయుడవు
స్వకీయమగు నీమాయలో చిక్కక
సన్నిధిచేర్చియు నను గావు ॥వా॥ ౬

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్ ॥ 7

తా॥ రజోగుణము రాగాత్మక మయినది. రానివస్తువుల గోరుట, వచ్చినదానియందు చాలాప్రేమ, దేహిని దీనికై కౌంతేయ ! కర్మాసక్తితో బంధించుచున్నది.

తో॥ రానివస్తువుల కోరుచు రజస్సు
వున్న వస్తువుల విడువకను
రాగముచే కర్మలు చేయించుచు
రంజనచే దేహిని కట్టుగా ॥వా॥

*తో॥ హే కౌంతేయ! యథాలాభమున (కౌంతేయ)
దేహిని సంతోషింపదుగా
ఏకాలము నను ఎన్నో కోరుచు
రజోగుణము బంధించునుగా ॥వా॥ ౭

శ్లో॥ తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత! ॥ 8

తా॥ భారత! తమోగుణమైతే అజ్ఞానముచే పుట్టినదని ఎరుంగుము. సకల ప్రాణులను మోహమునకు ఈడుచేయుచు ప్రమాదాలస్య నిద్రలచే బంధించును.

తో॥ అజ్ఞానంబున బుట్టిన తమస్సు
సమస్తప్రాణుల మోహముచే
ముంచియు ప్రమాద ఆలస్యంబుల
బంధించును నిద్రాదులచే ॥వా॥

తో॥ భారత విపరీత జ్ఞానముచే (భారత)
పుట్టినదగు ఈ తమోగుణం
పరమార్థ జ్ఞానము పరికింపని
ప్రమాదమున పడవేయు గుణం ॥వా॥ ౮

శ్లో॥ సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత! ।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత ॥ 9

తా॥ భారత! సత్త్వగుణము సుఖమందును, రజోగుణము కర్మయందును, తమోగుణము జ్ఞానమును మరుగుచేసి ప్రమాదమునందును ఆసక్తిని కలిగించును.

తో॥ సత్త్వగుణము సుఖమందున గూర్చును
రజస్సు కర్మమునకు జేర్చు
కుంతీసుత జ్ఞానంబును కప్పియు
తమస్సు ప్రమాదమున చేర్చు ॥వా॥

*తో॥ సుఖమును కోరెడివారలు సత్త్వము
సేవించగవలె సంతతముఙ్
దుఃఖము కోరెడివారలు రాజస
తామసముల సేవించవలెఙ్ ॥వా॥ ౯

శ్లో॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత! ।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥ 10

తా॥ భారత! రజస్సును, తమస్సును నణచి సత్త్వగుణము వృద్ధి పొందును. రజస్సత్త్వముల నణచి తమోగుణము మించును. అట్లే తమస్సత్త్వముల నణచి రజోగుణము వర్ధిల్లును.

తో॥ రజస్తమస్సుల తిరస్కరించియు
సత్త్వము నిలుచును పార్థవిను
రజస్సు సత్త్వతమస్సుల నట్లే
తమస్సు సత్త్వ రజస్సులను ॥వా॥

*తో॥ యుక్తాహార విహారుల కెప్పుడు
సత్త్వ గుణమ్ము సహాయపడుఙ్
యుక్తాహార విహార శూన్యులకు
రజస్తమస్సులు బాధించుఙ్ ॥వా॥ ౧౦

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత ॥

తా॥ ఈ దేహమునందలి అన్ని ద్వారములలో ఎప్పుడు ప్రకాశము, జ్ఞానము పుట్టినదో అప్పుడు సత్త్వగుణము హెచ్చినదని తెలియవలయు.

తో॥ ఈదేహంబున సర్వద్వారముల
జ్ఞానప్రకాశ మభివృద్ధి
నొందిన సత్త్వగుణంబు హెచ్చెనని
పాండవ! తెలియుము నీ బుద్ధి ॥వా॥

*తో॥ ఉన్నది ఉన్నట్లుగ తెలియుటయె
జ్ఞానప్రకాశ మనబడును
ఉన్నది మారుగ తలచు చుండుటయె
అజ్ఞానంబని చెప్పబడుగ ॥వా॥ ౧౧

శ్లో॥ లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ! ॥ 12

తా॥ భరతర్షభ! రజోగుణము వృద్ధిపొందినదంటే లోభము, కామ్య కర్మ ప్రవృత్తి ఆరంభము. అతృప్తి అట్లే కోరికలు ఉత్పన్నమగుచున్నవి.

తో॥ ఈ శరీరమున లోభగుణంబును
కర్మారంభము యశమంబు
ఇచ్ఛయు ప్రబలంబగు చుండిన వినుః
రజోగుణము ప్రారంభంబు ॥వా॥

*తో॥ ధనార్జనంబును దాచి పెట్టడము
తా నతృప్తిగను నుండడము
ధనము పాత్రులకు నివ్వకుండడము
తగు రజోగుణము లక్షణము ॥వా॥ ౧౨

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన! ॥ 13

తా॥ అప్రకాశః-వివేకము లేకపోవుట, అప్రవృత్తిశ్చ-పనిపాటులయందు ప్రవర్తింపకుండుట, ప్రమాదః-జాడ్యమును మోహమును ఈలక్షణములు తమోగుణము వృద్ధిపొందినపుడు పుట్టుచున్నవి కురునందన !

తో॥ అజ్ఞానము సోమారి తనంబును
అప్రయత్నమును ప్రమాదము
అర్జున తమోగుణము అభివృద్ధిని
అగు సమయంబున గలుగు నిజమ్ ॥వా॥

*తో॥ వివేకమేమియు లేకపోవడము
వివేకహీనుల సహవాసం
విద్యాభ్యాసంబున మూఢత్వము
విను తమోగుణము లక్షణము ॥వా॥ ౧౩

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకా నమలాన్ప్రతిపద్యతే ॥ 14

తా॥ సత్త్వగుణము వృద్ధిపొందు దశలో దేహధారి మరణించితే ఆపుడు ఉత్తమవిదుల నిర్మలలోకముల బొందుచున్నాడు.

తో॥ సత్త్వగుణము ప్రబలెడు సమయంబున
మరణము చెందిన దేహికిని
స్వచ్ఛమయిన యుత్తమ లోకంబుల
పొందగ నగునపు డాతనికిన్ ॥వా॥

*తో॥ సత్త్వగుణము నొదగిన ఆ సమయము
సత్పురుషులు ధన్యులు నిజము
సద్వస్తువుపై బుద్ధి నుంచడము
సద్భావంబున నుండడము ॥వా॥ ౧౪

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే ।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15

తా॥ రజోగుణము ప్రబలమగు సమయమున మరణించిన కర్మసంగులలో పుట్టును. అట్లే తమోగుణ ప్రబలమగు సమయమున మరణమొందిన మూఢ యోనులందు జన్మించును.

తో॥ రజోగుణాధికమున మరణించిన
కర్మసంగులను జనియించు
తమోగుణాధికమున మరణించిన
మూఢయోనులను జన్మించు ॥వా॥

*తో॥ కర్మఫలం కోరుట కారణమగు
కర్మసంగులను జన్మంబు
కర్మఫలమ్మును ఈశ్వరార్పితము
కావించిన కడ జన్మంబు ॥వా॥ ౧౪

శ్లో॥ కర్మణస్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16

తా॥ సుకృత కర్మఫలము నిర్మలము, సాత్త్వికము అయినదనియు, రజోగుణ కర్మఫలము దుఃఖమని, తామసకర్మఫలము అజ్ఞానమని చెప్పుచున్నారు.

తో॥ సత్త్వగుణము చేగలిగిన కర్మము
నిర్మలమగు జ్ఞానము ఫలము
ఈతీరున రాజసము దుఃఖమగు
అజ్ఞానము తామసఫలము ॥వా॥

*తో॥ రామార్పిత సత్కర్మలు సుఖంబు
రాజసకర్మలు దుఃఖంబు
తామస కర్మఫలము నజ్ఞానము
తగచూడుము కర్మఫలంబు ॥వా॥ ౧౭

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥ 17

తా॥ సత్త్వగుణముచే జ్ఞానము, రజస్సునుంచి లోభము పుట్టుచున్నవి. తమస్సునుంచి ప్రమాదము మోహము ప్రత్యేకముగ అజ్ఞానము పుట్టుచున్నవి.

తో॥ సత్త్వగుణముచే జ్ఞానము గలుగును
రాజస గుణమున లోభంబు
పార్థివినుము తామసమున ప్రమాద
మోహాజ్ఞానము లుదయంబు ॥వా॥

*తో॥ సత్త్వగుణము తను చక్కగ నెరుగును
రాజస గుణంబు నెరుగదుగా
తామసంబు తను దయ్యంబనుచును
తగ నాలోచన చేయునుగా ॥వా॥ ౧౭

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః ॥ 18

తా॥ సత్త్వగుణమువారు మేలగు స్వర్గాది లోకములను పోదురు. రాజసులు మధ్యమమగు మనుష్యలోకమున ఉండుచున్నారు. కనిష్ఠగుణప్రవృత్తి గల తామసులు అధోగతి పాలగుదురు.

తో॥ సత్త్వగుణస్థులు ఊర్ధ్వలోకమును
రజోగుణులు మధ్యపులోకం
అధోలోకమును తామస గుణులును
చేరుదు రతి స్థిర ప్రారబ్ధం ॥వా॥

*తో॥ నీచపు గుణమెప్పుడు నియ్యకొను
నీచ కార్యముల చేయుడము
నీచుల సహవాసమున నుండడము
నీచ జంతువులలో జన్మమ్ ॥వా॥ ౧౮

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ 19

తా॥ ఎప్పుడు ద్రష్ట - తెలిసినవాడు గుణములకంటె అన్యము కర్తనుగా చూడడో, గుణములకంటె గుణవ్యాపారసాక్షిని పరం - అన్యునిగ నెరుగునో అప్పుడతడు నాస్వరూపమును పొందుచున్నాడు.

తో॥ తాను సాక్షిఅని గుణములు కర్తలు
అని యెరిగిన యా వివేకియు
తను తా తెలిసిన కారణంబునను
నాభావన పొందును తెలియు ॥వా॥

*తో॥ ఆత్మవేత్త త్రిగుణంబుల కన్నను
కర్తవేరు లేదని యెంచు
ఆత్మను గుణములకంటె వేరెయును
నాతడు నాభావము నొందు ॥వా॥ ౧౯

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥ 20

తా॥ దేహోత్పత్తికి కారణమగు ఈ దేహములో పుట్టిన త్రిగుణములను దేహి దాటి జన్మ మృత్యు జరాదుఃఖములను విడువబడి అమృతత్వమును పొందును.

తో॥ దేహోత్పత్తికి కారణంబులగు
త్రిగుణంబుల తా మీరియును
దేహి అమృతత్వమ్మును పొందును
జన్మజరాదుల విడచియును ॥వా॥

*తో॥ మాత్ర ద్వారమునందు నొచ్చుటయు
ముదిమి రోగముల చిక్కుటయు
మృత్యువు నోటను దుఃఖించుటయు
ముగించి నిను చేర్పగవలయు ॥వా॥ ౨౦

అర్జున ఉవాచ:—

శ్లో॥ కైర్లింగైస్త్రీన్గుణానేతా నతీతో భవతి ప్రభో !

కిమాచారః కథం చైతాంస్త్రీన్గుణానతివర్తతే ॥ 21

తా॥ ప్రభో! మనుష్యుడు ఏ లక్షణములనుంచి ఈ మూడు గుణముల నుండి దాటబడుచున్నాడు? ఆ ఆచారములెట్టివి? అతడు ఈ మూడు గుణములను దాటి పోవుచుండునదెట్లు?

తో॥ త్రిగుణంబులు మీరిన యాధన్యుడు
యే ఆచారము గలవాడు
యే గురుతుండును గుణముల మీరుట
ఎట్లగు తెలుపుము ప్రభు ఇపుడు ॥వా॥

*తో॥ గుణముల మీరుట కే ఆచారము
వర్ణాశ్రమ ధర్మము లెట్లు
గురు తెట్లుండును స్త్రీలా పురుషుల
గుణాతీత లక్షణ మెట్లు ॥వా॥ ౨౧

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ !

న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి ॥ 22

తా॥ పాండవ! ప్రకాశము ప్రవృత్తి అట్లే మోహము ఇవి సంప్రాప్తములైన ద్వేషింపడు. విడచిపోయిన కోరడు.

తో॥ సంప్రాప్తములగు పాండవ! ప్రకాశ
ప్రవృత్తి మోహము లనుగనియు
సంప్రాప్తంబేలని ద్వేషింపడు
విడువబడిన కోరడు మరియు ॥వా॥

*తో॥ మూడు గుణంబుల ప్రకాశ ప్రవృత్తి
మోహంబుల నన్నియు గనియు
మూడుగుణంబుల కార్యము లివియని
మునుగడు తన దివి కావనియు ॥వా॥ ౨౨

శ్లో॥ ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥ 23

తా॥ ఉదాసీనుని వలె నుండును. గుణములనుంచి అల్లాడడు. గుణములు పనులు నడిపించునని గమనించుచు స్థిరుడై ఉండును. చలింపడు.

తో॥ గుణములయందును గుణ కార్యములను
ఉదాసీను డగుచును తాను
గుణములచేతా చలింప కుండును
కార్యములన్నియు గుణములను ॥వా॥

తో॥ పరమాత్ముని భక్తిలో ప్రకాశించు
భజియించుచు ఆనందించు
పరమాత్ముని మరువకను తలంచుచు
ప్రపంచ ప్రవృత్తి కామరచు ॥వా॥ ౨౩

శ్లో॥ సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః ।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥ 24

తా॥ అతడు సుఖదుఃఖములను సమముగ జూచు, స్వస్థః-స్వస్వరూప మందే సంతసించు, రాతిని మన్ను బంగారును సముముగ జూచు, ప్రియాప్రియములను నిందాత్మ స్తుతులను సమానముగ చూచు ధీరుడు.

తో॥ స్వస్థత నుండును సుఖదుఃఖంబుల
కాంచన లోష్టాశ్మములందు
సమతత ప్రియాప్రియంబుల ధీరుడు
సమతత నిందాస్తుతు లందు ॥వా॥

*తో॥ స్వస్థ చిత్తుడగు ఆ ధీరునకును
సుఖదుఃఖంబులు తోచదుగా
స్వర్ణము శిలమృత్తిక సముంబగును
నిందాస్తుతులను నెంచడుగా ॥వా॥ ౨౪

శ్లో॥ మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే ॥ 25

తా॥ మానావమానములందు సముడు, మిత్రశత్రులందు ఆ పక్షములందు సముడు, సర్వారంభపరిత్యాగియు నగు నతడు గుణాతీతుడని చెప్పబడును.

తో॥ సర్వారంభంబులను విడచియును
మానము అవమానంబులను
సముడై మిత్రుల శత్రుల యందును
సముడగు త్రిగుణాతీతుండుగా ॥వా॥

*తో॥ గుణాతీతునకు ఆత్మ దృష్టియగు
గుణ కర్మంబుల పనియేమి
మానము అవమానముతో నేమి
శత్రుమిత్రులతో పనియేమి ॥వా॥ ౨౫

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్సమతీత్యైతా న్బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26

తా॥ ఎవడు నాయందు అవ్యభిచార భక్తియోగముచేత నన్ను సేవించునో అతడు ఈ మూడుగుణములను దాటి బ్రహ్మస్వరూపము పొందుటకు సమర్థుడగుచున్నాడు.

తో॥ ఎవ్వడు నన్నును అనన్య భక్తిచే
ఏవేళను సేవించగను
పావను డాతడు గుణముల దాటియు
బ్రహ్మప్రాప్తికి యోగ్యుడగుగా ॥వా॥

*తో॥ ఇతర సుఖంబులు అన్నియు మరచియు
ఈశ్వర నిన్నే తలచుచును
నినుభక్తిగ సేవించగ కృష్ణ
నీదయ బ్రహ్మ ప్రాప్తియగుగా ॥వా॥ ౨౬

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ॥ 27

తా॥ ఎందుకనగ నేను అమృతము, అవ్యయము అయిన బ్రహ్మము యొక్క కొనస్థానము శాశ్వత ధర్మము. ఏకాంతిగ సుఖముయొక్క కొన స్థానము అయివున్నాను.

తో॥ అమృతము అవ్యయ మగు బ్రహ్మంబును
శాశ్వత ధర్మ స్థానమును
అవ్యభిచారియు నగు ఆనందము
బొందగ జేనే మూలమును ॥వా॥

*తో॥ పరంధాముడవు పరమేశ్వరుడవు
పరబ్రహ్మ పరమాత్మవారె
పరంజ్యోతివి పరేశ పరాత్పర
పరమాత్మ పరాకాశ వారె ॥వా॥ ౨౭

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయ విభాగ యోగో నామ చతుర్దశోఽధ్యాయః.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## పంచదశాధ్యాయము – పురుషోత్తమ ప్రాప్తియోగము.

---

తో॥ సర్వాధారుడు పురుషోత్తము డగు
సర్వేశ్వరు జేరెడి గతిని
సర్వము తెలుపును ఈ అధ్యాయము
సంగరహితమే మూలమని ॥వా॥

తో॥ సర్వేశ్వరుడే సర్వ జీవులుగ
సర్వరూపముల తానాయె
సర్వాధారుని సర్వకాలముల
స్మరియించుట ధన్యంబాయె ॥వా॥

తో॥ ఈపురుషోత్తమ ప్రాప్తియోగమును
భోజన ప్రారంభము నందే
ఈశ్వర ప్రీతిగ పఠించి భుజించ
మంచిదనిరి పెద్దలు ముందే ॥వా॥

తో॥ సాత్వికాహార భోజనంబులతో
సత్పురుషుల సహవాసముతో
సాత్వికపు గుణమణి హారములతో
స్తుతించు గీతానందముతో ॥వా॥

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ 1

తా॥ మీదవేళ్లును క్రిందకొమ్మలు గలిగియున్న అవ్యయమగు వృక్షమును అశ్వత్థమని తెలిసినవారు చెప్పుచున్నారు. దానికి వేదములు ఆకులు. దాని నెరంగినవాడు వేదవేత్త యగును.

తే॥ అశ్వత్థంబను వృక్షమునకు మూ
లము యూర్ధ్వము శాఖలు క్రిందగ్
వేదంబులు యాకులు నగు దానిని
దెలిసిన వేదజ్ఞుండగును ॥వా॥

*తే॥ఊర్ధ్వమూలముగ శాఖలు క్రిందగు•అశ్వత్థంబనువృక్షమును
అవ్యయమనెదరు ఆకులు శ్రుతులగు•దానినెరుగ వేదజ్ఞుడగున్॥వా॥

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।
అధశ్చ మూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥ 2

తా॥ గుణములచే బలసిన కొమ్మలుగలది. విషయ చిగుళ్ళుగలిగి క్రింద మీద వ్యాపించినది. కర్మల రూపమును పొందిన దాని వేరులు పెద్దగ పెరిగి మనుష్యలోకమునకు పోయి నాటుకున్నది.

తే॥ గుణములచే శాఖలు బలసియును
విషయచిగుళ్ళును గలిగియును
ఊర్ధ్వముఖముగను అధోముఖముగను
వ్యాపించిన దీవృక్షంబున్ ॥వా॥

మూడు నాలుగవ పాదములకు తోహర.

*తే॥ అశ్వత్థంబను ఈ వృక్షమునకు•కర్మరూపమగు సంబంధం
అంతటబలిసిన వేరులచే ఈ•మనుష్యలోకంబును పొందున్॥వా॥

శ్లో॥ న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా ॥ 3

తా॥ అయితే ఈ వృక్షముయొక్క స్వరూపము తెలియబడదు. దీని అంతము ఆది స్థితి నెరుగుట దుర్లభము. దృఢమయిన వేళ్ళుగలిగిన అశ్వత్థ వృక్షమును (వైరాగ్య) అసంగమను శస్త్రముచే ఛేదించి.

తో॥ ఈ వృక్షపు రూపము ఆద్యంతము
స్థితి నెరుగుట బహు దుర్లభము
ఈ వృక్షపు వేరులు బహు దృఢములు
అసంగ శక్తిచె ఛేదనము ॥వా॥

*తో॥ ఈ సంసారము విడదీ సెరుగుట॰ఎట్టివారి కైనను కష్టం
ఈ సంసారము నిజమని తలచక॰యుండుటయె దీనికి నష్టం॥వా॥

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ 4

తా॥ అనంతరం ఏ స్థానమును పొందినవారు మరల జన్మమునరారో ఆస్థానము వెతుకవలయును. ఎవనివలన అనాదిసంసార ప్రవృత్తి విస్తరిల్లెనో అట్టి ఆదిపురుషుని శరణు పొందవలెను.

తో॥ ఏ పరమాత్మను పొందినవారికి
జన్మాదుల బాధలు లేదో
ఏ పరమేశ్వరు డాది పురుషుడో
ఆ దేవుని వెదుకగ రాదో ॥వా॥

*తో॥ఏమహా॰పురుషు సందర్శనమున॰ఏదుఃఖము ప్రాప్తముగాదో
ఏ మహా॰దేవు డన్నిటి కాదియొ॰ఆదేవుని శరణన రాదో ॥వా॥

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ ॥ 5

తా॥ మానమోహములనుంచి విడువబడినవారు, సంగదోషములు జయించినవారు, నిత్యము అధ్యాత్మచింతనలో స్థిరులు, నిష్కాములు, సుఖదుఃఖసంజ్ఞలుగల ద్వంద్వములచేత విడువబడినవారు, అమూఢులు అవ్యయపద మొందెదరు.

తో॥ మాన మోహములు విడచిన వారల
మోహము ఆత్మజ్ఞానమునన్
మనమున సంగపు దోషరహితులును
మూఢబుద్ధి విడచిన వారున్ ॥వా॥

*తో॥ కోరికేమియును సుఖదుఃఖములను
ద్వంద్వములను విడచిన వారున్
ధీరులయిన పుణ్యాత్ములు అవ్యయ
పదము పొందెదరు శాశ్వతమున్ ॥వా॥ ౫

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 6

తా॥ ఏ స్థానమును పొందినవారు మరల రారో, అదే నా ఉత్తమ స్థానము. దాని ప్రకాశింపచేయువారు సూర్యుడు కాడు. చంద్రుడు కాడు. అగ్నియు కాదు.

తో॥ ఎక్కడపోయిన మరలుట లేదో॥ఆయుత్తమ స్థానము నాది
అక్కడ సూర్యుడు చంద్రుడుఅగ్నియు॥ప్రకాశింప నక్కర లేదు॥వా॥

*తో॥ ఇన చంద్రాగ్నుల ఇంద్రాదుల ముని
బృందంబుల హృదయంబుల నే
పొందుగ ప్రకాశమును గావించియు
పోషించెడి వాడను గానే ॥వా॥ ౬

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః ।
మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7

తా॥ నాయొక్క సనాతనమైన అంశమే జీవలోకములో జీవుడుగా పుట్టి ప్రకృతిలోనుండు మనస్సహితమగు జ్ఞానేంద్రియములను తనపక్కకు లాగుచున్నాడు.

తో ॥ జీవలోకమున అనాదియగు నా
అంశమె జీవస్వరూపుడై
జ్ఞానేంద్రియముల చేరిన మానస
ప్రకృతిని లాగినవాడయ్యె ॥వా॥

*తో॥ నీ అంశజుడను నేనన్యుడనా
నీవానిగ చేయుము కృష్ణ
నీ అనుగ్రహామునే గోరెద విను
నీ నామము నిల్పుము కృష్ణ ॥వా॥ ౭

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥ 8

తా॥ ఈ ఈశ్వరుడనగ జీవుడు శరీరమును పొందునపుడును, విడుచునపుడును వాయువు (పుష్పము మొదలగు) పాత్రనుంచి గంధమును గొనిచనునట్లు వీటిని అనగ మనసు ఇంద్రియములను ఎత్తుకొనిపోవును.

తో॥ దేహాము జీవుడు చేరు నప్పుడును
దేహాంబును విడచెడి వేళ
ఇంద్రియముల గొని వెళ్ళును వాయువు
గంధంబును గొనిచను నటుల ॥వా॥

*తో॥ నిను మెడబాయని మానస మియ్యుము
నిను కనుగొను కన్నుల నిమ్ము
నీ కథవిను స్తోత్రము నా కొసగుము
నీ దాసుల స్నేహాము నిమ్ము ॥వా॥ ౮

శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ 9

తా॥ అయం - ఈజీవుడు త్వక్ చక్షుః శ్రోత్ర రసనా ఘ్రాణేంద్రియ పంచకమును మనస్సును అధిష్ఠించి విషయములను అనుభవించుచున్నాడు.

తో॥ జీవుడు శ్రోత్రము చక్షు స్పర్శన
రసనా ఘ్రాణము మనస్సును
వీటితో చేరియు శబ్దాదులను
విషయ భోగముల భోగించుచుక ॥వా॥

*తో॥ నీపాదంబులు కడిగిన తీర్థము
నా నాలుక పానము సేయ
నీకర్పించిన తులసీ పత్రము
నాసిక ఆఘ్రాణము చేయ ॥వా॥ ౯

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ 10

తా॥ ఈ ఆత్మ శరీరము విడుచునపుడు ఉన్నపుడు అనుభవించునపుడు గుణాయుక్తుడుగ నున్నపుడు మూఢులు తెలియజాలరు. జ్ఞానదృష్టిగలవారు నెరుగుదురు.

తో॥ జ్ఞానులు జీవుడు విడచెడి వేళను
ఉన్న వేళ భోగించు నెడ
గుణాయుతునిగ గందురు అజ్ఞానులు
తెలియగ జాలరు వీనియెడ ॥వా॥

*తో॥ అనుగ్రహించుము అచ్యుత వేడెద
నా ప్రార్థన లన్నియు దీర్చు
అనుదినమును నీనామము బలుకగ
నావాక్కునకును నియమించు ॥వా॥ ౧౦

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥ 11

తా॥ ప్రయత్నముచేయు యోగులు తమలో స్థితుడైయుండు ఆత్మను గనుగొనెదరు. సంస్కారబుద్ధిలేని అజ్ఞానులు ప్రయత్నపడినను ఈ ఆత్మను గనుగొనజాలరు.

తో॥ యత్నించిన యోగులు ఈ ఆత్మను
గనెదరు అంతఃకరణమునన్
యత్నించియు మూఢులు గనజాలరు
తమలోనుండెడి ఈ ఆత్మన్ ॥వా॥

*తో॥ లింగదేహమును చేరిన దేవర
నీరూపము బాగుగ నెరిగి
లింగపు సంగము నిపుడే విడచియు
నిజసుఖమును పొందుము యోగీ ॥వా॥ ౧౧

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12

తా॥ సూర్యునియందుండుకొని అఖిలజగత్తును ప్రకాశింపచేయు తేజస్సు, చంద్రునిలో నుండునది, అగ్నిలో వుండునది అదంతయు నా తేజస్సని యెరుంగుము.

తో॥ అఖిల జగత్తును వెలిగించెడి యా
ఆదిత్యుని ప్రభ చంద్రప్రభ
అగ్నియందు గల తేజము నంతయు
నాదని తెలియుము సూర్యనిభ ॥వా॥

*తో॥ సర్వాంతర్యామివి శ్రీకృష్ణ
సర్వకాలమును హరికృష్ణ
సర్వేశ్వర యని భజింతు కృష్ణ
సర్వాధారా హరికృష్ణ ॥వా॥ ౧౨

శ్లో॥ గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః॥13

తా॥ భూమిలో ప్రవేశించి నేను ప్రాణికోట్లను నా బలముచేత ధరించుచున్నాను. రసాత్మకుడైన చంద్రుడనై, సకలమైన ఓషధులను కాపాడుచున్నాను.

తో॥ భూమిలో చేరియు భూతము లన్నిటి
నాశక్తిచె నేధరించెదక
సోముడ నగుచును సర్వోషధులను
రసాత్మకత పోషించెదను ॥వా॥

*తో॥ తల్లితండ్రి తమ బిడ్డల ప్రేమతో
తగు వస్తువులచె కాపాడు
తరగతి సమస్త ప్రాణుల బ్రోచెడి
దామోదర నీసరి యెవడు ॥వా॥ ౧౩

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥ 14

తా॥ నేను వైశ్వానర రూపుడయిన అగ్నినై, ప్రాణుల దేహము లందుండుకొని ప్రాణాపానములచే కూడుకొన్నవాడనై, చతుర్విధములయిన (భక్ష్య భోజ్య లేహ్య పేయ) అన్నము పచనముచేయుచున్నాను.

తో॥ ప్రాణికోటులలో జఠరాగ్నియునై
వారి దేహముల చేరియును
ప్రాణాపాన సమాయుక్తుడనై
పచనము చేసెద అన్నమును ॥వా॥

*తో॥ చరాచరంబుల ధారణ చేయుచు
జీవనంబు కల్పించియు యీ
శరీరముల ఆహారము పచనము
చేసెద నంటివె యెంతదయా ॥వా॥ ౧౪

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥ 15

తా॥ నేను సర్వుల హృదయమందు అంతర్యామిగ నుండి స్మృతి, జ్ఞానము, మరుపు నానుండియే కలుగును. సమస్తవేదముల ముఖ్యముగ తెలియ వలసినవాడును నేనే. వేదాంత కర్తను నేనే. తెలిసిన వాడును నేనే.

తో॥ సర్వ ప్రాణుల హృదయ వాసుడను
స్మృతి జ్ఞానము మాంద్యము నాదే
సర్వవేదముల నన్నెరుగగవలె
సర్వోపనిషత్తులు నాదే ॥వా॥

*తో॥ బ్రతికి నందులకు పరమార్థంబును
బొందిన వాడే ధన్యుండు
బ్రతికియు వేదజ్ఞుని భజియించని (వేదవిత్)
పురుషుడు చూడగ మూఢుండు ॥వా॥ ౧౫

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16

తా॥ ఈ లోకములో క్షరుడని, అక్షరుడని ఇరువురు పురుషులు గలరు. క్షరుడనగ సర్వభూతములు. అక్షరుడనగ కూటస్థుడని పెద్దలవాక్యము.

తో॥ ఈ లోకంబున పురుషులు ఇరువురు
క్షరుడని మరి అక్షరు డనియు
ఈభూతము లన్నియును క్షరంబగు
కూటస్థుడె అక్షరు డనియు ॥వా॥

*తో॥ క్షరమగు ఇరువది నాల్గు తత్వములు॰అక్షరంబెకూటస్థుండు
క్షరాక్షరంబుల నిజ తత్వంబుల॰చక్కగ నెరుంగు ధన్యుండు॥వా॥

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ 17

తా॥ పురుషోత్తముడను మరొక పురుషుడు గలడు. అతడు పరమాత్ముడని పిలువబడును. నాశరహితుడయిన ఆ ఈశ్వరుడు ఈ మూడులోకములను నిండి ధరించుచున్నాడు.

తో॥ ఉత్తమ పురుషుడు మరియొక డుండును
పరమాత్ముడతం డనియుంచు
అతడవ్యయు డీశ్వరుడు లోకముల
మూటిని నిండియును భరించు ॥వా॥

*తో॥ మారెడి క్షర వస్తువులనునావను
అక్షరునకు తా ఉత్తముడు
పురుషోత్తముడని పరమాత్ముండని
పొగడబడును జగదీశ్వరుడు ॥వా॥ ౧౭

శ్లో॥ యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18

తా॥ నేను క్షరమునకు అతీతుడను, అక్షరునికన్నను ఉత్తముడను. కావున లోకమందును, వేదములయందును పురుషోత్తముడని ప్రసిద్ధిని పొందినాను.

తో॥ క్షరపురుషుని మీ రక్షర పురుషుని
కన్నను యుత్తము డనబడుదు
పురుషోత్తముడని ప్రపంచమందును
శ్రుతులను ప్రసిద్ధు డనవవుదు ॥వా॥

*తో॥ ఇరువది ఆరవ పురుషోత్తముండ
నిత్యనిరంజన నిష్కళుడ
ఇరువది అయిదవ అక్షర రూపుని
కన్నను ఉత్తమ పురుషుండ ॥వా॥ ౧౮

శ్లో॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత! ॥ 19

తా॥ భారత! అజ్ఞాన వర్జితుడై ఈ ప్రకారము పురుషోత్తముడయిన నన్ను ఎవడెరుగుచున్నాడో అట్టివాడు సర్వజ్ఞుడై సమస్త విధములచేత నన్ను భజతి - పొందుచున్నాడు.

తో॥ మోహవర్జితుడు సర్వజ్ఞుండై
పురుషోత్తము డని నను యెంచి
యూహించియు నను సర్వవిధంబుల
భారత భజించు ననుతలచి ॥వా॥

*తో॥ సర్వజ్ఞుండై సర్వభావములఽసర్వేశ్వరు డని నను యెంచి
సర్వకాలమును స్మరియించును ననుఽసర్వాధిప అనిమదితలచి॥వా॥

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయాఽనఘ! ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యా త్కృతకృత్యశ్చ భారత! ॥20

తా॥ అనఘ! భారత! మిక్కిలి రహస్యమయిన ఈ శాస్త్రము నాచేత చెప్పబడెను. ఈ ప్రకారము తెలిసికొన్న బుద్ధిగలవాడును కృతకృత్యుడగును.

తో॥ భారత రహస్యమగు నీ శాస్త్రము
పల్కితి పాపవిదూర విను
బాగుగ దీనిని నెరిగిన మనుజుడు
బుద్ధిమంతుడు కృతార్థుడగును ॥వా॥

*తో॥ ఎంత దయో పార్థునిపై కృష్ణఽసంతోషంబున శ్రీకృష్ణ
చింతలు దీరగ శ్రీహరి కృష్ణఽపల్కితి వంతయు శ్రీకృష్ణ॥వా॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
పురుషోత్తమ ప్రాప్తియోగో నామ
పంచదశోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## షోడశాధ్యాయము – దైవాసురసంపద్విభాగయోగము.

పల్లవి॥ వాసుదేవ జయ వాసుదేవ జయ ♦ వాసుదేవ జయ వాసుదేవ
వాసుదేవ జయ వాసుదేవ జయ ♦ వాసుదేవ జయ వాసుదేవ

తో॥ దైవానుగ్రహ మొందగ వలసిన
దైవీసంపత్తుకు తిరగు
దైవానుగ్రహ మొల్లక యుండిన
యాసుర సంపత్తున మెలగు ॥వా॥

తో॥ పరధనార్జనము పరసతి గమనము
పరహింసచే జీవించడము
పరద్రవ్యముచే పొట్ట పెంచడము
పాపపు నరకము పొందడము ॥వా॥

తో॥ పాపకృత్యముల పాపి జన్మములు
పొందుట చాలునో పరమాత్మ
పాపపు అసురీ పనిచాలింపుము
పాపహరణ ఓ పరమాత్మ ॥వా॥

తో॥ వస్తువు లన్నిటి వసియించెడి వో
వాసుదేవ ప్రార్థించెదము
వస్తువు లన్నిటి చూచిన నీవని
వాసుదేవ జ్ఞాపక మిమ్ము ॥వా॥

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః ।

దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥ 1

తా॥ భయములేకుండుట, శుద్ధమగు సాత్త్వికవృత్తి, జ్ఞానయోగ వ్యవస్థితి, దాతృత్వము, దమము, యజ్ఞము, స్వాధ్యాయము, తపము, ఆర్జవము.

తో॥ అభయము సత్త్వపు శుద్ధియు జ్ఞానపు

నిష్ఠయు ప్రీతిగ దానమ్ము

అర్జున ఇంద్రియ జయమును యజ్ఞము

స్వాధ్యాయము తప మార్జవము ॥వా॥

దైవీసంపత్తు గలవారల భాగ్యము.

*తో॥ నిను భజియించుచు నీకథ చదువుచు

నిర్జించిన ఇంద్రియు లగుచు

నీవారల సహవాసము చేయుచు

నిను తలతురు నిర్భయు లగుచు ॥వా॥ ౧

శ్లో॥ అహింసా సత్యమక్రోధ స్త్యాగ శ్శాన్తిరపైశునమ్ ।

దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥ 2

తా॥ అహింస, సత్యము, అక్రోధము, త్యాగము, శాంతి, అపైశునము, భూతదయ, అలోలత్వం, మృదుత్వము, సిగ్గు, చపలము లేకుండుట.

తో॥ హింసారహితము సత్యము పలుకుట

అక్రోధము త్యాగము శాంతి

పిశునత రహితము దయా మృదుత్వము

సిగ్గు చాపలము అలోలత ॥వా॥

*తో॥ విషయంబులు చేకూరిన యెడలను

ఇంద్రియ వికారములు లేక

పిశునత లేకను ప్రీతిగ నుండును

నినుస్మరించు చపలము లేక ॥వా॥ ౨

శ్లో॥ తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా ।
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత! ॥ 3

తా॥ తేజస్సు, ఓర్పు, ధైర్యము, శుద్ధి, ద్రోహములేకుండుట, గర్వ రహితము ఈ ఇరువది ఆరు గుణములు దైవీసంపత్తున పుట్టినవారికి ప్రాప్తమగును.

తొ॥ తేజము క్షమయును ధైర్యము శుద్ధియు
ద్రోహగర్వ రాహిత్యమును
దేవ యోగ్యమగు సంపద యందున
గల్గినవారికి ఇవి గల్గున ॥వా॥

*తొ॥ ఇరువది ఆరగు దైవీ గుణములు
ఇంపుగ గల్గిన మానవుడు
ఈశ్వరుండె సందేహ మెందులకు
ఇహలోకంబున మాన్యుండు ॥వా॥ 3

శ్లో॥ దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపదమాసురీమ్ ॥ 4

తా॥ పార్థ! డంభము, దర్పము, అభిమానము, క్రోధము, పరుషత్వము, అవివేకము ఈ గుణములన్నియు రాక్షసాంశమున పుట్టినవారల కుండును.

తొ॥ అభిమానము డంభము గర్వంబును
క్రోధము కఠినపు పల్కులును
అవివేకము ఈ ఆరు గుణంబులు
ఆసుర సంపద లనబడును ॥వా॥

*తొ॥ దురభిమానముల డంభ గర్వముల
దుశ్చింతలు గలిగియు చాల
దురాలోచనల దూరుచు పెద్దల
ద్రోహులు ఆసురి గుణంబుల ॥వా॥ ౪

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।
మా శుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ! ॥ 5

తా॥ దైవీ సంపత్తు మోక్షదాయకము, అసురీ సంపత్తు బంధమునకు కారణము. పాండవ! దైవీ సంపత్తున బుట్టినవాడవు. గాన చింతింపకు.

తో॥ దైవీసంపద మోక్షము నిచ్చును
నిర్బంధించాసుర మతము
దైవీసంపద నీ జన్మము విను
ధనంజయా చింతిల్లకుము ॥వా॥

*తో॥ మోహపోవుదురు రాక్షసాంశజులు
మోహము భక్తులకును చేసి
దోషరహితుడవు ధర్మానుజుడవు
దైవాంశలో పుట్టుట చేసి ॥వా॥ ౫

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు ॥ 6

తా॥ పార్థ! ఈ లోకమునందు దేవ అసురములను ఇరుతెరంగుల భూతసృష్టి గలదు. అందు దేవాంశము విస్తారముగ చెప్పితిని. రాక్షసమత మును చెప్పెద వినుము.

తో॥ ప్రపంచమున ప్రాణులకు జన్మమున
దేవాంశంబని అసురమని
ప్రబలును దేవాంశము చక్కగను
బలికెది ఆసుర యంశ విను ॥వా॥

*తో॥ పూర్వ జన్మమున పుణ్యార్జనమును
పొందుగ చేసిన దైవాంశ
పూర్వజన్మమున పాపపు పనులచె
పొందుదు రిప్పుడు అసురాంశ ॥వా॥ ౬

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7

తా॥ అసురాంశజులగు జనులు ఇది ప్రవృత్తి, అది నివృత్తి అను విచార మెరుగరు. శుచి వుండదు. ఆచారముండదు. సత్య మసలే వుండదు.

తో॥ బంధన విడుదల ఇట్టివి అనుచును
అసురాంశజులును అరయరుగా
బలుకుటబద్ధము శుచియును యెరుగరు
ఆచారము మొద లరయరుగా ॥వా॥

*తో॥ ధన్యత పొందెడి దారియు నెరుగరు
తగులుకొనెడి కార్యము లెపుడు
తప్పకచేతురు తహతహ పడుచురు
తామస రాజస గుణములెపుడు ॥వా॥ ౭

శ్లో॥ అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్ ॥ 8

తా॥ ఈ జగత్తు అసత్యమనియు, అప్రతిష్ఠిత (నిరాధార) మనియు, అనీశ్వరమనియు, స్త్రీ పురుషుల సంబంధమువలన గలిగినదనియు, కామమే హేతువు, మరేమి కాదని చెప్పుదురు.

తో॥ జగమసత్యమని నిరాధారమని
స్త్రీ పురుషులచే గలిగెనని
జగదీశ్వరు డెవ్వడు లేదనియును
కామమె మరేమి ఉన్నదని ॥వా॥

*తో॥ అసుర స్వభావు లాశకు లోబడి
అన్యాయముచే జీవింత్రు
అసత్యమగు మాటలు చెప్పుచుంద్రు
అసలు ఈశ్వరుడె లేడంద్రు ॥వా॥ ౮

శ్లో॥ ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9

తా॥ ఈ దృష్టి నవలంబించి నష్టాత్ములై అల్పబుద్ధిచే ఘోరకర్మలు చేయుచు లోకమునకు అనర్థమును కలిగించుచు నాశముకొరకే పుట్టుచున్నారు.

తో॥ ఈ దృష్టియు గలిగిన వారగుచును
తమ మానసమును చెడుపుకొని
బుద్ధిహీనతను లోకంబులకును
హింసా కార్యము సల్పుకొని ॥వా॥

*తో॥ సర్వత్రను నీవున్నా వనియెడి
సమబుద్ధియు నాకొసంగుము
సర్వత్రను నినుగనుగొనుచుండెడి
సమదృష్టియు వేగమె నిమ్ము ॥వా॥

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥

తా॥ ఎప్పటికి పూర్తిగాని కామమును ఆశ్రయించి దంభ మాన మదములతో కూడుకొని మోహమునకు లోబడి అశుచివ్రతులై అన్యాయార్జితమున ప్రవర్తింతురు.

తో॥ నింపుటకసాధ్యమగు కామంబును
దంభముమానము మదములచే
సొంపని మోహము అశుచియు చెందియు
పరధన మీడ్తురు దురాశచే ॥వా॥

*తో॥ అన్యాయ పరిగ్రహమును వదలియు
ఆడరాని మాటలు విడచి
అన్నికాలముల హరినీనామము
ఆడించుము ఇతరము మరచి ॥వా॥ ౧౦

శ్లో॥ చిన్తామపరిమేయాం చ ప్రళయాన్తాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ 11

తా॥ అట్టి ఆమరణాంతము లెక్కకు చిక్కని చింతలకు లోపడి కామోపభోగము లనుభవించుటే పురుషార్థమని భావించి నిశ్చయించి యుందురు.

తో॥ విషయ భోగములు అనుభవించవలె
వేరే యేమియు లేదనియుఁ
విషసమమగు భోగముల కొరకునై
చావువరకు పరితపించియుఁ ॥వా॥

*తో॥ వృద్ధుడయిన తాతను గని మనముడు
వివాహ మాడెదవా అనగా
వృద్ధుడయిన నా కెవ్వరు కన్యను
వాసగరనుచు తా వ్యథపడుగా ॥వా॥ ౧౧

శ్లో॥ ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్ ॥ 12

తా॥ నూరారు ఆశాపాశములలో చిక్కియు, కామక్రోధ పరాయణులై సుఖోపభోగములకుగాను అన్యాయముగ అర్థార్జనపరులగుదురు; దురుద్దేశమును చేతురు.

తో॥ ఆశాపాశ శతంబుల లోపడి
కామక్రోధ పరాయణులఁ
విషయ సుఖంబుల ననుభవించుటకు
కోరెద రన్యాయార్థమును ॥వా॥

*తో॥ యుక్తాహార విహారంబుల తన
శక్తికొలది కాలము గడపు
యుక్తమయిన ఆరోగ్య భాగ్యమున
భక్తిగ రాముని మది నిలుపు ॥వా॥ ౧౨

శ్లో॥ ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ 13

తా॥ ఇపుడింత ఆర్జించితి. ఇంకను నామనోరథము పొందెదను. ఈ ధనమంతయూ నా ఆస్తి. ఇకముందు ఇంతధనము నాకు లభింపగలదు.

తో॥ ఇంతార్జించితి ఇష్టము పొందెద
ఇంత ధనము ఇపుడున్నదిగా
ఇంతలో నిల్వను యింకా చేర్చెద
ఇది అది అంతయు నాదేగా ॥వా॥

*తో॥ ఈ ధనమంతయు నేనార్జించితి
యని మోహము బొందగ నేలా
ఈ ధనమంతయు ఇచ్చిన దేవుని
ఈశ్వరు మది దలపుము చాలా ॥వా॥ ౧౩

శ్లో॥ అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥ 14

తా॥ ఈ శత్రువు నాచే చంపబడెను. తక్కినవారిని సంహరించగలను. నేను ఈశ్వరుడను. నేను భోగిని. నే సిద్ధుడను. నేను బలవంతుడను. నేను సుఖవంతుడను.

తో॥ ఈ శత్రువు నాచే పడిపోయెను
తక్కిన వారల చంపెదను
ఈశుడ భోగిని సంపద్యుక్తుడ
సుఖినే బలవంతుడ నేను ॥వా॥

*తో॥ విరోధి చంపితి ఇంకా చంపెద
వీరుండని తను పొగడికొను
విరోధి షట్కము తను వంచింపగ
వీరుడనుటచే నేమగును ॥వా॥ ౧౪

శ్లో॥ ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥

తా॥ నేను ఆఢ్యుడ, నేను కులజుడ, నాకు సరిఅయినవాడెవడుండును? యజ్ఞములు చేసెద, దానమిచ్చెదను, సంతోషించెద నని అజ్ఞాన మోహితులగువారనుచున్నారు.

తో॥ ఆఢ్యుడ చక్కని కులజుడ నాతో
సమాను లెవ్వరు లేరనును
దండిగ క్రతువు లొనర్చెద దానము
లిచ్చెద సంతోషించెదను ॥వా॥

*తో॥ అజ్ఞానపు మోహమున బట్టుబడుచు
కర్తను నేనని భావించు
అహంకారమున నేను నేననుచు
అంధకారమున తనుమరచు ॥వా॥ ౧౫

శ్లో॥ అనేక చిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥ 16

తా॥ అనేక కల్పనల చిత్తవిభ్రాంతిపొంది మోహజాల సమావృతులై విషయ భోగములయందు మునిగియు అశుచియగు నరకమున పడెదరు.

తో॥ లెక్కలేని సంకల్ప భ్రాంతిచె
మోహజాలముల జిక్కియును
మిక్కుటమగు విషయంబుల సొక్కియు
పడుదురు ఘోరపు నరకమును ॥వా॥

*తో॥ సత్త్వగుణమొసగి సత్కర్మంబుల
సల్పగ చేయుము శ్రీకృష్ణ
భక్తోద్ధారక పరమేశ్వర హరి
పతితపావనుడ హరికృష్ణ ॥వా॥ ౧౬

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజన్తే నామ యజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్ ॥ 17

తా॥ తమ్ము తాము పొగడుకొనుచు, వినయవిహీనులగుచు, ధనమాన మదాన్వితులగుచు, దంభముఁగూడుచు, శాస్త్రోక్తవిధిమీరుచు, నామకార్థము యజ్ఞము చేయుచుందురు.

తో॥ తమ్మును తామే పొగడుచు స్తబ్ధత
ధనమాన మదాన్వితు లగుచు
దంభముచే యజ్ఞంబులు చేతురు
విధి పూర్వకమును ఏమరుచు ॥వా॥

*తో॥ నిఖిలంబులకును నీవె మూలమని
నీరీ తెరిగియు హరికృష్ణ
నిను నమ్మియు గతి నీవే యనియును
నిను తలచుట మేల్ శ్రీకృష్ణ ॥వా॥ ౧౭

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥ 18

తా॥ అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధములను పొంది తమ దేహములో అన్యుల దేహములో వుండు నన్ను ద్వేషించెదరు; అసూయ పడెదరు.

తో॥ దురహంకారము బలమును దర్పము
కామము క్రోధము లనుచేరి
తమదేహము పరదేహము లందును
నుండు నన్ను ద్వేషించెదరు ॥వా॥

*తో॥ అన్ని దేహముల లోపల వెలుపల
అంతట వెలిగెడి నను మరచి
అన్యులెవరో వేరున్న వారనుచు
అసూయ పడెదరు గర్వించి ॥వా॥ ౧౮

శ్లో॥ తానహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమా౯ ।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు ॥ 19

తా॥ అట్టి క్రూరుల ద్వేషస్వభావుల అశుభాచారులగు నరాధముల నిరంతరము సంసారమునందును, ఆసురీ యోనులందును క్షిపామి - ఉంచెదను.

తో॥ ద్వేషస్వభావు లగు క్రూరాత్ముల
నరాధములనే నెల్లపుడు౯
అశుభాచారుల అసురయోనుల
సంసారంబుల పడవేతు౯ ॥వా॥

*తో॥ ఏ మాత్రము సుఖమింత లేని ఈ
సంసారము నిజమని నమ్మి
ఎన్నో జన్మము లెత్తితి ఇదేనీ
దాపును చేరెద నినునమ్మి ॥వా॥ ౧౯

శ్లో॥ ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాంగతిమ్॥

తా॥ కౌంతేయ! ఆసురీగర్భములో బడిన ఈ మూఢులు జన్మజన్మము లోను నా ప్రాప్తి పొందక కొనకు అధోగతి పాలగుదురు.

తో॥ ఆసురయోనిలో పుట్టుచు గిట్టుచు
అవివేకులు ప్రతి జన్మమున
అధోగతిని పొందుచునే యుందురు
నను గనజాలరు గర్వమున ॥వా॥

*తో॥ వాసుదేవ విను భారము నీపై
వేసినాను శ్రీహరికృష్ణ
దాసుని కాపాడుట నీదేవిను
దాపు చేర్చు రాధాకృష్ణ ॥వా॥ ౨౦

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేత త్త్రయం త్యజేత్॥

తా॥ కామ, క్రోధ, లోభములను మూడును నరకమునకు ద్వారములు. వీటిచే ఆత్మ నాశనమొందును. గావున ఈ మూడుగుణములను విడువవలెను.

తో॥ కామము క్రోధము లోభము మూడును
తననాశనకారణము లగుచు
కావున నరక ద్వారము లగు నీ
గుణంబులను విడువందగును ॥వా॥

కామక్రోధలోభలక్షణములు:

*తో॥ కోరిక కోరుట యనునది కామము
విఘ్నము కలిగిన క్రోధంబు
కోరిక మేరకు దొరకిన వేగమె
దాచి పెట్టుటయె లోభంబు ॥వా॥ ౨౧

శ్లో॥ ఏతైర్విముక్తః కౌన్తేయ! తమోద్వారై స్త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్॥ 22

తా॥ కౌంతేయా! ఈ మూడువిధములు గల తమోద్వారమునుండి విముక్తుడయిన మనుజుడు తన శ్రేయస్సుకు కావలసినట్లు ప్రయత్నపడును. అనంతరం ఉత్తమమైన గతిని పొందును.

తో॥ కామము క్రోధము లోభము విడచియు
ఆత్మ శ్రేయో మార్గమును
నేమంబున నెరిగియును మోక్షమును
చెందునరుడు కౌంతేయ గను ॥వా॥

*తో॥ తమోద్వారముల దూరెడి మనుజుడు
తాపత్రయముల చిక్కబడు
తమో ద్వారములు మూడును విడచిన
తన శ్రేయస్సును పొందబడు ॥వా॥ ౨౨

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ 23

తా॥ యథేచ్ఛగా అనగ మనస్సునకు వచ్చినట్లు నడచి శాస్త్రవిధిని విడచి ఆచరించువాడు సిద్ధిని పొందజాలడు. సుఖమును పరతరమయిన గతిని పొందడు.

తే॥ శాస్త్రవిధిని గమనింపక మనుజుడు
నడుచునో తనయిష్టము వలెను
సిద్ధియు గానడు సుఖమును పొందడు
మోక్షము మొదలే పూజ్యమగుర ॥వా॥

*తే॥ భారతమును మరి భాగవతంబును॰మనుధర్మము రామాయణము
పఠించి పెద్దల ఆచరణంబును॰ఆచరించవలె అనవరతమ్॥ ॥వా॥ ౨౩

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥ 24

తా॥ కావున శాస్త్రములను ప్రమాణము లని నమ్మి శాస్త్రసమ్మతమైన కర్మలను శాస్త్రబాహ్యములైన కర్మలను నెరింగి శాస్త్రోక్తములైన కర్మలనే నీవొనర్చుట యోగ్యము.

తే॥ కావున శాస్త్రము ప్రమాణ మనుచును
కని శాస్త్రమునను బల్కినయా
కర్తవ్యాకర్తవ్యము లెరగియు
కర్మలు మంచివి సల్పుమయా ॥వా॥

*తే॥ తానెవరని తన ధర్మ మెట్టిదని॰తగ నెరుగుటకును శాస్త్రము లే
తగు ప్రమాణమని తగ నమ్మియు తా॰తగనడచిన తా ధన్యుడు లే॥వా॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసుర సంప
ద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## సప్తదశాధ్యాయము – శ్రద్ధాత్రయ విభాగయోగము.

పల్లవి: గోపాల జయ గోపాల జయ
గోపాల జయ గోపాల
గోపాల జయ గోపాల జయ
గోపాల జయ గోపాల

తో॥ శ్రద్ధావంతుడు జాగ్రతతోడను
జగమున మెలగుచు శ్రేష్ఠుడగుః
శ్రద్ధారహితుడు సోమరి తనమున
శ్రేష్ఠత లేకను హీనుడగుః ॥గో॥

తో॥సర్వ కర్మలును శ్రద్ధతో జేయుటఃశ్రేష్ఠంబని యెరిగియు కృష్ణ
సర్వులు ననెదరుఅందులో శ్రేష్ఠముచేయించుము నాచేకృష్ణ॥గో॥

భగవంతుని ఉత్తరము.

తో॥ సందేహము లెల్లను నే తీర్చెద
శ్రద్ధతోను విను ధనంజయ
సందేహము తీర్పును శ్రద్ధాత్రయ
విభాగయోగము వినుమయ్యా ॥గో॥

తో॥ మూడు విధంబులు శ్రద్ధలో వుండును
ముఖ్యమేది యని చింతించు
మూడు విధంబుల మేలగు నట్టిది
ముందుగ నీమది యత్నించు ॥గో॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వమాహో రజస్తమః॥

తా॥ శ్రీకృష్ణ! ఎవరు శాస్త్రవిధి విడచినను శ్రద్ధగలిగి పూజించెదరో వారల నిష్ఠ—అంటే నిలకడ (కొందరు శ్రద్ధాచారయుతులై యుందురు) ఎట్టిది? సాత్త్వికమా? రాజసమా? తామసమా?

తో॥ ఎవ్వరు శాస్త్రాచారము విడచియు
శ్రద్ధ గలిగి పూజించెదరో
యదుకుల నాయక వారల నిలకడ
సత్త్వము రజస్సు తామసమో ॥గో॥

*తో॥ శాస్త్రంబెరుగరు శ్రద్ధతో నుందురు
చేసెద రెప్పుడు కర్మలను
శాస్త్రమెఱంగియు చేసెడి కర్మలు
త్రిగుణంబుల లోనేదగును ॥గో॥ ౧

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥ 2

తా॥ ప్రాణిమాత్రులలో స్వభావజన్యమైన ఈ శ్రద్ధ మూడు విధములు గలది. సాత్త్వికము, రాజసము, తామసము అని. అది విను.

తో॥ ప్రాణుల స్వభావ మనుసరించియును
పుట్టును శ్రద్ధయు త్రివిధముగా
పాండుకుమారక సాత్త్విక మనియును
రాజస తామస మనియు విను ॥గో॥

*తో॥ అంత్యకాలమున త్రిగుణంబులలో
అభిమానము గల గుణంబునన్
ఆతడు పుట్టును అట్టి గుణంబున
అత్యంతము శ్రద్ధతో నుండు ॥గో॥ ౨

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత! ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః॥

తా॥ భారత! అందరియందును వారివారి సత్త్వమును అనగ సంస్కారము ననుసరించి శ్రద్ధగలుగును. మనుష్యుడు శ్రద్ధామయుడయివుండును. ఎవని శ్రద్ధ ఎట్లుండునో అట్లే అతడుండును.

తో॥ సంస్కారము రీతిగను శ్రద్ధయును
సర్వులకును గలుగుచు నుండు
స్వభావ మేగుణమందున చేరునొ
ఆ సంబంధము గలిగుండు ॥గో॥

*తో॥ భారత అందరి యందును వారల
పూర్వ జన్మవాసన వలెను
వారలు శ్రద్ధతో వర్తన చేతురు
వాటి గుణంబుల చేరియును ॥గో॥ 3

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥ 4

తా॥ సాత్త్వికులు అనగ సత్త్వగుణాధికులు దేవతలను గురించి పూజించెదరు. రాజసులు యక్షరాక్షసులను, నిలిచిన తామసులు ప్రేతభూతములను పూజించెదరు.

తో॥ దేవతలను సాత్త్వికు లర్చింతురు
యక్షరాక్షసుల రాజసులు
సేవింతురు భూతప్రేతంబుల
పూజింతురు తామస జనులు ॥గో॥

*తో॥ ఈశ్వర ప్రీతిగ దేవతార్చనలు
ఇష్టార్థము ఇంద్రాదులను
ఈశ్వర ధ్యానము నెరుగని వారలు
పోలేరమ్మ కాటేరులను ॥గో॥ ౪

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దమ్భాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥ 5

తా॥ అయితే అహంకార డంబములు గల జనులు కామరాగ బలముల కూడుకొని శాస్త్రవిరుద్ధమైన ఘోరతపస్సు చేతురు.

తో॥ కామరాగ బలములచే గూడియు
దంభాహంకారంబులతో
నేమముమరచియు శాస్త్రము విడచియు
తపింతు రతిగను ఘోరముతో ॥గో॥

*తో॥ పెద్దవారమని డంబము చూపుచు
పేదవారలను దూషించి
పెద్దపెద్ద అచారము మాదని
పెద్దల నిందింతురు మించి ॥గో॥ ౫

శ్లో॥ కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః।
మాం చైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్॥ 6

తా॥ శరీరములోనుండు భూతసముదాయమును శరీరాంతర్యామి అయిన నన్ను కృశింపచేయుదురు. అట్టివారలే అసురస్వభావులని యెరుంగుము.

తో॥ కఠినకర్మలచె పంచభూతముల
అంతర్యామియు అగు నన్ను
కృశింపచేయుచు తపస్సు చేతురు
అసుర స్వభావులు వారువిను ॥గో॥

*తో॥ పెద్దల పూజించెడి కరములు
పేదలయందు దయారసము
పెద్దల స్తోత్రము చేసెడి వాక్కును
పెద్దగ వేడెద నాకిమ్ము ॥గో॥ ౬

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ 7

తా॥ ఇంక ఒకరొకరికి ప్రియమయిన ఆహారమయితే మూడు విధములుగ నుండును. అయా జనుల యజ్ఞము, తపములు, అట్లే దానములు. వీటి భేదమును తెలిపెదను వినుము.

తొ॥ మూడు విధంబుల ప్రీతియు గలుగును
మనుజులకును గుణముల బట్టి
పాండుపుత్రవిను భోజనమును మరి
యజ్ఞ తపోదానము లట్లె ॥గో॥

*తొ॥ ఆత్మ స్వతంత్రుడు కావున గుణముల
అన్నిటి మార్పులు చేయ నగుణ
ఆత్మసోదరులు గుణముల మీరియు
ఆనందంబున నుండనగుణ ॥గో॥ ౭

శ్లో॥ ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।
రస్యాస్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః॥8

తా॥ ఆయుస్సు, సత్త్వము (సాత్త్వికవృత్తి), బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి వీటిని వృద్ధిపరచు రసవంతమౌ, చమురుగలవియు, మనోహరమైనది, స్థిరమయినదియునగు ఆహారములు సాత్త్వికులకిష్టములు.

తొ॥ ఆయుస్సత్త్వ బలారోగ్యంబులు
ఆనందము సుఖమును వృద్ధి
చేయు వస్తువులు సాత్త్విక ప్రియములు
రస్యాస్స్నిగ్ధా స్థిరాహృద్యా ॥గో॥

*తొ॥ రసవంతము జిడ్డును గలసినదియు
చెడు పాటేమియు లేనిదియు
వ్యసనాస్పదమేమియు గానిదియు
ఆహ్లాదాహారము వలయు ॥గో॥ ౮

శ్లో॥ కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ 9

తా॥ కారము, పులుసు, ఉప్పు, మిక్కిలి వేడి గలిగినవియు, చేదుగలది, దాహము గలిగించునది, ఎండినది, పరిణామమున రోగము దుఃఖము గలిగించు ఆహారము రాజసులకు ఇష్టమయినది.

తో॥ కార ముప్పు పులుసును మరి హెచ్చుగ
అనుభవించెదరు రాజసులు
కావున రోగము దుఃఖము శోకము
గలుగును మరి తాపకరములు ॥గో॥

*తో॥ కారమెచ్చు తినుటకు ప్రారంభము
కంటనీరు కారుట యున్న
కడుపులో మంటయు దుఃఖ శోకములు
కలిగించును రోగము లున్న ॥గో॥ ౯

శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10

తా॥ జాము కాలమయినది, రస రహితమయినది, దుర్గంధమయినది, పండి ఒకరాత్రి గడచినది, ఎంగిలి అయినది, అపవిత్రమయినదియునగు భోజనము తామసప్రియము.

తో॥ తామసు లతిప్రేమగను భుజింతురు
దుర్గంధము రసవర్జితము
అమేధ్య ముచ్ఛిష్టము చల్దన్నము
యాతయామ మగు భోజనము ॥గో॥

*తో॥ తామస ఆహారము బహుమాంద్యము
మరచు స్వభావము మరియున్న
ప్రమాదమాదిగ గల్గును గావున
మార్చుట మేలగు విరతమును ॥గో॥ ౧౦

శ్లో॥ అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ 11

తా॥ ఫలమందు కోరికలేక ముఖ్యముగ యజ్ఞము చేయవలసినదే అని సమాధాన చిత్తము గలిగి శాస్త్రవిహితముగ చేసిన యజ్ఞమునకు సాత్త్విక యజ్ఞమని పేరు.

తో॥ విధమేరకు యజ్ఞము చేయుగ వలె
ఫలమేమాత్రము కోరకను
విష్ణు ప్రీతిగ చేసిన యజ్ఞము
సాత్త్విక యజ్ఞము అనబడును ॥గో॥

సాత్త్వికుడు.

*తో॥ ఈశ్వరు డన్నియు ఇచ్చినాడనుచు
ఈశ్వర ధ్యానము చేయుచును
ఈశ్వర ప్రీతిగ యజ్ఞము చేసియు
ఈశ్వర కృప ఈడేరెనను ॥గో॥ ౧౧

శ్లో॥ అభిసంధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12

తా॥ ఫలోద్దేశ్యము గలిగియు, దంభార్థముగ చేయబడు యజ్ఞము భరతశ్రేష్ఠ! ఆ యజ్ఞమే రాజస యజ్ఞమని ఎరుంగుము.

తో॥ భరతసత్తమా ఫలమును కోరియు
ప్రతిష్ఠ కోరకయి యజ్ఞమును
నెరవేర్చిన అది రాజస మనబడు
హరి భజనయు లేనందునను ॥గో॥

రాజసుడు.

*తో॥ ధనవంతుడనని దంభార్థమునకు
దాశరథిచ్చిన ధనమనక
ధనవ్యయంబున చేసిన యజ్ఞము
రాజసమగు విను ఏమరక ॥గో॥ ౧౨

శ్లో॥ విధిహీనమసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13

తా॥ శాస్త్రవిధిని విడచి అన్నదానము లేక మంత్రశూన్యమై దక్షిణ సమర్పణలేక శ్రద్ధలేక చేసిన యజ్ఞము తామసమనబడును.

తో॥ శ్రద్ధలేక దక్షిణయును లేకను
అన్నదాన రహితంబుగను
శాస్త్రము మంత్రము తలచని యజ్ఞము
తామస యజ్ఞంబనబడును ॥గో॥

తామసుడు.

*తో॥ శాస్త్రంబులు పరిశోధించుటకును
చాలా కాలము కావలయు
శాస్త్రమనవసరము యజ్ఞము కాని
చెప్పిన విధి ముఖ్యంబనియు ॥గో॥ ౧౩

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 14

తా॥ దేవ బ్రాహ్మణ గురుప్రాజ్ఞుల పూజనము, శుచియు, ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింస ఇవన్నియు శరీరతపస్సని చెప్పబడును.

తో॥ దేవ ద్విజగురు ప్రాజ్ఞ పూజనము
దేహశుద్ధి నిష్కల్మషము
ఎవరిని హింసింపమి బ్రహ్మచర్య
శరీర తపస్సు ఇది వినుము ॥గో॥

*తో॥ బ్రహ్మ తత్వమును బాగుగ తెలిపిన
పరమగురువు పాదార్చనయు
బ్రహ్మ చర్యమును పాలించుటయును
ప్రాజ్ఞులగని పూజించుటయు ॥గో॥ ౧౪

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥15

తా॥ ఉద్వేగమును కలిగించని సత్యమైన, ప్రియమైన, హితమైన వాక్కులు, వేదాభ్యాసంబును వాచిక తపస్సని చెప్పబడును.

తో॥ ఇతరహింస కాస్పదమును లేనిది
యథార్థమగు ప్రియ వచనమును
హితమగు పలుకును వేదాభ్యాసము
వాచిక తపస్సు యనబడును ॥గీ॥

*తో॥ శ్రీనాయక నీనామ భజనయును
నీ చరిత్రములు చదువుటయు
నీ నామము భజియించు భక్తులకు
నీతి శాస్త్రములు బలుకుటయు ॥గీ॥ ౧౫

శ్లో॥ మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానసముచ్యతే ॥ 16

తా॥ మనస్సును ప్రసన్నముగ నుంచుకొనుట, సౌమ్యభావము, మౌనము, మనోనిగ్రహము, భావసంశుద్ధి ఇవి మానసతపస్సు అని చెప్పబడును.

తో॥ మనసు ప్రసన్నత శాంతియు నొందుట
మనో నిగ్రహము గలిగియును
మౌనము భావము శుద్ధియు నొందుట
మానస తపస్సు అనబడును ॥గీ॥

*తో॥ కరతాళము వేయుచు కృష్ణాయని (కాయిక)
కీర్తన చేయుట శ్రీకృష్ణ (వాచిక)
హరినారాయణ అని స్మరించుటయు (మానసిక)
కరుణతో నొసగుము హరికృష్ణ ॥గీ॥ ౧౬

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః।
అఫలాకాఙ్క్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17

. తా॥ పై వివరించిన మూడు విధములయిన తపస్సులను జనులు ఫలాకాంక్షలేక ఉత్తమ శ్రద్ధతో యోగయుక్తులై ఆచరించినట్లయితే దానిని సాత్త్విక తపస్సని పిలచెదరు.

తో॥ ఫలమును కోరక భక్తి శ్రద్ధల
త్రివిధ తపస్సులు యోగమునన్
భగవత్ప్రీతిగ నాచరించి నను
సాత్త్విక తపస్సు లనబడును ॥గో॥

*తో॥ భగవదనుగ్రహ భక్తి యోగమున
భగవత్ప్రీతిగ త్రివిధములౌ
భగవత్సేవలు బాగ నడపమని
భగవంతుని ప్రార్థించవలె ॥గో॥ ౧౭

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥ 18

తా॥ తమకు సత్కారము మానము పూజలు కావలయునని డంభమునకుగాను చేసిన చంచలము మరియు అస్థిరము అయిన తపస్సును రాజస తపస్సని పేరు.

తో॥ సత్కారము మానము పూజలకై
దంభము చేతను తపస్సును
సల్పిన యది నిలువదు చంచలమౌ
రాజస తపస్సు యనబడును ॥గో॥

*తో॥ పరులవలన పూజింపబడుటకును
పరధనాప హారణంబునకున్
పరమ యోగి అని తపస్సు చేసిన
పట్టుగ నుండదు పడిపోను ॥గో॥ ౧౮

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥ 19

తా॥ మూఢ తలంపుచేత ఇతరుల హింసించుటకై తనకు దుఃఖకరముగ ఆగ్రహమున చేసిన తపస్సు తామస మనబడును.

తో॥ అవివేకపు ఆగ్రహమ్ము వలనను
పరులకు బాధయూ గలిగించు
ఆత్మకు పీడా కరముగ చేసిన
తపంబు తామస మనిపించు ॥గో॥

*తో॥ తపమీవిధమున త్రివిధంబనుచును
త్రికరణ శుద్ధియు పలికితివి
త్రివిక్రమా పార్థునిపై గలదయ
దీనునిపై నిడు విను మనవి ॥గో॥ ౧౯

శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥

తా॥ దానము చేయుటయే అవశ్యమని ఏదేశము, ఏకాలము, ఏపాత్ర, ఏ దానము మంచిదని ఎరంగి ఉపకారము చేసినవారని తలంచక చేసినదానము సాత్త్విక మనబడును.

తో॥ దేశకాల పాత్రలను దెలిసియును
తలంపకను యుపకారమ్ము
దాన మిచ్చుటయె యుత్తమ మనుచును
ఇచ్చెడి దానము సాత్త్వికము ॥గో॥

*తో॥ బ్రహ్మజ్ఞానము బాగుగ నెరగిన
బ్రాహ్మణోత్తముని పూజించి
బ్రహ్మార్పణమని భక్తితో నిచ్చుట
బాగు సాత్త్వికంబని యెంచి ॥గో॥ ౨౦

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21

తా॥ అయితే ప్రత్యుపకారము అనియో, అథవా ప్రత్యుపకారము అగునని యో ఇచ్చిన హీనమయిన అనగ మనః క్లేశముగల దానము రాజస మనిపించును.

తత్త్వ॥ ముందుపకారము చేయుననుచు ఫల
ముద్దేశ్యముతో దానమును
మనసున వ్యథ నొందుచు చేసిన యది
రాజస దానంబనియు విను ॥గో॥

*తత్త్వ॥ ఆనాడిచ్చిరి ఈనాడిచ్చెద
అని మనసున తా చింతించి
ఏ నాటికి నేనిచ్చిన దానము
మానక ఫలించు ననియెంచి ॥గో॥ ౨౧

శ్లో॥ అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥ 22

తా॥ దేశకాలము ననుసరించక అపాత్రలో అనాదరణచే అథవా మానఖండనచేసి అయోగ్యస్థలమున ఇచ్చిన దానము తామస మనబడును.

తత్త్వ॥ అపాత్రయందున అకాలంబునను
అయోగ్యమగు స్థానంబునను
అనాదరంబున ఇచ్చిన దానము
అదియే తామస మనబడును ॥గో॥

*తత్త్వ॥ అన్యాయార్జిత మన్యాయంబుగ
అయోగ్యులగు దుర్మార్గులకు
ఆయాసంబున అనాదరణతో
అందిత్తురు అవమానముకు ॥గో॥ ౨౨

శ్లో॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23

తా॥ బ్రహ్మను యెరుగుటకు ఓం తత్ సత్ అను ప్రకారములు త్రివిధ నామోచ్చారణములు ఉచ్చరింపబడినది. ఆ బ్రహ్మమువలన తొల్లి బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు ఉత్పన్నమయినవి.

తో॥ బ్రహ్మ నెరుగుటకు ఓం తత్ సత్ అను
త్రివిధములని జ్ఞానులు యనిరి
బ్రహ్మనుండి బ్రాహ్మణులు వేదములు
యజ్ఞంబులు సృష్టియు నయిరి ॥గో॥

*తో॥ విద్యనేర్చి వేదములు చదువుటకు
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు
విధి వున్నను పూర్వభాష చదువరు
విషయ భోగముల ముచ్చటకు ॥గో॥ ౨౩

శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24

తా॥ ఆ హేతువువల్ల శాస్త్రరీత్యా యజ్ఞదాన తపఃక్రియలు బ్రహ్మవాదులు ప్రారంభించునపుడు శ్రీ ఓంకారమును ప్రథమమున ఎల్లప్పుడు పలుకుచున్నారు.

తో॥ ఆ హేతువుచే యజ్ఞదాన తపః
క్రియలను శాస్త్ర విధానోక్తి
బ్రహ్మవాదులు ప్రయత్నించు నెడ
ఓం అని పలికెద రతియుక్తి ॥గో॥

*తో॥ సర్వకాలమును సత్క్రియ లన్నియు
జరుగ బడెడి ఆరంభములో
సర్వేశ్వర నీ స్వరూప ప్రణవము
బ్రహ్మవాదు లనెదరు త్వరలో ॥గో॥ ౨౪

శ్లో॥ తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥ 25

తా॥ అట్లనే ముక్తిని కోరువారు అనేక యజ్ఞదాన తపమ్ము లొనర్చు సమయమున తత్ అను బ్రహ్మనామమూ నుచ్చరించుచు నిష్కాములై చేయు చున్నారు.

తే॥ మోక్షాపేక్షులు ఫలమును కోరక
యజ్ఞదాన తపఃక్రియ లెల్ల
దీక్షతో జేతురు తత్తను బ్రహ్మము
నుచ్చరించి భక్తితో చాల ॥గో॥

*తే॥ మంచి యజ్ఞములు మంచి దానములు
మూడు విధంబుల తపస్సులు
మంచివి అగు నానా క్రియలన్నియు (వివిధాః)
తత్ అనియే చేతురు క్రియలు ॥గో॥ ౨౫

శ్లో॥ సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే ॥ 26

తా॥ సద్భావే - కద్దనుట యందును, సాధుభావమందును సత్ అనెడి పదము ప్రయోగింపబడును. అట్లనే ప్రశస్తమయిన కర్మమందును సచ్ఛబ్దము పార్థ! ప్రయోగింపబడును.

తే॥ సద్భావంబున సాధుభావమున
సత్తను పదము ప్రయోగపడు
సత్తను శబ్దము ప్రశస్త కర్మల
పాండవమధ్యమ బలుకబడు ॥గో॥

*తే॥ సత్ అనుశబ్దము పరబ్రహ్మమగు
సత్కార్యంబులు సద్విషయం
సత్సాంగత్యము సద్గ్రంథపఠన
సత్కర్మలు సద్బోధ సుఖం ॥గో॥ ౨౬

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ 27

తా॥ యజ్ఞము, తపము, దానము వీటిలో స్థితి అనగ స్థిరభావన ఉండేదానివల్లను సత్ అని చెప్పబడును. యజ్ఞాది కర్మలకై చేయబడు కర్మలను సత్తని పేరు.

తో॥ యజ్ఞమునందును తపసు దానములకలిగిననిష్ఠయె సత్తగును
భగవత్ప్రీతిగచేయు కర్మయునుసత్తనియే చెప్పగబడును ॥గో॥

*తో॥సద్వృత్తియు సత్పురుషులుసద్గతిసద్వ్యాపారము సచ్చరితం
సద్గృహస్థులును సద్విద్యయనుటసాకేతాధిపు సన్నామం ॥గో॥

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28

తా॥ శ్రద్ధలేని హవనము, దానము, తపస్సు, అథవా వేరేకర్మలు అన్నిటికి అసత్తని పేరు చెప్పినారు. పార్థ! ఆ కర్మము ఇహలోకమందును, పరలోకమందును సుఖకరములు గావు.

తో॥ శ్రద్ధలేని దానంబు తపంబును
హోమము అసత్తు అనబడును
అది ఇహపరలోకంబుల రెంటిలో
ఫలమివ్వదు యోపార్థ విను ॥గో॥

*తో॥ శ్రద్ధాభక్తియు లేని కార్యములు
ఎన్నిచేసినను ఏమిఫలం
శ్రద్ధాభక్తితో చేసిన కార్యము
ఇహపర లోకంబులను సుఖం ॥గో॥ ౨౮

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
శ్రద్ధాత్రయ విభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

# గీతా సంగీతము

## అష్టాదశాధ్యాయము — మోక్షసన్న్యాసయోగము.

---

పల్లవి: గోవింద జయ గోవింద జయ
గోవింద జయ గోవింద
గోవింద జయ గోవింద జయ
గోవింద జయ గోవింద

తో॥ జ్ఞాపకార్థముగ కడచినట్టి యా జ్ఞానభక్తి వైరాగ్యములన్
జ్ఞానాపేక్షకుడగు పార్థునకును జ్ఞాపకంబు చేయగబూనన్ ॥గోవింద॥

తో॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులయిన మరి
శూద్రాదులలో నెవరయినన్
బ్రహ్మచారులే మొదలగు నాలుగు
ఆశ్రమవాసులు నయిన విను ॥గోవింద॥

తో॥ త్యాగియు నైనను సన్న్యాసైనను
తాత్విక దృష్టితో చూడగను
తర్కవాదములు నన్ని మరచి ఆ
త్మారాముని ధ్యానింపవలెన్ ॥గోవింద॥

తో॥ అన్నిటి కాధారుండవు నీవని
అన్ని శాస్త్రముల కథలువిని
అన్నియు నీవే అని వేడితిని
ఆదరించు నీ సేవకుని ॥గోవింద॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశినిషూదన! ॥ 1

తా॥ మహాబాహువులుగల హృషీకేశ! సన్న్యాస తత్త్వమును త్యాగము యొక్క తత్త్వమును వేరువేరుగ తెలియగోరెదను. కేశిదానవారి! తెలుపుము.

తో॥ సన్న్యాసము త్యాగము లక్షణములు
శ్రీకృష్ణ వేర్వేరుగను
హృషీకేశ దెలుపుము దయతోడను
మహాబాహు విన గోరెదను ॥గోవింద॥

*తో॥ సర్వకర్మ ఫల త్యాగము మేలో
సన్న్యాసాశ్రమమే మేలో
సర్వేశ్వర యెట్లుండుట మేలో
సర్వాధిప త్యాగమె మేలో ॥గోవింద॥ ౧

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 2

తా॥ కామ్యకర్మల వదలుట సన్న్యాసమని పండితులు ఎరుగుచున్నారు. సర్వకర్మ ఫలత్యాగమే త్యాగమని వివేకులు తెలియుదురు.

తో॥ ఫలాశ కర్మల విడుపు సన్న్యాసం
బని యెరుంగుదురు పండితులు
ఫలత్యాగమే త్యాగంబనుచును
బలికెదరు వివేకపు నరులు ॥గోవింద॥

*తో॥ ఫలమును కోరెడి కర్మలు వదలుట
పండితులనెదరు మేలనియు
ఫలమును కోరక కర్మలు చేయుట
మేలందురు త్యాగంబనియు ॥గోవింద॥ ౨

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥ 3

తా॥ కొందరు పండితులు అన్నికర్మలు దోషయుక్తములే కాన సన్న్యసించవలయునని చెప్పుదురు. మరి కొందరు యజ్ఞదాన తపస్సులను కర్మలు విడువకూడదని చెప్పుదురు.

తో॥ దోషముతో చేరినవే కర్మలు
త్యాజ్యమనుచు కొందరు అనిరి
దానము యజ్ఞము తపఃకర్మలను
కొందరు చేయుచు నుండనిరి ॥గోవింద॥

*తో॥ పుట్టువాదిగను పొయ్యే వరకును
పృథివి పయిన సంచారమగు
పృథివి పయిన గల క్రిమికీటకముల
బాధించుట తప్పక కలుగు ॥గోవింద॥ 3

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ! ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః ॥ 4

తా॥ భరతసత్తమ! త్యాగముయొక్క విషయమయి నా నిశ్చితమయిన మతమును తెలిపెదను వినుము. పురుషశ్రేష్ఠ! త్యాగమనునది మూడు ప్రకారములుగ చెప్పబడినది.

తో॥ భరతసత్తమ త్యాగ విషయమున
బల్కెద విను నా నిశ్చయము
పురుషశ్రేష్ఠుడ త్యాగ మనునదియు
మూడు విధంబులు ఇదిగనుమా ॥గోవింద॥

*తో॥ భరతకులోత్తమ త్యాగ లక్షణము
బల్కెదను వినుము విచిత్రము
పురుషవ్యాఘ్రమ నా నిశ్చయంబు
పరమదుర్లభము పవిత్రము ॥గోవింద॥ ౪

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5

తా॥ యజ్ఞదాన తపోరూప కర్మలు అవశ్యము చేయవలసినదే విడువరాదు. యజ్ఞము, దానము, తపము పండితులకు పవిత్రము లయినవి. (చిత్తశుద్ధి గలిగించును.)

తో॥ యజ్ఞము దానము తపఃకర్మములు
విడుచుట నొప్పదు చేయదగుఁ
యజ్ఞము దానము తపఃకర్మములు
పండితులకు పావనములగుఁ ॥గోవింద॥

*తో॥ పావన కర్మలయందు కృష్ణునకు
ప్రేమ యెంతో శ్లోకార్థమున
పలికియు రెండవ శ్లోకార్థంబున
పలికెను దీర్ఘముగను మరలఁ ॥గోవింద॥ ౫

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్ ॥ 6

తా॥ అందుచే పార్థ! పూర్వోక్తకర్మలను కర్తృత్వాభిమాన సంగము లేక ఫలమందాశలేక సత్కర్మలు చేయవలసినదే అని నా నిశ్చితమయిన ఉత్తమాభిప్రాయము.

తో॥ చేసెదనను అభిమానము లేకను
చేసిన ఫలమును కోరకను
చేయుదగినదని పార్థ కర్మలను
చేయుట యుత్తమ మనబడును ॥గోవింద॥

*తో॥ ఈశ్వరు డిచ్చిన ఇంద్రియంబులని
ఈశ్వరు డిచ్చిన ధనంబని
ఈశ్వరప్రీతిగ కర్మ చేతునని
ఈశ్వరాజ్ఞనే మఱువనని ॥గోవింద॥ (నిశ్చితం) ౬

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥ 7

తా॥ నియతమైన కర్మసన్న్యాసము చేయుట ఉచితముకాదు. మోహముచే కర్మపరిత్యాగముచేసిన తామస మనిపించుకొనును.

తొ॥ నియత కర్మలను మోహము చేతను
నేమముగను తాచేయనిచో
నట్టి త్యాగమును తామస మందురు
నిత్య కర్మలను వదలినచో ॥గోవింద॥

*తొ॥ ఈశ్వర భక్తితో కర్మ చేయవలె
ఈశ్వరు నెప్పుడు తలచవలె
ఈశ్వరాజ్ఞయె శాస్త్రంబనవలె
ఈశ్వర భజనతో మునగవలె ॥గోవింద॥ 2

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥8

తా॥ ఇది దుఃఖమయిన పని, దీనినుండి దేహమునకు ఆయాసమే అగును, సుఖములేదని భీతినుండి చేసిన కర్మత్యాగము రాజస త్యాగ మనిపించును. ఆ కర్మఫలత్యాగము వానికి దొరకదు.

తొ॥ శరీరమునకును ఆయాసంబని
సత్కర్మల తా వదలినను
కర్మఫల త్యాగము తనకబ్బదు
రాజసత్యాగం బనబడును ॥గోవింద॥

*తొ॥ సత్కర్మలు తాచేయుట మానిన
దుష్కర్మలు తప్పక నగును
దుష్కర్మలచే నరకము గావున
సత్కర్మలు సల్పుము నాయన ॥గోవింద॥ ౩

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున! ।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః ॥ 9

తా॥ అర్జునా! ఇది చేసియే తీరవలసిన కార్యమని నమ్మి (శాస్త్ర) నియతమయిన కర్మమును నేను చేసితిననెడి అభిమాన సంగములేక కర్మ చేసి ఫలాశను విడచిన త్యాగమును సాత్త్వికత్యాగమందురు.

తో॥ శాస్త్ర సమ్మతంబగు ఈకర్మము
శ్రద్ధతో చేయగ వలయునని
చేసెడి గర్వము ఫలమును విడచియు
చేసిన సాత్త్విక త్యాగముగ ॥గోవింద॥

*తో॥ హృదయ పీఠమున నుండియు నాచే
నడిపించిన కర్మము కృష్ణ
నీదేగద గర్వము నాకెందుకు
ఫలమును నీదే హరికృష్ణ ॥గోవింద॥

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ 10

తా॥ ఛిన్నసంశయుఁడు సత్త్వశీలుడు అయిన మేధావి ఇది అకుశల కర్మ అని ద్వేషించడు. కుశల కర్మ అని దానియందాసక్తి యుంచడు. అతడే త్యాగి.

తో॥ సాత్త్వికుడగు మేధావియు సంశయ
రహితుడగుచు సుఖదుఃఖములు
మఱితలచక సత్కర్మలు చేయును
తలచునెపుడు హరి నామములు ॥గోవింద॥

*తో॥ కుశలాకుశలపు కర్మలివి యనుచు (అకుశలం కుశలే)
సుఖదుఃఖంబుల తలపకను
కుశలవ మాతాపితృల తలచును
సుఖమిదియే యను నిరతమును ॥గోవింద॥ ౧౦

శ్లో॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥ 11

తా॥ దేహధారికి నిశ్శేషముగ కర్మత్యాగము చేయుటకు శక్యమయిన మాటకాదు. అందుచే ఎవడు కర్మఫల త్యాగము చేయునో అతడే త్యాగిఅని అనిపించుకొనును.

తో॥ దేహధారికిని సర్వ కర్మముల
త్యజించుటకు దుర్లభ మగును
దేహధారి కర్మఫలము త్యాగము
చేయుటచే తా త్యాగియగుగా ॥గోవింద॥

*తో॥ యెవనిలో సమస్త భూతోత్పత్తియు
యెవనిలో వృద్ధియు పొందినదో
యెవనిలో వుపశాంతియు పొందునో ఆ
యశోద తనయుడె గతిగాదో ॥గోవింద॥ ౧౧

శ్లో॥ అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12

తా॥ అనిష్టము, ఇష్టము, మిశ్రము అని త్రివిధమయిన కర్మఫలము మరణానంతరము కర్మఫలము త్యజించనివారలను బొందుచున్నది. కర్మఫల త్యాగము చేసినవారలను ఆ ఫలము పొందదు.

తో॥ కర్మఫల త్యాగమ్మును జేయని
వారికి జన్మాంతరమునను
కర్మపు ఇష్టమనిష్టము మిశ్రము
కలుగును త్యాగికి విడుదలగుగా ॥గోవింద॥

*తో॥ అభిమానియు తాచేసిన కర్మల
ఆశకులోనై త్రివిధఫలం (త్రివిధం)
అనుభవించుటకు జన్మల నొందును
ఆ త్యాగికి శూన్యము జన్మం ॥గోవింద॥ ౧౨

శ్లో॥ పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ 13

తా॥ మహాబాహో! సమస్తకర్మల సిద్ధికొరకు సాంఖ్యుల సిద్ధాంతములలో చెప్పిన ఐదు కారణములు చెప్పెద వినుము.

తొ॥ ఓ మహాబాహు ఐదు కారణము
లుండును కర్మపు సిద్ధికినై
నా మాటయు విను సాంఖ్యశాస్త్రమున
సిద్ధాంతంబున నిర్ణయమై ॥గోవింద॥

*తొ॥ లోకంబున నే కార్యంబయినను
నెరవేరుటకును పార్థ విను
సాంఖ్యుల సిద్ధాంతంబున చెప్పిన
ఐదు కారణము లుండవలెగా ॥గోవింద॥ ౧౩

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥ 14

తా॥ దేహము అభిమాని జీవుడు ఆయా ఇంద్రియములు ప్రాణాది వాయువులు వ్యాపారము దైవము ఇట్లు ఐదుకారణములు.

తొ॥ దేహము కర్తయు వేరువేరు ఇం
ద్రియములు వివిధ వాయువుల
వ్యాపారంబులు అయిదవదగు దై
వంబును జేరియు కారణముల్ ॥గోవింద॥

*తొ॥ దేవ దేవ నీదాస దాసుడగు
సంజీవ నారాయణ దాసుని
దేహంబున నివసించియు గీతా
సంగీతము వ్రాయింతునని ॥గోవింద॥ ౧౪

శ్లో॥ శరీరవాఙ్మనోభిర్య త్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః॥ 15

తా॥ శరీరముతో వాక్కుతో మనస్సుతో మనుష్యుడు చేసెడి మంచి చెడ్డ కార్యము లన్నిటికి ఈ ఐదే కారణములు.

తో॥ శరీర వాఙ్మనములచే కర్మలు
శాస్త్రోక్తంబులు అయినవియు
శాస్త్రయుక్తములు కానివి అయినను
అయిదు కారణములని తెలియు ॥గోవింద॥

*తో॥ దేహ వాఙ్మనో కర్మంబులచే
దీనుని హృదయంబున నిలచి (కర్మ ప్రార
దేహ పవిత్రత పొందగ గీతా భతే నరః)
సంగీతంబును పలికించి ॥గోవింద॥ ౧౫

శ్లో॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।
పశ్యత్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః ॥ 16

తా॥ ఇట్లు ప్రతికర్మకు ఐదుకారణము లుండగ శాస్త్రసంస్కారము లేనిబుద్ధిగలవాడు నేనొకడే కర్తనని భావనచేయును. అట్టివాడే దుర్మతి.

తో॥ చక్కని శాస్త్రజ్ఞానము లేకను
చపలత కర్మకు కర్తనను
చక్కగ బుద్ధియు లేకుండిన విను
చక్కని దుర్మతి యనబడును ॥గోవింద॥

*తో॥ నీ భక్తుల హృదయంబున నిలచియు
గీతా సంగీతము బాగా
నీ భక్తులు కృతకృత్యులు గాగను
నుడివించితి నెంతయు వేగా ॥గోవింద॥ ౧౬

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాఽపి స ఇమాన్లోకా న్న హన్తి న నిబధ్యతే॥ 17

తా॥ నేనే చేసెదనను అహంకారభావన లేనివాడు లిప్తముగాని బుద్ధిగలవాడు ఈ లోకమంతయు చంపినను చంపినవాడనరాదు. ఆ కర్మము అతని బంధన చేయజాలదు.

తో॥ నేనను భావము యెవనికి లేదో
ఎవనిబుద్ధి లేపము లేదో
జనుల నందరిని ఆతడు జంపిన
హత్యగాదు బంధము లేదు ॥గోవింద॥

*తో॥ నీ దాసుని బ్రోవంగను గీతా
సంగీతంబును పలికించి
నీ భక్తుల ధన్యతకై గీతా
సంగీతంబును నుడివించి ॥గోవింద॥ ౧౭

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః॥ 18

తా॥ జ్ఞానము జ్ఞేయము జ్ఞాతృవు అని మూడు విధములు కర్మవిధులు. కరణం కర్మ కర్త అను మూడు విధములు కర్మ సంగ్రహములుగ నున్నది.

తో॥ జ్ఞానము జ్ఞేయము పరిజ్ఞాతఅని
త్రివిధంబులు కర్మపు తెలివి
కరణము కర్మము కర్తృత్వంబును
ఇవియును మూడై నిలచినవి ॥గోవింద॥

*తో॥ ఉభయుల నందరి ఉద్ధరించితివి
ఉభయుల హృదయంబుల నిలచి
ఉత్తర గర్భజు ఉద్ధరించుగతి
ఉత్తమ పురుష నను్ధరించు ॥గోవింద॥ ౧౮

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥ 19

తా॥ జ్ఞానమును, కర్మమును, కర్తయును సత్త్వరజస్తమోగుణ భేదములచే నొకటొకటి మూడుమూడు రూపములు గలదిగ కాపిల సాంఖ్య శాస్త్రములో చెప్పినది వినుము.

తో॥ జ్ఞానము కర్మము కర్తయు త్రిగుణపు
భేదంబులు విను వలికెదను
సాంఖ్యశాస్త్రమున బల్కిన రీతిని
మూడు మూడు భేదంబు లగుగా ॥గోవింద॥

*తో॥ గీతా సంగీతంబును ముద్దుగ
గానము చేతురు సాత్త్వికులు
గీతా సంగీతంబును నిర్మల
బుద్ధితో విందురు సాత్త్వికులు ॥గోవింద॥ ౧౯

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20

తా॥ వేరవేర అయివుండే సర్వభూతములలో అవిభక్తమై అవ్యయమై ఏకమైన పరబ్రహ్మమును చూచెడి అతనిజ్ఞానము సాత్త్వికమని ఎరుంగుము.

తో॥ సర్వభూతముల విడివిడి లేకను
అఖండ మవ్యయ మొకటిగను
సర్వరూపమగు బ్రహ్మము నెరిగెడి
జ్ఞానమె సాత్త్విక మనబడును ॥గోవింద॥

*తో॥ వేరువేరుగను నుండు భూతముల
వేరులేక నుండును బ్రహ్మం
వేరులేని పరబ్రహ్మను నెరిగెడి
వారి జ్ఞాన ముత్తమ జ్ఞానం ॥గోవింద॥ ౨౦

శ్లో॥ పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21

తా॥ సర్వభూతముల భేదముల పాటించి అట్లనే సమస్త చరాచర భూతములందును ఆత్మ భిన్నభిన్నముగ నుండునని భావించు జ్ఞానము రాజసమని భావింపుము.

తో॥ సర్వభూతముల నానావిధముల
పరమాత్మయు గలడని తలచు
వేరు భావమును గల ఆమనుజుని
జ్ఞానము రాజసమని యెంచు ॥గోవింద॥

*తో॥ సర్వ కాలముల సర్వేశ్వర నిను
సర్వము నీవని నెరుగుచును
సర్వాధారుడ సమముగ జూడగ
సర్వాధిప వేడెద నిన్ను ॥గోవింద॥ ౨౧

శ్లో॥ యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్ ।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22

తా॥ అయితే నిష్కారణముగ ఏదేని ఒకదానియందు ఇది సర్వస్వమని ఎరింగి తత్త్వార్థమును తెలియక విషయమందు చేరియుండునట్టి అల్పజ్ఞానము తామస మనిపించును.

తో॥ తత్త్వార్థంబును యెరుగనట్టిదియు
పరమార్థంబును తోచనిది
యథార్థమును ఎరుగనట్టి జ్ఞానము
తామస జ్ఞానము వినుము నిది ॥గోవింద॥

*తో॥ తనకు తోచినదె తత్త్వార్థంబని
తత్త్వ దర్శకుల తలచకను
అతత్త్వార్థమగు అల్పజ్ఞానము
అదే తామసం బనబడును ॥గోవింద॥ ౨౨

శ్లో॥ నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే ॥ 23

తా॥ ఫలప్రాప్తియొక్క ఇచ్ఛలేక రాగద్వేషములులేక నేచేసెదనను సంగములేక యెవడు నియతమైన కర్మచేయవలసినదే అని చేయునో, ఆకర్మకు సాత్త్వికమని పేరు.

తో॥ ఫలకాంక్షయు సంగమును లేనిదగు
పరులకు తొందర లేనిదగు
ప్రతికాలము రాగము లేనిదగు
చేయు కర్మ సాత్త్వికము నగు ॥గోవింద॥

*తో॥ నియత కర్మ నెప్పుడు చేయగవలె (నియతం)
నినుమది నెప్పుడు నెన్నవలె
నినుమది మరచిన ద్వేష ముంచవలె
నీపై మోహము నింపవలె ॥గోవింద॥ ౨౩

శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్॥ 24

తా॥ ఎవడు కోరికలతోను అహంకారముతోను కూడుకొని అధికబాధనొసంగు కర్మచేయుచున్నాడో, అట్టివాడు చేయుకర్మ రాజసమని చెప్పబడును.

తో॥ అహంకారములో కోరిక తోడను
అధిక ప్రయాస నొందుచును
ఆచరింపబడు కర్మము రాజస
మని అందురు యో పార్థ విను ॥గోవింద॥

*తో॥ తండ్రీ తనయుని తప్పుల నన్నిటి
తగ మన్నించుము మ్రొక్కెదను
తండ్రీ తనయుని తాపత్రయమును
దగ్ధము చేయుట నీకు తగుగా ॥గోవింద॥ ౨౪

శ్లో॥ అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే ॥ 25

తా॥ రాబోవు కార్యమును, నాశనమును, పీడను, తన సామర్థ్యమును విచారింపక మోహముచే ఏ కర్మము ఆరంభమగునో, ఆకర్మము తామసమని చెప్పబడును.

తొ॥ అహంకారమున శుభాశుభంబులు
హింసయు నాశము పౌరుషము
ఆత్మశక్తియును విచారించకను
చేయు కర్మయే తామసము ॥గోవింద॥

*తొ॥ ముందు జరుగబడు మోసము నాశము
మోహము చేతను నెరుగకను (మోహాత్)
ముందువెనుక గమనించక చేసెడి
కార్యమె తామస మనబడును ॥గోవింద॥ ౨౫

శ్లో॥ ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26

తా॥ ముక్తసంగుడును, నేను నాది అననివాడును, ధృతి ఉత్సాహము గూడినవాడును, కార్యసిద్ధికాని కాకపోని వికారము పొందనివాడును అగు కర్త సాత్త్వికు డనబడును.

తొ॥ సంగము లేకను నేనను నాదను
చపలత లేకను ధైర్యమున
సంతోషంబున ఫలాఫలంబుల
సమత కర్త సాత్త్వికు డగును ॥గోవింద॥

*తొ॥ ఆత్మారాముని నెప్పుడు మరువడు
ఆత్మేతర సంగియు కాడు
ఆత్మానందంబున సంతసపడు
ఆత్మయె సర్వము అనుచుండు ॥గోవింద॥ ౨౬

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27

తా॥ విషయాసక్తుడు, కర్మఫలాపేక్షకుడు, లుబ్ధుడు, హింసయందు వెనుకంజ వేయనివాడు, అశుచియు, హర్షశోకాన్వితుడు, ఇట్టి కర్త రాజసు డనబడును.

తో॥ సుఖపడు నాశయు లోభగుణంబును
హింసమానసము అశుచియును
శోకము సంతసమును ఫలేచ్ఛయును
చెందును రాజస కర్తయును ॥గోవింద॥

*తో॥ ఇంద్రియ సుఖ భోగములుకు యెప్పుడు
ఇచ్ఛచె ఇతరుల హింసించి
ఇంద్రియ భోగములచె తనదేహము
హింప పెట్టు హీనత బడసి ॥గోవింద॥ ౨౭

శ్లో॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధ శ్శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28

తా॥ అవివేకి, సంస్కారహీనుడు, క్రూరుడు, వినయశూన్యుడు (సోమరి), మాయావి, దుఃఖశీలుడు, దీర్ఘాలోచనపరుడు, వెంటనే చేయుపనిని ఆలస్యముగ చేయునట్టి వాడునగు కర్త తామసు డనబడును.

తో॥ అవివేకియు ప్రాకృతుడు స్తబ్ధుడును
మాయావియు పరహింసకుడు
అలసుడు విషాది దీర్ఘసూత్రుడును
అగుకర్తయు విను తామసుడు ॥గోవింద॥

*తో॥ పెద్దలసుద్దులు ప్రేమచె వినుచును
బుద్ధిని చక్కగ దిద్దియును
పెద్దలసేవయు భక్తిగ చేయును
తామస గుణ రహితుండిలను ॥గోవింద॥ ౨౮

శ్లో॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ! ॥ 29

తా॥ ధనంజయ! గుణములనుబట్టి బుద్ధి ధైర్యము మూడేసి విధములు. వేర్వేరుగ సమస్తమును చెప్పెదను వినుము.

తో॥ ఓయి ధనంజయా బుద్ధియు ధైర్యము
త్రిగుణంబులచే త్రివిధముగ
ఉండును పల్కెద నిశ్శేషముగను
వినుము శాంతిగను వివరముగ ॥గోవింద॥

*తో॥ బుద్ధి శుద్ధముగ పుణ్యస్థలముగ
అనుగ్రహించియు దయయుంచి
బుద్ధి పీఠమున ప్రేమతో వసించు
పురుషోత్తమ ప్రార్థన దలచి ॥గోవింద॥ ౨౯

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ॥ 30

తా॥ పార్థ! ప్రవృత్తి ఇది, నివృత్తి ఇది, కార్యమిది, అకార్యమిది, భయమిది, అభయమిది, బంధమిది, మోక్షమిది అని తెలిసికొనజాలెడి బుద్ధి సాత్త్వికము.

తో॥ ఇది ప్రవృత్తియని ఇది నివృత్తియని
కార్యాకార్యము భయ మభయం
బంధమోక్షములు పార్థ యెరింగెడి
బుద్ధియు సాత్త్వికపు గుణము ॥గోవింద॥

*తో॥ నిన్నే నమ్మితి నిన్నే తలచితి
నీవే గతిఅని అనుకొంటి
నిన్నే నాపతి నిన్నే నాస్థితి
నీవే అన్నియు ననుకొంటి ॥గోవింద॥ ౩౦

శ్లో॥ యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ! రాజసీ ॥ 31

తా॥ పార్థ! ఇది ధర్మము, ఇది అధర్మము, ఇది కార్యము, ఇది అకార్యము అని యథార్థముగ నెరుగజాలని బుద్ధి రాజస బుద్ధి అగును.

తో॥ ఇది ధర్మము మరి అది అధర్మమని
ఇది కార్యము అది కాదనియు
యథార్థంబుగను నెరుగని బుద్ధియు
పార్థ రాజసంబని తెలియు ॥గోవింద॥

*తో॥ నిను సేవించని మానవుండేల
నిన్నరయని ధర్మంబేల
నీకై చేయని కార్యములు ఏల
నిన్ను గ్రహించని ప్రజ్ఞేల ॥గోవింద॥ 3౧

శ్లో॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా ।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ ॥ 32

తా॥ పార్థ! అధర్మమును ధర్మముగాను, అట్లే అజ్ఞానముతో గూడినదై సమస్తమును విపరీతముగ జూచునది తామస బుద్ధి అనబడును.

తో॥ అజ్ఞానావృతమగు యే బుద్ధియు
అధర్మమును ధర్మంబుగను
అట్లనె అన్నియు విపరీతంబుగ
గను బుద్ధియె తామసమగును ॥గోవింద॥

*తో॥ తామస గుణవంతులు అధర్మమును
ధర్మమనుచు తలచియు చాల
తాముచేయు కార్యంబుల నన్నియు
తల క్రిందుగ చేతురు మిగుల ॥గోవింద॥ 3౨

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ! సాత్త్వికీ ॥ 33

తా॥ పార్థ! ఎవఁడైతే ఏ ధైర్యముచే మనస్సు, ప్రాణములు, ఇంద్రియములు, వీటియొక్క వ్యాపారములను నిశ్చలముగా యోగముచే నియమించునో, వాని ధైర్యము సాత్త్వికము.

తో॥ అవ్యభిచారపు ధైర్యయోగమున
మనః ప్రాణ ఇంద్రియములను
ఎవ్వని ధైర్యమునకు వశమగునో
ఆ ధైర్యము సాత్త్విక మగును ॥గోవింద॥

*తో॥ తన ఇంద్రియముల తన ప్రాణంబుల
తన మనసును చక్కఁగ నిలువు
తన ధైర్యమె సాత్త్విక ధైర్యంబగు
తన్నుగాచు తన్నను తెలువు ॥గోవింద॥ 33

శ్లో॥ యయా తు ధర్మకామార్థాన్ధృత్యా ధారయతేఽర్జున!
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతిస్సా పార్థ! రాజసీ ॥ 34

తా॥ అర్జున! ఏ ధైర్యముచే ధర్మకామార్థములు శ్రద్ధతో ధరింపబడి ఫలమును కోరునో, అతని ధైర్యము రాజస మనబడును.

తో॥ ధర్మము అర్థము కామము కోరియు
మనః ప్రాణ ఇంద్రియములను
ధర్మానుజ నియమింపగ బడునో
ఆధృతి రాజస మనబడును ॥గోవింద॥

*తో॥ ధర్మము అర్థము కామము నందలి
ప్రియముచె ఫలమును కోరియును
ధరింపబడునో దానిని విడువని
ధైర్యము రాజస మనబడును ॥గోవింద॥ 34

శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ ॥ 35

తా॥ ఓయి పార్థ! ఏ ధైర్యమువల్ల దుర్మేధస్సుగలవాడు నిద్ర అనగ సూర్యోదయాస్తమయ కాలంబులను నిద్రయు, భయము, దుఃఖము, శోలుముఖము, మదము విడుమట యెఱుంగడో వాని ధైర్యము తామసము.

తో॥ ఓయి పార్థ! స్వప్నము భయశోకము
విషాద మదంబు దుర్జనుడు
ధైర్యము వలనను విడువక నుండును
ఆ ధైర్యము తామసము కదు ॥గోవింద॥

*తో॥ పెద్దల సేవించని యామనుజుడు
పెద్ద మొద్దు గార్దభమువలె
బుద్ధి వివేకము పొందని ధైర్యము
పొందియుండు తా పందివలె ॥గోవింద॥ 3౫

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36

తా॥ భరతశ్రేష్ఠ! ఇక సుఖము మూడు విధములు. విను తెలిపెదను. ఎద్దానిలో అభ్యాసమువల్లను రమించి దుఃఖమును దాటునో.

తో॥ మూడు విధంబుల సుఖమును వినుమో
భరతర్షభ అభ్యాసముచే
క్రీడించునో యా దుఃఖరహితమగు
దాని తెలిపెదను వినునాచే ॥గోవింద॥

*తో॥ ఆత్మానందమె నిజమగు సుఖమగు
ఆత్మారాముని స్వరూపము
అభ్యాసంబున ఆనందంబున
అనుభవమగు తన స్వరూపము ॥గోవింద॥ 3౬

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్॥ 37

తా॥ ఏది మొదట విషసమానముగ నుండి పరిణామమున అమృతోపమానమగునో, అట్టి ఆత్మ (తన) బుద్ధి ప్రసన్నతనుండి గలుగుసుఖము సాత్త్వికమనబడును.

తో॥ ప్రారంభములో విషముగ తోచియు
పరిణామములో నమృతముగ
పరిణమించు సుఖమాత్మ బుద్ధిచే
ప్రసన్నమగు సాత్త్విక మనగ ॥గోవింద॥

*తో॥ జ్ఞాన భక్తి వైరాగ్యంబులచే
ధ్యాన సమాధియు ప్రారంభం
కష్టముతోచును కడపడ సుఖమగు
ధ్యానమె పరిపూర్ణానందం ॥గోవింద॥ ౩౭

శ్లో॥ విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38

తా॥ విషయ ఇంద్రియ సంయోగము ఆరంభములో అమృతమువలె నుండి పరిణామములో విషసమానముగ నుండును. ఆ సుఖమే రాజస మనబడును.

తో॥ విషయేంద్రియ సంయోగము వలనను
వెంటనె అమృతము యనబడును
విషముగ తోచును కడాపటది విను
అట్టి సుఖమె రాజస మగును ॥గోవింద॥

*తో॥ సకాలంబునను నదీస్నానమును
సంధ్యావందన జపతపము
సూర్య నమస్కారము హరి కర్చన
సహజము పరిణామ సుఖము ॥గోవింద॥ ౩౮

శ్లో॥ యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39

తా॥ నిద్ర ఆలస్య ప్రమాదములవలన బుట్టిన సుఖము ఆరంభమునను కడపటను మనస్సునకు మోహము కలిగించును. ఈసుఖమే తామస మనబడును.

తొ॥ ఏ సుఖమాదిలో అంత్యము నందును
ఎంతో సుఖముగ తోచునది
ఏ నిద్రయు సోమరితనంబును
ప్రమాదమివి తామసము నిది ॥గోవింద॥

*తొ॥ సకాలంబునను స్నానము చేయుడు
సంధ్యా వందనమును సున్న
సోమరి తనమున గలుగును ఆత్మకు (ఆత్మనః)
సుఖమనిపించును వినుమన్న ॥గోవింద॥ ౩౯

శ్లో॥ న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః ॥ 40

తా॥ ప్రకృతి జన్యములగు ఈత్రిగుణములకు లోబడని ప్రాణి ఎద్దియూ ఈ పృథివియందును, ఆకాశము అట్లే దేవలోకములందును లేదు.

తొ॥ భువి ప్రాణులలో దివి దేవతలలో
ప్రకృతిచె గలిగిన గుణములచె
పూర్తిగ విడుదల నొందిన ప్రాణియు
పాండవ లేదని వినునాచే ॥గోవింద॥

*తొ॥ ఎటు బ్రోచెదవో యాదవ నాయక
కఠినవు త్రిగుణంబులు కృష్ణ
వీటికి చిక్కని ప్రాణియు లేదే
కటకట నీవే గతికృష్ణ ॥గోవింద॥ ౪౦

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప!।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥ 41

తా॥ పరంతప! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు క్రియలు ప్రకృతివలన బుట్టిన త్రిగుణములచే విభజింపబడినది.

తో॥ ఓయి పరంతప బ్రాహ్మణ క్షత్రియ
వైశ్యులకును మరి శూద్రులకున్
వారి స్వభావపు గుణ కర్మంబులు
వేరువేరు ఏర్పడిన వగున్ ॥గోవింద॥

*తో॥ వొకతల్లి గర్భంబున బుట్టిన
వారల స్వభావములు వేరు
వారి పూర్వకర్మాను సారముగ
వర్తింతురు గుణముల తీరు ॥గోవింద॥ ४౧

శ్లో॥ శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మ స్వభావజమ్॥ 42

తా॥ శమము, దమము, తపస్సు, శౌచము, క్షమ, ఋజుత్వము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము ఇవి బ్రాహ్మణులకు స్వభావములగు కర్మలు.

తో॥ బ్రాహ్మణ స్వభావ కర్మంబులు విను
అంతహ బహిరింద్రియ జయము
జ్ఞానము విజ్ఞానము తపశ్శుచియు
ఓర్పు ఆర్జవము నమ్మకము ॥గోవింద॥

*తో॥ బ్రాహ్మణ కులమున పుట్టుట పుణ్యము
బ్రాహ్మణ గుణములు మరి పుణ్యం
బ్రహ్మజ్ఞానము పొందుట పుణ్యము
బ్రహ్మ స్వరూపమును పుణ్యం ॥గోవింద॥ ४౨

శ్లో॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజమ్ ॥ 43

తా॥ శూరత్వము, పరాక్రమము, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమున వెనుకంజ వేయకుండుట, సత్పాత్రదానము, పాలనశక్తి యివి క్షత్రియ స్వభావ సిద్ధమైన కర్మలు.

తో॥ శౌర్యము తేజము ధృతిసామర్థ్యము
సత్పాత్రల దానము యనిలో
పారిపోక యుండుట ధీరతనము
క్షత్రియ స్వభావ మీ యిలలో ॥గోవింద॥

*తో॥ బ్రహ్మజ్ఞానుల పోషించుటయును
పాపిష్ఠుల పరి మార్చుటయు
పవిత్రముగ రాజ్యము పాలించుట
పరమ మంగళము గనుమిదియు ॥గోవింద॥ ४३

శ్లో॥ కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యంకర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ 44

తా॥ దున్నుట, గో సంరక్షణము, వ్యాపారము ఇవి వైశ్యులకు స్వాభావికకర్మలు. సేవారూపమైన కర్మ శూద్రులకు స్వాభావిక కర్మ.

తో॥ కృషి గోరక్షణ వాణిజ్యంబును
కర్మగు వైశ్య స్వభావముచె
పరిచర్యయు పాదజ స్వభావమా
కర్మ యనబడును శాస్త్రముచే ॥గోవింద॥

*తో॥ కృషిచేసియు గోరక్షణ చేసియు
కోరిన వస్తువులను అమ్మ
గో బ్రాహ్మణులకు హితమును కోరును
కర్మచేయు వైశ్యుడు ప్రేమ ॥గోవింద॥ ४४

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥ 45

తా॥ మనుజుడు తనతన కర్మలందు ఆసక్తుడైనవాడై సంసిద్ధిని పొందు చున్నాడు. స్వకర్మ నిరతుడై సిద్ధిని ఎట్లు పొందునో దానిని విను.

తా॥ మనుజుడు స్వకీయమగు కర్మంబులు
మరిమరి చేయుచు సిద్ధియు దా
ఘనుడై పొందెడి జ్ఞానమార్గమును
వినుపించెద విను ఓపార్థ! ॥గోవింద॥

*తా॥ తనతన కర్మల యందాసక్తత
మనుజుడు సిద్ధిని పొందును తా
తన కర్మల తా చేయుచు సిద్ధిని
పొందు విధానము విను పార్థ ॥గోవింద॥ ౭౫

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥ 46

తా॥ ఎవనినుండి సకల భూతములు బయలుదేరినవో, ఎవనిచే నీ విశ్వ మంతయు వ్యాపింపబడియున్నదో, ఆ పరమాత్మను స్వకర్మచే అర్చించి మానవుడు సిద్ధిని పొందుచున్నాడు.

తా॥ ఎవనివలన భూతముల ప్రవృత్తియొ
ఎవడంతట నిండినవాడో
అవని ప్రజలు సిద్ధిని పొందెదరా
దేవుని కర్మచె కొలచినచో ॥గోవింద॥

*తా॥ సర్వజగములకు సర్వజీవులకు
సర్వేశ్వరు డెవడాధారం
సర్వస్వకర్మలు సర్వేశ్వరునికి (స్వకర్మణా)
సమర్పించుటయె ప్రాముఖ్యం ॥గోవింద॥ ౭౬

శ్లో॥ శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47

తా॥ శ్రేష్ఠమయిన పరధర్మాచరణకన్నను, విగుణమయినను స్వభావ నియతమయిన కర్మము చేసినట్లయిన కిల్బిషము పోవును. స్వధర్మమే మేలు.

తత్త్వ॥ శ్రేష్ఠమయిన పరధర్మము కంటెను
స్వీయధర్మ మెంతయు మేలు
స్వధర్మ మెంతయు విగుణంబయినను
ఆచరింప దోషము దోలు ॥గోవింద॥

*తత్త్వ॥ వారివారి కర్మంబులు చేయుచు
వారిజనాభుని వదలకను
వరదా నీవన్నిటికిని ప్రభుడవు
వరదుడవని వర్ణింపవలెగ ॥గోవింద॥ ౮౨

శ్లో॥ సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్ ।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥48

తా॥ కౌంతేయ! దోషముతో కూడినదైనను, సహజమగు కర్మలను విడువరాదు. ఎందువలననగ అగ్నిని పొగగప్పినరీతిని యెల్లకర్మములు దోష యుక్తములే.

తత్త్వ॥ హే కౌంతేయ సహజకర్మమును
సదోషమయినను విడరాదు
అగ్నిని పొగవలె సమస్త కర్మలు
దోషయుతంబగు విడిలేదు ॥గోవింద॥

*తత్త్వ॥ శాస్త్రమునందున చెప్పిన విధిగను
శాస్త్రవిహిత కర్మంబులను
శాస్త్రవేత్తలచె నెరిగియు కర్మను
శాస్త్రవిధిని చేయగ వలెను ॥గోవింద॥ ౮౩

శ్లో॥ అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49

తా॥ సర్వత్రను ఆసక్త బుద్ధివిడచి అంతఃకరణమును జయించి ఆశలుడిగి కర్మఫలత్యాగముచేత ఉత్తమ నిష్క్రియసిద్దిని పొందును.

తో॥ అన్నిటియందును సంగము లేకను
మనసును హరి కర్పణచేసి
ఆశలు వదలియు జ్ఞానము నొందును
కర్మఫల త్యాగము చేసి ॥గోవింద॥

*తో॥ ఆత్మేతర వస్తువు లాదంటట
ఆశవదలి బుద్ధిని నిలిపి
ఆత్మను జయించి పరమోత్తమమగు (జితాత్మా)
ఆ నిష్క్రియ సిద్ధిని చెంది (నైష్కర్మ్యసిద్ధిం పరమాం)

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50

తా॥ కౌంతేయ! నైష్కర్మ్యసిద్దిని పొందినపిదప శ్రేష్ఠమైన జ్ఞాననిష్ఠచే పరబ్రహ్మను పొందుటకు మార్గమును సూక్ష్మముగ నీకు తెలియ చెప్పెదను వినుము.

తో॥ కుంతీకుమార సిద్ధిని పొందియు
జ్ఞానముచే పరమాత్మను తా
పొందు నిష్ఠయును సంక్షేపంబుగ
బలికెదను వినుము ఓ పార్థ ॥గోవింద॥

*తో॥ బ్రహ్మను పొందగ పరమోత్తమమగు
జ్ఞాననిష్ఠ విను పలికెదను
బ్రహ్మానందము పొందగవచ్చును
పరమావధి పల్కులుగ విను ॥గోవింద॥ (పరా)

శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ।
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ 51

తా॥ విశుద్ధమయిన బుద్ధితో గూడుకొని ధైర్యముచే మనస్సును నిగ్రహించి శబ్దాది విషయములను నిగ్రహించి రాగద్వేషములను బొత్తిగ విడచి.

తో॥ విశుద్ధమగు బుద్ధియు గలవాడై
ధైర్యంబున మనసును నిలిపి
విషయంబుల నన్నిటిని తొలియును
రాగద్వేషంబుల విడచి ॥గోవింద॥

*తో॥ విశాలమగు బుద్ధితో గూడుకొనియు
విషయములగు శబ్దాదులును
విష్ణుపాదసేవలో తా నిలిపియు
విడువగవలె రాగాదులను ॥గోవింద॥ ౫౧

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52

తా॥ రహస్యస్థలవాసియై అల్పాహారముగలవాడై శరీరవాఙ్మనంబుల వశముచేసికొని నిత్యధ్యానయోగయుక్తుడు వైరాగ్యమును ఆశ్రయించి.

తో॥ లఘువుగ భుజించి ఏకాంతంబున
వైరాగ్యము నెప్పుడు పొంది
వాక్కాయ మనంబుల వశపరచియు
సదా ధ్యానయోగము నొంది ॥గోవింద॥

*తో॥ సోహంహంసః హంసస్సోహం
సోహంహంసః అనుచు సదా
సుఖస్వరూపుని సుఖముగ ధ్యానము
సల్పుచు నుండును యోగి సదా ॥గోవింద॥ ౫౨

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥ 53

తా॥ అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, పరిగ్రహము విడచియు మమకారములేక శాంతస్వభావముగల పురుషుడు బ్రహ్మభావమును పొందుటకు సమర్థుడగును.

తో॥ అహంకారమును బలము దర్పమును
కామము క్రోధము పరిగ్రహముఁ
అంతయు త్యజించి మమత్వ ముడిగిన
శాంతుడు గనను బ్రహ్మమును ॥గోవింద॥

*తో॥ బహు జన్మంబుల పరిగ్రహించిన
పాపంబుల పోదోలవలెఁ
బహు జాగ్రత్తతో పరమేశ్వరు పద
పంకజముల భావించవలెఁ ॥గోవింద॥ ౫౩

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54

బ్రహ్మభూతుని లక్షణము.

తా॥ బ్రహ్మభూతుడు ప్రసన్నచిత్తుడగును. దుఃఖమొందడు. కోరడు. సమస్తభూతములయందును సముడగును. పరమోత్తమమగు నాభక్తిని పొందును.

తో॥ బ్రహ్మభూతుడగు ప్రసన్న హృదయుడు
శోకము నొందదు కోరదతి
భూతము లన్నిటి సమముగ చూచును
పొందును పరమగు మద్భక్తి ॥గోవింద॥

*తో॥ పోయెననుచు శోకము తా పొందడు
రాలేదని కాంక్షయు లేదు
బాయని భక్తియు నాయందుంచియు
ప్రపంచమున సమముగ నుండు ॥గోవింద॥ ౫౪

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥ 55

తా॥ ఇట్లు పూర్ణభక్తి గలవాడయితే నేను యెట్టివాడు యెవడు అనుదానిని అతడు తత్త్వతః నెరుగును. అట్లు నన్ను పూర్ణముగ నెరిగినవెనుక అతడు నాలో ప్రవేశించును.

తో॥ భక్తియుక్తుడును నేనెవడనునది
సత్తుచిత్తు ఆనందమును
భక్తిగ నానిజరూపము నెరిగియు
పూర్ణములో తా పూర్ణుడగుగ ॥గోవింద॥

*తో॥ భక్తిచేత నను చక్కగ నెరుగును
భక్తిచె నన్నెరిగియు నతడు
భక్తిచేతనె నాలో చేరును
భక్తవశుండను నేనెపుడు ॥గోవింద॥ ౫౫

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్॥ 56

తా॥ నిరంతరము సర్వకర్మములను చేయుచున్నవాడై నన్నే ఆశ్రయించిన అతడు నా అనుగ్రహముచేత నాశరహితమైన శాశ్వతమైన పదమును పొందుచున్నాడు.

తో॥ నేనే ఆశ్రయమని నమ్మియును
ఎల్లకర్మముల యెప్పుడును
నెరవేర్చిన నాయనుగ్రహంబునను
నాశరహిత స్థానము పొందుగ ॥గోవింద॥

*తో॥ స్నానము చేయుచు నామును దిద్దుచు
సంధ్యావందనమును చేస్తూ
ధ్యానము చేయును అవ్యయు డగునను
సమస్తకర్మల నర్పిస్తూ ॥గోవింద॥ ౫౬

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ ॥ 57

తా॥ మనస్సుచే సర్వకర్మలను నాయందుంచి మత్పరాయణుడవై బుద్ధియోగము నవలంబించి సతతం నాయందే చిత్తము గలవాడవగుము.

తో॥ మనసుచె సమస్త కర్మసమూహము
నాకర్పించియు నావాడై
జ్ఞానయోగమును ఆశ్రయించియును
సతతముంచు చిత్తమునాపై ॥గోవింద॥

*తో॥ మనోబుద్ధి చిత్తములను నిలిపెడి
మార్గము చూపును ఈ శ్లోకం
జ్ఞాన మన్నవిను బుద్ధి యన్నవిను
నాకటేయని పెద్దలవాక్యం ॥గోవింద॥ ౫౭

శ్లో॥ మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।
అథచేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ 58

తా॥ నాయందుంచిన చిత్తము గలవాడయితే నీవు నా అనుగ్రహమున సకల సంకటదుర్గములను దాటగలవు. లేక తెలిసినవాడనెడి అహంకారముచే వినవేని చెడిపోదువు.

తో॥ తండ్రీ నీచిత్తము నాయందే
నిలిపిన సమస్త కష్టముల
దాటగలవు నీ వహంకారమున
వినకుండిన జెడుదువు మరల ॥గోవింద॥

*తో॥ బుద్ధి పీఠమును హరి కర్పించుట
చిత్తము శ్రీరాముని దనుట
శ్రద్ధచె మనసున శ్రీధరు తలచుట
అహంకారమును హరి దనుట ॥గోవింద॥ ౫౮

శ్లో॥ యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥ 59

తా॥ అహంకారమును ఆశ్రయించి నేను యుద్ధముచేయను అని నీవు సంకల్పించియుండుదువుగద. నీనిశ్చయము వ్యర్థమగును. నీ ప్రకృతియే ఆకార్యము నీనుండి చేయించును.

తో॥ ఏ యహంకారమును నమ్ముకొనియు
యుద్ధముచేయను అనియెదవా
ఆ అహంకార మబద్ధమగు విను
ప్రకృతివలన పనిచేసెదవు ॥గోవింద॥

*తో॥ అహంకారమిది అనేక జన్మలు
ఆర్జించును బహు అన్యాయం
అహంకారమును హరి కర్పించిన
అనేక జన్మములకు నాశం ॥గోవింద॥ ౫౯

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ! నిబద్ధస్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్॥60

తా॥ కౌంతేయ! స్వభావజన్యమైన స్వకర్మచేనుండి బద్ధుడైనావు. గనుక మోహమునకు లోబడి నీవు దానిని చేసేదిలేదనినను అవశుడవయిన నీవు దానిని చేసియే తీరవలసివచ్చును.

తో॥ మోహముచే యుద్ధము చేయననియు
మొకురు పట్టుగల కౌంతేయ
మరుపుచేసి నీ స్వభావ గుణములు
నీచే చేయించు గదయ్య ॥గోవింద॥

*తో॥ స్వభావ కర్మము చేసితీరవలె
అహంకారమున కాదన్న
స్వభావమును నీచే చేయించును
విడువదు స్వభావ గుణమన్న ॥గోవింద॥ ౬౦

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥61

తా॥ అర్జున! సకలభూతముల హృదయమందు ఈశ్వరుడున్నవాడై యంత్రగాడు బొమ్మల నాడించురీతి తన మాయచేత సమస్త భూతముల ఆడించుచున్నాడు.

తో॥ సర్వభూతముల హృదయంబులను
సర్వేశ్వరుండు నిలిచియును
సర్వభూతముల మాయచె త్రిప్పును
యంత్రంబుల బొమ్మలవలెను ॥గోవింద॥

*తో॥ వృథాభిమానము వూపిరివుండే
వరకును విడువదు అన్యాయం
వృథాభిమానము వూడినవారికా
వుత్తమమగు బ్రహ్మానందం ॥గోవింద॥ ౬౧

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ 62

తా॥ అందువలన భారత! సర్వభావములచేత ఆ ఈశ్వరుని శరణు చెందుము. అతని అనుగ్రహమునుంచి పరమోత్తమమగు శాంతియును, శాశ్వత స్థానమును పొందగలవు.

తో॥ కావున భారత ఆ పరమేశుని
సర్వభావముల శరణమను
ఈశ్వర కృపచే పరమ శాంతియును
శాశ్వత స్థానము పొందనగుగా ॥గోవింద॥

*తో॥ శాశ్వత స్థానము చెందగ వలసిన
సర్వేశ్వరుడగు ఈశ్వరుని
శరణాగతుడను చక్కగావు మన
శాంతియు చెందును ధన్యుడగుగా ॥గోవింద॥౬౨

శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

తా॥ ఇట్లు రహస్యములలో పరమరహస్యమగు జ్ఞానము నీకు నాచే చెప్పబడినది. ఇదంతయు చక్కగ విమర్శించి నీకు తోచినట్లు చేయుము.

తో॥ జ్ఞానమునీకై ఇటు బలికితి విను
గుహ్యములోనతి గుహ్యమగు
జ్ఞానము చక్కగ విమర్శించియును
నీయిష్టముగను నడువనగు ॥గోవింద॥

*తో॥ పరమరహస్యము గీతాజ్ఞానము
పరిశోధించుము పావనము
పరమానందము భాగ్యోదయమగు
పార్థుడ గీతా సంగీతము ॥గోవింద॥ ౬౩

శ్లో॥ సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥ 64

తా॥ సర్వరహస్యములలో ఉత్తమ రహస్యమును మరల బలికెదను వినుము. దృఢముగ నీవు నాకు ప్రియుడవుగ నున్నందున నీకు హితమే బలికెదను.

తో॥ మరలవినుము నా శ్రేష్ఠవచనమును
సర్వరహస్యోత్తమ మగును
అర్జున నీకుహితంబు బలికెదను
ఇష్టుడ వన్నిట చూచినను ॥గోవింద॥

*తో॥ దృఢభక్తునికిని దృఢవరచగవలె
దృఢమగు భక్తిజ్ఞానమును (దృఢమితి)
దృఢముగ పొందుము దృఢవైరాగ్యము
దృఢంబునగు నాహితంబును ॥గోవింద॥ ౬౪

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ 65

తా॥ నాయందే నీమనస్సుంచుము. నా భక్తిని సల్పుము. నన్నర్చించుము. నాకు నమస్కరించుచుండుము. ఇటులయిన నన్నే పొందగలవు. నీవు నాకు ప్రియ భక్తుడవు. గనుక సత్యముగ ప్రతిజ్ఞ చేసి పలికెదను.

తో॥ నాయందే మనసుంచియు భజించు
నన్నారాధించియు మ్రొక్కు
నాయందే చేరెదవు యథార్థము
నాకు ప్రియుండవు నేదిక్కు ॥గోవింద॥

*తో॥ నాకు భక్తుడవు నాయనకమ్ము
నేనేగతి చక్కగ నమ్ము
నాకు ప్రియుండవు నిజముగ సుమ్ము
నేను ప్రమాణము నీసొమ్ము ॥గోవింద॥ ౬౫

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

తా॥ సర్వధర్మములను పరిత్యజించి నన్నొకనినే శరణు పొందుము. నే నిన్ను సర్వపాపములనుండి విడుదల చేసెదను. చింతించవద్దు.

తో॥ అన్ని ధర్మములు పరిత్యజింపుము
నేనే శరణంబని నమ్ము
అన్ని పాపముల నినునే వినుము
విడుదల చేసెద నేడ్వకుము ॥గోవింద॥

*తో॥ సర్వధర్మముల మూలకారణము
సర్వము నేనని యెరుంగుము
సర్వధర్మములు నాకర్పింపుము
సర్వపాపములు పోవునిజం ॥గోవింద॥ ౬౬

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥

తా॥ దీనిని తపస్సు చేయనివానికి, భక్తిలేనివానికి, వినుటకు ఇష్టపడని వానికి, నన్ను నిందించువానికి ఎప్పటికి చెప్పవద్దు.

తో॥ గీతాశాస్త్రము తపస్సుచేయని
భక్తిలేని శ్రద్ధతో వినని
ఇత్యాదులకును నాయందసూయ
పడువానికి తెల్పకు దీని ॥గోవింద॥

*తో॥ యోగశాస్త్రమును శ్రద్ధతో తెలిపెడి
యోగివరేణ్యుని పాదముల
బాగుగ పూజించియు శుశ్రూషణ
చేయవలయు భక్తితో మిగుల ॥గోవింద॥ ౬౭

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥ 68

తా॥ ఈ పరమగుహ్యమును నా భక్తులయినవారికి తెలిపినవాడు నాయందు పరమభక్తిగలిగి నన్నే పొందుచున్నాడు. సంశయమేమిలేదు.

తో॥ పరమోత్కృష్టము పరమరహస్యం
బగు ఈ శాస్త్రము భక్తులకు౯
పరమ ప్రీతిగను ఉపదేశించిన
భక్తుడు పొందును పరునన్ను౯ ॥గోవింద॥

*తో॥ ప్రాజ్ఞులవద్దను పరమగుహ్యమగు
భగవద్గీతను యెరింగియు
పరమభక్తులకు భక్తిగ పలికియు
పొందవలయు నను మరలకయు ॥గోవింద॥ ౬౮

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥ 69

తా॥ అతనికంటెను మనుష్యులలో నాకు మిక్కిలి ప్రియముచేయు వాడు ఒకడునులేడు. వానికంటె ఇతరుడు నాకు భూమియందు ఇష్టుడుగా నుండువాడు పుట్టడు.

తో॥ మనుజులలో నాకతనికంటె ప్రియ
మనుజుడు వేరే కనబడడు
ఘనుడతండు ఈభువిలో నింతకు
నధికప్రియుండు రాబోడు ॥గోవింద॥

*తో॥ నాతత్వంబును నా భక్తులకును
న్యాయంబుగ తెల్పుట కన్న
నాకుప్రియంబగు నాదగు సేవయు
నాయున నిజముగ లేదన్న ॥గోవింద॥ ౭౯

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః ॥ 70

తా॥ మన ఇద్దరియొక్క ధర్మయుక్తమైన ఈ సంభాషణము ఎవనిచేత అధ్యయనము చేయబడుచున్నదో అట్టివానిచేత జ్ఞానయజ్ఞముచే నేను పూజింపబడినవాడగుదునని నా అభిప్రాయము.

తో॥ మన ఇద్దరి సంవాద రూపమగు
ధర్మశాస్త్రమును అధ్యయనం
బొనర్చుటయె జ్ఞానముచే నాటదు
నన్నర్చించుటయౌ నిజము ॥గోవింద॥

*తో॥ గురుశిష్యుల సంవాద రూపమగు
గీతాశాస్త్రము భక్తిగను
గురుశిష్యులె తమ గురువులుగాగని
గీతను చదువుట మేలగును ॥గోవింద॥ ౭౦

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తశ్శుభాఁల్లోకాన్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥

తా॥ అసూయలేక శ్రద్ధతో ఎవడు ఈగ్రంథమును వినునో, అతడు ముక్తుడై ప్రశస్తములైన పుణ్యకర్మములు చేసినవారలయొక్క పుణ్యలోకములను పొందును.

తో॥ గీతాశాస్త్రము శ్రద్ధావంతుడై
అసూయ రహితుండై వినునో
అతడు ముక్తుడు పుణ్యాత్ములు జను
ఉత్తమ లోకంబును పొందుఁ ॥గోవింద॥

*తో॥ చదువు రానియెడ చదివెడి వారల
సన్నిధికినిజని శ్రద్ధగను
చదివెడి గీతార్థము చక్కగ విన
చేరును పెద్దల స్థానమును ॥గోవింద॥ ౭౧

శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా? ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ? ॥ 72

తా॥ హే పార్థ! నా ఉపదేశమును ఏకాగ్రమయిన మనస్సుచే వింటివిగద. ధనంజయ! అజ్ఞానముచే గలిగిన మోహము సంపూర్ణముగ పోయి నట్టేగద?

తో॥ ఏకాగ్రంబగు మనస్సుచేతను
హే ధనంజయుడ ఈ గీతా
వాక్యంబులు వింటివ అజ్ఞానపు
మోహము నశించినద పార్థ ॥గోవింద॥

*తో॥ కరుణానిధి కుంతీకుమారునికి
గీతార్థము బోధించియును
కరుణతో పరిపక్వస్థితి పరీక్ష
గీతాచార్యుడు ప్రశ్నించె ॥గోవింద॥ ౭౨

అర్జున ఉవాచ:—

శ్లో॥ నష్టో మోహస్స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥ 73

తా॥ అచ్యుత! నీ కరుణవల్ల మోహమంతయు నష్టమాయెను. స్మృతిని నేపొందితిని. సందేహరహితుడయి వున్నాను. నీవు చెప్పినట్లు నడచెదను.

తో॥ మోహము పోయెను నీ ప్రసాదమున
వాసుదేవ జ్ఞానము గలిగె
మీ ఆజ్ఞను శ్రద్ధతో నే చేసెద
సందేహము నంతయు తొలగె ॥గోవింద॥

*తో॥ అచ్యుత నీదగు అనుగ్రహంబున
అజ్ఞానము అంతయు శూన్యం
అందెను స్మృతినే అదృష్టవంతుడ
ఆచరించెదను నీవాక్యం ॥గోవింద॥ 23

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాదమిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥ 74

తా॥ ఇట్లు వాసుదేవునికి మహాత్ముడయిన పార్థునికి నడచిన అద్భుతమగు పులకాంకురము గలిగించు ఈ సంవాదమును నేను వింటిని.

తో॥ వాసుదేవుండు మహాత్ముండు నగు
పార్థుని ఈ సంవాదమును
విననద్భుతంబు రోమహర్షణము
గలిగెనయ్యా నే వినంగను ॥గోవింద॥

*తో॥ పార్థుని ప్రశ్నకు పరమాత్ముండగు
ఆ వాసుదేవు ఉత్తరము
సార్థకమును నే పొందియు వింటిని
అద్భుతమగు పుణ్యప్రదము ॥గోవింద॥ ౨౪

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్॥

తా॥ యోగేశ్వరుండగు శ్రీకృష్ణుడు స్వయముగ చెప్పిన పరమరహస్య మగు యోగశాస్త్రమును వ్యాసానుగ్రహముచే నేను వింటిని.

తో॥ యోగేశ్వరుడగు కృష్ణమూర్తి తా
సాక్షాత్తుగ పరమోత్తమమా
యోగము వచింప శ్రవణము చేసితి
సద్గురు వ్యాసానుగ్రహమా ॥గోవింద॥

*తో॥ వేదవ్యాసుల అనుగ్రహంబున
వేదాంతము పరమ రహస్యం
వేదవేద్యుడగు కృష్ణుడు పలుకగ
వేగవింటి పరమ పవిత్రం ॥గోవింద॥ ౭౫

శ్లో॥ రాజన్సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥ 76

తా॥ రాజా! అద్భుతము, పుణ్యము అయిన ఈ కేశవార్జునుల సంవాదమును తలచితలచి మరలమరల సంతోషమగుచున్నది.

తో॥ పుణ్య మద్భుతము కేశవార్జునుల
సంవాదము ఆశ్చర్యంబు
పునః పునః నే తలచతలచగను
ధృతరాష్ట్ర సంతోషంబు ॥గోవింద॥

*తో॥ సర్వమునందును నీవుందువుగద
సర్వము నీయందుండుగద
సర్వేశ్వర నిన్నెప్పుడు తలచెద
సర్వదుఃఖములు మానుగద ॥గోవింద॥ ౭౬

శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః॥
విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః పునః॥

తా॥ రాజా! శ్రీహరియొక్క అత్యద్భుతమయిన దివ్యరూపమును తలచితలచి నాకు పరమాశ్చర్యము, మరలమరల హర్షమగుచున్నది.

తో॥ శ్రీహరి విశ్వాకృతి అద్భుతంబు ◆ ధ్యానము చేయగ చేయగను
యూహకసాధ్యము బహుసంతోషము ◆ గలిగెరాజ ఆశ్చర్యంబున్ ॥గోవింద॥

*తో॥ అత్యద్భుతమగు హరిరూపంబును ◆ అత్యాశ్చర్యము తలచగను
ఆనందము మరలమరల గలిగెను ◆ అనఅనంగ ధృతరాష్ట్రవిను ॥గోవింద॥ ౭౭

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువానీతిర్మతిర్మమ॥ 78

తా॥ ఎచ్చట యోగీశ్వరుండగు శ్రీకృష్ణుడును, ఎచ్చట ధనుర్ధారియగు అర్జునుడుండునో అచ్చట శ్రీయు,విజయము,శాశ్వతమైన ఐశ్వర్యము, నిజమైన నీతి యుండునని నా అభిమతము.

తో॥ ఎచ్చోటను యోగీశ్వరుండు హరి ◆ ఎచ్చట గాండీవియు నుండు
అచ్చట సంపద జయమైశ్వర్యము◆స్థిరమగు నీతియుగలిగుండు ॥గోవింద॥

*తో॥ దయానిధివి నే దీనుడ దాసుడ ◆ ధనుర్ధారి పార్థునితోడ
దయచేయుము యాదవనాయక నా◆హృదయ సదన పీఠము నిండ ॥గోవింద॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
మోక్షసన్న్యాస యోగో నామ
అష్టాదశోఽధ్యాయః.

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే॥
శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతేస్స్వభావాత్ ।
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥

తో॥ కృష్ణార్జునులారా నాలోగల॰తృష్ణాదుల తొలగించియును
ఇష్టాగోష్ఠితో నుండుదు నాలో॰తృప్తిపొందెదను మీతోను

తో॥ పర్వశయన నీవాడిన పలుకులు
నీకర్పించితి మాయప్ప
తప్పులు వప్పులు నీదేనప్ప
గొప్పదేవ కందర్పప్ప ॥గోవింద॥

తో॥ మంగళంబు శ్రీరుక్మిణిదేవికి
మంగళంబు శ్రీకృష్ణునకు
మంగళంబు కనతల్లితండ్రులకు
మంగళంబు గురుశిష్యులకు ॥గోవింద॥

తో॥ మంగళంబు మానినీ మనోహర
మంగళంబు మాధవ నీకు
మంగళంబు మారజనక మావర
మంగళంబు నీభక్తులకు ॥గోవింద॥

*తో॥ కృష్ణా నీవాడించిన పలుకులు
నీ కర్పించితి నా తండ్రీ
తృష్ణాదుల తొలగించుము తండ్రీ
తవ దాసుడ మరువకు తండ్రీ ॥శ్రీకృష్ణ॥

హరిః ఓం తత్సత్.
శ్రీ కృష్ణార్పణమస్తు.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# గీతా సంగీతము

## వరాహ పురాణాంతర్గత

## గీతా మాహాత్మ్యము.

---

పల్లవి: గోవిందా జయ గోవిందా జయ
గోవిందా జయ గోవిందా
గోవిందా జయ గోవిందా జయ
గోవిందా జయ గోవిందా

తో॥ ప్రాణాయామము గీతాధ్యయనము
భక్తిజ్ఞాన వైరాగ్యములున్
ప్రారంభించిన పుణ్యాత్ములకును
పాపంబులు నాశనమగును ॥గోవింద॥

తో॥ అనేకభాషలు అనేకవిద్యలు
అనేక ధర్మరహస్యములు
అన్నియు నెరిగియు గీతార్థంబును
నెరుగకున్న అన్నియువ్యథలు ॥గోవింద॥

తో॥ గీతను చదువుము గీతార్థముతో
కర్మలుచేయుము నిర్భయము
గీతను చదువుచు మాహాత్మ్యంబును
చదువుటయే పరమోత్తమము ॥గోవింద॥

ధరోవాచ:—

శ్లో॥ భగవన్ పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో! ॥ 1

తా॥ పరమేశ్వర! భగవంతా! ప్రభు! ప్రారబ్ధబద్ధుడైనవానికి చలనము లేని భక్తి ఎట్లు గలుగును? అని భూదేవి శ్రీవిష్ణుదేవుని ప్రశ్నించెను.

త్రో॥ ప్రారబ్ధం బనుభవించువానికి
పరమేశ్వర నిశ్చల భక్తి
ప్రభో ఎటు కలుగును పలుకుము దయతో
భగవన్ ఎటు గలుగును ముక్తి ॥గోవింద॥

*త్రో॥ బిడ్డలపై సతిప్రేమ తల్లికిని
బిడ్డల గతియెట్లగు ననుచు
బిడ్డలకై భూదేవియు పతితో
భక్తిని గూర్చియు ప్రశ్నించు ॥గోవింద॥ ౧

విష్ణురువాచ:—

శ్లో॥ ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥ 2

తా॥ ప్రారబ్ధమనుభవించుచున్నను ఎవడు గీతాభ్యాస రతుడగునో అతడు ముక్తుడే. అతడు కర్మబంధమునకు లోబడడు. లోకమున సుఖపడును. విష్ణువు భూదేవికి ఇట్లు సమాధానము చెప్పుచున్నాడు.

త్రో॥ ప్రారబ్ధం బనుభవించుచున్నను
భగవద్గీతా భ్యాసమునన్
ప్రేమగలిగి యానందము నొందిన
భక్తుడు ముక్తుడు సుఖపడును ॥గోవింద॥

*త్రో॥ గీతార్థంబును గ్రహించి కర్మలు
శాంత చిత్తమున చేయుబడు
గీతాభ్యాసకు డెపుడు లోకమున
కర్మబంధనకు లోబడడు ॥గోవింద॥ ౨

శ్లో॥ మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్స్పర్శం న కుర్వంతి నళినీదళమంభసా ॥ 3

తా॥ దేవీధరా! మహాపాపములు సైతము గీతను స్మరించినవానిని తామ రాకును నీరు స్పృశింపలేనట్లు యెంతమాత్రము స్పృశింపలేవు.

తో॥ తామరపత్రము సలిలము లంటని
తీరున పాపము లన్నియును
తాత్విక దృష్టితో గీతను చదివిన
నాతని నంటవు ధరావిను ॥గోవింద॥

*తో॥ పెద్దపెద్ద శాస్త్రజ్ఞుల నయినను
మొద్దుల చేసును నామాయ
శ్రద్ధతోడ గీతాభ్యాసంబును
చేయువాని చేరదు మాయ ॥గోవింద॥ 3

శ్లో॥ గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై ॥ 4

తా॥ గీతాపుస్తకము యెచ్చటయుండునో, యెచ్చట గీతాధ్యయనము జరుగునో, అచ్చట ప్రయాగాది తీర్థములన్నియు ఉండును.

తో॥ యెచ్చట గీతా పుస్తకముండును
యెచ్చట ప్రవచనమగుచుండు
అచ్చట ప్రయాగ తీర్థములన్నియు
ముచ్చట సిద్ధముగా నుండు ॥గోవింద॥

*తో॥ విష్ణుపాదమున పుట్టినగంగా
విమలుల చేయును స్పృశించిన
విష్ణువాక్యమగు భగవద్గీతా
వైకుంఠ మొసగు స్మరించిన ॥గోవింద॥ ర

శ్లో॥ సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే ।
గోపాలా గోపికా వాపి నారదోద్ధవపార్షదైః ।
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే ॥ 5

తా॥ ఏ గృహమున గీతాసేవ నడుచుచున్నదో అచ్చట సర్వదేవతలు, ఋషులు, యోగులు, పన్నగులు, గోపాలురు, గోపికలు, నారదుడు, ఉద్ధవుడు, పార్షదులు శీఘ్రముగ సాయపడుదురు.

తో॥ ఎచ్చట గీతా ప్రవచన మగునో
అచ్చట వేగమె తోడ్పడుచు
ముచ్చట నుండెడి వారలను వినుము
సచ్చరితులు సాధకు లగుచు ॥గోవింద॥

*తో॥ సర్వదేవతలు ఋషులు యోగులును
వాసుకి మొదలగు పన్నగులు
సర్వగోపికలు గోపాలురును
నారదోద్ధవులు పార్షదులు ॥గోవింద॥

శ్లో॥ యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి ॥ 6

తా॥ దేవీ! పృథివీ! నిత్యము ఎచ్చట గీతయొక్క అధ్యయనము, అధ్యాపన, శ్రవణము, అర్థవిచారము అనగ మననము నడుచుచున్నదో అచ్చట నేను నిశ్చయముగ ఎల్లప్పుడు వుందును.

తో॥ పృథివీ విను గీతా విచారమును
పఠనము పాఠనమును శ్రవణం
నిత్యము ఎచ్చట నడుచునో అచ్చట
నివసింతది నా నిశ్చయము ॥గోవింద॥

*తో॥ గీతాసంగీతము విచారమును
గీతాపఠనము పాఠనము
ఏతావున గీతార్థము శ్రవణము
ఆతావున నానివాసము ॥గోవింద॥ ౬

శ్లో॥ గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్।
గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్ ॥ 7

తా॥ గీత నాశ్రయించి నేయున్నాను. గీత నాకు ఉత్తమ గృహమై యున్నది. గీతాజ్ఞానమును ఆశ్రయించి నేను ముల్లోకములను పాలించు చున్నాను.

తో॥ గీతాశ్రయుడై నేనుందును విను
గీత నాకు ఉత్తమగృహము
గీతాజ్ఞానము ఆశ్రయించినే
ఈ త్రిలోకముల పాలింతుగా ॥గోవింద॥

*తో॥ అందరియందును నీవుందువు గద
నీ యందందరు ఉందురుగా
అందకాడవో ఇందిరపతినా
వందనములు గొని బ్రోతువుగా ॥గోవింద॥ 2

శ్లో॥ గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా ॥ 8

తా॥ గీతయే నాకు పరమవిద్య. ఇది అర్ధమాత్రాస్వరూపము, అక్షరము, నిత్యము, అనిర్వాచ్యమగు ఆత్మపదరూపముగ నున్నది. నిస్సంశయముగ బ్రహ్మస్వరూపమే.

తో॥ పరమవిద్య నాకిది గీతా మరి
అర్ధమాత్రాక్షరము నిత్యం
బ్రహ్మరూపమగు నిస్సందేహము
అనిర్వాచ్యస్వ ఆత్మపదం ॥గోవింద॥

*తో॥ బ్రహ్మరూపమగు ప్రణవరూపమగు
నాశరహితమగు నిత్యమగు
బ్రహ్మజ్ఞానుల ఆత్మరూపమగు
పరమవిద్య ఈగీత యగు ॥గోవింద॥ ౫

శ్లో॥ చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానంద తత్త్వార్థజ్ఞానమంజసా ॥ 9

తా॥ వేదత్రయరూపముగను, పరమానందముగను, తత్త్వజ్ఞాన గర్భితముగను నుండు ఈ గీత చిదానంద స్వరూపుడగు శ్రీ కృష్ణునిచే స్వముఖతః అర్జునునకు చెప్పబడినది.

తో॥ చిదానందఘనుడగు శ్రీకృష్ణుడు
స్వముఖంబున ఆ పార్థునకు
బోధించిన పరమానందంబగు
తత్త్వార్థము జ్ఞానంబునగు ॥గోవింద॥

*తో॥ వేదత్రయ రూపంబునగును ఈ
గీతాశాస్త్రము భక్తిగను
శ్రద్ధతోడ పారాయణ చేయుచు
అర్థజ్ఞానము నొందవలెన్ ॥గోవింద॥ ౯

శ్లో॥ యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరంపదమ్ ॥ 10

తా॥ నిశ్చలచిత్తముతో నిత్యము (గీతా) పదునెనిమిది అధ్యాయము లున్న పారాయణము చేయునతడు జ్ఞానసిద్ధిని పొంది అందుచే పరమపదమును పొందును.

తో॥ ప్రతిదినంబు నిశ్చల చిత్తముతో
పదునెనిమిది అధ్యాయములున్
భక్తితోడ గీతను పఠించినను
పొందునతడు నుత్తమపదమున్ ॥గోవింద॥

*తో॥ పరమోత్తమ గతిపొందగ వలసిన
పొందవలయు జ్ఞానపుసిద్ధిన్ (జ్ఞానసిద్ధిం)
భగవద్గీతా పరమార్థంబున
పొందనగును జ్ఞానపు సిద్ధిన్ ॥గోవింద॥ ౧౦

శ్లో॥ పాఠేఽసమర్థస్సంపూర్ణే తదర్థం పాఠమాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥ 11

తా॥ గీతసంతయు పారాయణము చేయలేనివాడు సగము పఠించవచ్చును. అట్టివాడు గోదానఫలమును తప్పక పొందును.

తో॥ సంపూర్ణంబుగ పఠించజాలక
సగము పఠించిన మనుజుండు
సంపూర్తిగ గోదానఫలము గను
సంశయమేలను వినుమతడు ॥గోవింద॥

*తో॥ ఉత్తమగోవును యుక్తకాలమున
ఉత్తమ ద్విజునకు యుక్తముగ
భక్తిగనిచ్చిన ఫలమును పొందును
భగవద్గీతార్థము పఠన ॥గోవింద॥ ౧౧

శ్లో॥ త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ ॥ 12

తా॥ మూడవ భాగము భగవద్గీత పఠించు నతడు గంగాస్నానఫలము బొందును. ఆరవ భాగము చదువునతడు సోమయాగ ఫలమును బొందును.

తో॥ మూడవభాగము పఠించు మనుజుడు
గంగాస్నానఫలము బొందు
మూడవ భాగార్థము పఠించినను
సోమయాగ ఫలమును జెందు ॥గోవింద॥

*తో॥ భూలోకంబున నరుడై పుట్టియు
పుణ్యనదీ స్నానము లేక
భగవద్గీతను పఠన చేయనిచో
భూమికి బరువై పోవుగాక ॥గోవింద॥ ౧౨

శ్లో॥ ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః।
రుద్రలోకమవాప్నోతి గణో భూత్వా వసేచ్చిరమ్॥ 13

తా॥ నిత్యము ఒక అధ్యాయము భక్తితో పఠించినచో రుద్రలోకమును పొంది చిరకాలము ప్రమథగణములతో గూడియుండును.

తో॥ భక్తితో గూడియు భగవద్గీతను
ఏకాధ్యాయము పఠించిన
ప్రమథ గణములతో రుద్రలోకమున
చిరకాలము తా వసియించుః ॥గోవింద॥

*తో॥ నిత్యము మరువక నియమము తోడను (నిత్యం)
గీతాపారాయణంబును
భక్తితో చేసియు భగవంతుని కృప
బడయగ వలయును పూర్ణముగన్ ॥గోవింద॥ ౧౩

శ్లో॥ అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః।
స యాతి నరతాం యావ న్మనుకాలం వసుంధరే॥ 14

తా॥ అధ్యాయ శ్లోకపాదమయినను ఏ నరుడు నిత్యము పఠించునో అతడు మన్వంతరమువరకు భూమిలో మనుష్యుడై పుట్టుచుండును.

తో॥ నాల్గవభాగము అధ్యాయములో
నరుడు నిత్యమును పఠించిన
నొకమన్వంతర కాలము భూమిలో
నరుడై పుట్టును మారకను ॥గోవింద॥

స్వామి శుద్ధచైతన్యుల అభిప్రాయము.

*తో॥ ఒక అధ్యాయము శ్లోకపాదమును
భక్తితో నిత్యము పఠించినన్
ఒకమన్వంతర కాలము భువిలో
మనుజుడగుచు తా పుట్టనగున్ ॥గోవింద॥ ౧౪

శ్లో॥ గీతాయాశ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్ ।
ద్వౌత్రీనేకం తదర్థం వా శ్లోకానాం యః పఠేన్నరః॥15

తా॥ గీతలో పది శ్లోకములుగానీ, ఏడుగానీ, అయిదుగానీ, నాలుగాని, మూడుగానీ, రెండుగానీ, ఒక్కటిగానీ, తుదకు సగము శ్లోకముగాని పఠించిన ఆ నరుడు.

తో॥ భగవద్గీతలో పదిశ్లోకంబులు
ఏడు అయిదు మరి నాల్గైన
భక్తితో మూడో రెండో ఒకటో
శ్లోకార్థమొ చదివిన నరుడున్ ॥గోవింద॥

*తో॥ అనన్యభక్తితో నాచింతనతో
నాకు భక్తులై మెలగినచో
అనుఅర్థము శ్లోకార్థంబైనను (అ. 9 శ్లో. 12)
అనుదినమును తాపఠించుచో ॥గోవింద॥ ౧౫

శ్లో॥ చంద్రలోకమవాప్నోతి వర్షాణామయుతం ధ్రువమ్ ।
గీతాపాఠసమాయుక్తో మృతో మానుషతాంవ్రజేత్ ॥16

తా॥ చంద్రలోకమునకు పోయి పదివేలేండ్లు ఉండును. గీతాపారాయణము చేయుచు మరణించిన అతడు దేవత్వమును పొందును. నిజము. ఈ దేహానంతరము మనుజుడుగా పుట్టుననియు శంకరానంద భారతీ స్వాములు.

తో॥ చంద్రలోకమునకును జని నాతడు
పదివేలేడులు నందుండు
మందహాసమున గీతను చదువుచు
మరణించిన నగు మనుజుండు ॥గోవింద॥

*తో॥ భగవంతుని వాక్యము నొకటయినను
భక్తితోడ తనవాక్కునను
బల్కుచు ప్రాణము విడచిన నరుడును
బాగుగ దృఢముగ దేవుడగున్ ॥గోవింద॥ ౧౬

శ్లో॥ గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తిముత్తమామ్ ।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్ ॥ 17

తా॥ ఆతడు పునః గీతాభ్యాసము చేయుచు నుత్తమ ముక్తిపొందును. వేయేల, 'గీతా'అని ఉచ్చరించుచు మరణించిన మనుజుడు సద్గతిని పొందును.

తొ॥ ఆతడు మరలను గీతాధ్యయనము
ఆనందంబుగ సల్పుచును
అందగలడు ఉత్తమమగు ముక్తిని
ఆతని భాగ్యమె భాగ్యముగుక ॥గోవింద॥

*తొ॥ అంతేలను తన అంత్యకాలమున
అక్కరతో గీతా యనగక
ఆతడు సద్గతి ఆనందంబున
అందగలడు అతి మోదమునక ॥గోవింద॥ ౧౭

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥ 18

తా॥ మహాపాపయుక్తుడయినను గీతార్థశ్రవణాసక్తుడైతే వైకుంఠముచేరి విష్ణువుతో కూడి ఆనందించుచుండును.

తొ॥ అతి పాపిష్టుండైనను గీతా
అర్థము నందున ఆశపడ
ఆవైకుంఠాధిపు డగుహరితో
ఆనందము చెందగలండు ॥గోవింద॥

*తొ॥ ఆ వైకుంఠము పొందగ హరితో
ఆనందంబును చెందగను
అక్కర గీతార్థము బహు చక్కగ
ఆలోచించిన అందనగుక ॥గోవింద॥ ౧౮

శ్లో॥ గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః ।
జీవన్ముక్తస్స విజ్ఞేయో దేహాన్తే పరమం పదమ్ ॥ 19

తా॥ గీతార్థమును నిత్యమును ధ్యానించుచు గొప్పగా కర్మలుచేసిన జీవన్ముక్తుడే అని యెఱుంగుము. అతడు దేహాంతమున పరమపదమును పొందును.

తో॥ గీతార్థంబును నిత్యము తలచుచు
గొప్పగ కర్మలు చేసినను
అతడు జీవన్ముక్తుం డగుచును
అంత్యంబున మోక్షముపొందుఁ ॥గోవింద॥

*తో॥ గీతారహస్యమును మదితలచుచు
సీతాపతి పాదము తలచి
వాతాత్మజువలె కర్మలు చేయుచు
పాతక రహితుండవు నిలచి ॥గోవింద॥ ౧౯

శ్లో॥ గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః ।
నిర్ధూతకల్మషా లోకే గీతాయాతాః పరం పదమ్ ॥ 20

తా॥ జనకాది పెక్కండ్రు గొప్పరాజులు గీతను ఆశ్రయించి కల్మష దూరులై ప్రఖ్యాతినొంది పరమపదమును పొందిరి.

తో॥ జనకుడు మొదలగు అనేకరాజులు
చక్కగ గీతల ఆశ్రయముఁ
చేసియు పాపంబులు పోద్రోలియు
జెందిరి పరమగు పదంబును ॥గోవింద॥

*తో॥ నిజమగు ఆనందము గావలెనా
నిజముగ గీతకు మ్రొక్కవలె
నిజమగు గీతార్థము తెలియగ వలె
నిజమగు పదమును పొందవలె ॥గోవింద॥ ౨౦

శ్లో॥ గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్ ।
వృథాపాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః ॥ 21

తా॥ గీతాపారాయణము చేసి మాహాత్మ్యమును పఠించనివానికి పారాయణము వృథయై శ్రమయే మిగులును.

తో॥ గీతను చదివియు మాహాత్మ్యంబును
చదువక విడచిన అతనికి
గీతాపారాయణము వ్యర్థమై
శ్రమమాత్రంబగు నాతనికి ॥గోవింద॥

*తో॥ సర్వోపనిష త్సారంబయినది
సర్వులకును అనుకూలమిది
సర్వులు గీతా సంగీతంబును
సర్వము పఠించ ముక్తినిది ॥గోవింద॥ ౨౧

శ్లో॥ ఏతన్మాహాత్మ్య సంయుక్తం గీతాభ్యాసం కరోతి యః ।
స తత్ఫలమవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్ ॥ 22

తా॥ ఈ మాహాత్మ్యముతోకూడా గీతలు చదువునతడు ఆ ఫలమును పొందుటయేగాక దుర్లభమైనగతి అనగ మోక్షమును పొందును.

తో॥ మాహాత్మ్యముతో భగవద్గీతను
పారాయణమును చేసినచో
మానవుండు సత్ఫలమును మోక్షము
పొందును పరమాత్ముని దయతో ॥గోవింద॥

*తో॥ భగవద్గీతార్థము నెరుగని యెడ
భక్తితో గీతాసంగీతం
భగవద్గీతతో చేర్చియు భజించ
భగవంతునికృప గలుగు నిజం ॥గోవింద॥ ౨౨

సూత ఉవాచః—

శ్లో॥ మాహాత్మ్యమేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్ ।
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ ॥ 23

తా॥ నాచే చెప్పబడిన సనాతనమైన ఈ గీతామాహాత్మ్యమును గీతా పారాయణానంతరమున పఠించునతడు మాహాత్మ్యములో చెప్పబడిన ఫలమును పొందును.

తో॥ నేబల్కిన ఈ సనాతనంబగు
గీతామాహాత్మ్యము నెపదుఁగ
నేమంబున గీతాంత్యము నందున
పఠించపొందును తత్ఫలముఁగ ॥గోవింద॥

*తో॥ గీతార్థంబును ఎరుగని వారలు ♦ గీతార్థంబును నెరిగినను
గీతా సంగీతంబును భజించ♦గీతార్థమ్మును వ్యక్తమగుఁగ ॥గోవింద॥

ఇతి శ్రీవరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యం
సంపూర్ణమ్.
సర్వం శ్రీ కృష్ణార్పణమస్తు.

---

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు ॥

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥

అపుత్రిణః పుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః ।
అధనాస్సధనాస్సంతు జీవంతు శరదాంశతమ్ ॥

దుర్జనస్సుజనో భూయాత్ సుజనశ్శాంతిమాప్నుయాత్ ।
శాంతో ముచ్యేత బంధేభ్యో ముక్తశ్చాన్యాన్విమోచయేత్ ॥
తథాఽస్తు.

# గీతార్థసారము.

శేసప్రిరాగము _ ఆటతాళము.

పల్లవి॥ గీతార్థసారము వినుము-నవనీతము జేకొనువిధము॥

భూతదయాపర, హేతువుచే నిపి, కేతనునకు ఖగకేతనుఁ
డెఱిగించు — జ్ఞాతివధచే, పాతకము సం, జాతమౌనే, నే
తెఱంగునఁ, జేతునని యుద్ధమొల్లక పురు, హూతసుతుఁ
డీ రీతి బల్కెను ॥గీతా॥

1_వ అధ్యాయము _ అర్జున విషాదయోగము. శ్లో॥ 47

తాతతండ్రులు మేనమామలు — గురు — భ్రాతమిత్రులు
పుత్రపౌత్రులు — ఈ తీరువారిని, ఘాతముచే నరక, పాతమౌ
కులధర్మ, ఘాతమింతియెకాదు — పితపిండోదకంబై స్త్రీ,
జాతిచెడి వర్ణసంకరమగు, పాతకంబని విడిచె పార్థుడు,
చేతిధనువతనికను శ్రీహరి ॥గీతా॥

2_వ అధ్యాయము _ సాంఖ్యయోగము. శ్లో॥ 72

జీవమెన్నడు నాశమొందదు _ దేహ — మేవిధంబున నుంచ
నిల్వదు — భావము సమదృష్టిఁ, గావించి దృఢబుద్ధి,తో —
విధాయక యుద్ధ, మీవిధంబునసల్పు — చావు గెలుపులఁ,
గాంతుదివిభువిఁ, గావునను గెలుపోములును సమ, మై —
వికారములేక కోర్కెలఁ, బోవిడు మహంకార మమతలు॥గీతా॥

3_వ అధ్యాయము _ కర్మయోగము. శ్లో॥ 43

కర్మజ్ఞానములని రెండును — నాచే — నిర్మింపఁబడె లోక
మందును — కర్మవిడుచుట వశము కాదు గావున నిజ,
కర్మజేయుచు ఫల, కాంక్ష వదలుట మేలు — నిర్మమత
నిరహంకృతినినై, ష్కర్మ్యసిద్ధి జితేంద్రియుడవై, నిర్మల
జ్ఞానమును గప్పిన, కూర్మి కామద్వేషు జయింపుము ॥గీతా॥

4_వ అధ్యాయము - జ్ఞానయోగము శ్లో॥ 43

అన్ని నేనను తెలియు నర్జున — పను — లన్ని జేయుచు ఫలవర్జన — మున్ను జేసిరి నీవ, ట్లన్ని జేయుము యున్న, వన్ని లేనివి లేని,, వన్ని యున్నవిగను — గొన్నధీయుతు, లన్ని కోర్కెల నన్ని తలంపుల, నున్న జేసిన, మున్నతత్వము గొన్న వారై, ఛిన్నసంశయులైరి జ్ఞానులు ॥గీతా॥

5_వ అధ్యాయము - కర్మసన్యాసయోగము. శ్లో॥ 28

యోగసన్యాసము లొకటిగా — ఫల — త్యాగయోగమె మంచిమేలుగా — రాగద్వేషము లుడుగ, వాగాదింద్రియ ములు, యేగివిషయములందు, భోగించుతాఁగాదు — యీ గతినిదా, నేగుచును సం, యోగ ప్రాణాపానమనములు, యోగ బుద్ధియు భ్రూయుగాంతర, మాఁగి బ్రహ్మముఁ బొందుయోగియు ॥గీతా॥

6_వ అధ్యాయము - ఆత్మసంయమయోగము. శ్లో॥ 17

మనమేకాగ్రము జేయు టెక్కువ — కర్మ — మును జ్ఞాన తపములు తక్కువ — వినుకుశాజిన వస్త్రా, సనమునఁ గూర్చుండి, తనువుసుస్థిరముగ నునిచి నాసాగ్రము—కనుగొనుచు కోరికల నన్నిటిఁ, దునిమి సంకల్పములు విడిచిన, మనము పవనము లేనిదీపము నను వునను బ్రహ్మమును బొందును ॥గీతా॥

7_వ అధ్యాయము - విజ్ఞానయోగము. శ్లో॥ 31

అన్ని నేనను తెలివిజ్ఞానము తన — కన్న లేకున్న విజ్ఞానము— భిన్న భూతప్రకృతి, కన్న మేలుజీవ — మన్ని ధరించు నే, నన్నిట బీజము, అన్ని పూసల దారమట్లుగ, నున్నదగ త్రిగుణాత్మ మాయో, త్పన్నులై తెలియరజ్ఞులు వి, చ్ఛిన్న మోహా ద్వంద్వులట్టుల ॥గీతా॥

8-వ అధ్యాయము - అక్షర పరబ్రహ్మయోగము. శ్లో॥ 28

యోగిప్రాణము విడుచునప్పుడు — సర్వ — త్యాగియై ప్రణవమెల్లప్పుడు — బాగుగ స్మరియించి, వేగమె ముక్తుడౌ, యోగబలము చేత, లాగిప్రాణములను — ప్రోగుచేభ్రూమధ్య మాఁగుచు, లోఁగతిని ద్వారములు గట్టివి, రాగి తనువు త్యజించి బ్రహ్మము లోఁగలియు శుక్లమార్గంబున ॥గీతా॥

9-వ అధ్యాయము - రాజవిద్యారాజగుహ్యయోగము. శ్లో॥ 34

అన్నిట నవ్యక్తరూపుగ — నేనే — యున్ననా యందవి యుండెగా — కన్న లేవనిచిత్ర, మన్ని చింతలుమాని, నన్నే సేవింపఁ బ, సన్నతఁగాచెద నన్నిటను వ్యాపించి యంటక, యున్న నన్నే గొల్వవారల, పిన్నకులమైనఁబ్రోచెద సం, పన్నకులజుల నెన్న నేటికి ॥గీతా॥

10-వ అధ్యాయము - విభూతియోగము. శ్లో॥ 42

సురనరగిరితురగహస్తులు — తిర్యక్ — తరుశస్త్రఖగపన్న గాదులు — సరసిశ్రుతిస్మృతి, పురజపవరశైల, సురనది విద్య శ్రీ, కరధైర్య కీర్తులు — ధరణీధర కాల ఋతు మాసము, లరయవరములు మత్స్వరూపం, బెరుగు జగతికిబీజమైను, స్థిరత యేకాంశంబు ఫల్గున ॥గీతా॥

11-వ అధ్యాయము - విశ్వరూప సందర్శనయోగము. శ్లో॥ 55

జగదాకారుని నన్నుజూడుము — పార్థ — తగదివ్యదృష్టిఁ గైకొనుము, మిగులచిత్రమనేక, సొగసులు బ్రహ్మరు, ద్ర — గణము లతిభక్తిఁ, బొగడ తేజోమయ — మగుచు వెలుగు చరా చరము కురు, పగతులెల్లరు నిగతులై రిక పొగడబడు హేతువై ప్రేమను, విగత వైరుడ వగుము ఫల్గున ॥గీతా॥

12-వ అధ్యాయము - భక్తియోగము. శ్లో॥ 20

సగుణ నిర్గుణ బ్రహ్మోపాసన — మోక్ష — మగు యుక్త
మున కష్టతరమున — తగమనో బుద్ధులు, తగిలించి నాపైన,
విగతకర్మఫల, మగునేనిబ్రోచెద — పగవిడచిభూతదయతోసము,
లగుచు దృఢబుద్ధితోనన్నె, మిగుల ధ్యానించు నాభక్తులు, వగ
గొనకనను జెందెదరనె ॥గీతా॥

13-వ అధ్యాయము - క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము. శ్లో॥ 35

తనువుక్షేత్రంబిదియెరిగిన — నేనే — వినుక్షేత్రజ్ఞుడ నాలో
నుండిన — ఘనమాయాపురుషులు, అనయమందురుగా స,
న్మనము సమత్వమై యనబడు జ్ఞానము—కనుగొనగ బ్రహ్మంబు
జ్ఞేయం, బనగ సర్వము, నందు మిన్నుగ నునికినంటక, వెలుగ
జేయును యినుడు లోకము, రీతిఁదెలియుము ॥గీతా॥

14-వ అధ్యాయము - గుణత్రయ విభాగయోగము. శ్లో॥ 27

త్రిగుణములాయెనామాయను—దాన— జగముగల్గెను బీజమై
తేను — తగ సత్త్వరజ స్తమో, గుణములు జీవ, నిగళము
సుఖరాగ, తగమోహములచేత విగత సుఖదుఃఖరాగద్వే, షగతి
సర్వారంభ త్యాగము, నగును నిర్గుణ సిద్ధితుల్యత, పగయు
మైత్రియు లేక నుండుట ॥గీతా॥

15-వ అధ్యాయము - పురుషోత్తమప్రాప్తియోగము. శ్లో॥ 20

ఎగువ దిగువను వ్రేళ్ళు కొమ్మలు — విషయ — నిగమ
ప్రవాళ పత్రంబులు — త్రిగుణములను బెరుగు, తగనశ్వత్థము
నాశ, మగు నిస్సంగముచేత, నగుమోక్షమదియాది, జగము
కూటస్థంబు రెంటికి, మిగులుదురు నాయంశ జీవులు, నగుదు
రన్నియు, నేనె యనినను, దగభజంపవె, యిదిరహస్యము॥గీతా॥

16_వ అధ్యాయము - దైవాసుర సంపద్విభాగయోగము. శ్లో॥ 24

దైవాసుర సంపద్ద్వివిధము — సత్వ — భావదయ సత్య శౌచము — దైవమాసురమన, జీవహింసమన, నెవ్వారికినీదన— శీవిలేదనియెంచు — టవియు నపవర్గంబు నరకం, బివియు నిరయ ద్వారనామము, లివియె గామక్రోధలోభము, లవలంద్రోచి భజించు శాస్త్రము ॥గీతా॥

17_వ అధ్యాయము - శ్రద్ధాత్రయ విభాగయోగము. శ్లో॥ 28

సత్వ రజస్తమశ్రద్ధలు — దాని — తత్వము మూడు విధం బులు— సత్వదేవ - రాజ, సత్వయక్షతామ, సత్వపిశాచపూ, జత్వమాహార — క, ర్తృత్వ దాన తపో యజ్ఞంబులు, సత్వరాజస తామసముల కృ, తత్వములు ఓం తత్సదితి య, జ్ఞత్వవేదా, గ్రత్వమయ్యెను. ॥గీతా॥

18_వ అధ్యాయము - మోక్ష సన్యాసయోగము. శ్లో॥ 78

విను సన్యాసము కామవర్జన — త్యాగ, మన కర్మఫలము విసర్జన — తన కర్మాసక్తి లే, కనుజేయుముక్తి యం, దును త్రిగుణత్యాగ మని జ్ఞానమాదిగ - గనిమనంబున నను దలంచుచు, పనులు నాపై, నుంచిభక్తిని, జనుచు సర్వము, విడిచి శరణని, ననుభజించు రహస్య మర్జున ॥గీతా॥

మంగళము.

మంగళమిదె జగన్మోహన - శ్యామ - లాంగ సుందర గరుడ వాహన - శృంగారరసభరిత, సంగీతవాద్య ప్ర, సంగ శ్రీఅల మేలు మంగాసమేత శ్రీ, రంగభాస్కర పుంగవుని స, త్సంగ తునిగా జేసిబ్రోచు టె, రుంగు శేషభుజంగగిరివర, మంగళము మాతంగరక్షక. ॥గీతా॥



# ప్రబోధము.

1. మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బన్ధు స్సహోదరః ।
అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

2. జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః ।
సంసారసాగరం దుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

3. కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః ।
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

4. ఆశయా బధ్యతే లోకః కర్మణా బహుచిన్తయా ।
ఆయుఃక్షీణం న జానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

5. సంపదస్స్వప్నసంకాశా యౌవనం కుసుమోపమమ్ ।
విద్యుచ్చఞ్చలమాయుష్యం తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

6. క్షణం విత్తం క్షణం చిత్తం క్షణం జీవితమావయోః ।
యమస్య కరుణా నాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

7. యావత్కాలం భవేత్కర్మ తావత్తిష్ఠన్తి జన్తవః ।
తస్మిన్ క్షీణే వినశ్యన్తి కా తత్ర పరిదేవనా ॥

8. ఋణానుబన్ధరూపేణ పశుపత్నీ సుతాదయః ।
ఋణక్షయే క్షయం యాన్తి కా తత్ర పరిదేవనా ॥

9. పక్వాని తరుపర్ణాని పతన్తి క్రమశో యథా ।
తథైవ జన్తవః కాలే కా తత్ర పరిదేవనా ॥

10. ఏకవృక్షసమారూఢా నానాజాతి విహంగమాః ।
ప్రభాతే విదిశో యాన్తి కా తత్ర పరిదేవనా ॥

11. ఇదం కాష్ఠ మిదం కాష్ఠం నద్యాం వహతి సంగతః ।
సంయోగాచ్చ వియోగాచ్చ కా తత్ర పరిదేవనా ॥



# గీతా గేయము.

శ్రీ రాగము - ఆదితాళము.

భగవద్గీతోద్యానవిహారము । భక్తినొనర్పఁగ పరుగున రండీ । సొగసుగ దానిని । జూడగనయ్యెడు । సుఖవగు త్రోవను । జూపెదనండీ ॥

1. భారత యుద్ధపు । పరిసరభూముల । బయలుదేటిన । భాగ్యం బండీ । ధీరుఁడు వ్యాసుడు । స్థిరముగనాటిన దివ్యోద్యాన । క్షేత్రముసుండీ ॥

2. రహీనిలకృష్ణుడు । రక్తితొపార్థుని । రథమును నడిపిన । రంగంబండీ । ఇహాపర సుఖకర । హేతుభూతముల । నన్నియొ యాతఁడు పన్నినదండీ ॥

3. ఇలపయి నదిపది । యెన్మిదియగా యకరంబుల పరిమితి రాజిలునండీ । సులలితముగ నట । సప్తశతంబుల । సద్వృక్షంబులు । జెలఁగును జుండీ ॥

4. ఎప్పుడు వాడని । పూవులుచుండీ । ఎప్పుడు కుళ్ళని ఫలములుసుండీ । తప్పక మనమా । ధన్యవనికేఁజని । తలకొక కొన్నిఁటిఁ దెత్తము రండీ ॥

(శ్రీ ద్రోణమరాజు రామమూర్తిగారి "గీతోద్యానవిహారము"నుండి)



# గీతాస్తుతి.



ప॥ తల్లీ ! భగవద్గీతా ! మా
యుల్లములందున నుండుము మాతా ॥త॥

1. తెలివిమాలి నీ దెసజూడనిమము ।
తులువలమనుచును దూరము సేయకు ॥త॥

2. మదమత్సరముల మదిలోనిడుకొని ।
వదలితి మమ్మ నీ - పదయుగళంబును ॥త॥

3. నిన్ను భజింపకయే గద మేమిటు
లెన్నో జన్మము లెత్తుచు నుంటిమి ॥త॥

4. జనన మరణముల చక్రములోబడు
తనయుల నిపుడొక దారిని చేర్చుము ॥త॥

5. భ్రమకూపంబున బడి, నినుగాంచని
మముగని తప్పులు మన్నించగదే ॥త॥

6. చేయూత నొసగి శిశువుల, మగుమము
జేరదీసి నీ చెంతనె నిలుపుము ॥త॥

7. అన్ని భూతముల యందు వెలింగెడి
హరిగను నటులో యమ్మ దీవింపుము ॥త॥

8. గీతాభక్తుల - గీతము విని సం -
ప్రీతిని శాంతి, నీవే దయ చేయుము ॥త॥



# శ్రీ గీతా హారతి.

పల్లవి॥ జయజయ జయజయ భగవద్గీతే।
జయ భవబంధన శమనసుచరితే ॥జ॥

1. కాండత్రయ సంశోభిత రూపే।
ఖండిత త్రిభువన — ఘన సంతాపే ॥జ॥

2. సాంఖ్య కర్మయోగాది — విలసితే।
సంశ్రిత సాధక — జనకల్పలతే ॥జ॥

3. పద్య సప్తశత భవ్యతరంగే।
పాప విభంజన — పావనగంగే ॥జ॥

4. భక్తిజ్ఞాన సోపాన శోభితే।
పరమయోగి — హృత్పద్మ భావితే ॥జ॥

5. భగవత్ శ్రీ ముఖ పద్మమకరందే।
పార్థ హృత్సదన — భరితానందే ॥జ॥

6. సకలోపనిషత్ సాగర జాతే।
సన్ముని మథనాచల — పరిపూతే ॥జ॥

7. శాంతి సుఖప్రద — సదమృత కిరణే।
జనన మరణ భవ — సాగర తరణే ॥జ॥

8. భజన సమాజ — సుభక్త హృదబ్జే।
పరిపూజిత — పావన పాదాబ్జే ॥జ॥

జయ భగవద్గీతే జయ భగవద్గీతే
హరి హియ కమల విహారిణి సుందర సుపునీతే ॥జయ॥

కర్మ సుమర్మ ప్రకాశినీ కామాసక్తి హరా
తత్వజ్ఞాన ప్రకాశినీ, విద్యా బ్రహ్మపరా ॥జయ॥

నిశ్చలభక్తి విధాయినీ నిర్మల మలహారీ
శరణ రహస్య ప్రదాయినీ సబవిధి సుఖకారీ ॥జయ॥

రాగద్వేష విదారిణి కారిణి మోదసదా
భవభయ హారిణి తారిణి పరమానంద ప్రదా ॥జయ॥

ఆసురభావ వినాశినీ నాశిని తమ రజనీ
దైవీ సద్గుణ దాయిని హరి రసికా సజనీ ॥జయ॥

సమతాత్యాగ శిఖావని హరి ముఖకీ బానీ
సకలశాస్త్రకీ స్వామినీ శ్రుతియోం కీ రాణీ ॥జయ॥

దయా సుధా బరసావనీ మాతృకృపాకీ జై
హరిపద ప్రేమ దానకరా అపనోకరలీ జై ॥జయ॥

---

పూజ్యజనకులు, గురుమూర్తులు, తీర్థపాదులగు శ్రీ సంజీవనారాయణ
దాసు గారి దివ్యసన్నిధికి భక్తిపురస్సరముగా నర్పించిన

## ఆంధ్ర సీసపంచకమ్.

సీ॥ బాల్యదారంభముగ భాగవతంబును భక్తులభవదుఃఖ మంత
మొంద। బోధించితివినీవు-భువనములుపొగడొంద అజ్ఞానతిమిరంబు
నంతమొంద ॥ తల్లిదండ్రిసేవల-ధర్మైక్యబుద్ధితో నాచరించితివీవు
నధిక భక్తి। నెలగొల్పితి వీవు ధైర్య సాహసమునర రామ
కృష్ణోత్సవత్రాజ్యమంత ॥

తండ్రి నినుబోలు మనుజుండు ధరణిగలడె
పూజ్య నీ సేవ జేసిన ముక్తి గలదు
ఆర్య నినుగన్న జననియు నవనివంద్య
మాన్య జగదేక గుణకీర్తి మానవనుత ॥

సీ॥ గీర్వాణభాషలో గీతయుండుట సదామానవ మాత్రకుఁ
మరుగుననియు। ఆబాలగోపాల యభినందనీయమగా - తోహరాల
రీతిగా దొర్లిపడగ॥ కవనంబుజేకూర్చి కంఠభూషణముగా, గాన
కోవిదులకు ఘనముగాను। జగ దుపకారార్థ జాజ్వల్య దీప్తిచే
భాగవతులకెల్ల భాగ్యమనగ॥

అందజేసితి వీవుమా యాశదీర
రత్నభాండము పగిది స్వారాజ్యమందు
శేగుకులచంద్ర గుణసాంద్ర సేవ్యచరిత
దాస సంజీవనారాయణాఖ్య దేవ॥

సీ॥ లక్ష్మీదేవమ పూజ్యరామాంజనేయగర్భ సంజాతుడగరమున్
సౌమ్య మూర్తి। నియమనిష్ఠాదులఁ నిజ ధర్మపద్ధతిఁ యాచ
రించితి వీవు యమితకీర్తి । సౌందర్యవర్గముఁ శాసించినాడవు
సన్మార్గగామిగా సత్యచరిత । తనయజ్యాయాలకుఁ దగుబోధచే
వార్లమహితకీర్తుల సదా మరిపినావు॥

ఇలుగెల్చి రచగెల్వనిదియె పథము
జనక యభినవ జనకుని చరితనీది
తీర్థపాదుల సేవకై తీర్థయాత్ర
సల్పితివి నీవు సకుటుంబ సహితముగను॥

సీ॥ తత్త్వబోధకుడీవు తలితండ్రులకుమున్ను యతిసేవ్య కపిల
మహర్షి పగిది । నీతిదాయకు డీవు నిఖిల మానవులలో కారుణ్య
మూర్తివి గాంధి వోలె। భక్తిదాతవు నీవు భవమును సమయింప
నిత్యకర్తవుగావే మనుజముకుట । భజనకొరకు నిన్ను భగవంతు
డుద్దేశ పడియుండి కాబోలు బంపెనేమో ॥

భజనయందున నీవు మామాన్య చరిత
తత్వమిది నిన్నుగన తండ్రి ధన్యుడాయె
ధన్యజీవిత నిర్మల ధ్యానమూర్తి
జనక జనవంద్య బుధసేవ్య చరిత మహిత ॥

సీ॥ సంతానతతిలోన సజ్జనసేవ్యమా లలితసత్కృతి నీవు వ్రాసి నావు। నీకీర్తిచంద్రికల్ నీకృతిసోముండు వెదజల్లుచు నెయుండు విశ్వమందు। భవనకూపములాది పావనసంతతుల్ నిర్మించితివి నీవు నిర్మలాత్మ। సుతలేమిచే మోక్షసుఖమబ్బదనెడి యా లోకోక్తి నీపట్ల లుప్తమాయె ॥

భక్తజనవంద్య బుధసేవ్య పరమపూత
నిన్ను గొలచిన జనులకు నిక్కముగను
భవము భస్మముగాదె మామాన్య చరిత
దాస సంజీవనారాయణాఖ్య పూజ్య ॥



# గీర్వాణ శార్దూల గుర్వష్టకమ్.

వైశ్యాంభోనిధిసోమ తావకకృతి జ్యోత్స్నాయమానాయ తే
జ్ఞాతుం చోన్నతభాష్యపండితపదం చైవాభిషేకే తవ।
యత్కించిత్ప్రతిభార ఏవ సుజనాస్సమ్యగ్విజానంత్యతో
వందేఽహం భవహారకం గురువరం సంజీవనారాయణమ్ ॥

బాల్యాన్మాతృవినమ్రభావనపరం భక్త్యైకమూర్తిం శివం
అధ్యాత్మాది సుసేవనీయ సకలాం తుష్ణేన సంపాదితమ్।
యాత్రాదీ ప్రథమః సుసేవనపరం చాసేతువారాణసీం
వందేఽహం భవహారకం గురువరం సంజీవనారాయణమ్ ॥

సంతానాని చ సప్తధా భువి నృణాం ముక్త్యైకదాయీని చేత్
సద్గ్రంథో భవతా కృతో జనపదేష్వాచంద్రతారార్కకమ్ ।
త్వత్కీర్తి ప్రసరిష్యతీతి చ సదా త్వామేవ సంసేవయేత్
వందేఽహం భవహారకం గురువరం సంజీవనారాయణమ్ ॥

యోఽపశ్యత్ప్రథమం చరాచరమిదం యన్నామరూపాత్మకం
తన్మిథ్యేతి చ జ్ఞాయతే భువి సదా వైరాగ్యసామ్రాడభూత్ ।
నిత్యం శాశ్వత రామనామభజనాస్వాదం చ యో జ్ఞాయతే
తం వందే భవహారకం గురువరం సంజీవనారాయణమ్ ॥

యస్యానుగ్రహలేశతశ్చ మనుజా భక్తాగ్రగణ్యాః కృతాః
శ్రీమద్భాగవతాది పుణ్యకృతయః దృష్టాశ్చ యేనాదితః।
ప్రేమ్ణా స్థాపితభక్తసంఘనివహాం నిర్ధూతదోషాత్మకం
తం వందే భవహారకం గురువరం సంజీవనారాయణమ్॥

గార్హస్థ్యోఽపి చ మైథిలః ప్రథమతః రాజ్యాధిపత్యే చ యః
కార్యాసక్తనిమగ్నమానసపరః సంసేవితో యోగిభిః ।
తత్సాదృశ్యమభూత్కలంకరహితా యత్కీర్తిజ్యోత్స్నా చ నః
తం వందే భవహారకం గురువరం సంజీవనారాయణమ్ ॥

సంపూజ్యేఽగరవిట్కులే ద్విజవరాద్రామాంజనేయాదభూత్
లక్ష్మ్యాం దుగ్ధసముద్రజో దివి శశీతుల్యో భవత్సంభవః ।
బాల్యాభ్యాసిత సంస్కృతాది సకలాపాండిత్యవంతం శివం
వందేఽహం భవహారకం మమ గురుం సంజీవనారాయణమ్॥

యశ్చ స్థాపితరామభక్తభజనస్థానః సదా నిర్మలో
యేనోక్తాశ్శివవిష్ణుబ్రహ్మగురు మాతాపితృసంస్తోత్రకాః।

యద్భక్త్యా చ భవేన్నరః సుకృతినస్తం గాయకం జ్ఞానదం
వందేఽహం భవహారకం మమ గురుం సంజీవనారాయణమ్ ॥

ఇతి తవ చరణార్చీ వేణుగోపాలగుప్తః
సతతవినయసేవీ కాంక్షతే త్వత్ప్రసాదః ।
గురువరకృపయాఽహం రక్షణీయోఽభవం హి
తవ పదయుగసాయ్యే చార్పితం చాష్టకం నః ॥

**ఇతి భవత్సూనునా శిష్యేణ చ శేగు వేణుగోపాలగుప్తేన**
**సభక్త్యా సమర్పితం శార్దూలగుర్వష్టకం**
**సమాప్తమ్.**

---

ఓం

# నారాయణోపనిషత్.

★

ఓం సహనా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వినా వధీత మస్తు । మా విద్విషావహై ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

**మం॥** అథ పురుషో హవై నారాయణోఽకామయత । ప్రజాస్సృజేయేతి । నారాయణాత్ ప్రాణో జాయతే । మనస్సర్వేంద్రియాణి చ । ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ । నారాయణాత్ బ్రహ్మా జాయతే । నారాయణా ద్రుద్రో జాయతే । నారాయణా దింద్రో

జాయతే । నారాయణాత్ ప్రజాపతయః ప్రజాయంతే । నారాయణాత్ ద్వాదశాదిత్యారుద్రా వసవ స్సర్వాణి చ ఛందాగ్ంసి । నారాయణా దేవ సముత్పద్యంతే । నారాయణే ప్రవర్తంతే । నారాయణే ప్రలీయంతే ॥

మం॥ అథ నిత్యో నారాయణః। బ్రహ్మా నారాయణః। శివశ్చ నారాయణః । శక్రశ్చ నారాయణః । ద్యావాపృథివ్యౌ చ నారాయణః । కాలశ్చ నారాయణః । దిశశ్చ నారాయణః। ఊర్ధ్వం చ నారాయణః । అధశ్చ నారాయణః । అంతర్బహిశ్చ నారాయణః । నారాయణ ఏవేదగ్ంసర్వం। యద్భూతం యచ్చ భవ్యం । నిష్కలో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధో దేవ ఏకో నారాయణః । న ద్వితీయోఽస్తి కశ్చిత్ । య ఏవం వేద స విష్ణురేవ భవతి స విష్ణురేవ భవతి ॥

మం॥ ఓమిత్యగ్రే వ్యాహరేత్ । నమ ఇతి పశ్చాత్ । నారాయణాయే త్యుపరిష్టాత్ । ఓమిత్యేకాక్షరం । నమ ఇతి ద్వే అక్షరే । నారాయణాయేతి పంచాక్షరాణి। ఏతద్వై నారాయణస్యాష్టాక్షరం పదం ॥ యో హవై నారాయణస్యాష్టాక్షరం పద మధ్యేతి । అనపబ్రువ స్సర్వ మాయు రేతి । విందతే ప్రాజాపత్యగ్ం రాయస్పోషం గౌపత్యం । తతోఽమృతత్వ మశ్నుతే తతోఽమృతత్వ మశ్నుత ఇతి । య ఏవం వేద ॥

మం॥ ప్రత్యగానందం బ్రహ్మ పురుషం ప్రణవస్వరూపం। అకార ఉకారో మకార ఇతి । తా నేకధా సమభర త్తదేతదో మితి । య ముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసారబంధ నాత్ । ఓం నమో నారాయణాయేతి మంత్రోపాసకః । వైకుంఠభువనలోకం గమిష్యతి। త దిదం పరం పుండరీకం విజ్ఞానఘనం । తస్మా త్తడిదాభమాత్రం బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనోం। సర్వభూతస్థ మేకం నారాయణం । కారణపురుష మకారణం పర బ్రహ్మోమ్ ॥

మం॥ ఏతదథర్వశిరో యోఽధీతే ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి। సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి । మాధ్యందిన మాదిత్యాభిముఖోఽధీయానః పంచపాతకోపపాతకాత్ప్రముచ్యతే । సర్వవేదపారాయణ పుణ్యం లభతే । నారాయణసాయుజ్య మవాప్నోతి । నారాయణసాయుజ్య మవాప్నోతి । య ఏవం వేద ఇత్యుపనిషత్ ॥

ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి । తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥ (నారాయణ గాయత్రీ మంత్రము)

ఓం సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కర వావహై। తేజస్వినా వధీత మస్తు । మా విద్విషావహై ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఓం తత్సత్.



# మధురాష్టకమ్.

★

అధరం మధురం, వదనం మధురం
నయనం మధురం, హసితం మధురం ।
హృదయం మధురం, దమనం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 1

వచనం మధురం, చరితం మధురం
వసనం మధురం, వలితం మధురం ।
చలితం మధురం, భ్రమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 2

వేణుర్మధురో, రేణుర్మధురః
పాణిర్మధురః, పాదౌ మధురౌ ।
నృత్యం మధురం, సఖ్యం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 3

గీతం మధురం, పీతం మధురం
భుక్తం మధురం, సుప్తం మధురం ।
రూపం మధురం, తిలకం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 4

కరణం మధురం, తరణం మధురం
హరణం మధురం, రమణం మధురం ।
వమితం మధురం, శమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 5

గుంజా మధురా, మాలా మధురా
యమునా మధురా, వీచీ మధురా ।
సలిలం మధురం, కమలం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 6

గోపీ మధురా, లీలా మధురా
యుక్తం మధురం, ముక్తం మధురం ।
దృష్టం మధురం, శిష్టం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 7

గోపా మధురా, గావో మధురా
యష్టిర్మధురా, సృష్టిర్మధురా ।
దలితం మధురం, ఫలితం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్ ॥ 8



# కృతజ్ఞత.



సద్ధర్మములు వర్ధిల్లుటకు సద్గ్రంథంబులు ముఖ్యము. సద్గ్రంథంబులు అనేకములు రచియించిన శ్రీ వేదవ్యాసుల పేరున సకాలమునకు శుద్ధముగ సద్గ్రంథంబులు అచ్చొత్తించుటకునై శ్రీ శ్రీ శ్రీ మలయాళస్వాములవారు చిత్తూరునందు శ్రీ వేదవ్యాస ప్రెస్సు అను నామకరణముతో ఒక ముద్రాక్షరశాలను స్థాపించిరి. ఈ తోరాద్వయ గీతాసంగీతమును ఆ ప్రెస్సులో సకాలమునకు అచ్చొత్తించుటకు అనుమతించిన శ్రీ D. G. వెంకటేశ్వరస్వాముల కును, ఇట్లేట్లువుండవలెనని చక్కగ నేర్పరచిన మేనేజరు శ్రీమాన్ న్యాయశిరోమణి కేళాత్తూరు శ్రీనివాసాచార్యుల వారికిని, అక్షరక్షరమునుచూచి ప్రూఫులు శుద్ధపరచిన శ్రీమాన్ సాహిత్య శిరోమణి వీ. వరదాచార్యుల వారికిని, అన్నిటియందు శ్రద్ధబూని సకాలమునకు అందముగ అచ్చొత్తించి ఇచ్చిన శ్రీ సి. మాణిక్యం గారికిని, మరియు ఈ పుస్తకము అచ్చగునప్పుడు సాయపడిన వారి కందరికిని సర్వాభీష్టఫలము లిచ్చునట్లు సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

సేగు సంజీవనారాయణదాసు,

అగరము.





# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 25 | | మొదటిలో 'సంజయ ఉవాచ' అని వుండవలెను. | |
| 30 | 3 | బిక్షా | భిక్షా |
| 47 | 21 | నాశ | నాక |
| 161 | 20 | ఎవిగను ఎవిటిలో | అవిగను అవిటిలో |
| 272 | 13 | గను నన్నయ్య | నను గన్నయ్య |
| 380 | 12 | స్మతి | స్మృతి |

---


చిత్తూరు శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాలయందు
ముద్రితము.